# భారతి

## సచిత్ర మాసపత్రిక

అధిపతి

కా. నాగేశ్వరరావు

సంపాదకుడు

గన్నవరపు సుబ్బరామయ్య

సంపుటము ౧౨, సంచిక ౫

ఆంధ్రపత్రికా ముద్రాలయము, మద్రాసు

౧౯౩౫


విషయసూచిక

# చిత్రములు

త్రివర్ణచిత్రములు—భారతిసాంత్వనము; కృష్ణాష్టమి; కృష్ణనవమి —

సాధారణ చిత్రములు — రాజవీథి; కాళహస్తి: దేవాలయము, సువర్ణ ము ఖరి వంతెన, నగరభాగము; అస్తమయము (కుమారి వద్ద); ఉదయము (కన్యా); బిం ప్రతిబింబము; కన్యాకుమార్యగ్రము; మూడుసముద్రములకూటమి (కన్యాకుమారి); తో ఘుస్తాబు తికమక; ఏకాంతవాసి; ఉదయిని; మిశ్రశిల్పము; తిరుమలనాయకుని సౌధము మధుర; రాజభవనము-తిరువనంతపురము పార్కుప్రక్కన; కొండపల్లిఖిల్లా; మ్యూజియము తిరువనంతపురము; సూర్యాస్తమయము; ఉండవల్లిగుహాలు;—వ్యంగ్య చిత్రములు: పౌ షము; అత్తింట-తమయింట;— “వేత్తిగానరసం ఫణీ”; ప్రతీక్ష; బకింగుహామ్‌కాలువ-పడ వ్లలు; రజతోత్సవ చిత్రములు; ఇతరములును.

# అమృతాంజనము

అమృతాంజనముచేత
అన్నినొప్పులుగూడ
అదృశ్య మగుచుండ - మనసా!
పనికిమాలినయట్టి
పాడుమందులు వాడ
ప్రారబ్ధమటె, పిచ్చి - మనసా!!

స్వాతంత్ర్యము నశించి
సేవకావృత్తిలో
సతత మేర్పడి నీకు - మనసా!
తల్లికడుపూలోకి
తపను డేగేసరికి
తప్పదే తలనొప్పి - మనసా!!

తలనొప్పి కేర్పడిన
వెలలేని యౌషధము
కలియుగంబున నిదియె - మనసా!
ఇతరమందూలన్ని
విత్తనాశమెగాని
వెతలుదీర్చవె వెఱ్ఱి - మనసా!!

భ్రమపెట్టుచుండెడీ
ఇమిటేషను మందులను
గమనించవలె పిచ్చి - మనసా!
ప్రకటనల గనుపించు
పంచభావను చూస్తే
వంచనే గలుగదే - మనసా!!

రసవాసనగంధశా
లసలె గలువకయుంట
పనలేదనకె, పిచ్చి - మనసా!
వ్యయము గణించకను
వనమూలికలజేయు
వాహ్వారే! యనిపించు-మనసా!!

అర్థమేపాయికే
వ్యర్థపడనీ, నీసా
సార్థకంబా "డబ్బే!" మనసా!
పేరిన నెయ్యివలె
పరమ సువాసనతో
సురలుమెచ్చెడిమందె- మనసా!

ఆలగాపరి మొదలు
అవనీధవునివరకు
అందుబాటులోనుండ - మనసా!
అన్నినొప్పులకును
ఆలోచనతో మరల
యౌషధము చేరికే - మనసా!!

ఒంటికేర్పడు పోటు
వంటి నొప్పులనైన
వెంటనే పోగొట్టు - మనసా!
తేలుకాగ్రిబాధ
కాలుగంటాలోన
పాలార్చునే వెఱ్ఱి-మనసా!!

పొట్టలో బిడ్డలకు
పేర్లుపెట్టుచోనుండు
పాశ్చాత్యవైద్యులే - మనసా!
"గుడ్డు - గడ్డ"ని దీని
గుణము గ్రహించుకొని
"గొడ్డు"వలె సేవింత్రె - మనసా!!

ఇంతమహిమము గలిగి
ఎంతో చౌకగ దొరకు
వింతయౌ నీమందు - మనసా!
పట్టుబట్టి నీవు
ఎట్టులో కొని చేరి
పెట్టెలోపలనుంచు - మనసా!!

# భారతి



సంపు. ౧౨  యువసంవత్సరము, వైశాఖమాసము (మే ౧౯౩౫)  సంఖ్య ౫

## వకుళమాలిక

శ్రీ శివశంకర శాస్త్రీ

प्रेमनगरकी राह कठिन है ।

౧

ఎంత చక్కని వెలుతు

    రెంత చక్కని వెలుతు !

రెంత చల్లని గాలి !

    యెంత చల్లని గాలి !

ఎంతకాలంబాయె

    [illegible]

నై మఱచి పోవలయు

    [illegible]

సూర్యకిరణాలలో

    చొక్కిపోవలె నేడు.

పండువెన్నెలలోన

    పరవశము కావలెను !

ఈపెటికాహర్మ్య

    మెవరు తెరచినవారు ?

కానుపించదుస్వామి-

    కరముపోలిక నేడు.

[illegible] నే

    [illegible]

నాస్వామి అర్ఘ్యదెంచి-
నాడ్డేమొ అనుకొంటి.
ఎంత చక్కని వాడో!
ఎంత చల్లని వాడో!
ఎవ్వరో మీరు నా
కెరుగరా కున్నారు.
తీసివేయకుడు న
న్నీసివేయకు డయ్య!
నాస్వామికోసమై
న న్నుండనిం డిచట.
ఎంత చక్కనిచేయి
ఎంత చల్లనిచేయి!
చిగురుటాకునుబోలు
చేయి నానాథునిది.
అతని హస్తముసోకి
నంతనే నామేన
అంకురించును పులక
లానందగరిమమున.
వాడిపోయినజీర్ణ
వకుళమాలగ నెంచి
త్రోసివేయకుడు న
న్ద్రోసివేయకు డయ్య!
మీరు నానాథునకు
మిత్రులట్టులు తోచు:
కాకున్న ఈపేటి-
కను దెరచు కేలాగు?
ఎంచబోకుడు నన్ను
ఎండుపూదండగా

ప్రాణ మున్నది, నిండు
ప్రాణ మున్నదినాకు!
వింతచూపులతోడ
వీక్షింతు రేమిటికి?
ప్రసవదామమ్మునకు
ప్రాణ ముండగ రాదా?
ప్రాణ ముండుటె కాదు
ప్రమదంబు దుఃఖంబు
కలుగుచుండును నాకు
కారణంబునుబట్టి.
బాల్యయౌవనజరా-
ప్రముఖభేదము లెల్ల
సక్రమంబుగ నాకు
సంభవించిన వయ్య!
ఐన నెడనెడ స్వామి-
యమృతహస్తము తాఁగ
ఉదయ మొందును యౌవ
నోద్రేక మెదలోన.
ఆనందతుందిలం
బగు నంతరంగంబు
చెలగు లావణ్యంబు
జీర్ణదేహముమీద.
నాస్వామి యేలాటి
నవనీత హృదయుండో!
కుసుమమాలికగ న
న్జూడలే రెన్నండు.

ఆప్తురాలివిధాన
        ఆదరించెడివాడు.
స్వీయసుఖదుఃఖాలు
        చెప్పుచుండెడివాడు.
కడచె రెండబ్దములు
        కాలమింకెన్నాళ్లో ?
నాస్వామికోసమే
        నశియించిపోకుండ
జీవించియున్నాను
        శీర్ణదేహముతోడ..
ఏనుపోయిన ఆత
        డెంత దుఃఖించునో !
పుష్పదామమ్ముగా
        పుట్టియుండన యేని,
పూబోణిగా నేను
        పుట్టగల్గితి నేని
అతనినే వరియించి
        ఆత్మవల్లభునిగా
కౌగిలింతు తదీయ-
        కంఠ మే వేళను !

౨

అతిమనోహరమైన
        దాల్మియజన్మంబు
ఈశరీరం బొదవె
        ఇందిరాదేవిచే
ఎంత చక్కనిచుక్క
        ఇందిరాలలితాంగి !
ఎంత కోమలహస్త
        ఇందిరాకన్యకది !

చైతన్య మొదవంగ
        సంభ్రమంబున నేను
నలుదెసలు కనుగొంటి !—
        నల్లకల్వలబోలు
నయనాలతో నామె
        నను విలోకించుచున్
కోమలాంగుళులతో
        గుచ్చుచుండెను పూలు.

ఏమి చక్కనికన్ను
        లిందిరాసుందరివి !
సారెసారెకు నాకె
        సమ్మోద మొదవంగ
నాస్వామి ఆకన్న-
        నయనయుగ్మము కాంచి
ఆనందపరవశుం
        డగుట చిత్రము కాదు !

అనురాగసూచి యా
        అరుణసూత్రము వెంట
కుసుమముల్ మెల్లగా
        గుచ్చుచుండెడివేళ
కిన్నరీకంఠాన
        గీత మాలాపించె,
విజనప్రదేశాన
        వేదిపై కూర్చుండి :—

* * *

౧

చల్లన్ని సాయాహ్న మోనాథా!
చక్కన్ని మార్గాన ఓనాథా!
నాహోము చూచుచూ ఓనాథా!
నడచుచుండగ మీర లోనాథా!
ఎన్న డెరుగని మిమ్ము ఓనాథా!
ఈక్షించినంతనే ఓనాథా!
చెప్ప శక్యము కాక ఓనాథా!
స్నిగ్ధభావము కల్గె ఓనాథా!
బహువిధంబుల దాని నోనాథా!
పరికించి చూచినా నోనాథా!
తరచి చూచినకొద్ది ఓనాథా!
తాత్పర్యమే హెచ్చె ఓనాథా!
నానుండియు నాకు ఓనాథా!
నవ్యజీవన మబ్బె ఓనాథా!
చెక్కటను చెయిచేర్చి ఓనాథా!
చింతించు మిముగూర్చి ఓనాథా!
నాకిప్డు డీలోక మోనాథా!
నవ్యకాంతుల దోచు నోనాథా!
సంసారసాగరం బోనాథా!
స్వర్గంగవలె దోచు నోనాథా!
మీచరిత్రలు వినుట కోనాథా!
మిగులకౌతుక మొదవు ఓనాథా!
ఆకాశసౌధమ్ము లోనాథా!
అద్భుతంబుగ గట్టు దోనాథా!
ఆడువారల ప్రేమ ఓనాథా!
అంతస్సులో నుండు ఓనాథా!
దైవతము మీకన్న ఓనాథా!
దాసురాలికి ఎవ్వ రోనాథా!
మీపాదదాసి నై ఓనాథా!
మెలగు టెన్నాళ్లకో ఓనాథా!
ఆనందసరసిలో ఓనాథా!
అవగాహ మెన్నడో ఓనాథా!

* * *

పల్లవారుణమైన
పాణియుగ్మముతోడ
పట్టుకొని యిందిరా-
బాల వ న్మృద్వాడి
రక్తకౌశేయాంబ-
రము పరచి యున్నట్టి
సుమసముద్గకమందు
సొంపుగా నిల్పినది.

కడచుచున్న కొలంది
గడియ ఒక్కొక్కటే
అంతకంతకు గంధ
మతిశయించుచునుండ
అంతరంగములోన
ఆమోద భరిత నై
కలయజల్లితి నేను
గదినిండ సౌరభము.

పన్నెండుగడియ లీ
పగిది సాగిన యంత
ఇందిరాలలితాంగి
ఈవలకు గొనివచ్చి
తాను వాతాయన-
స్థలమున న్గూర్చుండి
పాణిపద్మముతోడ
పట్టుకొన్నది నన్ను.

ధౌతకౌశేయంబు
ధరియించినది ఆమె.
కౌసుంభరాగంపు
కంచుకము తొడిగినది.

పదుచుండ నొడలిపై
పండువెన్నెలరుచుల్
దేవకన్యకవోలె
తేజరిల సాగినది.

కర్ణపూరద్యుతుల్
గండయుగ్మముమీద
నవ్యమోహనముగా
నాట్యమాడుచునుండ,
తపనీయహారముల్
స్తనమండలమ్ముపై
కమనీయలాస్యంబు
గావించుచుండంగ,

పాటలద్యుతులతో
ఫాలదేశమునందు
తిలకబిందువు సము-
ద్దీపించుచుండంగ,
దుగ్ధాబ్ధిలోనుండి
తోతెంచు ఇందిరా
దేవిపోలిక నామె
తేజరిల్లగసాగ!

ప్రతివిశాలం బైన
ఆజాలకమునందు
ఆసీనయై ఆమె
ఆరామవాటిపై
[illegible]ణంబులక
నిగుడించుచుండంగ
బంగారుబొమ్మనే
పరికింపసాగితిని.

నల్లకల్వలబోలు
నయనాలు నాపైకి
తిప్పి ఆయమ నన్ను
తేరిచూచి ఒకింత
చిరునవ్వు మోముపై
చిందులాడుచునుండ
లాలింపసాగినది
లలితగీతమ్ములతో :—

* * *

౨

వచ్చునే శాయీ నా
వల్లభుం డిచటికే,
వచ్చి ప్రేమను వేగమే
మాలికా,
గ్రుచ్చి కౌగిట జేర్చునే!
ఎంత చక్కనివాడో
హృదయాధినాథుండు
కాంచగల్గుదు విస్ఫుడే
మాలికా,
కనులకరవే తీరగా!
చిరునవ్వు మలయు నా
జీవితేశునిమోము
పండువెన్నెల కాయునే,
మాలికా,
నిండుపున్నమిబోలునే!
అమృతతుల్యము లైన
అతనివాక్కులు విన్న
ఆనంద ముప్పొంగునే,
మాలికా,
అవశత్వమే కల్గునే!
నానాథుసన్నిధా-

సమునందు నిలువంగ
అన్ని చింతలు వీడంగే,
మాలికా,
ఆనందమే నిండునే!
నాకోసమై ఎంతో
నవయుచున్నా డతడు,
లాలించుటకు రాడగే,
మాలికా,
అంగీకరింపవలెనే!
ప్రాణేశ్వరునిగాఢ—
పరిరంభణమ్ములో
విస్మరింపనే సర్వమూ,
మాలికా,
విశ్వాన కలిసిపోనే!

* * *

అని లేచి వీక్షించి
ఆరామవాటికను
నానాథు డేతెంచి—
నాడు, పోదము రమ్ము
విభుడు నాకోసమై
వేచియున్నా డదిగో,
అనుచు నుపవనిలోని
కరిగె సంభ్రమముతో.
ఎంత చక్కనినడక
ఇందిరాసుందరిది!
అందోలనమ్ములో
అడుగడ్గునకు నామె-
పాలిండ్లపై నున్న
పట్టురైకను దాకి
తేలిపోవుచునుంటి
దేవతామార్గాన!

# రసపరిష్కారము

పాటిబండ మాధవశర్మ

బ్రహ్మశ్రీ మల్లాది సూర్యనారాయణ శాస్త్రిలవారు తమ "ప్రేమతత్వము" అను గ్రంథమునందు "రసములు-ప్రేమ" అను శీర్షికక్రింద రసములన్నియు ప్రేమమూలకములను సిద్ధాంతమును చేయుచు నిట్లు వ్రాసినారు:

"హాస్యరతిశోకక్రోధభయాదులైన
స్థాయిభావంబులకు నెల్ల సదనమైన
మానసంబు ప్రవృత్తి ప్రేమమున నగుట
సకలరసములు ప్రేమమూలకములయ్యె."
(పుట ౨౨, ప్రేమతత్వము)

శ్రీ శాస్త్రిలవారు ఇది "కేవల పదార్థాత్మకమైన యొక స్వతంత్రకావ్యము" అని పీఠికలో చెప్పకొనినారు. "ప్రబుద్ధాంధ్ర" లో దీనిని పరామర్శించుచు శ్రీ ఇంద్రకంటి హనుమచ్ఛాస్త్రి గారు ఇది శాస్త్రగ్రంథమే కాని *కావ్య మెంతమాత్రము కాజాలదనియు, రసములన్నియు ప్రేమమూలకములను శాస్త్రిలవారిసిద్ధాంతము కేవలము సత్యదూరమనియు వ్రాసినారు.

"ప్రేమ—విశ్వమానవకళ్యాణము" అను చక్కనివ్యాసమును డిశంబరు ౩౨ భారతిలో ప్రకటించిన శ్రీ దేవగుప్తాపు విశ్వేశ్వరరావు గారు తమ వ్యాసవిషయముతో పొందకున్నను రసములు ప్రేమమూలకములు కావు అను సిద్ధాంతము చేయుచు "ఒక సహృదయుని గ్రంథపరిశీలనమునుండి" అని ప్రబుద్ధాంధ్రలోని శ్రీ హనుమచ్ఛాస్త్రిగారి వాక్యములనే ఉదాహరించుకొనినారు. శ్రీ విశ్వేశ్వరరావుగారు తమ వ్యాసమును ప్రేమను గూర్చిన ఒక "విజ్ఞానసర్వస్వము"గా తయారు చేయదలంచినట్లున్నది. వారి వ్యాసములోని ఇతర గుణదోషములతో నా కిట నిమిత్తము లేదు. కాని "సహృదయుని" విజ్ఞానము నెడ గల విశ్వాసబలవత్తవలన ఆవాక్యములంతలి శుద్ధిని విచారింపకయే ఉదాహరించుకొనిరని మాత్రము చెప్పకతీరదు.

రసములు ప్రేమమూలకములు అనుట సత్యసమ్మతమని నా సిద్ధాంతము. ఇందుకు శ్రీ శాస్త్రిలవారిపద్యముల నిట నుదాహరింప బోవుటలేదు. శాస్త్రిలవారి వాదప్రకారము నట్లుంచి అసలు వారిసిద్ధాంతముయొక్క ఔచిత్యమును నిరూపించుటయే ఈ వ్యాసము నుద్దేశ్యము.

"స్వం స్వం నిమిత్త మాసాద్య
శాంతా ద్భావః ప్రవర్తతే;
పున ర్నిమిత్తాపాయేతు
శాంత ఏవ ప్రలీయతే."

* ఇది కావ్యమా, కాదా యను విచారణచేయుటకు ఈవ్యాసమున నవకాశము లేదు. ఆవిషయము వేరొకతరి పరిశీలింపగలను. పా. మా. శర్మ.

ఈశ్లోకమును అభినవగుప్తపాదాచార్యులు "అభినవభారతి" యను తమ భరతనాట్య శాస్త్ర వ్యాఖ్యానమునం దుదాహరించి యున్నారు. దీని యర్థము :

"తమతమ నిమిత్తములను పొంది సర్వ భావములును శాంతమునుండియే ఉద్భవించు చున్నవి. తిరిగి నిమిత్తాపాయమున శాంతము నందే లీనమగుచున్నవి." దీనికి నా వ్యాఖ్యానము :

బ్రహ్మము నిర్గుణము. అది సగుణమైన ప్పుడు దానినుండి యొకసంకల్పము పుట్టినది. ఈసంకల్పము బ్రహ్మమున కొకవికారము. ఈ వికారము ప్రవృత్తి నివృత్తి రూపముల ద్వివిధము. ప్రవృత్తి యనగా సంకల్పము స్థితి; ఉనికి. నివృత్తి తన్నష్టి. సంకల్పరూపమగు నీ వికారమేసృష్టి.సృష్టియొక్కనివృత్తివికల్పము. (The positive and negative aspects of nature) సృష్టితోడనే ఈ వికారమునుండి రసములు పుట్టినవి. అవియు ప్రవృత్తి రసములు, నివృత్తిరసములు నని ద్వివిధము.

సృష్టికి బ్రహ్మమువలె రసములకు శాంతము మూలపీఠము.ఇది నిర్గుణము( Neutral). దీని వికారము ప్రేమ. ఈప్రేమకు ప్రవృత్తి నివృత్తులు కలవు. ఈ రెండుశాఖలనుండియే అష్టరసములు పుట్టినవి. ప్రవృత్తినివృత్యాత్మకమైన సృష్టికి తిరిగి బ్రహ్మమునందు వలెనే రసము లన్నింటికి తిరిగి శాంతము నందే వినియోగము.

సంకల్పరూపమగు బ్రహ్మమువికారము నుండి సృష్టి రెండుశాఖలుగా బయలుదేరి నట్లే శాంతమువికారమగు ప్రేమనుండి రసములు రెండుశాఖలుగా బయలుదేరినవి. శృంగార, హాస్య, వీర, అద్భుతములు ప్రవృత్తి రసములు. కరుణ, భయానక, రౌద్ర, బీభత్సములు నివృత్తిరసములు. వీనికి క్రమముగ స్థాయిభావముల నెఱింగి యవి యెట్లు ప్రేమ యొక్క ప్రవృత్తినివృత్తిరూపములో పరిశీలింప వలయును. ప్రవృత్తినష్టియే నివృత్తి యని గుర్తుంచుకొనవలయును.

శృంగారరసమునకు రతి స్థాయి—ఇది ప్రేమకు ప్రవృత్తి.

కరుణరసమునకు శోకము స్థాయి—ఇది ప్రేమకు నివృత్తి.

హాస్యమునకు హాసము స్థాయి—ఇది ప్రవృత్తి.

భయానకమునకు భయము స్థాయి—ఇది నివృత్తి.

వీరమునకు ఉత్సాహము స్థాయి—ఇది ప్రవృత్తి.

రౌద్రమునకు క్రోధము స్థాయి—ఇది నివృత్తి.

అద్భుతమునకు విస్మయము స్థాయి—ఇది ప్రవృత్తి.

బీభత్సమునకు జుగుప్స స్థాయి—ఇది నివృత్తి.

ఇందు శృంగారరసమునకు ప్రేమయొక్క ప్రవృత్తి కారణము. కరుణమునకు తన్నష్టి, అనగా ప్రేమయొక్క నివృత్తి కారణము. నష్టి యనగా విఘాతము. ప్రేమయొక్క ప్రవృత్తిస్వరూపము రతి. రతివిఘాతమైనచో శోకము. రతిస్థాయికము శృంగారము. శోకస్థాయికము కరుణము. ఇట్లే శృంగారము, హాస్యము, వీరము, అద్భుతము, ప్రేమయొక్క ప్రవృత్తివల్ల పుట్టిన రసములు. రతి, హాసము, ఉత్సాహము, విస్మయము అను స్థాయిభావములు ప్రేమయొక్క ప్రవృత్తి సూచకములు. శోకము, భయము, క్రోధము, జుగుప్స అను స్థాయిభావములు ప్రేమయొక్క నివృత్తిని, అనగా విఘాతమును సూచించును.

"శమో వైరాగ్యాదినా నిర్వికారచిత్తత్వం"

"తత్ర సంభోగవిషయ ఇచ్ఛావిశేషో రతిః"

"ఇష్టజనవియోగాదినా ఆత్మని దుఃఖాతిభూమిః శోకః"

"వికృతి దర్శనాదిజన్యో మనోవికారో హాసః"

"క్షుద్రసందర్శనాదిభి రనర్థాశంకనం భయం"

"లోకోత్తరేషు కార్యేషు స్థేయాన్ ప్రయత్న ఉత్సాహః"

"శత్రుకృతాపచారేణ మనఃప్రజ్వలనం క్రోధః"

"అపూర్వార్థసందర్శనా చ్చిత్తవిస్తారో విస్మయః"

"అర్థానాం దోషసందర్శనాదిభి ర్గర్హణం జుగుప్సా."

ఇట్లు విద్యానాథుడు స్థాయిభావములను నిర్వచించినాడు. ఈ నిర్వచనములు సంప్రదాయసిద్ధములే.

ఇందు శమము నిర్వికారస్థితియని చెప్పబడినది. సంభోగేచ్ఛ రతి. తద్విఘాతము శోకము. ఈజంటలో ప్రేమప్రవృత్తినివృత్తులు సుగమములు. ఇట్లే క్రిందిజంటలందును అన్వయించుకొనునది.

వికృతిదర్శనమువల్ల వస్తువునెడగల ఆదరముచే గల్గునది హాసము. ఇట వస్తువునెడ ప్రేమ కలదు. తద్విఘాతమగుచో, అనగా వస్తుదర్శనమున ప్రేమనశించినచో భయము. లోకోత్తరకార్యములందలి ప్రేమ ఉత్సాహము. తద్విఘాతము, అనగా క్షుద్రకార్యముల సాధించు "ఈర్ష్య" క్రోధము. అపూర్వవస్తుదర్శనమున గల్గుప్రేమ విస్మయము. తద్విఘాతము, అనగా వస్తుదర్శనమున ప్రేమ తిరోహితమగుచో జుగుప్స.

ఇట్లు పరిశీలించుటవల్ల శాంతము మూలరసమనియు, దానినుండి బయలుదేరినవే శృంగారాదులగు ప్రవృత్తిరసములు, కరుణాదు

లగు నివృత్తిరసములు సనియు, సర్వరసములకు కారణము ప్రేమయనియు తేలుచున్నది.

కనుక శ్రీ సూర్యనారాయణశాస్త్రిల వారి సిద్ధాంతము సత్యసమ్మతము. హనుమచ్ఛాస్త్రిగారును, "వారియందలి విశ్వాస బలవత్త"వల్ల విశ్వేశ్వర రావుగారును కేవలము పొరపడిరి. ఈ రసపరిష్కారమును విజ్ఞులు పరిశీలింపగోరినాను.

---



తిరుమలనాయకుని సౌధము
దక్షిణగృహము-మధుర. V. M. R.

# నన్నెచోడుడు - వచనరచన

గోబ్బూరు వేంకటానందరాఘవరావు

(అనువృత్తము)

## నన్నయభట్టు - నన్నెచోడుడు

నన్నయభట్టు రచించిన వచనములంబోలు వచనములు కొన్ని నన్నెచోడునిరచనములయం దగుపడుచున్నవి.

### ౧

నన్నయ్య. ఆది. ౪,౧౫౧ గంగానదీతరంగముల వర్ణనలో "అనిలాలోల కల్లోలమాలాస్ఫాలన."

నన్నెచోడుడు I. ౧౧౬ "...అనేకజలచరకులాకులితలులితాలోలకల్లోలానూనఫేనాయమాన..."

ఈ రెండురచనలయందును జలతరంగజాలము వలెనే సరళలకారము దీర్ఘమగుచు, హ్రస్వమగుచు, నున్నతమగుచు, మేళవించుచు, ముందునకు సాగిపోయి తుదకు నిష్ఠురాక్షరసంపర్కమున విరిగి కూలుచున్నది. ఇందు అర్థానుగుణమైన శబ్దసంఘటన గలదు.

### ౨

నన్నయ.సభా I. ౨౦౬. భీమజరాసంధుల మల్లయుద్ధము. "ఒండొరులంబట్టియు గిట్టియు, నడచియుం బొడచియుం; దాచియు ద్రోచియు మహాయుద్ధంబు చేసిరి. ఇందుకొక్క జతక్రియలలో మొదటియక్షరము మాత్రము మార్చి తక్కినయక్షరము లట్లేయుంచి యనుప్రాసము కూర్పబడినది.

నన్నెచోడు డిట్టిరచనలు రెండుగావించినాడు.

I. ౨౧౬. దక్షునిభయము: "అతిభయభ్రాంతుడై కన్నవారలకు మ్రొక్కుచు స్రుక్కుచు లోగుచు డాగుచు" I. ౬౪౧. "పార్వతిని తపోనిశ్చయమునుండి మరల్చుటకు ప్రౌఢాంగనలు తమబలిమియు గలిమియు మెఱయుచు నగజ భంగించుచు నగ్గించుచు.

### ౩

నన్నయ: ఆరణ్య I. ౩౬౪. ఊర్వశి యర్జునునితో ప్రస్తావించిన విహారములు:

"...మేరుశైలకందరంబులను మందపవనంబుగల నందనాదివనంబులయందును నితాంతకాంతవికసిత కనకారవిందసమధిక సౌరభసంవాసితమహానందకందంబులైన మందాకినీతీరమణిమయవేదికలయందును, చంద్రికాసుందరంబులైన సికతాతలంబులను మఱియు నిర్ఝరవిహారస్థానంబులను......"

నన్నెచోడ: పార్వతీపరమేశ్వరవిహారములు II. ౩౨౪.

"...హిందోళాందోళిత లతాందోళంబులం బరిమళాక్రాంతానందలతాంతమందిరానంతరంబుల జలవిహంగారావఘూర్ణితసరోవరంబుల చంద్రకాంతమణిసోపానదీర్ఘికాతటంబులం గనకవాలుకాభిరామనిర్ఝరపులినతటంబుల గాంచనమణిగణాలంకృతవిచిత్రకృత్రిమాంచలగుహాగహ్వరంబుల......"

### ౪

నన్నయ. ఆది ౧-౯. రాజరాజుసభ:—మంత్రిపురోహిత సేనాపతి దండనాయక దౌవారిక మహాప్రధానానంత సామంత విలాసినీ పరివృతుండు.

నన్నెచోడ II, ౬౦౩. స్కందుస్కంధావారము......అనంతమండలిక మహాసామంతదండనాయకామాత్యభృత్యాద్యఖిలజనపరివృతుడు.

ఈరచనలను జాగ్రతగా పరిశీలించినపక్షమున నన్నెచోడుడు నన్నయ రచించిన వచనముల పద్ధతులను కొంతవఱ కనుకరించెనని నాకు తోచుచున్నది.

## అర్థాలంకారములు-ఉపమ

నన్నెచోడుని యుపమానము లత్యంతమనోజ్ఞములు.

౧. దక్షప్రజాపతి చేసిన ఈశ్వరదూషణ విని సతీదేవి "నవఘనఘనధ్వని వినిన కమలలక్ష్మియుంబోలె వడిరిపడెను. I. ౧౫౬.

౨. కామశక్తి: I. ౪౩౪: "బలపరాక్రమాతి ధైర్యశౌర్యమంత్రతంత్రధ్యాన ధారణైశ్వర్యాద్యశేష దివ్యశక్తు లెంత విశేషంబులయ్యును చంద్రకాంతోపలంబులు చంద్రకిరణ స్పర్శనంబునం గరంగునట్లు అతి కోమలంబైన కామశక్తికి లోనై మృదుభావంబునం బొందు నిది జగంబునం దనుభవసిద్ధంబు.

౩. మేనక పార్వతిని వీడ్కొనుట: II. ౩౪౩: "పుష్పస్తబక భరావనమ్రకల్పలతిక లొండొంటం బెనంగునట్లున్నవశాదీగలు సోపులావ నొండొరుల నందంద కౌగలించుకొని మేనక మనోరాగంబున నిజతనయ స్వీకుకొనిచనియె.

౪. దనుజేంద్రుండు తనుజయు తాను జవరు లొక్కట ఘోరజలపటలంబునుంబోలె గజవడను మహి జలాసారంబునం ముగ్గినగాని......

మరియు శాస్త్రములు, భయానకములు నగు రంగములను వర్ణించునపుడు ప్రళయకాలమునాటి యుపమానములను కూర్చుటయందు నన్నెచోడునికి చాల ప్రీతి.

చూ. I. ౧౯౩: దక్షాధ్వరధ్వంసనమున కభిముఖుండగు గణాధీశ్వరుడు ప్రళయకాల నీలఘనాఘనంబునుంబోలె మహాధ్వని గర్జిల్లెను.

తారకయుద్ధమునం దీయుపమానములు విశేషముగా కానవచ్చుచున్నవి. II-౬౮౫ కుమారతారకులు తమతమ బలంబులను చేయిచ్చినం బ్రళయానిలంబు వీచినం బెరి చుడిపను కాలానల శిఖాకలాపంబులుం బోలెం గోపానలోద్దీపితాంతరంగులై ...ఇట్లే కుమారుండు విలయకాలస్వరూపుండై నీశానువలెను (II-౬౯౩) కేతుమాలి విలయకేతుమాలావతియుంబోలెను (II-౭౨౬) అంతకుండు యుగాంతకాలాంతకుండునుం బోలెను (II-౭౭౯, ౯౧౦) సమరమొనర్చిరి.

### —మాలోపమ

ప్రతిపాదితార్థము పాఠకుల మనములందు బాగుగా నాటుకొనుటకు కవి యొక్క ఉపమానముతో తృప్తినొందక, రెండుమూడుపమానములుగల మాలికలం గూర్చుటయు గలదు.

చూ. ప్రస్థానభేరీధ్వనివినిన దేవసేనలు:—II-౫౬౪.

"అమ్మహాధ్వని విని నవఘనాఘనధ్వని విని విజృంభించు మయూరసంఘంబునుం బోలె చెలంగి కలగొనం బాలు సమరకటకంబు చంద్రోదయంబునం దనరి పొంగు మహాసముద్రంబునుం బోలె చెరిగి ఘూర్ణిల్లుచుండె—"

I. ౨౮౨. పార్వతియౌవనప్రాదుర్భావము:

"మఱియుం గౌమారానంతరంబున ౧. లేదీగకుం గవ్వం బెక్కునట్లు ౨. పువ్వునకు దావివొందునట్లు ౩. చిత్రరూపంబునకు మెఱుఁగెక్కువిధంబున నిఖిలజన మనోభిరామంబగుచు...(౨౮౪)...అభినవ మధుసంగతింజెనగు ప్రసన్నమగు నుద్యానవనంబునుం బోని యౌవనమభ్యుదయమున.

### —శ్లేషోపమ

శ్లేషోపమలయం దీతనికి దృష్టి లేకపోలేదు. II. ౩౭౩. శరవణసరస్సు:"అనిమిషాస్పదంబగుట నమృతాన్వితంబగుచు, ఖరదండసహితంబగుటం సుమదాన్వితంబగుచు, ద్విజావాసంబగుట గుణాన్వితంబగుచు, హంసాశ్రయంబగుటం గూర్మాసనాన్వితం బగుచు.

### రూ ప క ము

కోపమును, విరహమును అగ్నిగా నిరూపించు సామాన్యరూపకము లటుండ, ఈక్రింది రూపక, సావయవ రూపక, పరంపరిత రూపకము లీతనిరచనయందు గమనింపదగియున్నవి:—

I. ౬౯. సకలావయవంబుల పరిపూర్ణంబైన దివ్యకావ్యాంగనని.

I. ౪౭౩. పార్వతి, తపోలక్ష్మీముఖవిశేషంబు నుం బోని తపోవిశేషంబు దాల్చి.

II. ౮౦౨. నిలింపబలజలధి నిజాయుధానేక జలచరాకీర్ణంబు చేయుచున్న.

II. ౮౧౬. మహాబాహుచతురంగబల దావానలంబు గని వరుణుం డవార్యవరుణాస్త్రప్రసారంబున నతిశ్రమంబున నుపశాంతిం బొందించె.

II. ౮౮౧. కాలనేమి దుర్వారార్తిం బ్రాణపవిహరణంబు దుర్వారనారాయణాస్త్రప్రసారఘోర మహోరగంబున కాహారంబైన.

II. ౯౪౫. తారకుడు నిర్గతైశ్వర్య ప్రభావుండై ఘోరాంగనాంతఃసంతాపానల వివర్ధనానిలుండగుచు.

II. ౪౬౪. దేవాసురరణరంగమున భూతభేతాళంబులు "రుధిరజలపూర్ణసరోవరంబుల జలక్రీడయు, కరిశరకళేబరాగ్రంబుల కృత్రిమాచలక్రీడయు, ప్రకంపమానధ్వజపతాకానేకదండంబుల వనక్రీడయు సల్పగు......

## —ఉత్ప్రేక్ష

భావాంబరవీథి న్విహరించు నీకవిచంద్రుని కవితాప్రభావ మీతని యుత్ప్రేక్షలలో విశేషముగా ప్రకాశించుచున్నది. చూడుడు.

I. ౧౬౬ సతీదేవి నిజదేహ విదాహకరంబైన కోపానలంబునకుం బరమేశ్వరు వియోగానలంబునకును శిశిరోపచారంబులు సేయం దలంచినదియుంబోలె హిమవంతంబునకు జనుదెంచెను.

II. శరవణసరస్సున కుమారస్వామి (II ౪౨౨). "కమలబంధుండు బంధుభావంబున కమలలక్ష్మి యింటికి విందువచ్చినట్లు తేజోవిరాజితుండై సరోవరంబు నలంకరించుచున్న బాలకుడు.

II. ౪౧౪ ఇట్లీశ్వరు సురలింగాకారంబు పురుషాకారంబు దాల్చినట్లు, నిజజనకునిసు సంవత్సరంబు నగ్గలింప సుస్మితముఖుండై ద్వాదశరవిప్రకరంబున వదనంబులు నిజావయవంబులు దాల్చినట్లు ద్వాదశకరపంకజ శోభితుండై కమలగర్భు నోత్తరించి కమలాసనంబు గైకొనినయట్టు కమలనిలయుండై వెలుంగుచుండె నంత..

I. ౬౧ ౪౭ యజ్ఞాగ్నములు - తదవసరంబున ఘృతాంశుకరాహతి నలిరి, తదీయాప్రబంధములైన యాగవింపంబులు కలిగి దండింపం జొచ్చునట్లు వేదండంబులు కమలమండంబుల కరుసుడించి మహోత్సాహంబున...

## వివిధాంశకుశలత్వము

ఇంతవఱకు చర్చింపబడిన యంశములను గమనించినపక్షమున నీకవి సమస్తాంశములయందును కుశలుడుగాని సామాన్యుడుకాడని తేటపడియుండును. అయినను అతడు సమస్తకళామర్మముల నెఱిగినవాడనుటకు ఒకటిరెం డుదాహరణములు చూతము.

(౧) చిత్రపటరచన:—I. ౫౬౪. "పార్వతి తనుసంతాపంబు వాపనోపక పరమేశ్వరు రూపు చిత్రించిచూచినదైన నూఱటయగునో యని చిత్రసాధనంబులు గొని పలకఘట్టించి మెఱుంగిడి త్రివటించి తిట్టంబు కొలదికిం దెచ్చి ఋజ్వాగతంబున రేఖనూల్కొలిపి, పత్రకబిందుకనిమ్నోన్నతాపాంగమానోన్మానంబు లలవఱిచి సలక్షణంబుగా చిత్రించి వన్నెవగొలిపి కండెఱ దెఱచిన."

చిత్రకళాసాంకేతికముల బాగుగా నెఱిగినవారు గాని పెవచనము రచింపనేరరుగదా?

(౨) రసవాదపరిజ్ఞానము. I. ౮౦౩.

చ. ఇనుము రసంబులో నుడుగ
కెప్పుడు నూనినగాని కాదు కాం
చన మమరాద్రివాయసము
సంతతముం వసియించికాని రేు

కనకము చాయగాదు చిర
కాలసుసేవనగాని కాదె స
న్మనమున నిన్ దలంచు డొక
మాత్రము చాలదె ముక్తికీశ్వరా.

## పదవైచిత్రి

ఈకవిరాజునకు సంస్కృతాంధ్రములయం దద్భుతపాండిత్యము కలదు గావున నాభాషల పదసంపత్తి యీకావ్యమున పుష్కలముగా గోచరించుచున్నది. మఱియు కావేరీతీరమున రాజ్యమేలుటచేత నాపరిసరమున ప్రబలియున్న తమిళ కర్ణాట భాషా వాఙ్మయముల ప్రాబల్య మీ కావ్యమున విశేషముగా నగపడుచున్నది. ఆంధ్రకవుల కావ్యములలో సాధారణముగా కానరాని విచిత్రపదము లనేకము లీతని రచనలలో కానవచ్చుచున్నవి. ఇట్టి పదప్రయోగవైచిత్ర్యము ఇతనిశైలి కొకముఖ్యలక్షణము. అట్టిపదములు కొన్ని మచ్చునకు వ్రాయుచున్నాను.

I. ౫౨౩ కనుచేటంబైన దావగొనక (I. ౭౩౨.)

I. ౨౨౬ రొల్లిదించి. I ౫౯౩. సెచ్చితి.

I. ౬౩౭ నక్కుత్తికొనక I. ౯౦౨. ఎయిద సేరమి.

II. ౧౭ రాగోత్కటంబున దావగొనక

II. ౨౫ ఆయగము.

II. ౩౭౩ జాలిమేలిల్లు.

II. ౮౪౪ పురోభాగంబున పరభాగిల్లు......

## పొరపాటు రచనలు

భావోద్రేకపరవశుడగు నీకవిప్రభుడు కావ్యమునందలి పాత్రలను తనమనోవీథిని సన్నిధానముచేసికొని పరవశుడై వాక్యరచనమునం దొక్కొకచోట ప్రమత్తుడగుచున్నాడు చూడుడు:

I. ౩౭౪. మొదలు ౮౦౧ వఱకు మన్మథుడింద్రునితో ప్రత్యక్షముగా మాటలాడుచున్నాడు.

—౮౦౨. "వెరవున భుజశౌర్యంబున సురవల్లభ పనుపు నీవచూడగ పరమేశ్వరుసైన నొత్తు జెలిసుర నర ఫణిదివిజాధిపతులు నా కెదురుదురే" (Direct speach)

—౮౦౩. "అని సెనరుముట్టం బూనిన కుసుమాయుధు పూనికి వజ్రాయుధుండు ఘనంపఱిచి తారు తారకాసురుచేతం బరాజితులై పరమేష్ఠిమఱువుం జొచ్చినవిధంబును విధి తద్వధ కుపాయం బయ్యుమామహేశ్వరుల వీర్యసంభవుండైన కుమారుండగునని హితోపదేశంబు సేయుటయు హరిగిరిజలు నైష్ఠికానుష్ఠానులై హిమవంతంబున నున్నవారు, వారికి సంగమంబుసేసి జగద్ధితంబుసేయు మిది యనన్యవిషయంబు నీవలనకాని యొరునకు సాధ్యంబు గాదు కావున నిన్నుం బ్రార్థించితిమి."

ఇందు ౮౦౩ ఆరంభముమొదలు 'హరిగిరిజలు' వఱకు పరోక్షభాషణము (Indirect speach): పిమ్మట ప్రత్యక్షభాషణముమధ్య నొకక్రియ రచింపకుండుటచేత ప్రత్యక్షపరోక్షభాషణములు కలగలుపై యన్వయము పొసగకున్నది.

మఱియొకటి:—II. ౮౯౧. కుమారుని పట్టాభిషేకము "...పరమేశ్వరుండు శక్త్యాద్యనేకరాజచిహ్నంబులు దయసేసి దివ్యశస్త్రాస్త్రంబులు హస్త్యశ్వరథపదాదిచతుర్బలంబులు దయసేసి మఱియుం బార్వతి వజ్రమయవర్మ... అనేకరాజచిహ్నములు దయసేసి. ..." ఇందు 'దయసేసి' యనుక్రియ ముమ్మాఱు రనవసరముగా వక్కాణించుటచేత రచనయందు కవి యంత లక్ష్యముంచక వ్రాసిన ట్లగపడుచున్నది.

(3) II. ౭౭౮. ఉమామహేశ్వరులు కుమారు ననేకవేదశాస్త్రాగమ పురాణేతిహాసకథా బృహత్కథాద్యఖిలవిద్యావేదికలయందు పారంగతుంజేసి—

బృహత్కథ యిటీవలి యాంధ్రచరిత్రకు సంబంధించినది. దేవసేనానియగు కుమారస్వామి తనవిద్యాభ్యాససందర్భమున బృహత్కథ పఠించెనని వ్రాయుట విపరీతముగా తోచుచున్నది. కుమారసంభవకర్తలైన

ఉద్భట, కాళిదాస, నన్నెచోడులు బృహత్కథ పఠించి యుందురు. తమవిద్యాభ్యాసమునాడు తాముచదివిన యితివృత్తములు దేవతల విద్యాభ్యాసమునాడు దేవతలు చదువుకొనిరని వ్రాయుట కాలవ్యత్యాసదోషము (Anachronism) కాని మరియొకటికాదు. ఇట్టి పొరపాట్లు కొరకులుగాని గొప్పదోషములుగావు.

౫

## ప్రేమ

ఏకవియొక్క ప్రతిభయైనను అతడు ప్రేమ తత్త్వమునుగూర్చి చేసిన రచనలవలన విశేషముగా వ్యక్తమగుచుండును. నన్నెచోడుడు రచించిన మిథునము లలో నీక్రిందివి గమనింపవగియున్నవి.

౧. దక్షప్రజాపతి-అతనిభార్య.

౨. సతి-ఈశ్వరుడు.

౩. హిమవంతుడు-మేనక.

౪. రతీమన్మథులు.

౫. పార్వతీపరమేశ్వరులు.

### ౧. దక్షప్రజాపతి-అతనిభార్య

వీరలాదిమదంపతులు. వీరి కేబదిమంది కూతుండ్రుగలరని నన్నెచోడుడు I. ౭౪ లో నుడివెను. కొన్ని పురాణములలో వీరి కరువదిమంది కూతు లని చెప్పబడెను. అందు అదితిమొదలగు పదుముగ్గురు కశ్యపునిభార్యలైరి. అశ్విని మొదలు రేవతివఱకు నిరువది యేడుగురు చంద్రుని భార్యలు. సతీదేవిని ఈశ్వరుని కిచ్చి పెండ్లిచేసి దక్షుడు తనధర్మపత్నితో సుఖముగా జీవించుచు తన్ను గన్న బ్రహ్మదేవునికంటె నధికమగు కీర్తిపొందెను.

### ౨. సతి-ఈశ్వరుడు

పరమేశ్వరుడు దాక్షాయణి మనోహరాకార నవయౌవన హావభావవిలాస విభ్రమ సౌందర్య గుణంబుల కంతకంత కనురక్తుడైయుండెను. వారలనోన్యానురాగాతిరేకమున కామకేళీలాలసులై, కైలాస నగముమీదను ఆగిరిపార్శ్వములందలి మనోహర స్థలములందును హాయిగ విహరించుచు దాంపత్యధర్మములు నిర్వహించుచుండిరి. ఆప్రాంతములందు మత్తేభము లనేకములు హృదయాహ్లాదముతో ననేకప్రకారముల మదనాసక్తిం బెనంగుచుండుటగని దాక్షాయణి సాభిప్రాయముగా పతివంకజూచెను. ఈశ్వరు డంగీకరించెను. ఆహా! మన్మథునిమహిమ! ఏమనవచ్చును?

గీ. ఆదిమూర్తులు శివశక్తు లచలమతులు
హరుడు సతియును సురతార్థమై విహీన
తరములగు మృగరూపముల్ దాల్చిరనిన
కామమాయల నెవ్వార లేమిగారు?

ఇట్లు పరమేశ్వరుండును సతీదేవియు సామజకేళీలాలసులై విహరింప సద్యోగర్భమున గజముఖుడుద్భవించెను. సంస్కృతకుమారసంభవ కథలలో లేని గణపతిజన్మమును నన్నెచోడు డిందు చేర్చినాడు. విఘ్నేశ్వరున కేనుగుముఖ ముండుటకు ఈ కథలో శాస్త్రీయమైన హేతువు (Scientific reason) చెప్పబడినది. గర్భధారణకాలమందు దంపతుల మనస్సులందు, అందును ముఖ్యముగా స్త్రీమనమునందు గాఢముగా నాటుకొనిన రూపములు, అంశములు, సందర్భములు ఊరకపోవు. గర్భస్థమగు శిశువుయొక్క భవిష్యద్రూప గుణాదులయం దివియన్నియు తప్పక వ్యక్తము కాగలవు. ఈశాస్త్రమునే యూజెనిక్సు (Eugenics) అను నామముతో పాశ్చాత్యులిటీవల వ్యవహరించుచు, దాని యభివృద్ధినిమిత్తము మిగుల కృషిచేయుచున్నారు. అదియటుండనిండు.

దక్షుడు కశ్యపయమచంద్రాదులైన యల్లుండ్ర యిండ్లకరిగి వారిచే సగౌరవముగా పూజింపబడెను. కాని తనదురభిమానముచేత నీశ్వరుని విముఖునిచేసుకొని స్వగృహమున కరిగి, యీశ్వరు నవమానించుటకై యొక యజ్ఞమును చేయసమకట్టి సమస్తబంధుజనులను, దేవతలను ఆహ్వానించి, యీశ్వరునిమాత్ర మాహ్వానింపడయ్యె. సతీదేవి జగజ్జనకుండగు తనజనకుని మహత్త్వ

విభుత్వములకు మెచ్చుచు, పరమేశ్వరు నాహ్వానింప కుండుటకు హేతువేమియని ప్రశ్నించెను. జామాతపై ద్వేషముచే దక్షుడు పరమేశ్వరునటు విని సహింపక దారుణముగా శివుని దూషించెను. ఆమాటలు వినుచుండ నామెయొడలు మండజొచ్చెను. మండదా మతి? భర్తృదూషణవాక్యములు పతివ్రతలకు దేహము దాహము బొందించు నగ్నిహోత్రములే కదా! ఆకోపాగ్నిచే లక్కబొమ్మవలె ఆమె భగ్గున మండిపోయెను. మహాద్భుతము! భర్తయందు పతివ్రతకు గల పవిత్రమైన ప్రేమ కీయంశము అద్వితీయమైన యుదాహరణము. దూషించినవాడు తండ్రి; కాని దూషింపబడినవాడు జీవితేశ్వరుడు. ప్రేమమహిమచేత మనోనాథుని యందు లీనమైపోయిన సతికి పరమేశ్వరునిగూర్చి చేయబడిన దూషణప్రసంగము లగ్నిహోత్రమయి యామెను దగ్ధముచేసినవి. ప్రేమతత్త్వము అభేద్యముకదా?

సతిమరణమునకు ఈశ్వరుడు ఘోరరౌద్రరూపము దాల్చెను. లోకభయంకరమైన యాకృతితో నందియు, విసర్వించుచు గణాధిపతులును ఈశ్వరునిచుట్టుచేరి జగత్సంహారమున కుపక్రమించుచుండిరి. ఈశ్వరుని సెలవుగైకొని గణనాయకులు దక్షాధ్వరశాలకరిగి మఖము మంటగలిపి గోమేధికసదనము దాగిన దక్షు పట్టుకొని శిరముఖండించిరి.

సతిమరణదైన్యమున కోర్వక దక్షుకాంత శివుని శరణుచొచ్చి పురుషభిక్ష వేడుకొనెను. కరుణామయుడగు నీశ్వరుడు దక్షుని మరలబ్రతికించి, యజ్ఞము సఫలముచేసి ప్రజాపతిని యోగమునం దెప్పటియట్లు నిలిపెను.

తక్కినవారందరు నెప్పటియట్లే యుండిరి. ఈశ్వరునికిమాత్రము భార్యావియోగము తటస్థమైనది. కైలాసము చిన్నబోయి చీకటిలో నున్నట్లున్నది. ఏమియున్నను గృహిణిలేని దొకగృహమా? భృంగిరిటాదుల హాస్యప్రసంగములు పరమేశ్వరుని మనోవ్యథ మాన్పలేకపోయినవి.

## 3. హిమవంతుడు మేనక

వీరలు పుణ్యదంపతులు. పర్వతములకెల్ల చక్రవర్తి హిమవంతుడు. అతనికి నిఖిలస్త్రీరత్నమైన మేనక అగ్రమహిషి. వారికి బ్రహ్మవరముచేత మైనాకుడను పుత్రుడుద్భవించెను. కాని ఇంద్రుడు వజ్రాయుధముచేత రెక్కలు ఖండించివైచునను భయముచేత మైనాకుడు సముద్రములో దాగెను. ఎట్టివారికైన నేదేని మనోదుఃఖముండకపోదు. కొడుకిట్లు దూరమయ్యెనని దుఃఖించి యాదంపతులు సతీదేవి తమకు కూతురై జన్మింపవలయునని తపస్సుచేసిరి. సతీదేవి ఆదంపతులకు ప్రత్యక్షమై వారుకోరిన వరమిచ్చి మేనకగర్భమున ప్రవేశించెను.

పిమ్మట నొకశుభముహూర్తమున నా దంపతులకు పుత్రికయై పార్వతి జనించెను. కాలక్రమమున నామెకు యౌవన మంకురించెను. ఆమెకు పరమేశ్వరుడే భర్త యగునని నారదుడు హిమవంతుని కాదేశమిచ్చి చనెను

అట పరమేశ్వరుడును, సతి వియోగాగ్ని మనములో దగిలికొని కాల దానికి దనువుసేయ దలచియో, లేక నిక్కముగా తపము చేయవలచియో హిమగిరికి వచ్చెను. హిమవంతు డీశ్వరాగమనమున కెంతయు బ్రీతుడై, యనేకవిధముల నర్చించి పెక్కు వరములు బడసియు దేవదుర్లభుడగు మహేశ్వరుని బాసిపోనేరక చేతులుమోడ్చి దీనాననుడైయున్న కరుణించి "నీపురంబున కేదారేశ్వరుండన వసియించెద నోడకుండు" మని వరదుడు వరమిచ్చెను. మహాప్రసాదమని హిమవంతు డానందపరవశుడై, తన కూతుం బార్వతి నాదేవుసమ్ముఖమున నిల్పి,

సీ. ఈబాల దన్నుదానెఱిగిన కోలెన
నన్యశరణ్యయై యహరహంబు
నిన్ను గొల్చుచునుండు నీవిందు మాపుణ్య
మునజేసి వచ్చుట విని ముదమున

జాడంగవచ్చి నిన్ జూచినకోలె భ
  క్త్యావేశమున జేసి జీవమొసల
బాసిన మీపొందు వాయనోపదుపాసి
  తలరు గావున నిచ్చ దగినవరువు
బనులుచేయుచుండు పార్వతి యునికికి
తరడ యిచ్చగింపవలయు ననిన
నతని విన్నపమున నంతకు భక్తవ
త్సలుడు నెమ్మనమున సంతసించె.

పార్వతియు నీశ్వరారాధనాసక్తయుక్తయై భక్తియు ననురక్తియు నంతకంతకగ్గలించుచుండె

సీ. చమరీజబర్హావార్జనుల బరీక్షించి
  నయమున సమ్మార్జనంబు సేయు
కర్పూరతైలార్ద్ర కస్తూరికాకర్ద
  మంబుల ననులేపనంబు సేయు
కాశ్మీరమాంజిష్ఠ గరుడాంశుహరినీల
  ముక్తాఫలంబుల మ్రుగ్గులిట్టు
కుసుమపల్లవలతాకోరకంబుల జిత్ర
  దామంబులొనరించు దావిమినుల
పుష్పమందిర మొనరించు పుణ్యవారి
సౌరభము వించి మణికలశముల నించు
నచలపతిసుత మది నిట్టు లహరహంబు
శివుని కనురక్తి పరిచర్య సేయుచుండె.

అట దేవేంద్రుడు తారకాసురుచేతం బరాజితుడై మహేశ్వరతనూభవునిచే గాని యారాక్షసునకు మరణము లేదని విని, మన్మథునిపిలిపించి హరగిరిజలు నైష్ఠికానుష్ఠానులై హిమవంతంబున నున్నవారు. వారికి సంగమంబుచేసి జగద్ధితంబు సేయు మిది నీవలనన కాని యొరునకు సాధ్యంబుగాదు. నిన్ను బ్రార్థించితిమి. అనిన దర్పకుండు దర్పించి "శూలితపోభంగ మెంతపని దేవహిత మిదె చేసెద నని బయలుదేరెను.

## ౮. రతిమన్మథులు

రతి యపశకునములగాంచి కలగిన మదితో పతిరాక ప్రతీక్షించుచుండెను. మరుడును మరలిరాగానే యతనివలన కార్యగతు లెఱిగి రతి యదరిపడి తల్లడిల్లుచు

హరుడు నెపమల్గి చూచును నాత్మగణంబ,
యఖిలజగములు సంహారమగు రయమున.

కాబట్టి అట్టియుగ్రునిపై పోరాదు పోవుటని విన్నవించెను. మరుమహేశ్వరులకుగల తారతమ్యమెంతో రమ్యముగా వర్ణించెను.

కాని బాలురైనను తని పిప్పి యుమిసెడు
  చెఱుకువిల్లని నమ్మి చేతబట్టి
మెలతల విలసంత్రుకలబోలని కందదు
  నలరుపుష్పములమ్ములని తలంచి
తలిరాకులైన గదల్పనోపని మంద
  పవనుండు నాకు పెనుప్రాపుగాగ
నబలలు నోపని యాకాశమున బోవు
  నలిశుకములు మూలబలము గాగ
నంతనేనని మిట్టిన నంటిమరుల
ననువసంతుడు తనుసహాయంబుగాగ
కాకిపిల్లల కోకిలపికములు బోటు
మగలుగా నుగ్రుపై బోవుదునె మదన?

అని పెక్కుభంగుల నివారించెను. కాని ప్రయోజనము లేదయ్యెను.

రతీమన్మథులు హిమవంతముచేరి హరుని తపోవనము ప్రవేశించిరి. పార్వతియుగూడనుండినగాని ఈశ్వరునిమనస్సు చలింపజేయుట మదనునికి సాధ్యముకాలేదు. అంతలో నామె లతామందిరాంతరంబున కరిగి హరచరణసరసీరుహంబులకు పుష్పాంజలియిచ్చి కృతాంజలియయ్యె. ఆక్షణముననె ఆమెహృదయము మదనాస్త్రభేదితమయ్యె. మోహపరవశయగు పార్వతిముఖాలంకారముకనుగొనినంతనే పరమేశ్వరుని హృదయమును చంచలితమయ్యెను. నిర్నిమిత్తముగ మనోవికారమగుట కేమి కారణమోయని హరుడు నలుగడలం బరికించిచూచి నీలాభ్రపటలమధ్యమున నింద్రచాపహస్తుడైన పర్జన్యునివలె నవతమాలలతలమధ్యమున పుష్పచాపహస్తుడైన మదనుని కనుగొని కోపించి, ప్రళయకాలాగ్నిరౌద్రోద్రేకమునం జెరిగి దహనాంబకంబు విచ్చిచూచిన తత్క్షణములో మన్మథుడు భగ్గునమండిపోయెను.

శివునికి పార్వతిపై రాగము, మదనునిపై ద్వేషము పెచ్చు పెరుగుటచేత తపము చాలించి యతడు కైలాసమునకు మరలెను. విరహతాపపరవశయై పడిన పార్వతిని హిమవంతుడు స్వగృహమునకు గొనిపోయెను. రతి ప్రలాపించుచు చనుదెంచి పుష్పకోదండపల్లవభత్రమకరకేతనంబుల నచ్చుపడియున్న మరుభస్మాకారంబుగని శోకపరవశయై పతిచే తపించుచుండెను. జీవముపై నాస విడచి వసంతాదు లెంత వారించినను మానక కులపాలికాధర్మవృత్తినైనం బురుషుతోడ పరలోకమున కరుగవలయునని మరణనిశ్చయముచేసి యగ్నిప్రవేశమునకు సిద్ధపడుచుండ నాకాశవాణి 'వలదు. నీపతి పునర్జీవితుడగు. శాంతింపు' మనెను. మన్మథుని పునరవతారము నుద్యోగించి రతి నిరతిశయభక్తితో పరమేశ్వరు నారాధించుచుండెను.

## ౫. పార్వతీపరమేశ్వరులు

అట పార్వతియు నీశ్వరవిరహదహనదాహము సహింపనోపక లీలోద్యానమున నేకాంతమున నరిగి పరమేశ్వరు రూపము చిత్రించిచూచిన నైన నూఱట యగునని సలక్షణముగా చిత్రించునంతలో చతురిక చేరవచ్చెను. పార్వతి లజ్జించి, చిత్రము కప్పి, పలకబోయి పరవశయయ్యెను. "ఈశ్వరుని నీవు ప్రేమించుట అనింద్యము - సద్వంద్యము - త్రైలోక్యపూజ్య మని చెలికత్తె సంబోధించి శిశిరోపచారము లెన్ని చేసినను ఆమెవిరహవ్యథ యథాక్రమమున నుండెను. తపోమహిమచే నర్పించి, మెప్పించి, యీశ్వరుని భర్తగాబడసెదనని యామె తపోవనమునకు నెడల నిశ్చయించెను. మేనకాహిమవంతు లది తగదని వారించిరి. అంతఃపురప్రౌఢాంగనలు తమబలిమియు గలిమియు మెఱయుచు నామెను భంగించుచు నగ్గించుచు తపఃప్రయత్నము మాన్పజూచిరి. యథార్థప్రేమమున కా వృథాజల్పములతో పనియేమి? "ఈభవనమున నీశ్వరుండ పతి ప్రాణము దేహము చిత్తవృత్తులున్, శివపద పంకజార్పణముచేసితి బాసితి మీకు నింతతోన్." "పొండ" ని పార్వతి కోపించి తెగబలికెను. అద్భుత నిశ్చయమునకు మరెవరును మారాడజాలరైరి. తలిదండ్రులను వీడ్కొని చతురికాదివయస్యలకూడ గొని చని తపోవనము ప్రవేశించి హైమవతి యీశ్వరునిగూర్చి యథావిధిగ తపముచేయజొచ్చెను. వేసవిని పంచాగ్నిమధ్యమునను, వర్షాకాలమునం దంభోవాసియైయును, దుస్సహశీతోపేతంబులను హేమశిశిరంబులందు నిరంతరోదకవాసనియమమునను నిరాహారాది ఘోరతపోవృత్తి నుండెను.

I. రాగం :

ఇనుము రసంబులో నుడుగ
కెప్పుడు నూనినగానికాదె కాం
చన మమరాద్రినాయసము
సంతతముగా వసియించికానియే
కనకముచాయగాదు చిర
కాల సుసేవనగాని కాదె స
న్మనమున నిన్ దలంచుటొక
మాత్రము చాలదె ముక్తికీశ్వరా.

అంతకును పరమేశ్వరుడు ప్రత్యక్షముకాలేదు. ఆమె పట్టువదలలేదు. శరీరము చర్మాస్థిమయమై కాష్ఠావస్థనుండినను తపోనిష్ఠ సాగించుచుండెను. ఆమె నిశ్చల తపోమహిమకు విశ్వమంతయు చలించిపోయెను. కైలాసమీశ్వరునితోగూడ నంటిబొంగరమువలె గిఱ్ఱున తిరుగజొచ్చెను. యథార్థప్రేమ మహిమ యిట్టిది. అది యిట్టి విశ్వభ్రాంతులకు లొంగదు. ఆ ప్రేమము విశ్వమునే కలచివైచి వశపఱచుకొనును. ఆతపోమహిమకు లొంగి మూడుకనులవాడు సహితము కైలాసము దిగి రావలసినదే. అయినను కడసారి మరియొకపరీక్ష. ఈశ్వరుడు మునికుమారునివేషము ధరించి పార్వతిం జేరవచ్చి కుశలప్రశ్నల గావించి, చతురికవలన నామె శంభుని ప్రాణేశుగా గోరి తపముచేయుచున్నట్లు విని హేళనచేసి పలువిధముల పరమేశ్వరుని నిరాకరించి పలుకుచు, తక్కుంగల దేవతలను వివిధముల పొగడజొచ్చెను. ఉపన్యాసమంతయు విని, పార్వతి యాకృతక మునికుమారున కొక్క జవాబిచ్చినది.

“జనుషవై లేట్లు బ్రాహ్మణజాతి బుట్టి”

మునికుమారుకు మరికొంతతడవు శివదూషణ చేయుచుండెను. పార్వతి యాపలుకులు విననోపక, కోపావేశమున పరాఙ్ముఖయై వెడలి పోబోయెను. త్రినేత్రుడైనను ఆమె నిక నేమిపరీక్షింపగలడు? గాని నిశ్చలభక్తియుక్తి కనురక్తుడై యీశ్వరు డాక్షణమె నిజస్వరూపముతో ప్రత్యక్షమయ్యెను. హైమవతి యులికిపడి స్తంభించి నిల్చెను.

ఆమె మనశ్శరీరము లొక్కసారే వికసించెను. తపము సఫలమైనందు కామె కానందాశ్రువులు పొడమెను. సప్రేమముగా నామె యీశ్వరుని క్రీగంట చూడసాగెను. ఈశ్వరు డాచంచలనేత్రి యవలోకనసుధారసప్రవాహమున మునిగెను. హరుడు గిరిజ యధిక ప్రణయరసాపూర్ణ సాగరంబులను సభిమానశీలంబులను నతిక్రమింపనున్న సమయమున చతురిక “మహాదేవా! ఈమె కన్యాపణము సప్రతిష్ఠితముచేసి పరిణయపూర్వకముగా పరిగ్రహింపు టుచిత” మని విన్నవించెను. అటుగాక యని హరుడు రజతాద్రికి మరలెను. పార్వతి తండ్రి గృహమున కరిగెను. హిమవంతు డుత్సవముచేసి కూతు తపోవేషము మాన్చెను.

పిదప సప్తఋషుల నంపి హరుడు హిమవంతుని కూతుం దనకిచ్చి వివాహము చేయుమని కోరెను. మహాప్రసాదమని హిమవంతుడు సమ్మతించెను. భవుడు పెండ్లికొడుకై తరలిరాగా హిమవంతుడు సగౌరవముగా నెదుర్కొని తోడ్తెచ్చి శుభముహూర్తమున కన్యాదానము చేసెను. ముజ్జగములు మహానందముతో వెల్లివిరిసెను.

ఇదేసమయమున మన్మథుని పునర్జీవితుని చేయుటకని బ్రహ్మాదులీశ్వరునితో “దేవా, మన్మథుడు దేవహితార్థ మింద్రాదులచే ప్రార్థితుడై మిమ్మను మహాయోగిని సంగతిసేయువాడై మీమీదకువచ్చెను. అంతే గాని మీపైనెత్తివచ్చుటకు వానికెన్ని గుండెలున్నవి? ఈశుభసమయమున మదనుని పునర్జీవితుం జేయవలయు” నని విన్నవించిరి. “అంగజాడు జగంబులకనంగుడై రతికిం ప్రాక్తనస్వరూపుండై వర్తించునని వరదుండు కరుణించి వరమిచ్చి యతని పూర్వనియోగమును దయచేసెను. తక్షణమే తెరవెడలివచ్చునట్లు వచ్చి మన్మథుడు రతిప్రియాల నిలిచెను. అప్పుడు

“తలుకొత్తెం దరహాస మాననమునన్
దట్టూర్చిపో మేనను
త్పులకల్ గ్రక్కున బర్వె లోలనయనాం
భోజాతపత్రంబులన్
జలరెన్ భోరనసమ్మదాశ్రుజల ము
ద్వేగంబు రాగంబుగా
నెలమిం జిత్తము తక్షణంబరతి కా
త్మేశావతారంబునన్.”

పార్వతి యకలుషితచిత్తముతో పరమేశ్వరుం బ్రేమించి ఎట్టిదురంతరాయములకు దలంకక, ఎట్టివిఘ్నములను లెక్కచేయక, శల్యావశిష్టయగునంతకు తపోనిష్ఠనుండి పరమేశ్వరు నర్ధాంగలక్ష్మి కాగలిగెను. ఇట్టి కఠినతపఃపరీక్షలకు లోనైనపిదపగదా పార్వతియైనను పరమ దేహార్ధమును బడయగల్గినది? ఐదువతనమున కాధిపత్యము బడసినది? కన్యకలును, పుణ్యాంగనలును, ఎప్పటికి నైదువతనమును కోరి పార్వతినే పూజించుచుందురు గదా? అందరిమాటలేల? శ్రీకృష్ణుని భార్యకాగోరిన రుక్మిణిసహితము “నమ్మితి నా మనమ్మున సనాతనులైన యుమామహేశులన్, మిమ్ము పురాణదంపతుల మేలు భజింతుగదమ్మ చాలపెద్దమ్మ దయాంబురాశివి గదమ్మ హరిం బతిసేయవమ్మ నిన్నెమ్మిన వారి కెన్నటికి నాశము లేదుగదమ్మ యీశ్వరీ!” అని ప్రార్థించినది.

ఇంతవఱకు బాగున్నదికాని యటుపైకథ కొంత రోత కలుగచేయుచున్నదని వ్రాయకతప్పదు. అష్టమాశ్వాసమున సుమారొకనూరుపద్యగద్యములైన పిమ్మట హిమవంతుని యోషధిప్రస్థపురమున రాత్రి చీకటిపర్వినపిదప జారచోరాది గూఢచారుల చర్యలు నాయాశ్వాసాంతమువఱకు వర్ణింపబడినవి. ఆరచనలు కొన్ని మాధుర్యహీనములై యసహ్యము కల్గించుచున్నవి.

అందలి బోడెంగులు, లంజకాండ్రు, అత్తగంతులు, చిల్లతర్కములు లోనగునవి యుత్తమకవుల మహాకావ్యములం దుండవలసినవి కావు. ఈకావ్యమునం దిచట నివి యప్రస్తుతములు, గౌరవహీనములు ననియనకతప్పదు. ఆనాటి శ్రీమంతజీవనముయొక్కయు, విటవిటీజనముయొక్క వృత్తివిశేషములయొక్కయు వివరములు కవి యిందు వర్ణించియుండును. ఈయంశములో నన్నయభట్టారకునకును, నన్నెచోడునకును చాలవ్యత్యాసము కనబడుచున్నది.

పిమ్మట నవమాశ్వాసమున, పార్వతీపరమేశ్వరులు వివాహానంతరము కైలాసముచేరినపెనుక నభ్యంతరమున వారి దాంపత్యధర్మములను రతివర్ణనమనుపేర కవి మిక్కిలియసహ్యముగా వర్ణించినాడు. ప్రాచీన సంస్కృతాలంకారికులు కావ్యమునందు రతివర్ణన ముండవలయునని విధించియున్నందున రతివర్ణింపకున్నచో కావ్యమునకు అదియొక లోపముగా పరిగణించి పండితులు తమగ్రంథమునకు గొప్పగౌరవ మొసంగరని భీతిచేతనో, మరి యేహేతువుచేతనో యీమైథున వివరములు కొందరు గ్రంథకర్తలు వర్ణించియుందురు. రతి యనగా ప్రేమరసము సగౌరవముగా వర్ణింపవచ్చును. అంతేగాని ఏకాంతము నభిలషించి శయనాగారముం జేరి తలుపులు మూసుకొనిన దంపతులపై దండెత్తి, నక్కి పొంచి యక్రమముగా గదిలోదూరి (Lurking nuptial room tres pass) నేరముచేసి రేయెల్ల రెప్ప వేయక కొఅతను దీసినట్లు గూరుచుండి వారి దాంపత్య మర్మములనెల్ల వరుసగా రతివర్ణనమనుపేర వర్ణింప నెంచుట పరమాసహ్యము. వివేకలేశ మున్నవార లెవరును ఏదంపతులశయనాగారమునందు నిట్లు జొరబడరు. తన తలిదండ్రుల దాంపత్యమర్మముల నెవడైన లజ్జలేక వర్ణింపబూనునా? అట్టి తలిదండ్రులకెల్ల తలిదండ్రులగుటచేత జగత్పితలని పూజింపబడు పార్వతీపరమేశ్వరుల మైథునమును వరుసగా బంధనక్రమములతో వర్ణించుచు కావ్యము వ్రాయుట గొప్ప తప్పు. కావ్యమునం దిట్టివర్ణనలు దైవమునెడలను పాఠకునెడలనుకూడ మహాపరాధములని నావిన్నపము. అలంకారశాస్త్రనిబంధనల ననుసరించి రతి, మద్యపానవర్ణములుగావించిన గాని ప్రబంధము సద్రసబంధురము కావనియు, కావ్యలక్షణములకు లోపము కలుగు ననియు భ్రమించి నన్నెచోడు డీ కావ్యమునం దివి విధిలేక వ్రాసియుండును గాని మరియొకటికాదని తోచుచున్నది. ప్రాచీన నిబంధన గ్రంథములయం దత్యంత భయభక్తులు గల యిట్టికవుల స్వతంత్రబుద్ధు లానిర్బంధవేదికలపై బలిపెట్టబడుచుండును. కావున నవి తలయెత్తి లోకమునకు పొడసూపుట బహుదుర్లభము.

## ౬

## ఇతర రసములు

ఈకావ్యమునందు దాక్షాయణి మరణము, మన్మథునిమరణము మిక్కిలి జాలిగొలుపునట్లు వర్ణింపబడినవి. గణాధ్యక్షులు దక్షాధ్వరధ్వంసమున నుపక్రమించునపుడును, దేవాసురయుద్ధసంఘర్షమునను వీరరసము వెల్లివిరిసినది. రణమరణ పరిచ్ఛేదులైన పతులతోడన మరణపరిచ్ఛేదలనుచునుండిన పుణ్యసతులు దీనానాథ విద్వజ్జనంబుల నపారవసుధారాసారంబులం దేల్చుచు సర్వస్వదానులై దానవీరము ప్రకాశింపజేసిరి. మన్మథుని భస్మముచేయు రుద్రునందును, దక్షాధ్వరధ్వంస దేవాసురయుద్ధములందును రౌద్రరసము పెక్కుతావులందు ప్రస్ఫుటమైనది. రణరంగ నిహతుల రక్తమాంసముల హరించు శాకినీఢాకినీప్రభృతి పిశాచకృత్యములందు బీభత్సము విదితము.

గణేశోత్పత్తి, దాక్షాయణిమరణము, దక్షప్రజాపతి పునర్జన్మ, మన్మథదాహము, పునర్జన్మ లోనగు రంగములద్భుతావహములు. భక్త్యావేశములో మతప్రాధాన్యముగా వ్రాయబడిన యిట్టికావ్యములలో హాస్యమున కెడముకనబడదు గాని కలహభోజనుడైన నారదుడు శరవణసరస్సుననున్న కుమారుంగని నాటి యాహారమున కమరేంద్రుం దెచ్చి పోరింతుగాకయని నిశ్చయించినపుడు నవ్వురాకపోదు. కుమారుండాది వెడలి పరువులెత్తునింద్రునందు భయానకము విస్పష్టము. తనయొక్క నెంతటిమహాపరాధముచేసినను పాటింపక పంచత్వంబు

నొందిన దక్షుని పునర్లబ్ధజీవితుం జేసిన శరణాగత వత్సలుడగు పరమశివుని శాంతరూపమే శాశ్వతము.

### ఉపసంహారము

ఋతుమహిమచే మోళ్లుచిగిర్చి మంటిదిబ్బలు సస్యవంతములై మనోజ్ఞములైనట్లు ఈకవి స్పర్శన మాత్రముచేత ఎట్టినీరసాంశమైనను బహురసవంతమగు చున్నది. అట్టిచో రమ్యమగు కుమారసంభవకథ యీ కవిరాజుచేతిలో రమ్యతమమై ప్రకాశించుచున్నదని వేరే చెప్పనక్కరలేదు. వర్ణనాసామర్థ్యముచేత కథయం తయు బయస్కోపునందువలె మనోనేత్రములయెదుట గోచరించుచునేయున్నది.

ఈతని వివిధాంశ కుశలత్వమునకును, భావకేంద్రీకరణ నైపుణ్యమునకును, అపూర్వభక్తి మతావేశములు తోడై పదారువన్నె మెఱుగుబంగారమునకు పరిమళ మొసంగుచున్నవి. కావున నీకావ్యకర్త కాంధ్రకవులలో నొక యగ్రస్థానము శాశ్వతముగా కలదని నిస్సందేహముగా వాకొనుచు విరమించు చున్నాను.

## "డాక్టర్ సాబ్!"

బొడ్డు బాపిరాజు

కలతపడిన చిత్తము, వి-హ్వలతమెయిం గొంతుపికలివచ్చెడి శోకా
కుల నిస్వనమును కొనయూ-ర్పులచావునకు వేచియున్న బుడుతనితోడఁ.

కటికిదరిద్రురా లరయగా నొకచల్లని కంటిచూపు తి
య్యటి పలుకేని నోచుకొననట్టివిపర్యయభాగ్యమూర్తి; ఒ
క్కట నొకబల్లకట్టిన యొకానొకవైద్యుని యింటిముందు పం
డట నిలుచుండి పిల్చును పదేపదే 'డాక్టరుసా' బటంచునున్.

పిలిచిన డాక్ట రింత వినుపించుకొనం డదిపోగ, కారుకూ
తల పడదిట్టి 'పోవె సయితా' నను సేవకచక్రవర్తి ప
ల్కుల కెద నుల్కి యుల్కిపడి గోడనుగీచినబొమ్మవోలె చూ
పులను కదల్పదే? మఱచిపోయినదో బ్రతికున్న సంగతిన్!

తనపూర్వవైభవ దినములు ఒకసారి స్మృతిసీమలో గోచరించెనేమొ
కొడుకుపుట్టిననాడు పొడమిన సుఖపారవశ్యము తలపున వచ్చెనేమొ
జీవితేశ్వరుని ప్రాణావసానములైన నిమిషముల్ కనుపాప నిలిచెనేమొ
గుండెలు పగిలించి కొట్టుయిప్పటి యీయవస్థ కట్టెదుర కన్పట్టెనేమొ
ఎన్ని భూకంపములు తటస్థించెనొక్కొ!-ఆమెహృదయమ్ముకరగి నేత్రాంచలముల
నుండి వాగులై నదులు మహోదధులయి - పారె నూరక నిలుచున్న పాళముగను.

మును ప్రార్థింబడి 'పాహిమాం'మ్మని కరమ్ముల్ మోడ్చి పిల్వం గజేం
ద్రుని యాలించెను ఎక్కడో గలుగు వెన్నుండేని; నే కెంతయే
డ్చినగానీ మొరపెట్టుకొన్నను వినండే డాక్టరింతైన; యీ
తని గాదం చలగాని గొల్చిన వెతం దప్పించు బాగుండదేఁ.

వెజ్జునకు వేచియున్న దా పేదతల్లి - ఆ దరిద్రజీవి యనంతయాత్ర కనుచు
కోరికనుపెట్టుకొనియుండె కొసకునెవరి-యీప్సితమ్ములె ముందు సిద్ధించునేమొ!

సూనునిజూచు ద్వారమును జూచును సేవకుజూచు తన్నుదా
పూనికజూచు చూచు తనపుత్రునిచూచు నభాగ్యజీవి యా
మానిని చూపులఁ మసలు మర్మము దేవుడుతక్క నింతయుం
గానగలేరు పాపపుజనమ్ములు కన్నులకావరమ్మునఁ.

వీలేయుండినజూచుచుం బుడుతనిఁ వీతాసు గానిచ్చునే?
యేలాగైనను డాక్టరయ్య దయ నీళ్లేయిచ్చి మందన్ననుం
గ్రోలించుం బ్రదికించుకోగలదు పుత్రుఁ; పాప మాబిడ్డకుఁ
పాలే యక్కరపట్టవిప్పుడు మహాప్రస్థానసంక్షోభలో.

కలవెన్నో విలువైనమందు లల డాక్టర్ సాబు సీసాల, ఎం
దులకా దక్కరి వెక్కివెక్కి విలపించుం దల్లికింగూర్మి ము
ద్దులబిడ్డం బ్రతికింపగానియపుడుఁ?—దోరించు పెన్మంటలఁ
నిలువెల్లం దహియింప కూలబడియెఁ బిట్టూర్చి నిట్టూర్చుచుఁ.

దేవునకే పగైనదిగదే తుద కీ బ్రదుకంచు నెంచుచుం
భావము కొయ్యవారె; యెడబాయని యాపరదాలుజారె నో
షావిధితీర వీథులను చావనిచావయియుండి బిడ్డకై
బావురుమంచు వావిడిచి 'బా' బను 'డాక్టరు సాబుజీ!' యనుఁ.

ఇవలకును రా భిషక్కునకరగి మొరను-వెళ్లబోసుకొన్నది; అయ్యో! 'వేరుపనులు
కలవులేరదు నా' కని. తొలగెనతడు-తొలగినది యాశయును బిడ్డకలత బ్రదుకు.

# ఆధునికాంధ్రవాఙ్మయము–స్త్రీలు

చిరుమామిళ్ల శివరామకృష్ణప్రసాదు

[అనువృత్తము]

'మాంచాల'యను ఖండకావ్యమునందు:

"కారెమపూడియుద్ధమున
కాపలనాటి పసిండికోటపై
పారెను వెల్మబావుట ప్ర
చండ మరున్నదదంతరిక్షయై
హోరున నార్చుచున్నది మ
హోద్ధతి బోరుకలంగ భేరికా
వారము ప్రాణనాథుఁ డిఁక
వచ్చునో పాళెము వట్టిపోవునో?"

అను సంశయమున మేడపై తగటుదీర్చి చెక్కిటను చేయిజేర్చి యోచించుచున్న 'మనువ మాంచాల'ను ప్రథమమున పాఠకుని కనులయెదుట ప్రదర్శించుచున్నారు శ్రీమతి మనమంచి అనంతమ్మగారు. వ్యర్థపదములతో పద్యపాదములను పూరించి, భావ నొకత్రోవను, భావము నొకత్రోవను నడిపింపక చక్కని కథావస్తువులను నిర్ణయించుకొని సొంపుతీయూరని పదములసాయమున వానిని కళాకాంతితో జికిలియొనర్పగల సామర్థ్యము శ్రీ అనంతమ్మగారియెడ ననంతముగ గలదు.

సాని సహవాసమున తన మొగముజేని చూడని ప్రాణవిభుఁడానాడు తల్లియనుజ్ఞను తలదాల్చి యుద్ధమున కేగకపూర్వము తనకడ కరుదెంచునని యూహించి మాంచాల మేడపై ఆశతో వేచియున్నది. తన చక్కదనమును కొంచెపరచి, తన భర్తకు ప్రేమ లేకుండునట్లు మాటలమూలమున అతని మనసు త్రిప్పిన బ్రాహ్మణుడామె కాసంతలో నసమయమునందుసహితము జ్ఞప్తికి వచ్చెను. హృదయమునం దణగియున్న క్రోధానల మొక్కసారి భగ్గుమనినది:

'మాదు వదిన మనువమాంచాలతల దుబ్బ
దోసకదుపు చెవులు దొప్పలమును
పలుక కారణమేమోయి? బ్రాహ్మణుండ!
అమతోడున బుట్టవేమయ్య నీవు?
ఇంత వలపాక్షికము బూనితేమి తండ్రి!
సానిసబ్బాయి నీకేమి సారబెట్టె?
మనువ మాంచాల యివ్వని మాన్యమేది?
నల్లగొండల కోనేటి నట్టనడుమ
జారుబండల గుడిమెట్ట కోరిమీద
ఏకుబరులను దాటించితేని తేజి
పక్కఘుని వక్కలై తలబగులుగాక!"

అని శపించినది. మరియు:

'జగతిపైబుట్టి నిర్భాగ్యజన్మనైతి
భర్తమెచ్చని యీభోగ్యభాగ్యమేల?
కర్మఫలమును దాటగాగలరె జనులు?'

అని తనస్థితిని దలంచి వెచ్చనూర్చినది. పైన గీటుంచిన పాదములయందు ప్రతిబింబించుచున్న స్త్రీహృదయమును పాఠకులు గమనించి సంతసింపకుందురా? శ్రీ అనంతమ్మగారి కూర్పునేర్పును విశదపరచుట పద్యపాదములు చాలియున్నవి.

తనజీవితమునందు మొదటిసారి తనభార్యమొగము గాంచి ఆమెకడ తుదిసారి సెలవుగైకొని రణరంగమున కేగదలచి బాలచంద్రుడు మేడపై కరుదెంచి, మాంచాలిని గాంచి:

" కెలిడి ముక్కుమీద తుల
కించెడి రూపము 'నాట్టె' గాంచి మాం
చాల విరూపిగాదలచి
పాణిగ్రహంబున కేగినాడ ఛీ!
ఛీ! లలనా! నికృష్టమతి
జీవితమెల్లను వీటబుచ్చుచున్

గాలికుమీరముందు కను
గావక నే వసియించినాడనే ?"

అని వాపోయినాడు. మానవతియగు మాంచాల భర్తను వింతరీతి గౌరవించినది. శ్రీ అనంతమ్మగారి లేఖిని ఇచ్చట అమృతవర్షమును గురిసినది. మాంచాలచేసిన మర్యాదలకును, భర్తయడిగిన ప్రశ్నలకును వింతరీతి సమన్వయముగూర్చి, పాఠకుల కీకవయిత్రి తనప్రతిభ నెట్లు వెలువరించెనో గమనింపుడు :

భర్తనుగాంచినంతనే మాంచాల :

'కాంచి మాటలాడగా కొంతయుంకించి
తేరిచూడలేక తిరిగిపోయె,
తివిరి చేటనీరు దెచ్చి దక్షిణపాద
'కమల మొకటి గడిగె కొంతునకును.'

"మాంచాల! రెండవదిమానినా వదియేమి
గండువా రాచారకాండ గాబోలు ?"

"పల్నాటివీరుడా! పరిగణింపవదేల
సానిసబ్బాయి దాచరణంబుగాద ?"

"కోమలీ! యిదియేమి, కుడిపైట వేసితివి
శీలమువారి దాసీకైన లేదే?"

"గండువారింటిలో గాలిసైతముగాని
కుడివైపుగా వీచు, కోల్పోదుపటిమ."

"తములపాకు రెండువరుల జీల్తువదేమి
వేరుబంధము జేతువే వీరపత్ని!"

సానిదా తుంపునీసతిది యీతుంపు
వీసెలాగు నిన్ను వెతకి తీసితిని."

నవ్వివాడు బ్రహ్మనాయని కొడుకు
మాంచాల రెపరెప మధురకేగినది."

మాంచాల సౌందర్యమును గాంచి బాలచంద్రుడు యుద్ధముమాటయేమరచి ప్రియపత్నితో కాలము గడుపదలచినాడు. కాని మాంచాల వీరపత్ని కావలచినది. ఆమెరక్తనాళములందు వెదకిచూచినను పిరికినెత్తురు మందునకైన లేదు. కాకున్నచో పెండిలియైనదాది పెడమొగము ద్రిప్పి సానిలో సౌఖ్యాంభోధి నోలలాడుచున్న ప్రియుడు, రాకరాక గృహమునకు వచ్చి తన చక్కదనమును గాంచి తన్మయుడైయున్న సమయమున :

'పల్నాటియుద్ధమే వచ్చెను నీకు
త్రోసిరాజు నీకు తోడిమార్బలము
బ్రతికిన పల్నాడు రతనాల మేడ
చచ్చినపల్నాడు పుచ్చలబీడు.

విసరుమా నీ వెల్మబావుట
వింటికిని మంటికిని పోరుగ
కరుడుగట్టని రక్తధారలు
తిరుపమిచ్చుచు పిరికివారికి.'

అని, వానియందు మణుగుపడియున్న రౌద్రానలమును రగులగొట్టదలచినది. కాని :

'కారెమపూడికే కదల మాంచాల
రాజ్యమేల? నేను రాజుగానేల ?
నీదు సౌఖ్యాంబుధి నీదులాడకయ
కనికరింపుము నన్ను కలికి మాంచాల!'

అని బాలచంద్రుడు బ్రతిమాలుకొనినాడు. మాంచాల గుండె లదరిపోయినవి. దెబ్బతిన్న కోడెత్రాచువలె ఆమె యధికక్రోధమున:

'మధురజీవన! ఎంతమంది పోలేదు ?

షట్చక్రవర్తులు వకున్నారె ?
మనమెల్లరము నిల్తుమనుమాట నిజమే ?
క్షణములో రాగల చావు చెప్పానువె ?
సుఖమెప్పటికి మనసొమ్ము కాబోదు
కష్టసుఖములు తప్పగలవె జీవులకు ?
కర్మభోక్తయొకడె కడతేరగలడు
కర్మలేనివ్యక్తి కలుగబోదొకటి
ప్రకృతివినాశమే ప్రాజ్ఞు డూహించు
ఉన్నది బోదు లేకున్నది రాదు
లెమ్ము కారెమపూడి లెంకవు గవలి
క్షాత్రధర్మభావై ఖడ్గముబట్టి
త్రుంచి తూటాడుము దొడ్డదిశాంద్ర

శాంతి శాంతి యనుచు సౌఖ్యముగోరి
పడతులచేతిలోపల బొమ్మలైన

వలనాడు మీచేత పాలితంబౌనె

అని యుద్ధమునకు వానిని పురికొల్పినది. పైన గీటుంచిన పలుకులయందు ప్రతిబింబించుచున్న కూర్పునేర్పును ఉచితజ్ఞతను పాఠకులు గమనింపకుందురా? గీటుంచిన మొదటిపంక్తియందు, మాంచాల, బాలచంద్రుని 'మధుర జీవన!' అని పిలిచినది; పిలిచి "ఎంతమందిపోలేదు?" అనిప్రశ్నించినది. ఈరెండుపలుకులమధ్య నెంతయంతర మున్నది? మాంచాల హృదయమునందు నిండియున్న అవిదితమగు భావము లీపలుకులమూలమున విశదమగుచున్నవి. ఈవిషయము నింక ప్రస్తరింపక విడుతును. కవితాత్మగల పాఠకు లీపంక్తియందు దాటలూరుచున్న వింతభావములను తమకు తామే తెలిసికొని తన్మయులగుదురుగాక!......గీటుంచిన రెండవ పంక్తివలన మాంచాలయొక్క నైదుష్యము కరతలామలకమువలె గన్పట్టుచున్నది. తుదిపంక్తులలో, మాంచాల తనప్రియునకు పౌరుషమును బుట్టించుటకెట్టిపలుకులు అవసరమో, అట్టివానినే సమకూర్చుకొనినది — మాంచాల, మానవతి, విదుషి, వీరవనిత, అని పాఠకు డిప్పుడు తెలిసికొనినాడు.

బాలచంద్రుని హృదయము ఒక పాషాణముగా మారిపోయినది. మానవతియగు మాంచాలపలుకులు: అవి ములుకులబోలు పలుకులైనను, అతని హృదయమున నెట్టిబాధను గల్గింపలేదు. మాంచాలకేమియు తోచలేదు. కాలము గడచుచున్నది; రణభేరి మ్రోగుచున్నది; కాని బాలచంద్రు డట్లే నిలచియున్నాడు. మాంచాల తన్నుదామరచిపోయి:

"శీలము వారివంశమున
　　ఛీ! యిటువంటి నికృష్టుడైన రా
చూలిజనించెనే? వెనుక
　　చూపును వెన్నున తూపు జన్మజ
న్మాల కెఱుంగ రట్టిపల
　　నాటి మహాత్ముల రక్తధారలో
కాళిమ నేడుగన్పడియె
　　గట్టిది నామెడతాళి యింతకున్."

అని భావోన్మాదమున గంభీరముగ పల్కినది:

"చివరమాటవినిరయి శీలము సింహంబు
దుమికె నైటి కొక్కదూకులోన-
నవ్వుకొన్న దపుడు నాజన్మఫలమేమి
వీరపత్నినను ధీరురాలు........."

పురుషప్రకృతికిని, స్త్రీప్రకృతికినిగల తారతమ్య మీకథయందు బాగుగ పోల్చిచూపబడినవి. ఇందలి పురుషుడు జారుడు; అవివేకి; విషయాసక్తుడు. మీదుమిక్కిలి సమయాసమయముల నెఱుంగక ఒకేవిధముగ ప్రవర్తించు స్వభావుడు. గొప్పకుటుంబమునం దుద్భవించినవాడే కావచ్చును. రణరంగమున విరోధులను ఛిందిచేయగల దోర్బలముగలవాడే కావచ్చును. కాని ఈతనియందు గన్పట్టు దుర్గుణములే ఎక్కువతూకమును గల్గియున్నవి. ఇక నీకావ్యమునందలి స్త్రీ వివేకవతి, విదుషీమణి, వీరవనిత, మీదుమిక్కిలి 'గట్టిది నామెడతాళి యింతకున్' అని రణరంగమునకు బోవ వెనుకంజవేయుచున్న భర్తతో పలికి, శత్రువుల కరకుబల్లెముకన్న బలవత్తరమగు గాయమును అతనిహృదయమునందు గావించి, అతని పిరికితనమును పారదోలి, రణమునకు బంపి 'వీరపత్నినైతినని' సంతసమును వెలువరించిన ధన్యజీవిని; భారత నారీలోకమున కీనాటివర కలంకారమును గూర్చుచున్న యనర్ఘరత్నము. ఇట్టి మానవతి చరిత్రను మధురముగ వర్ణించిన మడమంచి అనంతమ్మగారి ప్రయత్నము ప్రశంసార్హమై యలరుచున్నది.

శ్రీ అనంతమ్మగారు ప్రకృతి పరిశీలనమునందును వీనుమిగెలిన నేటి తెనుగుకవులకు తీసిపోరు. సంక్రాంతి ప్రకృతి నెరీతి చిత్రించిరో తిలకింపుడు:

"విరిమల్లె చెరివిన కురులు నీలాలాడ
　　నీరెండ చెంగావిచీర జార
కుంచుముత్యాల దామంబులు దూగాడ
　　చలిగాలి యూర్పులు సందడింప

## చిరకాలమునుండి బాధించుచున్న మూత్రవ్యాధులకును శగ(గనేరియా)వ్యాధికిని క్రొత్తగాకనిపెట్టబడినదివ్యౌషధము




కృత్రిమములు చూచి మోసపోకుడు. "కోడి" మార్కు గమనింపుడు.

# గోనోకిల్లర్ (రిజిష్టర్డు)

ఈయౌషధము ఇంగ్లీషుమందులను దేశీయౌషధములను పుచ్చుకొనినను గుణముకలుగనియెడలను, యింజక్షనులవలనను వాక్సినులవలననుగూడ లాభము లేక పోయినయెడలను కడపటిప్రయత్నముగా మా గోనోకిల్లరునుగూడ పుచ్చుకొని చూడుడు. పెక్కు యేండ్లనుండియున్నను లేక క్రొత్తగా కలిగినను ఏరకము శగ సంకటమైనను మరెట్టి మూత్రవ్యాధులనైనను స్త్రీలకైనను పురుషులకైనను గోనోకిల్లరు తప్పక కుదుర్చును. మూత్రము ఝూరీగా వెడలును. మూత్రముపోవుచున్నపుడు కలుగుమంట తగ్గిపోవును. మూత్రనాళమునందలివాపుతీసిపోవును. శగవ్యాధి (గోనోకోకసు)వలన మూత్రముబొట్లుగా పడుట, మేహరోగమువలన మూత్రద్వారమునుండిపోవు తెలుపు, మూత్రద్వారముయొక్క వాపు: మూత్రద్వారముయొక్క చుట్టువుండు పొరయొక్క వాపు, మూత్రాశయముయొక్క వాపు లేక మూత్రతిత్తియొక్క వాపు, నరములజబ్బు, మున్నగువ్యాధులన్నియును స్త్రీలకును పురుషులకునుగూడ గోనోకిల్లరువలన కుదురును. వీర్యము(సెమను)పోవుట, మూత్రవ్యాధులు మున్నగునవిగూడ దీనివలన కుదురును. ఖరీదు 50 మాత్రలుగల సీసా రు. 3-0-0. కృత్రిమములు చూచి భ్రమజెందవలదు. మా పుంజుమార్కు గమనింపుడు. వీ. పీ. చార్జి ప్రత్యేకము అడ్రసు:—డాక్టరు డి. యన్. జస్సాని, గిర్‌గాము వెనుకరోడ్డు, బొంబాయి 4.

Dr D. N. JASANI, Girgaon Back Road, Bombay, 4
Madras Agents:—DADHA & Co, 52, Nainiappa Naick St, P. T. Madras.




# జమూన

స్నానమునకు మరియు టాయిలెట్‌కు అతి చౌక, శ్రేష్ఠమైన సబ్బు.

నాజూకు సువాసన చేర్చబడినది, సున్నితమైన చర్మమునకు తగినది.
అతి శుద్ధమైన వస్తువులచే తయారుచేయబడినది.

**BENGAL CHEMICAL :: CALCUTTA.**

మదరాసు ఏజంట్లు:—యన్. దేశాయి గౌండర్ అండ్ కో., నెం. 41, బందరు వీధి, మద్రాసు.

కవికిని, లోకమునకును బోలెడంత యంతర మున్నది. అందులకే అతఁడొకవిధముగ మానవాతీతములగు గుణములను కలిగియుండును. సత్కవులహృదయముల నెఱింగి, వారి భావములను తేటతెల్లముగ తెలిసికొని, వారియం దధికగౌరవమును కుదుర్చుకొనిన నిత్యకల్యాణమ్మగారి పలుకు లాలింపుడు :

'నీ కవితాభ్రవీథి రమ
        ణించెడు మంజులభావతారకా
నీకరుపారదృగ్గళిత
        నిర్మల రోచులలోన నైక్యమై
నాకపుసౌఖ్యసంపద న
        నారతముఁ హాసియింతు సత్కవీ!
యీకలుషావనీ భయద
        వీక్ష నినున్ స్పృశియింప నేర్చునా ?'

శ్రీ నిత్యకల్యాణమ్మగారి పద్యములందు వ్యర్థపదములు గన్పింపవు :. సంస్కృతశబ్దములే వీరిపద్యములం దెక్కువ సంఖ్యను కల్గియున్నవి. వీరి రచనములందు శబ్దాలంకారములకన్న అర్థాలంకారములే అచ్చటచ్చట గన్పట్టుచున్నవి. ఇది బలవంతముగ తెచ్చిపెట్టబడనందున, ఇవి యలంకారమును గూర్చుచునే యున్నవి. ఈవిదుషీమణి సంస్కృత కావ్యముల నెక్కుడుగ పఠించి వానియందలి భావములను బాగుగా నలవరచుకొనినట్లు గోచరించుచున్నది. ఈక్రిందిపద్యము, కాళిదాసుని భావముల ననుసరించియున్నను, ప్రకృతి సౌందర్యమును వెలువరించుట కనువగు పదముల పొందికతో నలరుచు, ఈకవయిత్రి కళాప్రతిభలను, కూర్పు నేర్పును ఎట్లు విశదపరచుచున్నదో గమనింపుడు :

'నవనవచ్ఛవుల తృణాంకురపాళులు
        వైడూర్య శకలాలువలె వెలుంగ
ప్రోత్థిత కందళీ స్ఫురితదళంబులు
        నీలాలమొత్తంపు నీటుగొల్ప
హృద్యసాంద్రారుణార్ద్రేంద్ర గోపవితతి
        పద్మరాగంబుల పసలునించ
నీటుగా నటియించు నీటిబుగ్గల చాలు
        ముక్తాఫలంబుల మురువుజూప
మహిత నిత్యసౌందర్య సంపదలొసంగు
మణివిరాజిత నవదివ్యమండనములు
దాల్చి హసియించు ప్రేమసుందరివిధాన
దనరు నీశ్రావణంబున ధరణికాంత.'

శ్రీనిత్యకల్యాణమ్మగారు చక్కని భావచిత్రములను తెనుఁగునుడికారంపు తీయదనమును తేటతెల్లము చేయు పలుకులతో తయారుచేయఁగలరు. భావచిత్రమును పాఠకులకనులయెదుట ప్రదర్శించి, వానియం దాశ్చర్యమును గల్గించి కొలఁదికాల మూహాప్రపంచమునం దుయ్యాలలూగింపగలవాఁడే కవి. ఒకవిషయమును వర్ణించునప్పుడు ఆవిషయమునకు చెందిన ప్రతిభాగమును విరళముగ విశదపరుపవలసియుండును. అప్పుడే ఆవర్ణనము సమగ్రమై, సమంజసమై యలరారును. అట్టి సమగ్రవర్ణనమునకు పరిశీలనాపటుత కవికి మిగుల కావలసియుండును.

'ధవళాంశుకములోని అంగపట్టపు కావిరంగు'ను సహితము కవి తిలకించి, అట్టిదానిని సహితము తనభావచిత్రమున ప్రదర్శింపగల్గినాఁడు. శ్రీనిత్యకల్యాణమ్మగారి క్రిందిపద్యమునందు పేరటాండ్ర విలువబోవు నొక చిరంటిచిత్రము నెట్లు ప్రదర్శించుచున్నారో గమనింపుడు :

'జాళువా నెమ్మేన లీల సింగారించు
        తెలిపట్టుచీర సొంపులువెలార్ప,
తలిరుచెంగావి రంగుల ఫాలతలమున
        గ్రమమోహనతిలకము రహింప,
విద్రుమారుణ సుధావిమలాధరమునందు
        గ్రమమోహనతిలకము రహింప
గాత్రశోభాభతోఁ గలసిపోయిన కంక
        ణంబు లమృతనిస్వనము లావర్ప
పాణిచే నొక్క కుంకుమబరిణె బూని
యరుగుచున్నది యొక్క కన్యాలలామ

గొనబుగా దీర్పు బొమ్మలమాటమునకు
నమలహృదయంబులో పేరటాం[డబిలువ."

ఈవిదుషీమణికిగల దేశభక్తి యనుంతితము. అందులకే:

'నీవొక యాంగ్ల దేశరమ
ణీమణివైన నుదారబుద్ధి హిం
దూవరమాతృకా[ప్రజ క
నూన ముదం బెస నుప్పతిల్ల స్వే
చ్ఛావిభవంబు కూర్పు నిజ
శక్తిని సర్వము ధారవోయు జు
మ్మీ వు మహాత్ము నొద్ద కరు
డెంచితివో జననీ! శుభఃఘృణీ!'

అనీ స్లేడుకన్యను [ప్రశంసించియున్నారు.

మొత్తముమీద శ్రీనిత్యకల్యాణమ్మగారి రచనములందు దేశకల్యాణమున కనువగు భావములున్నవి. ఈకవయిత్రి తామురచియించిన ఖండకావ్యములనెల్ల నొకచో గూర్చి ఒక[గంథరూపమున [ప్రకటించిన బాగుండును. [ప్రస్తుతము వీరేలనో మౌనమువహించి యున్నారు. కవితాత్మగలవారిట్లు మిన్నకుండుట యుచితము కానేరదు. ఓపినకొలది ఆంధ్రభాషాయోషకూడిగమొనరించుటే తమపనిగా తలంచుటయుక్తము.

(సశేషము)



రాజభవనము

తిరువనంతపురము పార్కుపక్కన.

# కొండవీటికవులు—వారి కాలము

యన్. వెంకటరమణయ్య

## ii జక్కన

**విక్రమార్కచరిత్రమును** రచించిన జక్కనకవి యొక్క కాలమును నిర్ణయించుప్రయత్నము కొందఱు సల్పియున్నారు. కాని, వారు నిర్ణయించినకాలము భిన్నముగ గాన్పించుచున్నది. కవులచరిత్రకారులగు వీరేశలింగంపంతులుగారు "విక్రమార్కచరిత్రము ౧౪౧౦ వ సంవత్సరమునకును ౧౪౨౦ వ సంవత్సరమునకును మధ్యకాలమున రచింపఁబడినదని నిరాక్షేపముగా జెప్పవచ్చును" అని యాంధ్రకవులచరిత్ర ప్రథమ భాగమున వ్రాసియున్నారు. కాని, ఇదానీంతను లొక్కరు పంతులుగారు చేసినకాలనిర్ణయము సరిగావని యభిప్రాయపడుచు ౧౪౨౫వ సంవత్సరమునకు తరువాత విక్రమార్కచరిత్ర విరచింపబడినట్లు సూచించియున్నారు. అనగా, విక్రమార్క చరిత్ర రెండవదేవరాయల కాలమున వ్రాయబడెనని వీరి యభిప్రాయమని తోచుచున్నది.

జక్కనయొక్క కాలమును నిర్ణయించుటకు వలయుసామగ్రి నంతటిని జక్కనయే యొసగియున్నాడు. ఆసామగ్రిని పరిశీలించిన నిజ మేర్పడునేమొ కనుగొనవలసియున్నది: జక్కన నిజవంశమును వర్ణించుసందర్భమున తనతాతగారగు పెద్దయ నెల్లూరితిరుకాళత్తిరాజునాస్థానమున కవియైయుండినట్లు వ్రాసియున్నాడు:

'అనుచు నెల్లూరితిరుకాళమనుజ విభుని
సమ్ముఖమ్మున సాహిత్యసరణి మెఱసి
మహిమగాంచిన పెద్దయామాత్యసుకవి ' అని.

మఱియు కృతిపతివంశచరిత్రను దెల్పుపట్టున పెక్కురు రాజులను మంత్రులను పేర్కొనియున్నాడు. కృతిపతి వంశమునకు మూలపురుషుఁడగు సూరనసోమయాజి 'యొద్దనపూడి రాజేంద్రచోడకుమారమణుచే నగ్రహారములు వడసెను. అతని మనుమఁడగు (మొదటి) సిద్ధన 'సన్నుతగంధవారణంబునకుఁ బ్రధానుఁడై నుతుల బొందెను.' పైసిద్ధనయొక్క ద్వితీయపుత్రుఁడైన జన్నయ 'దేవరాయమహారాయ కరుణాకటాక్ష వీక్షణము' గాంచెను. ఇతనిపుత్రుఁడగు (రెండవ) సిద్ధన 'దేవరాయ మహారాయధీనిధేయ మంత్రిసల్లభచామనాసూత్య దత్త చామరచ్ఛత్రశిబికాది సకలభాగ్యచిహ్నముల' నొప్పెను. (రెండవ) సిద్ధనకు 'రెడ్డివేమనరపాలకుచేత మహాగ్రహారముల్ గొన్న కవీంద్రకుంజరుఁ' డగు 'వెన్నెలకంటి సూర్యుఁడు' 'పెదతండ్రి'. అనగా పెదతల్లిభర్త. విక్రమార్క చరిత్రలో నొసంగబడిన చరిత్రాంశము లివియే. వీని నాధారపఱచుకొని కవికాలమును నిర్ణయించవలసియున్నది. కవికాలమును రెండువిధముల నిర్ణయించవచ్చును. ౧. కవి స్వవంశవిషయమయి చెప్పిన యుదంతమునుబట్టి; ౨. కృతిపతివంశచరిత్రనుబట్టి.

౧. కవి తనపితామహుఁ డగు పెద్దయ 'నెల్లూరితిరుకాళమనుజవిభుని సమ్ముఖంబున సాహిత్యసరణి మెఱసె'నని గదా వ్రాసియున్నాడు. ఈతిరుకాళరాజెవ్వఁడో కనుగొంటిమేని తన్మూలమున పెద్దయ జక్కనలకాలమును స్థూలముగ నిర్ధారణచేయవచ్చును. తిక్కనామాత్యవిరచిత నిర్వచనోత్తరరామాయణపీఠికను జదివినవారికందఱికిని తత్కృతిపతియగు మనుమసిద్ధియొక్క తండ్రిపేరు తిరికాళత్తి లేక తిక్కరాజనుట తెల్లము. ఇతనికి గండగోపాలుఁడన్న బిరుదు గలదు. ఇతఁడు క్రీ. శ. ౧౨౪౮ మొదలు ౧౨౬౩ వఱకును నెల్లూరునందును, కంచియందును రాజ్యముసల్పెను. పెద్దయకవికి ఆశ్రయ మొసగిన తిరుకాళ మనుజవిభు డీతడే యగునా? కావచ్చును. పెద్దయకవిమనుమఁడగు జక్కన్న దేవరాయ మహారాయలకు సమకాలికుఁడు. ఈ దేవరాయలు క్రీ. శ. ౧౩౮౨ మొదలు ఉదయగిరిదుర్గముపై ప్రభుత్వ మొనర్చిన మొదటిదేవరాయలని తలచితిమేని అప్పుడు పెద్దయకవికిని అతనిమనుమఁ డగు జక్కన్నకును ౧౨౫ సంవత్సరములు ఎడముండును. తిరుకాళరాజు అంత్య దశయందు పసివాడుగను దేవరాయని ప్రభుత్వారంభ

కాలమున జక్కన్న ముసలివాఁడుగను నుండినపక్షమున పైని ౧౨౫ సంవత్సరముల కాలమును ఒకవిధముగ సరి పెట్టవచ్చును. కాని దీనికి ఒక ప్రబలమైన యాక్షేపము కలదు. కృతిపతియు నతనితండ్రియును నిద్దరును దేవ రాయనికి మంత్రులుగ నుండిరి. కావున కృతిపతియగు సిద్ధన తనతండ్రియగు జన్నయ యనంతరము దేవరాయ లకు మంత్రియాయె నని తలచుట యుచితము. అట్లగునేని విక్రమార్కచరిత్రము దేవరాయలు ప్రభు త్వమునకు వచ్చినపిదప గొంతకాలమునకు విరచింప బడినట్లు చెప్పవలసి యున్నది. అందువల్ల పెద్దయకవి పై జెప్పిన తిక్కరాజునకు సమకాలికు డైయుండె ననుట సమంజసము కాదు. కాబట్టి పెద్దయకవిని ఆ స్థానమునం దుంచుకొన్న తిరుకాళరాజు వేరొకడుండ వలయును. అట్టివా డెవ్వడేనియు కలడో చూతము. నెల్లూరు జిల్లా నెల్లూరు తాలూకాయందు పూర్వ సముద్రతీరముననుండు కృష్ణాపట్టణమను గ్రామమునందు శా. శ. ౧౨౦౧ అనగా క్రీ. శ. ౧౨౭౯-౮౦ నాటి యొకశాసనమున ఇమ్మడి తిరుకాళత్తిదేవు డను రాజు రాజ్యము సేయుచున్నట్లు చెప్పబడియున్నది. ఈరాజు క్రీ. శ. ౧౨౭౭ నందు సింహాసన మధిష్ఠించెను. ఇమ్మడి తిరుకాళత్తిదేవుఁడు మనుమసిద్ధియొక్క కొమా రుడని రాజశ్రీ చిలుకూరి వీరభద్రరావుపంతులుగారు తమయాంధ్రులచరిత్ర మధ్యయుగము ౧౦౬-వ పుట యందు వ్రాసియున్నారు. అట్లనుటకు సదరుశాసనమున గాని వేరొకస్థలమునగాని యాధారము లేవియు గాన రావు. సిద్ధిరాజు కొడుకైనను కాకపోయినను ఇమ్మడి తిరుకాళరాజు క్రీ. శ. ౧౨౭౮ సం. మున ప్రభుత్వము చేయ నారంభించెననుట నిశ్చయము. తరువాత యచిర కాలముననే అతఁడు రాజ్యమును గోలుపోయినట్లున్నది. ఏలన కాకతిప్రతాపరుద్ర మహారాజుయొక్క సేనాధి పతులలో నొక్కడగు రేచర్ల ఎఱదాచానాయడు ఇతనిశత్రులను పరాజితులను గావించి, యితనిని రాజ్య పీఠముపై మరలనెక్కించెనని, వెలుగోటివారి వంశావళి లోని ' నెల్లూరి వీరక్షేత్రరణభారతీమల్ల' 'తిరుకాళ రాజు రాజ్యస్థాపనాచార్య' యన్న వాక్యములవల్ల దెలియుచున్నది. ఎఱదాచనాయడు తిరుకాళరాజును రాజ్యమున పునఃప్రతిష్ఠునిగ జేసినది క్రీ. శ. ౧౨౯౭ వ సంవత్సరమునందు. తరువాత నత డెంతకాలము రా జ్యము సల్పెనో చెప్పుటకు వీలులేదు. ఒకవేళ నతడు క్రీ. శ. ౧౩౧౦-౧౩౧౫ సంవత్సరములవఱకు రాజ్యము చేసినను చేసియుండవచ్చును. ఈ ఇమ్మడి తిరుకాళత్తి దేవునిసభయందే పెద్దయకవి విరాజిల్లెను. పెద్దయ పదునాల్గవశతాబ్దారంభమున నుండెననిచెప్పుట న్యాయ విరుద్ధము కాదు. ఒక్కొక్కతరమునకు ౩౦ సంవత్స రముల చొప్పున లెక్కించితిమేని జక్కనకవి క్రీ. శ. ౧౩౬౦ - ౧౩౯౦ సంవత్సరములమధ్యవాఁ డగును. క్రీ. శ. ౧౩౭౮ మొదలు ఉదయగిరి నేలిన దేవరాయల మంత్రియగు సిద్ధనకు విక్రమార్కచరిత్రము నత డంకిత మిచ్చుటయందు వింత యేమియు లేదు.

౨. ఇక కృతిపతివంశచరిత్రనుబట్టి కవి యెప్ప టివాడగునో చూతము: కృతిపతివంశపురుషుఁడగు నూర నసోమయాజికి రాజేంద్రచోడుడు అగ్రహారముల నొస గనట. ఎవ్వ రీరాజేంద్రచోడుడు? వీరేశలింగము గా రీ తని నెల్లూటిరాజేంద్రచోడు డని తలచి కాలము సరి పడకపోవుటచేత తబ్బిబ్బునందిరి.

" రాజేంద్రచోడుఁడు ౧౧౫౬ వ సంవత్సరము మొదలుకొని ౧౧౬౩-వ సంవత్సరమువఱకు రాజ్యము చేసెను. సిద్ధనమంత్రికొడుకైన జన్నయమంత్రి౧౪౦౬-వ సంవత్సరము మొదలుకొని ౧౪౨౨ వఱకు రాజ్యపరిపా లనము చేసిన దేవరాయనికాలములో నుండెను. తాతకును మనుమనికిని ఇన్నూటయేబదిసంవత్సరములు వ్యత్యాస ముండుట సంభవింపనేరదు గావున నిచ్చుట మనుమఁ డనగా సంతతివాఁడని యర్థము చెప్పవలెను. అందుచేత సిద్ధనమంత్రి నూరనసోమయాజికి మనుమఁడుగాక త ద్వంశజుఁడయియుండుట నిశ్చయము. "

రాజేంద్రచోడు డన్నంతటనే అతడు నెలనాటి నేలినచోళరాజని భ్రమచెందుటచే వీరేశలింగంపంతులు గారు పైసిద్ధాంతమును జేయవలసినవారైరి. క్రీ. శ. ౧౨౪౫ మొదలు ౧౨౬౯-౭౦ వఱకును కాంచీపురమును

నిజరాజధానిగ చోళదేశము నేలినరాజేంద్రచోళుఁడొకఁడు కలఁడు. అతనికి నెల్లూరిచోళరాజులు సామంతులుగ నుండిరి. అతనియధికారము తెలుఁగుదేశమున నిప్పటి నెల్లూరుకడపచిత్తూరుమండలములపై వ్యాపించియుండెను. నూరనసోమయాజికి నగ్రహారము లొసఁగినవాఁడీరాజేంద్రచోళుఁడే కాఁబోలును? నూరనసోమయాజి ౧౨౬౦-వ సంవత్సరమప్పుడు అగ్రహారములను బడసెనని తలఁచి యప్పటినుండి తరమునకు ౩౦ సంవత్సరములచొప్పున లెక్కవేసిచూచిన, విక్రమార్కచరిత్రకు కృతిపతియగు సిద్దయతాత సిద్దయ ౧౩౨౦ - ౧౩౫౦ సంవత్సరములమధ్యనుండెను. అతనికొమారుఁడగు జన్నయ ౧౩౫౦ - ౧౩౭౦ సంవత్సరములమధ్యనుండెను. కృతిపతియగుసిద్దయ ౧౩౭౦ మొదలు ౧౪౧౦ వఱకును జీవించియుండును. కృతిపతి పెదతండ్రియగు వెన్నెలకంటిసూరన్నకు అగ్రహారముల నొసఁగి సత్కరించినరెడ్డివేమనరపాలుఁడు కవుల పాలిటి కల్పవృక్షమనఁదగినవేమారెడ్డి యగును. కొమటిదేవరాయలు ౧౩౮౭ మొదలు ఉదయగిరియందు ప్రభుత్వముసల్పుచుండుటను బట్టి జన్నయయు సిద్దయయు నతనికి మంత్రులుగ నుండుట సహజమే. కావున నూరనసోమయాజికి అగ్రహారములొసఁగినవాఁడు చోళచక్రవర్తులలో కడపటివాఁడగు మూఁడవరాజేంద్రచోళుఁడు గావచ్చును. కాని, నూరనసోమయాజికి నగ్రహారము లొసఁగినరాజు చోళచక్రవర్తియగు మూఁడవరాజేంద్రచోడుఁడుకాఁడని 'ఎద్దనపూండి రాజేంద్రచోడకుమారమణుచే నగ్రహారముల బడసి' ననుసీసపాదమునందు జక్కనయే తెలిపియున్నాఁడు.

ఈపంక్తిని వీరేశలింగం పంతులుగారు రచనావసరముగ 'నగ్రహారముఁగబడసి' అని దిద్దిరి. ఎద్దనపూండి రాజేంద్రచోడుఁడెవ్వఁడో మనమెఱుఁగకపోయినంతమాత్రమున పద్యమును దిద్దుట పాడియా? అట్లు దిద్దినందువల్ల మనుమఁడన వంశస్థుఁడను విపరీతసిద్ధాంతమును చేయవలసివచ్చినది. కావున నూరనసోమయాజికి అగ్రహారముల నిచ్చి యాదరించినరాజేంద్రచోడుఁడు ఎద్దనపూండి నేలుచుండిన మన్నెరాజని తలఁచుటయే ధర్మము. అతఁ డెవ్వఁడుండెనో చెప్పుటకు తగినసాధనము లిప్పటి కింకను లభ్యపడలేదు. గుంటూరుజిల్లా నరసారావుపేటతాలూకాయందు ఎద్దనపూండియను గ్రామ మొకటి కలదు. ఈగ్రామమే విక్రమార్కచరిత్రలోని రాజేంద్రచోడకుమారమణుని రాజధానియై యుండునని తలఁచెదను. ఏలన నూరనసోమయాజివంశస్థులుగూడ నాప్రాంతములవారే. కృతిపతియగు జన్నయ సిద్దయ 'బెల్లముకొండ భైరవునికృపవల్ల సంపదలను బడసినట్లు విక్రమార్కచరిత్ర ద్వితీయాశ్వాసాంతమున జెప్పఁబడియున్నది. ఈబెల్లముకొండ గుంటూరుజిల్లా సత్తెనపల్లి తాలూకాయం దున్నది. కావున రాజేంద్రచోడుఁడును అతనియాశ్రితుఁడగు నూరనసోమయాజియు కృష్ణాతీరమువారనుట యొప్పును.

నూరనసోమయాజి మనుమఁడగు (మొదటి) సిద్దన 'నధికుండగు నన్నన గంధవారణంబునకు బ్రధానుఁడై యుండెను. నన్నన గంధవారణ మనునది యొకమనుష్యుని పేరు కాదు. 'అదియొకబిరుదు.' అనేకరాజు లీబిరుదు ధరించియుండిరి. సిద్దన ప్రభువగు నన్నన గంధవారణము యొక్క నిజమైనపేరేదో తెలియదు. అట్లు తెలిసికొనుటకు వలయు సాధనములును గానరావు. నన్నయగంధవారణ యన్నబిరుదు 'నీతిసారము' అనుగ్రంథమును విరచించిన చోడబద్దెరాజునకు గలదు. ఇతఁడే (మొదటి) సిద్దనకొల్చిన ప్రభువని వీరేశలింగంపంతులుగారు సూచించిరి. క్రీ. శ. ౧౨౬౧ నాటి చోడబద్దభూపాలునిశాసనము నొకదాని నుదాహరించుచు 'యీనన్నయగంధవారణుఁడే బద్దె నృపతియేమో!' యని యచ్చెరువందిరి. ఇంతేకాదు. 'తిలనాటిచోడు' డనబడెడు రాజేంద్రచోడునిచే నగ్రహారాదికమును బడసిన నూరనసోమయాజికి మనుమఁడగు సిద్దనమంత్రి ౧౨౬౦ - ౭౦ సంవత్సరములప్రాంతముల నుండియుండవలెనని తీర్మానించిరి. ఆంధ్రకవులచరిత్ర ౨౬౫వ పుటలో సిద్దయ నూరనసోమయాజి యొక్క మనుమఁడు. ౩౭౫-వ పుటలో "మనుమఁడనగా సంతతివాఁడు". ఏగాలికి ఆచాప. అది యట్లుండనిండు. ౧౨౬౦-౭౦ ప్రాంతములనున్న సిద్దయకుమారుఁడగు జన్నయ యాతఁడు

తరువాత ౧౩౦-౪౦ సంవత్సరములప్పుడు ప్రభుత్వము సేయ నారంభించిన మొదటిదేవరాయలకు మంత్రియగుట యెట్లుపొసగునో పండితులవారు తెలుపవలెను. ఇక క్రీ. శ. ౧౨౬౧ సంవత్సరమునాటిశాసనమును వేయించిన చోడబల్లిగ దేవరాజును, 'నీతిసారము'ను రచించిన బద్దెనాఖ్యుఁడును నొక్కరనుకొనుటకేమో చూతము. పై శాసనమునందు పేర్కొనబడిన బద్దెరాజునకు 'వీరనారాయణుఁడ'ను బిరుదొక్కటి మాత్రము కలదు. ఈ బిరుదు 'నీతిసార' కర్తకును గలదు; కాని,నీతిసారగ్రంథకర్త కుండుఇతర బిరుదులు—అందును ముఖ్యముగ 'నన్నయగంధవారణ' అనుబిరుదు—లేదు. ఈ బిరుదులు కులక్రమాగతములు. మూలపురుషుడు సంపాదించిన బిరుదులను వంశమునందు కడపటివాఁడుసైతము ధరించును. మఱియు బిరుదునుబట్టి, ఒకేబిరుదును ధరించిన పురుషులందఱును నేకవంశజు లనుటయు పొసగదు. భిన్న వంశజుల కొక్కబిరుదు సామాన్యముగ నుండినట్లు శాసనములు తెలియజేయుచున్నవి. కావున శాసనమునందు చెప్పబడిన బద్దెరాజే 'నీతిసారము'ను రచించిన బద్దెనాఖ్యునా డనుట కింకను బలవత్తరమైన సాక్ష్యము గావలయును. ఇది యెట్లున్నను నీతిసారగ్రంథకర్తయే నూరనసోమయాజిమనుమడగు సిద్ధయకు ప్రభువనుట యంగీకరింపదగనిమాట.

పైని సిద్ధయకు మంత్రిభాస్కరుడు జన్నయ అనుకొమాళ్లిద్దఱుపుట్టిరి. వారియందు రెండవకుమారుడగు జన్నయ 'దేవరాయ మహారాయ కరుణాకటాక్షవీక్షణము గాంచెను. ఈదేవరాయ మహారాయ లెవ్వరు? మొదటిదేవరాయలా? లేక యతనిమనుమఁడగు ఇమ్మడి దేవరాయలా? గ్రంథకర్తయగు జక్కనార్యునితాతయగు పెద్దయ, కల్లూరుతిరుకాళమనుజవిభునిసభయందు వాసికెక్కెననియును, నీతిరుకాళరాజును రేచర్ల ఎఱ దాచనాయుడు సింహాసనమున క్రీ. శ. ౧౫౯౮ సంవత్సరమున పునఃప్రతిష్ఠితుని గావించెననియు ఇంతకుపూర్వము వ్రాసియున్నాను. ౧౫౯౮ ప్రాంతములు నుండిన పెద్దయమనుమఁడగు జక్కన ౧౪౨౨ సంవత్సరము మొదలు ౧౪౪౮ వఱకు రాజ్యము పాలనముచేసిన ఇమ్మడిదేవరాయలకాలమున నుండెననుట పొసగదు. కావున కృతిపతియగు రెండవసిద్ధనయు అతనితండ్రియగు జన్నయయు మొదటిదేవరాయనికడనే యుండిరనుట సమంజసము. క్రీ. శ. ౧౩౭౭ వ సంవత్సరమున రెండవ హరిహరరాయలు తనపుత్రుఁ డగు మొదటిదేవరాయని రాయరాజ్యమున కంతటికిని ప్రసమముగ్గ మని పేరందిన యుదయగిరికి పాలకునిగ నియమించెను. అతడు ౧౪౦౬ వ సంవత్సరమువఱకు నచ్చటనేయుండి రాజ్యమును పాలించుచుండెను. ఉదయగిరికి వచ్చినది మొదలు దేవరాయలు తన ప్రక్కనున్న రెడ్డిరాజ్యమును హరింప నుద్యుక్తుడై తరుణము వేచియుండెను; కాని ౧౩౮౨-వ సంవత్సరమున అనవేమారెడ్డి మృతినందువఱకును అతడు తన యభిలాషను నెరవేర్చుకొన జాలక పోయెను. తరువాత కుమారగిరిరెడ్డిరాజ్యారంభ కాలమున, అనగా ౧౪౨౨-౨౫ సంవత్సరములకుమధ్య నతడు రెడ్డి రాజ్యపు పశ్చిమార్ధమున జయించెను. అప్పుడే జన్నయయు నతనిపుత్రుఁడగు సిద్ధనయు కర్ణాటక ప్రభువుల కొలువునందు ప్రవేశించి యుండవలయును. అప్పటికి జక్కన పెద్దవాడై కవియని ప్రఖ్యాతిగాంచియుండుటచేత నతనికడ విక్రమార్కచరిత్రనుకృతి నందెను. కావున విక్రమార్కచరిత్రరచనాకాలము క్రీ. శ. ౧౪౨౫-౯౦ సంవత్సరములమధ్య ననుట యొప్పును.

వెన్నెలకంటి సూరన్న : ఇతడు కృతిపతికి పెదతండ్రియట. మఱియు నీతడు రెడ్డివేమ నరపాలకునిచేత నగ్రహారములు బడసెను. ఈ రెడ్డివేమ నరపాలు డెవ్వడు? కొండవీడు రాజమహేంద్రవర రాజ్యముల నేలిన రెడ్డిరాజులయం దనేకుల కీపేరు గలదు. పోలయవేమారెడ్డి, అనవేమారెడ్డి, పెదకోమటివేమారెడ్డి, రాచవేమారెడ్డి, కాటయవేమారెడ్డి, అల్లయవేమారెడ్డి. వీరిలో రెడ్డివేమనరపాలుడే వేమారెడ్డి కాగూడదు? కావునసే వీరేశలింగంపంతులు రెడ్డివేమనరపాలుడు ప్రోలయవేమారెడ్డి యగు ననగా, మఱికొందరు రాచవేమారెడ్డి యనిరి. అయితే నిశ్చయముగ నీరెడ్డి వేమనరపాలు డెవ్వడు? ఈ విషయమును పిష్టపురి గ్రంథకర్త యగు

వెన్నెలగంటి సూరన్న సాయమువల్ల కనుగొనవచ్చును. తన పూర్వీకులను వర్ణించు సందర్భమున నత డిట్లు వ్రాసియున్నాడు.

ఈనిఖిలంబు మెచ్చ నమ
 రేశ్వరదేవుఁడు చూడఁ గృష్ణవే
ణీనది సాక్షిగా నవికి
 నిల్చిన రావుకుఁ గేసభూవిభుఁ
గానకు దోల వెన్నడవి
 కాచిన వేమయయన్నపోత భూ
జానకి సత్ప్రబంధము లో
 సంగిన వెన్నెలగంటివారి లోఁ.

రెడ్డివేమనరపాలకుచేత మహాగ్రహారము గొన్న వెన్నెల గంటి సూరనయు, నన్నపోతభూజానికి సత్ప్రబంధము లొసంగిన వెన్నెలగంటి కవియు నొక్కఁడే నని వీరేశ లింగంపంతులుగారు చాలకాలము క్రింద చక్కఁగ గుర్తించిరి. కావున సూరన, యనపోత యనవేమా రెడ్ల కాలమువా డగును. అనపోతారెడ్డి క్రీ. శ. ౧౩౫౮ వ సంవత్సరము మొదలు ౧౩౮౧ సంవత్సరమువరకు రాజ్యము చేసెను. అనవేమారెడ్డి ౧౩౮౧ సంవత్సరము మొదలు ౧౩౯౧ సంవత్సరపర్యంతము ప్రభుత్వ మొన ర్చెను. కావున వెన్నెలకంటి సూరనార్యుఁడును అప్పటి వాఁడే. ఇతని తమ్ముఁడును, విక్రమార్కచరిత్ర కృతిపతి యొక్క తండ్రియు నగు జన్నయ దేవరాయ మహా రాయల కృపకు బాత్రుఁడాయెను. కృతిపతియగు సిద్ధన దేవరాయల మంత్రియగు చామనామాత్యునిచే సత్క రింపబడెను. వీరెల్లరును క్రీ. శ. పదునాల్గవశతాబ్దము చివరభాగమున నుండిరి. జక్కనయు నప్పటివాఁడే.

---




కొండపల్లి జిల్లా (శిథిలములు)

# విచిత్రవ్యః

(అనువృత్తము)

కె. వి. సుబ్బారావు

చెన్నపురికి నెమ్మదిగా చేరుకున్నాము. మా లెక్చరర్లూ, ప్రిన్సిపాలూ, వేణూ అందఱూ మమ్మల్ని అభినందించడానికి స్టేషనుదగ్గఱకు వచ్చారు. పెద్ద మేళతాళాల్తో, విజయధ్వనుల్తో మేముతెచ్చిన బంగారు కప్పును ఊరేగిస్తూ తీసుకొనివెళ్లారు. అప్పుడుకూడా నేనూ, సుధా ఒకచోట కూర్చోవలసివచ్చింది; ఏమని చెప్పను నాస్థితి — వేణూ చాలా ఆనందించాడు మావిజయానికి.

మాతెచ్చిన నాలుగువేలరూపాయల కప్పువిలువ కాలేజీవారికి అందటికీ ఒకరోజు సెలవు ఇచ్చుటతో తీరిపోయింది. ఆనాటినుండి నానిర్మలమైన మనస్సు మారిపోయింది. ఒంటరిగా ఉన్నప్పుడల్లా ఏవో పిచ్చి ఊహలు మనసులో దొర్లిపోవడం, నడుస్తూనడుస్తూ ఉంటేనే అవేవో సుఖస్వప్నరేఖలు రావడం, వస్తువులింకోవిధంగా అగుపడడం, ఎవో ప్రేమప్రతిబింబాల ఛాయలు నామీదిగా ప్రాకుతూఉన్నట్లుండడం, క్లాసులో చెప్పే పాఠాలు మనస్సు కెక్కకపోవడం ఇలాంటివాటితో ప్రతిరోజూ నాజీవితంమీదినుంచి, బరువుగా దొర్లిపోవడం తటస్థించింది. సుఖమో దుఃఖమో ముసుగువేసుకొని ఒకస్వప్నం, గాఢనిద్రలో జొరబడినట్లు, ఏవేవో వింతవింతఅనుభవాల్ని ధరించుకొని ఒకవ్యక్తి నాజీవితంలోకి బలవంతంగా త్రోసుకొని, చొచ్చుకొని వస్తూఉన్నట్లుండేది. ఆవ్యక్తి సుధయేమో అనిపించేది.

అదివరకు ప్రతిదినమూ వచ్చి నన్ను చూచి పోతూఉండే మావేణూ ఢిల్లీనుంచివచ్చినతర్వాత అంతతఱచుగా రావడం మానేశాడు. అందువలనకూడా మనోభారం నాకు ఎక్కువైంది. వానికి పని తీరుబాటు లేకపోవడంవల్ల రాలేదేమో అనుకొని నేను రెండుమూడుసార్లు లాల్‌గారి ఇంటికివెళ్లి వేణూను పిలిచాను. కాని వాడు లేడని వినిపించారు ఇంట్లోవాళ్లు. సుధను క్లాసులోమాత్రం చూస్తూఉండేవాణ్ణి. నామనస్సులో బాధ ఆమెకేం తెలుసునూ?

ఇంతలో నామనస్సులో ఒకసందేహం పుట్టుకొచ్చింది, సుధ ఎవరూ అని.

తగనివాళ్లమీద మనస్సు పారడం లేదుగదా అని అడిగింది అంతరాత్మ; మనస్సుమాత్రం—

"సతాంహి సందేహపదేషు వస్తుషు
ప్రమాణ మంతఃకరణ ప్రవృత్తయః"

అని బోధించింది. ఆకల్లోలం అంతటితో అణిగింది కాని వెంటనే "ఊరమణీలలామ" అనేపద్యం స్ఫురణకు వచ్చిందికూడాను.

కాలేజీనుంచి వచ్చి ఇలా మనస్సులోనే మీమాంస చేస్తూఉన్నసమయంలో వేణూ వచ్చాడు.

"బావా, పనితొందరమీద రాలేకపోయినాను, నాలుగురోజులైంది నిన్నుచూచి. అలారా, బీచికి వెళ్లుదా" మన్నాడు.

"సరే" అని ఇద్దఱమూ సముద్రతీరానికి వెళ్లి దూరంగా ఎవ్వరూరాని ఒకచోట కూర్చున్నాము.

"నాలుగురోజుల్నుంచీ నన్ను చూడడానికైనా తీరికలేని ఏమంత పెద్దపని వచ్చిందోయి" అన్నాను.

"బావా, పనిఏమీలేనివాళ్లకే తీరిక ఉండకపోవడం; పనిఉన్నవాళ్లకు ఆపని ఐపోగానే వాళ్లకంతా తీరికే! పనిలేకనే నాకు తీరికలేకపోవడం" అన్నాడు.

"అయినా ఇన్నాళ్లవలె నీవు ఉల్లాసంగా కనపడటం లేదు. నీమనస్సులో ఏదో బరువు తూగుతూ ఉన్నట్లు నాకు తోస్తుంది. ఏడ్చిఏడ్చివచ్చినవాడివలె నీముఖంలో ఏదో దీనత్వం కనబడుతూఉంది. కారణం తెలీదు. వేణూ ఏమి? చెప్పవూ?"

"అబ్బే బావా, ఏమీలేదు. మనోదౌర్బల్యం తప్ప ఏమీ లేదు. ఒంట్లో సరిగా లేదు. అంతకన్నా విశేషం ఏమీ లేదు" అన్నాడు.

"పోనీ, ఇంటికి ఉత్తరం వ్రాయనా? లాల్‌గారింట్లో సదుపాయాలన్నీ సరిగానే ఉన్నాయిగా! ఇక్కడికన్న అక్కడే చాలా బాగున్నదని చెప్పేవాడివి కదూ? క్రొత్తచేయదగ్గవిశేషా లేవీ పుట్టలేదుగా! బావా ఏదో ఉంది నీమనసులో?" అన్నాను.

"ఏదీ లే"దంటూనే ఈకబురు ఆకబురు చెప్పి ఆసాయంకాలం నాతో గడిపి ఇంటికి చేరుకున్నాడు వేణూ.

మర్నాడు శనివారం. కాలేజీలేదు. మధ్యాహ్నం రెండుగంటలైంది. ఆనాడు ఎండ కొంచెం తీక్ష్ణంగాఉంది. ఉక్క పోస్తూఉంది. వట్టివేళ్లతాపలు కిటికీల క్రిందికి దించి తలుపు ఓరగావేసి ఉత్తరరామచరిత్ర దీసి,

"త్వం జీవితం త్వమసి మే హృదయం ద్వితీయం
త్వం కౌముదీ నయనయో రమృతం త్వమఙ్గే"

అని సగం చదివేసరికి "విరమ! విరమ! ఇయమస్మి" అనుకుంటూ తటాలున తలుపుతెరుచుకొని లోపలికి వచ్చింది సుధ. నేను తబ్బిబ్బైనాను. వెంటనే, లేచి పట్టుకూడావేసుకొని కుర్చీలాగి, "కూర్చోండ"న్నాను.

"మండువేసవిలో మిట్టమధ్యాహ్నంఅప్పుడు కూడా శీతలసుధాచంద్రికలు కనబడతవేమండీ" అన్నాను విచిత్రంగా.

"అగుపడ్డా చుట్టూ ఆతపానికి ఉడుకుతూ ఉన్న అంతరంలోనూ, ఉబుకుతూఉన్న హృదయంతోనే అగుపడతవి కాని ఎన్నడూ శీతలంగా మాత్రం కనపడవు" అంది సుధ నవ్వుతూను.

"తామెంత ఉడికినా, ఎంతఉడికినా ఎదుటివాళ్లను మాత్రం రంజింపక మానవుగా! వాటి నైజమే అది. అందువలన వీతద్దర్శనం ఆనందకరమైన విషయమే" అన్నాను.

"ఇదే మీజాతిలో దుర్గుణమన్నాను, మోహన్, తానెంత ఉడికినా నీకక్కరలేదూ? నీసుఖంమాత్రం నీకు కావలెనేమి? నిన్ను రంజింపక దానికి తప్పదేమి? నీకోసం అది ఆత్మార్పణం చేసినా బాగానేమి. "చిన్న పాపాట్టకు శ్రీరామరక్ష" అని నీసుఖంలో నీ కడుపునిండిన చాలునేమి?" అన్నది తీవ్రంగా సుధ.

"పొరపడ్డావు, సుధా, బాగా పొరపడ్డావు! తన మకరందం తేటికర్పించనంతవరకూ, తన వాసన సమీరకుమారునికి సమర్పించనంతవరకూ తన సోయగము ఆనందించే కండ్ల కందివ్వనంతవరకూ కుసుమముజీవితమెందుకుచెప్పూ? చేపకు తనపిల్లలను కండ్లార చూస్తేగాని కడుపునిండదు. తాబేలుకు తన పిల్లలను తలుచుకుంటేగాని తుష్టికలగదు. ఒకళ్ల నానందింప చేయడమే తానానందించడమని ప్రప్రథమాన్ని పరమేశ్వరుడు పలికిన వాక్యం. ఆమహావాక్యానికి పురుషజాతి కొంచెం ఎడంగా జరిగితే జరిగిందిగాక. అసలుచోటులేని స్త్రీహృదయాని కాచోటిచ్చి మరీ జరిగింది.అందువలన మాజాతియొక్క ఆత్మౌదార్యం, అస్వార్థపరత్వం, ఆత్మార్పణోత్సాహం వెల్లడింపబడుతున్నాయి కాని, నీవన్నట్లు ఆత్మప్రియత్వం కాదు సుధా, ఎన్నటికీ కాదు" అన్నాను.

"మోహన్, ఏమీ చేతకాకపోయినా మగవాళ్లకు మాటలుమాత్రం బాగా చేతవుతాయి. నిన్ను కదలించడానికి నాకు భయం వేస్తుంది. నాకు నచ్చినా నచ్చకపోయినా మనస్సునకంటే సమాధానం చెప్తావు. అందుకనే నీదగ్గర కూర్చున్నంతసేపూ, నీతో మాట్లాడుతున్నంతసేపూ, నామనస్సునకేదో చెప్పరాని తన్మయానందం కలుగుతుంది. ఎంతసేపైనా నీదగ్గరే

ఉండాలనిపిస్తుంది. ఎవరి కనిపించదూ?" అన్నది సుధ నావైపే చూస్తూ. ఏలకోకాని నాకు వెంటనే ఢిల్లీ సత్రంలో నాటిరాత్రి కన్న కల స్ఫురణకు వచ్చింది. భయంవేసింది.

"సుధా మనుష్యుడి హృదయం అద్దంవంటిది. ఆఅద్దం మంచిఅద్దమే అయితే ప్రకృతిప్రతిబింబాలు సవ్యంగానే కనపడతాయి అందులో; లేక అది ధూళి అద్దమే అయెనా, నిజంగా ఉన్న దానికి భేదంగా వస్తుగుణాల వికృతస్వరూపాలు అందులో కనపడతాయి. నీమనోముకురం స్వచ్ఛమైనదీ, స్నిగ్ధమైనదీ కనుక మంచిని మంచిగాను, చెడ్డను చెడ్డగాను గ్రహిస్తుంది. అందులో నాపాప చక్కగానే కనపడిందంటావా? నిజంగా అది నాపూర్వపుణ్యభాగ్య మంటాను. నాఅదృష్ట ఫల మంటాను" అన్నాను.

"మోహన్, నిజంగా నీవు విజ్ఞానమూర్తివి. నిన్ను నేను అనునిమేషం తలుచుకోకుండా ఉండలేనంటే నమ్మవేమో?" అంది సుధ ఓరగా చూస్తూ.

"సుధాహృదయంలో ఈమోహనుడు కూడా ఒకస్థానం ఆక్రమించుకొనిఉన్నా డని యిదివరకే తెలిస్తే నిజంగా నన్ను నేను మరచిపోయే ఉందును. సుధా! యీక్షణంనుండి వలపెఱుగని నా యీ ఏకైక హృదయాన్ని దాచిపెట్టే భారం నీది. నాకిక ఏమీ భయంలేదు"

అని మాట్లాడలేక అట్లే ఆమె నిర్మలప్రేమమయ వదనంవంక చూస్తూ ఊరకున్నాను. సుధకూడా తన్మయానందం అనుభవిస్తూఉన్నదానివలె నన్నలా చూడనిస్తూ నాకండ్లమనసు తీరుస్తూ ఒయ్యారంగా కుర్చీలో అల్లాగే కూర్చుంది. కొంతసేపైనతరువాత సుధ టైమును చూచి,

"అప్పుడే నాలుగైంది; మోహన్; వెళ్ళనా" అన్నది సుధ చిలిపినవ్వు నవ్వుతూ.

"సుధా! నాలుగైనమాట నిజమే. వెళ్ళేవారు వెళ్ళిపోతే ఒక్కడనూ సుధా! ఉండనా"? అన్నాను. సుధ ముఖంత్రిప్పింది. ఆమెకు నామాటకు నవ్వువచ్చినట్లుంది. వెళ్తూవెళ్తూ-అదొక పిచ్చిపనిలెండి సుధ ఏమనుకొన్నదో ఏమో?—తన జేబురుమాలు నామీద విసిరివేసి వెళ్ళిపోయింది.

## ౭

కాలేజీనుంచి వచ్చి బీచికి వెళ్దామనుకుంటూ ఉండగానే వేణూకూడా వచ్చాడు. ఆరోజున మా వేణూవాలక మేమీ బాగులేదు. దిగులు చింత ఎఱుగక నిరంతరప్రసన్నంగా ఉండే ఆముఖంలో ఏవో వ్యసన మేఘాలు గ్రమ్మినట్లుగా విషాదంగా ఉంది. కొంచెం భయంకొలుపుతూ ఉందికూడాను. హిప్నాటిస్టు కండ్లలోవలె వాడి కండ్లలో ఎదుర్కొ లేని అనిర్వాచ్యశక్తి భయంగొల్పుతూ ఉంది. కాని అతని వాలకంలో మేఘంలో మెఱుపులాగా ఏదో క్రొత్తమధురిమ చాలక గోచరిస్తూనే ఉంది. నేను ఆరోజున చాలా సార్లు మాటలకి తడబడవలసివచ్చింది.

"బావా, మొన్న నీదగ్గఱనుండి వెళ్ళినదగ్గఱ్నుండి నాలో చాలావిచిత్రమైన మార్పు కలుగుతూ ఉన్నట్లు నాకే గోచరిస్తున్నది. ఈమార్పు నా వ్యక్తిగతమైనదే! నాఅభిరుచుల్ని గురించిందే" అన్నాడు ఉదాసీనంగా మావేణూ నావంక చూచి.

"నాకు కూడా అలాగే అనిపిస్తున్నది. వేణూ, ఇదివరకులాగ నీముఖంలో ఆరోగ్యకళలు అగుపడడం లేదు. వంట్లో సరిగాలేదా?" అన్నాను.

"అదిగాదు బావా, కొన్నిరోజుల్నించి నామనస్సులో ఏమీ స్వస్థతగా ఉండడంలేదు. నాకు ఇదివరలో ఉన్న మనస్థితికి కేవలం వ్యతిరేకస్థితి యిప్పుడు నామనస్సును చుట్టుకుంటూ ఉన్నది. ఈమనోభారం నీతో వెళ్లబోసుకొని కొంచెం స్వస్థత పొందుదామని నిన్నిక్కడకు ఇలా లాక్కొచ్చాను. ఇంతకూ కారణంఏమంటే నాకే గోచరంకావడం లేదు. పూర్వం నాకు భయంకరములుగాను, జుగుప్సావహములుగాను ఉండే దృశ్యాలన్నీ ఇప్పుడు నాకు చాలా

ప్రసరించాయి. రక్తం అంటే నాకు పూర్వం ఎంత అసహ్యంగా ఉండేదో ఇప్పుడు అంతగా రక్తదృశ్యాలని చూడడానికి నామనస్సు ఉరికి ప్రాకులాడుతూ ఉంటుంది. ఘోరమైన వ్యాఘ్రపు బొబ్బరింతలు వినడానికి చెవులు విచ్చుకొని ఉంటాయి. బాధ, క్రూరత్వం, భీతి, ఘాతుకత్వం, కృతఘ్నత, ఇలాంటిభావాలను చిత్రించడానికి నామనస్సారికే ఆరాటపడుతూ ఉంటుంది.

"వడవడ వణంకిపోదు జీవనపు గోసల
నెన్నడేనాస కళ తలయెత్తెనేని
ఉభయసంధ్యాంచలముల నేదో వెలుంగు
కలుగ కలవరపోవు ఘూకమ్మవోలె
మింటవెలుగు చుక్కమగన్న మిణుగురన్న
నేను సహియింపలేనవ్వి యారులు చెలుచు
నాకు ప్రాణమే మెఱపులే లేక యున్న
భాద్రపదమాసమున నమావాస్య రాత్రి."

అని కృష్ణశాస్త్రి పాడుకున్నట్లు నాకు కటికచీకటి పేరుకున్న రాత్రిలో పెద్దపులులు గాండ్రిస్తూ, ఘూకాలు గుట్టుమంటూ, జంబుకాలు భోరుమంటూ, విశ్వహృదయం మరుగుతూ ఉన్నసమయాన్ని ఏకాకినై వాటితోపాటు నేనుకూడా క్రుంగికలుపుదామని మనసు పరిగెత్తుతూ ఉంటుంది. ఇదివరకు లావణ్యమని పిప్రకృతి అనిపించిందో అదే యిప్పుడు అసహ్యంగాను, నీరసంగాను కనబడుతున్నది. "ఏనురుజనైతి, జరనైతి మృత్యువైతి" అనీ, "నామరణశయ్య పఱచుకొన్నాను నేనె" అనీ వ్రాసిన ప్రవాసివాక్యాలకు నామనస్సెంతైనా తృప్తితో నిండిపోయింది. ఈ నావిషాదప్రియమును లోకం ఉన్మాదమని తలిస్తుంది గాక. నాకందులోనే కొంత ఆనందం కనబడుతూ ఉంది. కొంత ఏమిటే? అందఱూ సుఖదాయకాలను కునే దృశ్యాల్లోకంటే నాకీ అనుభవంలోనే ఎక్కువ ఆనందం గోచరిస్తున్నది." అని బాధాకలితమైన హృదయపుటాన్ని గట్టిగా పట్టుకొని నాఒళ్లో తల పెట్టుకొని ముఖం కప్పుకున్నాడు.

"వేణూ, అబ్బా, యిలాంటి మాటలేవీ నాకు చెప్పకు. నాకే భయంవేస్తున్నది."

నీతో చెప్పుకునేనా మనోభారం తగ్గించుకుందామని వచ్చాను. నీవే వినకపోతే ఇంకెవరితో చెప్పుకోను. ఈపరివర్తనదశలో నూత్న సంఘట్టనాలతో ఉఱ్ఱూతలూగుతూ ఉన్న నామనస్సును ఇంకో హీనశక్తి ఒకటి ఆకర్షిస్తూఉన్నది. నన్నుకూడా మన స్వహజములైన చాంచల్యలౌల్యాలతో కూడుకున్న సామాన్యమర్త్యునిగానే యెంచి నా చెప్పేమాటలు సావధానంగా వింటానంటే, నన్ను మన్నిస్తానంటే నా ఉదాసీనవృత్తాంతం చెప్పుతాను. లేకుంటే నా విషాదంలో నేనే దాక్కుంటాను."

"నీవు చెప్పేమాటలచేతనే కలవరపడుతూఉన్న నన్ను సశేషసందేహాల్లో పెట్టి మఱింత చంపక. నీ వైఖరి నాకు నిజంగా భయంగొల్పుతూ ఉంది."

"ఈ కలతిహృదయానికి సాయంగా నాభావబలాన్ని ఒక అతిలోకసుందరి అపహరించింది. నీవు పొరపడినా యీమార్పంతా యీప్రణయచాంచల్యానికి ఫలితమే అని ఊహించవద్దు. నాకు ప్రేమచేత మతిపోయి ఇలాగంటున్నానని అనుకోవద్దు. నేను సంపూర్ణజ్ఞానముతో నుండి చెప్పుచున్నాను. నాకు యీ మనఃపరివర్తనము మొదలుపెట్టింతరవాతనే యీ నీరసశక్తి నన్ను పట్టుకొని బాధిస్తున్నది. నాకు ఆసుందరాంగిమీద వాంఛలేదు. నామనస్సునకు లోకులు దేనిని సుఖమనుకొనుచున్నారో అది పరాఙ్ముఖభావమైనదనీ, దేనిని లోకము దుఃఖమయమని తలుస్తున్నదో అది నాకు ప్రియమైనదనీ, మొదట్లోనే నీకు నేను చెప్పియున్నాను. అందుకనినే నామోహనాంగిమీద ప్రేమవిషయబలముచేత ఇలాగ అంటున్నానని ఎంతమాత్రం అనుకోవద్దు. ఆమె నావలన లోకం అనుకునే సుఖం ఏదైన పొందగోరిందా అంటే కేవలం ఆమె భ్రమిస్తున్నదన్నమాట. ఒకవేళ యీనిషయుద్ధలో నామనస్సుకుకూడ ఆమె నచ్చిందా అంటే, నేను దేనిని అతిలోకసుఖంగా తలుస్తున్నానో, దేనిని ఆనం

దానికి పరమావధిగా తలుస్తున్నానో ఆనాటికే ఆమెను చేరుస్తాను" అన్నాడు వేణు గంభీరంగా.

"ఆమె పేరు?"

"నాకు తెలియదు"

"ఆమెను చూపలేవా?"

"ఆపని నాకు చేతకాదు."

"పోనీ చిత్రకారుడివిగా! ఆమెబొమ్మను వేయలేవా?"

"యద్యత్సాధు న చిత్రేస్యాత్ క్రియతేతత్తదన్యథా,
తథాపితస్యా లావణ్యం రేఖయా కించిదన్వితమ్"

అని ఊరుకున్నాడు.

ఇక నాతని అట్టే మాట్లాడించిన లాభంలేదని అనుకున్నాను. వేణు స్థితిని తలుచుకుంటే ఒక్కసారి మాశ్యామల దీనవదనంతో కట్టెదుట ప్రత్యక్షమైంది. నాకు జాలివేసింది మఱునాడు శ్యామలను మాఅమ్మనూ తక్షణం పంపవలసిందనీ, ఇక్కడ వేణు స్థితిని గుఱించీ ఇంటికి ఒక ఉత్తరం వ్రాశాను.

౮

మఱునాడు నేనే లాలుగారింటికి వెళ్లాను. "వేణూ ఉన్నాడా" అని అడిగాను. 'మేడమీద గదిలో ఉన్నాడ'న్నారు. చరచర మేడమెట్లెక్కి వేణుగదిదగ్గఱకు నడిచాను. తలుపు గట్టిగా లోపలవేసి ఉంది. అయినా మావిచిత్రవ్యక్తి ఒంటరిగా ఉన్నప్పుడు ఏంచేస్తూఉంటాడో చూడాలనిపించింది నాకు. తాళపుకన్నంలోనుంచి చూశాను. నామనసు చెదిరిపోయింది. లోపల ఒకదోమతెరదించిన పందిరిపట్టెమంచం ఉన్నది. అందులో ఒకస్త్రీవ్యక్తి ఒయ్యారంగా శయనించిఉన్నది. తలుపువైపు తలపెట్టుకుని పరుండుటవలన నే నామెముఖం చూడలేకపోయినాను. ప్రక్కనే వేణూ నిల్చి నాకర్థంగాని చూపులామెవంక చూస్తున్నాడు. ఇంక నే నొక్కక్షణమైనా అక్కడ నిలువలేదు. గబగబ టెలిగ్రాఫ్ ఆఫీసుకు పోయి శ్యామలను అమ్మను తిరుగుబండికి తక్షణం పంపమని తంతియిచ్చి నేను కాలేజీకి వెళ్లాను. ఆరోజు సాయంకాలం మళ్లీ వేణూకోసం లాల్‌గారింటికి వెళ్లాను. కాని అక్కడ వేణు కనబడలేదు. బీచికి వెళ్లిఉంటాడని వెళ్లి అక్కడ అంతటా వాడికోసం వెతికాను. కాని వాడిజాడే నాకు కనబడలేదు.

సాయంకాలమైంది. అందఱు గృహోన్ముఖులైనారు. చీకటి జగాన్ని ఆవరించుకుంటూ ఉన్నది. సముద్రపుటలలు ఘోరుమంటూఉన్నవి. గాలి హోరుమని వీచడం మొదలుపెట్టింది. తుపాను వచ్చేటట్లుగా ఆరోజున అలలు పొడుగ్గా పైకిలేచి ఫెళ్లుమని విఱిగి ఒకదాన్ని ఒకటి కొట్టుకుంటూన్నవి. అందఱూ వెళ్లిపోయినారు. ఒక్కకారుమాత్రం దిక్కుమొక్కులేనట్లుగా రోడ్డుమీద నిలిచిఉన్నది. దూరంగా తాటిచెట్లల్లే లేచి విఱుగుతూఉన్న కెరటాలమధ్య ఒకచిన్న డింగీమీద ఊగుతూ ఏకాంతంగా ఎవరో మాట్లాడుకుంటూ ఉన్నట్లు మసకచీకట్లో నాకు కనిపించింది. ఇంతతుపానులోకూడా భయంలేకుండా అలాగ సముద్రంమధ్య ఊగులాడుతూఉన్న వాళ్లను చూచి ఆశ్చర్యపడ్డాను. ఒడ్డుకు వస్తారేమో వాళ్లెవళ్లో చూదామని చాలాసేపు వేచిఉన్నాను. ఎంతసేపటికి వాళ్లు వచ్చేవిధం కనపడలేదు. చీకటి దట్టంగా అలముకుంటూ ఉన్నా వాళ్లాసముద్రమధ్యాన్నే ఉన్నారు. గాలి అంతకంతకు ఎక్కువౌతూంది. అప్పుడే ఎనిమిదిగంటలైంది. ఇంకాఉంటే హోటల్లో చల్లారిన మెతుకులు తినాలిసివస్తుందనీ అదీకాక చెలరేగుతూన్న తుపానుకు నిలువలేకనూ బయల్దేరి తిరిగివస్తున్నాను. ఇంకా మాయింటికి సగందూరంలో ఉన్నాననగా, యిందాకటి కారు బుర్రుమని నాప్రక్కనుంచే వెళ్లిపోయింది. కారును వేణు నడుపుతున్నాడు. వెనకాల కూర్చున్నది స్త్రీఅని గుడ్డలనుబట్టి పోల్చాను కాని కారువేగంలో ముఖాన్ని చూడడానికి అవకాశం లేకపోయింది. మాబావ నన్ను చూచిఉండడు. లేకపోతే కారు ఆపేవాడే. పోనీలే అనుకొని హోటలుకు వెళ్లి పయింపీసయించని భోజనం చేసి ఇల్లుచేరుకునేసరికి తొమ్మిదైంది.

తలుపుతీసి లైటువెలిగించి ఏమీతోచక పెట్టిని తీసేసరికి, అంతరాత్రివేళా, తుపానులో, తడిసినపైగుడ్డలతో సుధ గదిలోకి వచ్చింది.

హాల్లో! వెల్‌కమ్! నేడన్నీ అద్భుతాలౌతున్నాయి. ఇక్కడ కూర్చోండి! రండి" అన్నాను కుర్చీనిలాగి. సుధ కూర్చుంది.

"ఏమి యింతరాత్రివేళా ఇలావచ్చారు? ఈ తుపాను శనిలాగ పట్టుకొని వదలకుండా ఉన్నది. పాపం మీగుడ్డలన్నీ తడిసిపోయిన వనుకుంటాను. అయినా ఇప్పుడు ఇలా రావడ మెలాతటస్థించింది?" అన్నాను.

"ఎబ్బే ఏమీలేదు; హాస్టలులో కొందరు స్నేహితులను చూడడానికి వెళ్లాను. అక్కడనుండి టవున్‌హాలులో ఏదో మీటింగున్నదంటే అక్కడకు కూడా వెళ్లి కాస్తసేపు కూర్చునేసరికి యీతుపాను పట్టుకుంది. అందినబండ్లన్నీ అందరూను కట్టించుకొని వెళ్లిపోయారు. టాక్సీగాని, బండీగాని, తుదకు రిక్షా కూడ దొరకలేదు. ఏమీదొరకక ఇలాగ వానలోబడి ఇంటికివెళ్తూ మీయింట్లో ఈ వానదెబ్బకు కాచుకోడానికి గొడుగైనా ఒకటి దొరుకుతుందనే ఆసతో వచ్చాను. ఇవ్వాళ మీయింటికి రావడ మిది నాలుగో సారి. అబ్బా ఏమిచలి?" అన్నది సుధ.

"సుధా, మగవారు ఆడువేషము వేస్తే ఎంత బాగుంటారో నేనెఱుగను కాని, ఆడువాళ్లు మగవేషం వేస్తే చాలాబాగుంటారనిమాత్రం నాకు చాలాబాగా తెలుసును. చాకలివాడు తెచ్చిన నాదుస్తులిస్తాను, అభ్యంతరంలేకపోతే——"

"మోహన్! నీవు చాలామంచివాడవు కానీ అల్లాచ! నాకోసం ఆటే ఏమీ శ్రమపడకు." అన్నది సుధ. నాకామాట లేమీ అర్థంకాలేదు.

"అవును. ఈవేళ నాలుగుసార్లు నాకోసం ఎందుకు రావాలిసివచ్చింది. సుధా! నన్ననుగ్రహించే పని యేమైనాఉందా?" అన్నాను.

"అవును. నీకోసం నాలుగుసార్లు కష్టపడి వచ్చాను. రేపు డిబేటుందని దాన్నిగురించి మాట్లాడుదామని నీకోసం సాయంకాలం నాలుగుసార్లు వచ్చాను. నీవింటలేవని చెప్పింది గదికివేసిఉన్న తాళం" అంది సుధ.

"ఇంత స్వల్పవిషయానికి సుధనింతగా శ్రమపెట్టినందుకు నన్నెవరేనా క్షమించేవాళ్లుంటే బాగుండును."

"దండించేవాళ్లుంటే బాగుండదూ?"

"అంతకన్నా మరీ బాగుంటుంది సుధా" అన్నాను.

"అయితే నేనే పొరపడుతున్నానన్నమాట. అంటే లోకంఅంతా పొరపడుతున్నదన్నమాట. అంతేనా! మోహన్" అన్నది సుధ పరీక్షగా నా వంక చూస్తూ.

"నాకేమీ అర్థంకాలేదు. దేన్నిగురించి పొరపడ్డావో, సుధా, చెప్పితే తెలుసుకోగలనేమో!" అన్నాను.

"క్షమించడం, భోగించడం, సుఖించడం, ప్రేమించడం, ఇలాంటి సాత్వికమైనభావాల్లోనే ఎక్కువ ఆనందం ఉంటుందని లోకం అనుకుంటున్నది అనుకుంటాను. నేనుకూడా ఇంతవరకూ సుఖంలోనే ఆనందం ఉంటుందనే మతంలోనివాణ్నే. పెక్కురోజుల్నుంచీ నేనొక కళామూర్తిని చూస్తున్నాను. అతడూ మొట్టమొదట ప్రేమ, భోగము, సుఖము వీటిలోనే ఆనందంఉందనుకుని, ఆఅనుభవాలను సంయమించుకొని బయటికి పద్యాలుగాను, చిత్రాలుగాను వ్రాసేవాడుట. కొద్దిరోజుల్నుంచీ, అతడు సుఖంలోకన్న దుఃఖంలో ఉన్న ఆనందమే నిశితమైనదనీ, రుచికరమైనదనీ, దానికి మృత్యువే అవధిఅనీ, అన్నిపరీక్షలకు శ్రాగిన ఆత్మకుతప్ప అట్టిది అవగతం కాదనీ, లోకానికి విపరీతంగా కనబడే ఇలాంటి సిద్ధాంతాలను చెపుతూ ఉంటాడు. ఇప్పుడు నీవుకూడ క్షమించడం

లోకంటే దండించడంలోనే ఎక్కువ ఆనందం ఉంటుందన్నావు. క్రమంగా నాకు మతిపోతున్నది. ప్రపంచకంలో ప్రాజ్ఞులు, చదువుకొన్నవాళ్లూ అందరూ ఇలాగే అనుకుంటున్నారా అనీ, అసలు అదే యథార్థతత్త్వమా అనీ నామనస్సు రికే కొట్టుకుంటూ ఉన్నది. విషంపూదిగిన అమృతఘుటిక ఏదో, అమృతం పూదిగిన విషఘుటిక ఏదో తెలుసుకోలేకుండా ఉన్నాను. నీవిజ్ఞానమూర్తిని నేను మనసార ప్రేమించాను. నీయెదుటఉన్నప్పుడు నాకు వేరేస్వర్గం కనబడదు. కాని నీయెదుట లేనప్పుడుమాత్రం లాలిత్యానికీ లౌల్యానికీ ఆకరమైన ఆమజాతికి చెందినదానను కనుక, నా మనస్సు కళామోహం విడిచిపెట్టలేకుండా ఉన్నది. ఆకళామూర్తికూడా యువతులకు అర్హుడనీ, ప్రేమకు పాత్రుడనీ, మన్ననకు తగ్గవాడనీ, తోస్తూఉంటుంది. క్షమించాలి, మోహన్, క్షమించాలి. ఒకవంక నీవిజ్ఞానమూర్తి, వేరొకవంక ఆతని కళామూర్తి, యీ మీ యిర్వురిమధ్యబడి దారియెఱుగని కెరటమువలె పైకిలేచి అల్లాడుతున్నాను మళ్లీ విశ్వసాగరంలో నాజీవితం లీనంకాకముందే, మోహన్, నన్ను రక్షించుకోమని ప్రాధేయపడుతూఉన్నాను."

అని ముఖంమీద గుడ్డవేసుకొని ఏదో తప్పుచేసినట్లు చిన్నపిల్లలాగ వెక్కడం ప్రారంభించిందిసుధ.

నామనస్సు ఆమెఅంటూఉన్న ఒక్కొక్క మాటకు ఒక్కొక్క ఉబుకు ఉబుకుతూఉన్న సముద్రంలాగ కల్లోలమయమైపోయి ఒక్కసారి ఘోరుమన్నది. నాహృదయముగ నిక్షేపించుకొన్న సుధ ఇలాగాఉందని కల్లోగూడ నేననుకోలేదు.

"సుధా, దయయుంచి మీనాన్నగారిపేరు చెప్పగలవా?"

"ఏమి మానాన్నగారికి చెప్పుతారా ఇదంతాను?"

"లేదు బాబూ, అసలే మరుగుతూఉన్న నా హృదయాన్ని మరింత ఏడిపించక! మీ నాన్నగారెవరు?"

"—లాల్‌గారు."

ఆమాట నాహృదయంలో వేయిసార్లు ప్రతిధ్వనించింది. "అయితే నీకళామూర్తిపేరువేణుగోపాలుడు కాదూ—సుధా!"

ఆమె నిర్వాఅపోయింది. ఒక్కసారి లేచినుంచుంది.

"క్షమించండి! మళ్లీ వస్తాను" అని చరచర వెళ్లిపోయిందిసుధ.

నాహృదయస్థితి చెప్పుకోడానికైనా నాకు సమర్థత లేకుండా ఉంది. ఇవతలసుధ; అవతల శ్యామల, మధ్య వేణు ఫొటోగ్రాఫ్‌లో లాగ నాహృదయరంగంలో నంచుని ప్రత్యక్షమైనారు.

నాకేమీ తోచలేదు. వెంటనే వేణూ దగ్గరకు పరిగెత్తుదామనుకున్నాను. ఏమిలాభం? ఈఉపద్రవాన్ని నివర్తించేశక్తి ఆపరమాత్మునికే తప్ప నాలో ఏమీలేదు. వేణూ హృదయాన్ని నేను త్రిప్పలేను. అది వివిధమైన అగ్నిపరీక్షలకు గ్రాసుతూ ఈభౌతికాన్ని అతిక్రమిస్తూఉన్న ఒక ఆత్మ. దానివేగాన్ని, పరిణామాన్ని ఆపుదామనుకోటం కాలాన్ని మళ్లించుదామనుకోటమే. ఏటొచ్చీ మాశ్యామల నలిగిపోతుంది. ప్రొద్దున వేణూ గదిలో ఉన్నది, సముద్రంమీద పడవలో వేణూతో ఉన్నదీ, కారులో సాయంకాలం నేను చూచినదీ సుధయే అని తెలుసుకున్నాను. ఈఊహకు నామనస్సు వక్రంగా చుమ్మలుచుట్టుకొనిపోయింది. పాపం సుధకు వేణూ ఒకపెండ్లి అయిన గృహస్థుడనీ, మేమిద్దరమూ బావమఱదులమనీకూడా తెలీసనుకుంటాను. లాల్‌గారైనా చెప్పిఉండరనుకుంటాను. వారికైనా మేము బావమఱదులమన్నమాటమాత్రమే తెలుసును కాని వేణూ వివాహితుడనేసంగతి తెలీదనుకుంటాను. ఇంట్లోనే ఉండి యిలా ఇర్వురికి ప్రేమాంకురాలు మొలకెత్తుతున్న వన్నసంగతి అసలాయన గొలుగడని అనుకోను. సుధ అవివాహిత. వేణూ తగినవాడు. వారిమధ్య లేనిపోని నిబంధనలు ఏర్పఱిచి ఆఘాతంగము ఎందుకు కల్పించాలని లాల్‌గారు వారి స్వైరవర్తనము కని

పెట్టేకూడా ఊరుకుని ఉండవచ్చుకూడాను. ఏమోలెండి అదంతా నాకు తెలీదు. ఇంతకూ తమలపాకులవాణ్ని నే నైనామగనక ఇతరులను గురించి ఎలాగైనా అనుకుంటాను. నాఊహాలు అసత్యాలు కావని ఏమిరూఢి?"

ఇలా అనుకుంటూఉండగానే "ఐంది. వీథిలో బండి ఆగినచప్పుడుకూడా వినది. వెళ్లి చూచాను. దీన వదనాలతో మాఅమ్మ, శ్యామలా, నాన్నగారుకూడా దిగారు. నేనుసంగతి ఏకుకాని కారణమే భయాస్పదంగా ఉందిగనుక వెంటనే లాల్‌గారి యింటికి వెళ్దామనుకున్నాను. అదృష్టవశాన్ని ఇందాకటినుంచి హోరుమంటూన్న పంచభూతాలూ కొంచెం శాంతించినయి. అప్పటికిమాత్రం మావాళ్లతో ఏమీ చెప్పలేదు.

బండిలో మాత్రం మాశ్యామల

"అన్నా! ఏమినాగతి" అని నాచేతుల్లో తన ముఖం పెట్టుకుని యేడ్చింది.

"నీకేం భయమమ్మ కన్నతల్లీ" అని అమ్మ నాన్నగారూ దాన్ని దగ్గఱకు తీసుకున్నారు.

మేము వెళ్లేసరికి లాల్‌గారియింట్లో అందఱూ లైట్లు ఆర్పివేసి పడుకున్నారు. అప్పుడే ౧-౨ కావస్తున్నది. వెళ్లి లాల్‌గారి వీథితలుపు తట్టినాము. నడుస్తూ శ్యామల నన్ను చుట్టుకుని

"అన్నయ్యా! భయంవేస్తున్నది" అని దీనంగా అన్నది.

"ఎందుకూ భయం! వెఱ్ఱితల్లీ" అని అమ్మ నాన్నగారూ దాన్ని చేరదీశారు.

కాపలాఉన్న నౌకరు తలుపుతీశాడు. "వేణూ ఉన్నాడా" అన్నాను.

"గోపాలంగారా! పైన గదిలో ఉన్నారు" అన్నాడు.

ధ్వనిచేస్తే ఇతరులకు నిద్రాభంగం మౌతుం దని నెమ్మదిగా నడిచి మెట్లెక్కి పై అంతస్థును చేరినాము. శ్యామలను చూచి ఐనా వేణూ మనసు మారుతుందేమో అని, అమ్మా నాన్నగారు తాన్నే ముందు నడవమన్నారు. వణుకుతూ ఉన్న చేతులతో నన్ను చుట్టుకొని

"అన్నా! భయం వేస్తూన్న" దన్నది నాముద్దు చెల్లెలు. కాని అమ్మ నాన్నగారూ,

"నీవిల్లా అడ్డాలుచెపితే, తల్లీ, చాలా కష్టం వస్తుంది. మేం చెప్పినట్లు చెయ్యి. వాడికళ్లకు ముందు నీ వగుపడాలి. ఏదిరా వాడిగది?" అని నెమ్మదిగా నన్నడిగారు.

"అది" అని నాలుగైదుగజాల్లో ఉన్న గదిని చూపించాను. లోపల లైటు వెలుగుతూన్నట్లుంది. శ్యామల విహ్వలిస్తూ వెనక్కు తిరిగితిరిగి చూస్తూ నడుస్తున్నది. గదిద్వారాన్ని సమీపించాము. తలుపులు ఓరగావేసిఉన్నయ్. శ్యామల వెనకనే నేనూఉన్నాను. శ్యామల తలుపునెట్టింది.

* * * * *

అది ఘోరమైన సంగతి. నేను వ్రాయనూ లేను. మీరు చదవనూ లేరు. వెనుక చెప్పిన పందిరిపట్టెమంచం మీద ఒయ్యారంగా పడుకుని సుధ నిద్రపోతూన్నది. ప్రక్కనే వేణూ భయంకరంగా ఎత్తిన చేతిలో ఒక తళతళలాడే ఒకక త్తిని పట్టుకొని పొడవడానికిసిద్ధంగా ఉన్నాడు. చేయిక్రిందికి దిగుతూన్న సమయాన్ని శ్యామల ఏమనుకున్నదో ఏమో గభాలున పరుగెత్తి నిద్రిస్తున్న సుధవక్షంమీద బోర్లపడ్డది. వేణూ చేతి విసురు ఆపలేదు. నేనుకూడా తటాలున ముందుకురికి వాడిచేయి పట్టుకునేసరికప్పుడే బాకు శ్యామల కంఠంలోనుంచి పూర్తిగా దిగిపోవడం, శ్యామల "అన్నా" అని ఒక్క అపఱచి ఊరుకోవడం, సుధ కంగారుతో మీదనున్న శ్యామలను త్రోసి కూర్చోటం, శ్యామల క్రిందపడడం, అన్నీ ఒకసారి జరిగినయ్. ఇదంతా ఒకత్రుటిలో జరిగిపోయినసంగతి.

శ్యామలవేసిన కేకకు ఉలిక్కిపడి అందఱూ నిద్రలనుండి లేచారు. అమ్మను నాన్నగారిని గురించి నేను చెప్పను. వారిమాట ఎత్తుకుంటేనే నాగుండెల్లు

పెక్కటిల్లాయి. లాల్ గారుకూడా భయంతో గబగబా వచ్చి ఉరికొయ్యదగ్గర్కి చూచి "పోలీస్, పోలీస్" అని కేకలువేశారు. తక్షణం పోలీసుస్టేషనుకు టెలి వార్త ఇచ్చారు కొందఱుజవానులను పంపమని. ఏమవుతూఉన్న ఆజనబృందంలోకల్లా ఆనందంతో పకపక నవ్వుతూన్నవాడు మా వేణూ ఒక్కడే. ఎదురుగా కిటికీ ఒకటిఉంది. దానికి విజయముపొందినవాడి లాగ వేణు ఆనుకుని ఓరగా నుంచున్నాడు. మా కంపకు వెఱ్ఱి అనిపించే ఏదో నవ్వుమాత్రం నవ్వుతూన్నాడు. వేణుకు చచ్చిపోయినది శ్యామల అని తెలిసి ఉండదనుకున్నాను. నేను వాడికి యీసంగతి చెప్పుదామని వేణూ దగ్గఱకు వెళ్తూఉంటే లాల్ గారు నన్ను పట్టుకొని "వాడికి మతిభ్రమించింది. దగ్గఱకు వెళ్లకు. నీచెల్లెలుకు పట్టిన గతే నీకూ పట్టుతుంది" అన్నారు. ఆమాట వేణూ విన్నాడు. ఒక్కసారి శవంవంక చూచాడు. ప్రక్కనే మోకరించాడు. శ్యామల రెండు చేతులను తనముఖముమీద కప్పుకుని ఒక్కసారి ఆకాశం వైపు నిమీలితనయనుడై తలయెత్తి నిశ్శబ్దసమాధిలో కొంతసేపున్నాడు. తర్వాత లేచి నవ్వుతూ నాదగ్గఱకు వచ్చాడు. దగ్గఱకు వస్తూఉంటే వాణ్ణిచూచి అందఱూ వెనక్కు తప్పుకున్నారు. వేణూ నా చేయిపట్టుకుని బలవంతంగా కిటికీదగ్గఱకు లాక్కుపోయినాడు.

"బావా, నీ వేమీ భయపడవద్దు. నామనస్థితిని సరిగాతెలిసినవాడివి నీవేకనుక నీతో నేమాట్లాడుతున్నాను. నన్నుగుఱించి ఎవ్వరూ భయపడనక్కర్లేదు. నాకు ఏది మిక్కిలి ప్రీతిపాత్రమైనదో దానినే నేను నా స్థానానికి చేర్చుకున్నాను. మీరు తటస్థవ్యక్తులు. మీరు నావలన భయపడనక్కరలేదు. చెఱుపుట నా కానందము. అందువలన నాకు మిక్కిలిప్రియమగువస్తువును నేను చెఱుపుకొన్నాను. మీరు దీనికి ఇతరముగా భావింపవలదు" అన్నాడు.

"అది! శ్యామల!" అన్నాను గద్గదకంఠంతో.

"ఔను! మొదట సుధను ప్రియమగు వస్తువను కొన్నాను. కాని భగవంతుడు నీకు నిజమగు ప్రియపదార్థము సుధకాదు, నీవు వెనుక విడిచివచ్చిన శ్యామలయే అని దానిని ఈలాగున ఈడ్చుకొనివచ్చినాడు. ఆనందానికి ఛాయ అయిన సుధకంటె నిజమగు నాఆనందనిధిని, నాశ్యామలనే నాస్థానానికి తీసుకొన్నానని తెలుసుకొనుటకు మిక్కిలిసంతోషిస్తున్నాను."

ఇంతలో పోలీసుస్టేషనునుంచి పోలీసులు వచ్చారు. లాల్ గారు "వీడున్మత్తుడు— ఖూనీచేశాడు — అదుగోశవము— వీణ్ణి పట్టుకుని వెళ్లండి" అన్నాడు. నవ్వుతూఉన్న వేణూను ఇన్స్పెక్టరుగారు పట్టుకోబోయినారు.

"ఖడ్డో" అన్నాడు వేణు. విభ్రాంతిగా అందఱూ ఉలిక్కిపడ్డారు.

"ఆ నీసధవమాలచేతులు నాపైని వేయక. వస్తా" నన్నాడు వేణు.

పదేనని వెనుకముందుప్రక్కలను భటులు పరివేష్టిస్తూ ఉండగా స్టేషనుకు బయల్దేరినాడు మా కళామూర్తి. కాదు—కాలమూర్తి.

......కోర్టంతా చూడడానికీ, వినడానికీ వచ్చిన జనంతోనూ, ప్లీడర్లతోనూ క్రిక్కిరిసిఉంది. ఇది ఇరుపక్షాలూ లేని వింతదావా. మేము వేణూపైన అభియోగం తెచ్చుట యెంతయూ హాస్యాస్పదము. ముద్దాయి చేసిననేరం తానే ఒప్పుకొనుచుండుటచేత కోర్టువారిపని తేలికైపోయినది. ముద్దాయిని చచ్చునంతవరకు ఉరితీయవలసినదిగా తీర్పునిచ్చిరి. చివరకు వేణూను ఏమైనా చెప్పుకోదలుచుకొన్నవి ఉంటే చెప్పుకోమని కోర్టువారు సెలవిచ్చారు. వేణూ బోనెక్కి ఇలా చెప్పుకొన్నాడు:

"మహాజనులారా, న్యాయాధిపా, నేటితీర్పు నాకెంతయు ఆనందదాయకముగా నున్నది. కాని మానవజాతికి పుట్టడం, చావడం, తినేనూ, కొడితేనూ నేరం అనుకోడం, చంపినందుకు శిక్ష మళ్లీ నేరస్థుడి

చావుతో తీరిపోవడం అనే యీ ఆశాసక్తి యెంతగా పట్టుకొనిఉందో రెండుమూడుమాటల్లో కొంచెం వ్యక్త పరుద్దామని నేను వచ్చాను; పుట్టడానికి ఎవ్వడూ నేరంచేసి పుట్టడు; ఒకవేళ పిల్ల పుట్టినందువల్ల అదివరకు బాగున్న తల్లి చ సే అదిమాత్రం నేరంగా ఎందుకు పరిగణించకూడదో తెలీకుండా ఉంది. పిల్లను మాత్రం అప్పుడు నేరంచేసినదానిలాగా, హూనీచేసినదానిలాగా ఎంచి చచ్చినదాకా దాన్ని ఎందుకు ఉరి దీయరు? బదులుకు బదులు అనే ట

మొదట యీ మంటిముద్దమీద అవతరించి, పచ్చిమాంసపు ముక్కలు తింటూ, అగ్ని అంటే ఏమో ఎఱుగక ఆకులు మొలకు అడ్డంగా పెట్టుకొని, నడాడుతూ, ఉండే ముడిమనుష్యునిలో పూర్ణంగా ఉండేది. దోవను పోతూఉంటే కాలికి ఎదురుదెబ్బ తగిలిన రాతిని, ముక్కలుగా వ్రక్కలించి పిండిగా గుండకొట్టి, దాన్ని నీళ్లలో కలిపిందాకా వాడికి కసితీరేది కాదు. అల్లా చేయకపోతే తాను ఒక భగవచ్ఛాసనానికి ఎదురునడుస్తున్నాననుకునేవాడు; అలా చేయకపోవడం ఒక పాపకార్యంగాకూడా భావించేవాడు. మనుష్యుడు ఇంత నాగరికతను సంపాదించాననుకొంటున్నాడు. ఇంతవిజ్ఞానాన్ని ఆర్జించాననుకొంటున్నాడు. ఇంత ప్రకృతిని వశపఱచుకొన్నాననుకొంటున్నాడు. కాని నాగరికత, విజ్ఞానమూ అధికమైనకొద్దీ మళ్లీ మానవుడు ఆ మొదటి ముడిమనుష్యుడి ప్రకృతికి దగ్గఱగా జరుగుతున్నాడు. ఈవిశాలకాలవలయంలో మొదట తానెక్కడ బయల్దేరేడో అక్కడికే చేరుకుంటున్నాడు. ఇంకాపైగా మానవత్వం పరిపూర్ణత చెందడానికి ఈపద్ధతులే సోపానాలూ, క్రమాంతరాలూ అంటాను. రూపాయి తీసుకుంటే ఉన్నఋణం రూపాయి ఇస్తే తీరినట్లు దెబ్బకొట్టిన బాకీ దెబ్బకొడితే తీరుతుందనేగా మీవాదన? అలాగే ఒకజీవాన్ని తీసినందుకు ఇంకొకజీవాన్ని ఇవ్వడమేగా మీమతం? శ్యామలను చంపినాననేకదా నాగొంతుక ఉరిపోస్తామంటున్నారు. ఇందులో ఆవేశంలో చేసిన హత్యలు నేరాలు కావనికూడా కాదూ మీ "లా"? ఆవేశంతో ఉన్నవాడిచేతిలో కత్తి తెగక మనఃపూర్వకంగా చెయ్యాలని చేసేవాడి చేతిలో కత్తిమాత్రమే తెగుతుందా? బుద్ధిజాడ్యంచేత తీసుకుంటూ, ఇలాంటి 'లా' నిర్మించినవాళ్లని మంగలాడు బుఱ్ఱలు గొఱిగినట్లే వాళ్ల పీకలు గూడ గొఱిగేసేవాడు లేకగానీ! లేకపోతే ఏమిటంటాను?

రాజ్యవ్యవహర్తలకు కోపంవచ్చి, ఆదేశం మంత్రీ యీదేశం మంత్రీ, వీడికొడుకును వాడు కొట్టేడనో, వాడికొడుకును వీడు గిల్లాడనో ఒక గడ్డిపోచంత కారణం అడ్డంపెట్టుకొని యుద్ధాలపేరుపెట్టి, అమాయకులూ, నిరపరాధులూ ఐన వాళ్లను ఒకళ్లనొకళ్లమీద బడి నఱుకుకోండని ఆజ్ఞాపించి తాము చూస్తూ ఊరుకుంటారు. ఇన్నిప్రాణాలు పోయాయని ఒక్కళ్లూ చింతించరు. మంత్రులకు కలిగినకోపం ఎన్నిప్రాణాలు తీసినా ఏనేరమూ లేదు. యుద్ధంపేరుపెట్టితే చంపడం నిరాటంకంగా చేయదగినపని; హూనీ పేరుపెట్టితే నేరమై ఊరుకుంటుంది. మానవజీవితమంటే ఇంత ప్రాముఖ్యం ఇస్తారు మీరు! రోజూరోజా మీపొట్టలు నింపడానికి మీరు క్రూరంగా కోస్తూఉన్న నోరులేని జీవాలకు బదులు మిమ్ముల్ని ఎందుకు అడ్డంగా పగలగొయ్యకూడదంటాను? మనుష్యుడు మాట్లాడనేర్చాడనీ, నారపేచులూ, నక్కగోళ్లూ, గ్రుడ్డిగవ్వలూ, గుల్లసామ్ములూ, లోహపు ముక్కలూ తగిలించుకొని కులకగలడనీ మీరు మీవాకిట్లో పడిఉన్న కుక్కప్రాణానికివ్వని విలువ వాడిజీవితానికిస్తారా? మానవజీవితమంటే అతిపవిత్రంగాను, అతిపునీతంగాను, భద్రంగాను చూడవలసినదనే వాక్యం చావంటే భయపడే పిఱికిపందలూ, తోలుతిత్తులూ సృష్టించారు. ఒకతల కింకొకతల అనే మీసిద్ధాంతం చేతగాని దౌర్భాగ్యులు ఏర్పఱచిన తాతమ్మసూత్రము. ఇంతకూ నేను చావంటే భయపడి, నన్నిలాగ చేసినందుకు చేతకాని ఉడుకుమోత్తనంచేత ఇలాగన్నానని మీరెంతమాత్రం అనుకోవద్దు. సుఖంలో ఉండే తీపికన్న దుఃఖంలో ఉండే తీపే ఎక్కువైనదనీ, దుఃఖంలో ఉండే ఆనందానికి మృత్యువే పరమావధిఅనీ నేను గట్టిగా నాఅనుభవంచేత తెలుసు

కొన్నాను. నాకు ప్రియమైనవస్తువులన్నీ ఆపరమావధికి చేర్చుకున్నాను. ఈన్యాయకర్తలు ఈ నైయాయికులూ, ఇన్నాళ్లాలోచించి ఇచ్చిన తీర్మానంతో నాకేమీ పని లేదు. నేను భూమిమీద పుట్టినకార్యం తీరిపోయినది. ఇక నాస్వస్థానానికి నేను చేరుకుంటాను. నేను మృత్యుస్వరూపాన్ని బాగా అవగత చేసుకున్నాను. స్వచ్ఛందమరణం పొందగలశక్తి నాకు భగవంతుడు ప్రసాదించాడు. అదిగో శ్యామల! కన్నులముందు తాండవిస్తూ రారమ్మని చేయూపుతున్నది. ఇక సెలవు" అని అలాచూస్తూనే అందుకు వెలుగుకొలిపుకలిగే ట్టుగా ఒక్కసారిగా నీరై కుప్పవడిపోయినాడు. నిర్జీవమైన అతని శరీరం బోనులో ఒకప్రక్క ఒరిగి పడిపోయింది.

* * *

లోకం వేణూనులాగ నన్నుకూడ వెఱ్ఱివాడను కుంటే అనుకున్నది గాక; వాడు వెళ్లేటప్పుడుమాత్రం వాడిస్వరూపాన్నీ వాడిభావాలనూ నాహృదయంలో స్థిరంగా నాటిపోయాడు. వాడీ లోకంలో ఉండదగిన మనిషికాడు. మొదటినుంచీ ఒకటిగా కలిసిఉండడం చేత నిజంగా వాడుపోయాడంటే మాశ్యామలపోయిన దానికన్నా ఎక్కువశూన్యంగా కనిపించింది నాజీవితం. నాభావాలన్నీ అంధకారపూరితాలై పోయినవి. ఆ వ్యక్తిలో కలిగిన ఆవిచిత్రపరివర్తనానికి తగినకారణం నేను ఇప్పటికీ కనుక్కోలేకపోయినాను. అందుకనే మనుష్యప్రకృతినిసుటించి సిద్ధాంతీకరించి సూత్రీకరించుట ఎవడితరమని ప్రప్రథమాన్నే మనవిచేసుకుని ఉన్నాను. సుధాపరిచయానికి పూర్వమే అతనిలో యీమార్పు కలగడంచేత సుధకు దీనితో సంబంధం కల్పించడానికి నాకేమీ హేతువు కనిపించడంలేదు. చీరకట్టుకున్నవాళ్లు స్త్రీలనీ, పంచకట్టుకున్నవాళ్లు పురుషులనీకూడ వాడప్పటికెఱుగడని నేను చెప్పను. నేనూహించుకొన్నంతవట్టు అప్పటికి వాడు ప్రకృతిలో సుందరమైన భాగాన్ని ప్రథమపురుషలోనుండియే తటస్థముగా అనుభవించాడుగాని ఉత్తమ మధ్యమాలకు గదిలేదు. కాని వాడి కళాదృష్టీ, ప్రకృతివిలాసాలూ ఉత్తమ మధ్యమ పురుషల పక్షాలై సంఘటించిన నప్పుడు మాత్రం మహోత్కృష్టలందటికిమల్లేనే వాడున్నూ లొంగక తప్పిందికాదు. తటస్థత వహించినంతవరకూ ప్రకృతివిలాసాలాతనికి పుష్టికరములైన జీవనౌషధాలు లాగానే ఉన్నాయి. ప్రత్యక్షపరోక్షాలకు దిగేసరికవ్వే వాడి అంతరాయానికి కారణాలైనాయి. వాడి అంత్యదశలో వాడి మనఃప్రవృత్తి తెలుసుకోడానికి అప్పుడు వాడు చిత్రించిన బొమ్మలూ, వ్రాసినపద్యాలూ కొన్నిమాత్రం వాడి జ్ఞాపకచిహ్నాలుగా మాకు విడిచి పెట్టి పోయాడు. అందులో ఒకదాన్ని పాఠకులకు వేదించుకుంటాను.

భయదమూర్తి

నవ్వనే నేడ్పింతు
నవ్వించియేడ్పింతు
యేడ్చి నేనవ్వింతు
నేడ్పించినవ్వింతు
కఠినత్వమేసాజము
ఘోరాతి
కర్కశత్వమెనైజము. ౧.

గండుశిలలే నాకు
మెండుగాముదిమిచ్చు
పెనురొదారులె నాకు
ప్రీతిపైపైగొల్పు
ముండ్లనినపొంగిపోదున్
బాధచే
మూల్గులే వినుచుందును. ౨.

అనునయమ్మన్నతో
డగ నాదుహృదయమ్ము
ఉడుకెత్తి ఉప్పొంగి
తెరలెత్తి పొరలెత్తి
పనిధియై తెరలిపర్వున్
కన్నీరు
వఱదలై విరిసిపాఱున్. 3.

భయములోగలతిపి
నయములోగనపడదు
క్రౌర్యమ్ములో మనుపు
కరుణలో నగుపడదు
    లంఘించు సింహిమొగమే
        తీరాను
    దివ్యసౌఖ్యముల కంటెన్. ౪.

నిప్పువాల్కలుజాపి
నీలపుంబొగగుప్పి
నెత్తియార్పులనార్చు
వింతజంతువులైన
    ప్రళయాబ్దగళఘోషముల్
        నాకిచ్చు
    ప్రబలహాసంతోషముల్. ౫.

బ్రతుకు మెలికలలోన
పరితాపములలోన

సారస్యముల ద్రావి
జాలినీరుల గ్రోలి
గాలింది కడగంటిని
    జగమందు
కసిగంటె పాడగంటిని ౬.

ఈపరివర్తనం కలిగినప్పుడు వేణు తనజీవితంలో సుధాపరిచయాన్ని గురించి "మదనురాగోదయ" మని ఒకఆఖ్యాయికను వ్రాశాడు. వాడి ఆత్మశాంతికై నేను చేయగలిగిన భవ్యకర్మముగా త్వరలోనే అది కూడా పాఠకలోకానికి సమర్పించుకుంటాను. ఇప్పటికి సెలవు.

సుధనుగురించిమాత్రం నన్నడగకండి. ఆ-మ యం తలుచుకుంటే నా గుండెలు కత్తిరించుకుని పోతాయి. ఆగంభీరకాళరాత్ర్యనంతరం మళ్లీ సుధను చూచినవాళ్లుగాని. ఆమెనుగురించి విన్నవాళ్లు గాని ఎవ్వరూ లేరనిమాత్రం చెప్పడానికి నాకనుజ్ఞ ఇవ్వండి.

సెలవు!

---

# భారతీయ చిత్రకళ

## గ్రంథకర్త: తలిశెట్టి రామారావుగారు, బి, ఏ., బి. యల్.,

ప్రాచీనకాలమునుండి భారతదేశమున చిత్రకళ పొందుచువచ్చిన మార్పులు, అభివృద్ధి మొదలయిన విషయములు, హైందవ చిత్రలేఖనోదయము, బౌద్ధకాలమునాటి చిత్రకళ, అజంతవిధానము, బాఘ్‌విహారములందలి చిత్రకళ, మొగలు చిత్రకళావిధానము, రాజపుత్ర చిత్రములవైఖరి, నేటిచిత్రములు మొదలయినవానిని గూర్చిన చరిత్రాదులు వివరముగా నీ గ్రంథమున చర్చింపబడినవి. ఆయాకాలపు చిత్రవిధానమును దెలుపునట్టి త్రివర్ణ-ఏక వర్ణచిత్రములు నలువది ఇందు గలవు. చిత్రకారులు, చిత్రకళాజిజ్ఞాసువులు, చిత్ర కళాభిమానులు నగు సాంధ్రు లెల్లరు తప్పక చదువవలసిన గ్రంథము. వెల. రు. ౧-౧-౦.

మేనేజరు, ఆంధ్రగ్రంథమాల, నెం. ౭, తంబుశెట్టివీధి, మదరాసు.

# కటికిలోకం

**దువ్వూరి సూర్యనారాయణమూర్తి**

[ఏకాంకరూపకం]

[వర్షం కురుస్తోంది. ధనవంతులంతా పాతికేసి రూపాయిల పట్టుశాలువాలు కప్పుకొని వెచ్చగావుంటే, అన్నంలేనిబీదలు కన్నితాళ్ళలాగ మెలేసుకు పోతూ, ఆకలిదిచ్చుదగ్గిర చలికాసుకుంటున్నారు. రాదారీపడవ వింజరం దాటివొచ్చింది. చలికి కాళ్ళూ చేతులూ కర్రలై పోతున్నా ఎల్లాగో కష్టంమీద లాగుతున్నారు సరంగులు. నీటికి ఎదురవటంచేత పడవ బాలింతరాలల్లా నడుస్తోంది. అక్కడ ఒకడు నడుస్తూ వస్తున్నాడు. మనిషి నల్లగావుంటాడు. మాసిపోయిన బిరుసులగోచీ, పెద్ద చింపిరితల. చేతులోవున్న చేపాటికర్ర పట్టుకుని ఎనిమిదేళ్ళపిల్లాడు అతణ్ణి లాక్కుపోతున్నాడు. అడుగులు తడబడుతూ అంధుడు నడుస్తూంటాడు.]

అంధుడు

బాబయ్యా! ఒక్కడబ్బు బాబా! కడుపు మండుకుపోతోంది బాబా! కూటికి మొగంవాచేను బాబా! ధర్మం బాబా ధర్మం......

[పడవ ఆగింది. వానజడి అప్పుడప్పుడు ఉన్నా ననిపిస్తోంది. ముసలాడి వొళ్ళంతా తడిసిపోయింది. ఒంటిమీద గరిపొడిచిన రోమకూపాల్ని తప్పించుకుంటూ వాననీరు కిందికి దారితీస్తోంది. కాళ్ళూ చేతులూ గడగడ వణికిపోతున్నాయి. అల్లాగే కుర్రాడు ముందుపడవెక్కి ముసలాణ్ణి ఎక్కించేడు. పరిపాటి అభ్యాసంచేత అంధుడు పడవపడిచెక్కమీద నడుస్తూ ఏదో పాడుతూ మొదటి గదిదగ్గిరికి వెళ్ళేడు.]

అంధుడు

కళ్ళురెండూ లేవు నారాయణా
తిన కూడులేదండీ నారాయణా.
కట్ట గుడ్డాలేదు నారాయణా
కట్టమెరిగిన ప్రభులు నారాయణా.
బాబయ్యా! ధర్మంతండ్రీ! ధర్మం.

గదిలో వొకడు

ఏయ్. నాన్సెన్సు. ఏమిటాపడవగోలా నువ్వూను? ఫో. ఇంకోహార్ని అడుక్కో. ఇక్కడ గోల చెయ్యకు.

అంధుడు

బాబయ్యా! వానకి తడిసి ముద్దయిపోయేను తండ్రీ!! ఒంటికి గుడ్డలేదు బాబా! కడుపులో ఆకలి బాబా! ఈపస్తోడి పొట్టకోసం ఓపిమ్మడి దానం చెయ్యరా!!!

అతడు

నీకొక్కమాట చెప్పటం. వెధవ్వేషం పొమ్మంటే వెధవగోల చేస్తావేం. ఆకలైతే చావు. ఏజన్మానోమ్మో చేసుకున్నావు. ఇక్కడ అట్టే చదరకు. డోంటాక్. గోఎవే.

[పెదవులు తెకతెక కొట్టుకుంటూన్న బోసినోరుతో అంధుడు మాట్లాడలేక పక్కగదికి తడుముకుంటూ వెడతాడు. కుర్రాడు ముందే నడుస్తూఉంటాడు]

పడవలో

పెసరట్లూ!!! ఇడ్డెన్లూ!!! ఉప్మా!!! కాఫీ!!!

మొదటిగదిలోని ఉద్యోగి

ఓయిషావుకారూ!! వానజడి వెలిసినట్టుంది. ఈ గదికి రావోయ్. ఒంటిగంట దాటుతోంది. ఎప్పుడో పదిగంటలకి ఆదరాబాదరా తిన్నతిండి.

షావుకారు

వొస్తున్నా బాబూ! (తొందరగావచ్చి సమృద్ధిగా తినుబండంసరుకులిచ్చి డబ్బు వసూలుచేసుకుపోతాడు)

అంధుడు

ఏమిజన్మము ఏమిజీవనమూ ఈమాయకాయము

ఏమిజన్మము ఏమికీర్తన మేమిశాశ్వత మేమిస త్తెము
ఏమి నా ప్రాలుద్ధకర్మము స్వామినన్నిటు చేసి
పోయెను. ఏ.

బాబయ్యా! దిక్కు లేనిపచ్చిని తండ్రీ! కష్ట
సుందికి దోసెడు గుడ్డసాతేనా లేదుబాబా! ఏబాబుకీ
కనికారం లేదా నాయనా! ఓకబ్బు దయచెయ్యండి
బాబా!!

[మాటాలేదు మంతీలేదు. ఈదరగాలి ఎకెరెకిరి
పడుతూ ఎంతోభయంగా ఝూంకారిస్తోంది. కేకవిని
పించలేదేమో అని ఆఅంధుడు మెల్లిగా రెండోగది
తలుపు తట్టి దీనంగా ధర్మం అడుగుతాడు. తలుపు
తెరిచేరు. ఈ పరిద్రనారాయణ స్వరూపాన్ని చూసి
వెర్రిగా నవ్వులుమొదలెట్టేరు అందులో స్టూడెంట్సు
అంతాను]

ఒకడు

ఏంతాతా! ఎవరునువ్వు?

అంధుడు

నేను తిండిలేనివాణ్ణిబాబా! ధర్మం చెయ్యండి
తండ్రుల్లారా!

అతడు

అదికాదోయ్. కులంఏమిటి?

అంధుడు

అయ్యబాబా! నాకులగోత్రాలు కూలిపోయేయి
బాబా! ఈనాటికిల్లా అడుక్కుతినమన్నాడు నాయనా
దైవంనన్ను.

అతడు

ఉహూం. దానికేంగాని తాతా, గోచీసద్దుకో
ముందు.

(సిగ్గుపడి బట్టసడ్డ సద్దుకుని)

అంధుడు

నాయినా! చేసం, చాలాస్తోందిబాబా! ఓ
దర్మం చెయ్యండిబాబా! చిప్పెడు గంజి కాచుకుతాగుతా
తండ్రీ! మీబిడ్డలు సల్లగా వుండాలిబాబా!

అతడు

తాతా! ఈకుర్రా డేమౌతాడుమనికి?

అంధుడు

మనవడుబాబా! కొడుక్కొడుకు నాయనా!

అతడు

ఐతే నీకు కొడుకు లున్నారూ. ఉండిగూడా నీ
కీ అవస్థేమిటి తాతా! మహారాజులా యింట్లోకూచోక?

అంధుడు

హయ్యతండ్రి! ఓడా యిద్దరా బాబా! నలుగు
రున్నారు. ఉన్నా నా కీగతి తప్పిందికాదు బాబూ!
ఓకాని కనికరించరా?

ఇంకొకడు

కానీ లేదు నీపాడూ లేదు. పో అవతలికి. నీకిక
వాసనా నువ్వూను. చీఛీ ముక్కు బద్దలయిపోతోంది.
ముందు పోమ్మనండ్రా!

మరోడు

ఉండరా! నీదగ్గిర ఎన్నిడబ్బు లున్నాయి
తాతా! వాళ్ళతో నీకేంగుడూ? ఇల్లాపడెయ్యి. పకో
డీలు కొనుక్కుందాం.

ఇంకొకడు

తాతా! దోసి డిల్లా చాపవోయ్. పిల్ల ఎంతా
గ డేకారీసజ్జు.

[అంధుడు చేతులుచాపేడు. అందరూ కడు
పుబ్బేలా నవ్వులు. దోసిట్లో ఏదో పడేసరికి అభిక్షువు
ఆకలి సగం అణిగిపోయింది. కాని దాన్ని తడుముకొని
చూసుకునేసరికి అది కాల్చిన బీడీపీక! అవమానంచేత
ఆగర్భదరిద్రుడు నిరాశాభావంతో మాట్లాడకుండా
పడిచెక్కమీంచి పాకులాడుకుతూ పడవవాల్లోకి వెళ్లి
పోయేడు. ]

అంధుడు

ఎంతచిత్రము ఎంతమోసంబూ, ఈ భ్రమ్మసృష్టి
కలిగివున్నది శాశ్వతంబని గర్వపర్వతరాసులెక్కి
కానసై తిని క్రిందిమీదులను ఓదేవదేవా. ఎం.

[అని పాడుతూఉంటాడు]

ఓఅమ్మ

ఆహాహా! ఏమ్ముక్కలమ్మా! అమృత గుటకలు.

ఇంకో అమ్మ

అంతేకాదమ్మా! అంతే కాదు. ఉన్నన్నాళ్లు ఈశరీరానికి సబ్బులురాసీ, వాసననూనెలురాసీ, తలంటే నానావేషాలు వేస్తాం. కొసకి పుట్టేను పుల్లలతో గాని దీనికి విముక్తిలేదు. చచ్చేక ఓగడియ వుంచితే వాసన తప్ప మరేముంటిమ్మా!

అంఘుడు

అమ్మా! పొద్దున్న కాణ్ణుంచి తిరుగుతున్నా తల్లో! ఒక్కపిర్మం దొరకలేదమ్మా! నీ పల్లని చేత్తో ఓపట్టి య్యమ్మా కడుపు చల్లపరుచుకుంటాను కన్నతల్లో!!
[కర్రా డు ఒక్కొక్కరిదగ్గిరికీ తీసికెడుతూ వుంటాడు]

ఇంకోతల్లి

ఒరేవ్, ఒరేవ్. నీయమ్మ కడుపు మాడిరిగదరా! దిక్కుమాలిన గుడ్డిచచ్చినాడా! నీకేం దుగంతందగ్గిరికొ పడిందిరా! తగుల్తావురా! (దవడలు నొక్కుకుని) మానే వుపన్నా! పీడి పొయ్యికాలం. గుడ్డిచచ్చినాడా! కొంచెం అసింటా తీసుగెళ్లరా!

అంఘుడు

అమ్మా! కోపం పడకతల్లీ! దూరంగానే పోతా నాయమ్మా!

ఆమె

నీదగ్గొచ్చి పడిపోతో ఇంకా ఏమిటంట పేల్తున్నావు. దూరంగా వుండి యేదు నీయేదు పంతాను. తుంపర్లు మీదపడతాయి. స్నానంచేసి తనుల్దాను కూడాను. నీజీవానికి పడిపోతున్నా ఈ చలిలో మళ్లీ మునగలేను.

అంఘుడు

అమ్మా! పొద్దుణ్ణుంచి గెంజిలేదుతల్లీ! బిడ్డపాపల్ని కడుపున్న తల్లులు నాయమ్మా! ఈయాల ఓతల్లికీ కనికారం లేదా అమ్మా!!

ఒకఆమె

ఒరేఅబ్బీ! ఇల్లారా! ఇందమ్మా. చేతులుచాపు. దోసెడెట్టు.

[చేతుల్లో రొట్టిముక్క పెడుతుంది]

పిల్లాడు

తాతా! తాతా! నాకట్టవూ ఆరొట్టిముక్క?
[అంఘుడు సగంముక్క మనవడికి కిస్తాడు]

పిల్లాడు

తాతా! అంతా నాకే పెట్టెయ్. ఈపూంతా నాకొద్దూ ఊఁ ఊఁ ఊఁ

[చేతులూ కాళ్లూ దులుపుతూ మారిముడిచి ఏడుస్తాడు. అంఘుడు రొట్టిముక్క అంతా పెట్టి ఊరుకో పెడతాడు. వాడు ఊరుకుని తింటూ పడవరేవు రొండో వేపుగదిదగ్గిరకి తీసికెడతాడు అంఘుణ్ణి]

అంఘుడు

కూడుగుడ్డా లేక కుమిలిపోతున్నాను
ఒకధర్మంచెయ్యి నాతల్లో!
ఒక్కధర్మంచెయ్యి నాతండ్రో!
మాడకళ్లూ లేవు ఉండముల్లూ లేవు
నాకడుపుమంటలే నాయమ్మో!
నాబాధచూడండి నాతల్లో!!

బాబా అర్థివోణ్ణి. కడుపు మాడిపోతోంది కన్నతండ్రీ! దాతలు ఈముసిలోడి ఆకలికి ఓకవళం దైచెయ్యండితండ్రీ!!

[ఈపాటలూ, పీడిబీదఅరుపులూవిని ఆగదిలో చింటిపిల్లాడు ఏడుస్తాడు కెవ్వుమని. వెంటనే వాళ్లు పొమ్మంటారు]

అంఘుడు

బయంలేదుబాబా! తీసుకుపోను నాయినా! నాకే కూడులేదు దొరా! మిమ్మల్ని తీసిగల్లి నేనేం చేసుగోనుబిడ్డా! (కంట తడిపెట్టుకుంటాడు)

[ఆఏడిచీ బాలుడు బెదురుతూ బెదురుతూ వాడికేసి చూసి మళ్లీ తల్లిని కౌగలించుకుని బేరు మంటాడు. వారు ముష్టివాణ్ణి పొమ్మని గట్టిగా కేక వేస్తారు. ఉసూరుమంటూ పోతాడు అంధుడు]

పిల్లాడు

తాతా! అల్లగ్గాయి ఏడుస్తాడేం తాతా! మన్ని చూసా. మన్ని గూస్తే ఎందుకు ఏడుస్తాడు తాతా!

అంధుడు

ఏంలేదు పదబాబా. కొసగదికి తీసికెల్లునాయినా!

దర్మతంత్రములు దాగబోరన్నా. ఏనాటికైనా
దర్మమే తనవెంటవచ్చన్నా.
అన్నతమ్ములూ ఆలుపిల్లలు కొంపగోడలు మళ్లుమా
న్యము
లన్నిచచ్చిపోయినంతా సున్నసున్నా తెలియరన్నా.

[పాడుతూ ఉంటాడు నిలబడి ఆగదిదగ్గర]

[అది సరంగులు అన్నాలుపెట్టుకునేగది. గది ముందర ఓమట్టిపొయ్యి వుంది. దాన్లో ఓకుక్క నిద్దరోతోంది. జనం ఎక్కువగా వుండడంచేత ఆగదికూడా జనాని కిచ్చేసేరు. ఈభిక్షువు పాటలకీ, అరుపులకీ ఆకుక్క లేచి అరవడం ప్రారంభించింది. దానికి తగ్గట్టు ఆగదిలోంచి ఎవరోగాని 'ఉస్కో ఉస్కో'మన్నారు. అనేసరికి 'భౌంయ్ భౌంయ్'మని గుండెలు బద్దలయ్యేలా అరుస్తూ ముందరున్న కుర్రాడికాలు పట్టుగో పోయింది. గదిలోవాళ్లు ఇదంతా చెక్కలసందుల్లోంచి చూస్తూనేవున్నారు. కుర్రాడు బెదిరి బారున ఏడుస్తూ గభీమని వెనక్కి నడవబోయి కాళిలేక కాలవలో పడి పోయేడు.]

అంధుడు

బాబోయ్ బాబోయ్! నాబిడ్డ కాలవలోపడి పోయేడు బాబులాగోయ్. కొంత రక్షించి తీసిపెట్టండి బాబులోయ్. నాకుకళ్లులేవు తండ్రోయ్. అమ్మోయ్!!!

[అని కాలుకాలిన పిల్లిలా నుంచున్నచోటే అటు గతపడుతూ గట్టిగా అరిచేస్తున్నాడు ఏడుస్తూను. ఆ యీదర గాలికి, చినుకులకి భయపడో ఏంచేతో ఒకరూ ఈవలికిరాలేదు. దగ్గరగావున్న గదిలోవారు తలుపు తెరవలేదు. ఆ తూసంపడి పడివుండడంచేత సరంగులు కూడా ఏమూలో పడి నిద్దరోతున్నారు. అంధుడికి కడుపు ఆగిందికాదు. ప్రేమపాశం ప్రాణాన్ని తృణంగా చేసింది. ఆకలి మరిచేడు. చలిపోయింది. కాలవలో పడిన తనగర్భవాసాన్ని వెతుక్కుందికి తనకి గంపంత లేసి కళ్లున్నా యనుకున్నాడు. ఈతేనా రాదు. ఇహ ఒకక్షణం నిలవలేకపోయేడు. గభీమని కాలవలో వురి కేడు బారచాపుకుని.

అంతా అంధకార బంధురం
పడవ పరిగెత్తిపోయింది.]

మనుష్యజీవనము వ్యతిరేకశక్తులకు ఆటపందిరి. దివ్యశక్తి నెదిరించు పైశాచికశక్తి కొంత కాలము దీనియందు విజృంభించును. తుద కది తుక్కలు కాకమానదు. పదపడి అఖండజ్యోతులట్లు ఆశయములు వెలుంగకమానవు. విభిన్నశక్తుల సంఘర్షణము వసుమతీసాహితియందు ప్రత్యక్షమగును. సదాశయముల విజయడిండిమము అందు శ్రుతిగోచరమగును. గోచరమగుతఱి హృదయ మావేశపూరితమగును. ఈయావేశము నుండి ఎన్నియో భావము లుత్పతిలును.

ప్రాచీప్రతీచీసాహిత్యములను పుంఖానుపుంఖముగ పరిశీలింపుడు. అం దీసంఘర్షణము తప్పక దృగ్గోచరమగును. ఎంతేని యరిష్టమును దెచ్చిపెట్టినదయ్యు, పెక్కు రుధిరస్రవంతులను వెలారించునదే యయ్యు, కడ కది యంతయు కాకమానదు. **Nemesis** నకు పట్టముగట్టని పాశ్చాత్యకవి లేడు. ఉత్కృష్టభావమునకు, ఉన్నతాశయమునకు పట్టాభిషేక మొనరింపని కవి పూర్వపృథ్వియందు లేడు.

సంఘర్షణమున డీకొను ఈశక్తు లించుమించుగ నుజ్జీగా నుండును. యమలోకము మార్కొనదలచుట స్వర్గమునే. అది మంటలమయము. ఇది పూలమయము. కావ్యకర్త ఈవిషయముపై కన్ను వేసియుండును. హృదయమును చఱ్ఱునలేపు శక్తు లీసంఘర్షణమునుండి వెడలును. హృదయమునకు పరితోషమిచ్చు ఫలితమునూ అందుండియే వెడలును.

కావున మహాకావ్యములు, ముఖ్యముగ మహానాటకములు హృదయమును తాకితీఱును. ఇట్లు తాకజాలని నాటకములు నాటకములుకావు; వట్టి బూటకములు. ఈబూటకములం దుత్కృష్టభావము హుళక్కి.

నాటకకర్త మనుష్యప్రకృతిని చక్కగ పరిశీలించు పటిమకావలెను. మనుష్యహృదయమున దలసూపుశక్తులెట్టివో గ్రహింపవలెను. ఇవి గ్రహించిననాడే అతడు పాత్రశిల్పమున సిద్ధహస్తుడగును; పాత్రశిల్పమున ప్రాణప్రతిష్ఠ చేయ జాలును; తననాటకమున కాయువు వోయగలుగును.

మనుష్యప్రకృతికిని, బాహ్యప్రకృతి (**Nature**) కిని పెక్కుపోలిక లున్నవి. రెండింటియందు పంచభూతములకు సంబంధించినశక్తులు వెలయుచుండును. రెండును కళావిశిష్టములు. పువ్వునందు మకరందముండును. పువ్వుబోలుమనస్సున నమృతమయ భావముండును. కళయందు శోభిలు సౌందర్యమాధుర్యములు కలసిమెలసి యుండును. ఈరెండును కళాసందీప్తమైనహృదయమున ననవరతము విరాజిల్లుచుండును. మాలతీవల్లిపై నుమ్మెత్త కాయలు పుట్టవు; జిల్లేడుపూవులు తోపవు. మధురరససంభరితమైన హృదయమున నిష్ఠురభావము లుద్భవింపవు.

మనుష్యమానసము రాయివంటిది కాదు. అందు వికారములు తోచును. ఈవికారములందు విపరీతవిశృంఖల ముండదు. ప్రకృతిపరివర్తనములందు క్రమగతియుండును. తొండ ముదిరి ఊసరవిల్లి కావచ్చును; పెద్దపులి కాగలదా ?

ఈవికారములు నిలుకడలేని ప్రవృత్తులందు బుట్టును. ఇవి పిల్లగాడ్పులవంటివి. ఒక ముహూర్తమున మనుష్యమానసమున సద్భావము దోచును. వేఱొక ముహూర్తమున నందు దుర్భావము తలసూపును. మనుష్యచారిత్రము వెలుగుట కీభావములు కొలబద్దలుకావు. క్రమనిష్ఠవలన ననుడు, చిరమననమువలన ననుడు, పూర్వభవక్రియాఫలమువలన ననుడు మనసున నిలుచుభావమే దాని ప్రత్యేకగుణమును నిర్దిష్టమొనరించును. ఈ భావ

* కర్త: విశ్వనాథ సత్యనారాయణగారు, యం. ఏ., రసతరంగిణీ గ్రంథమాల, బందరు. ౪-వ గ్రంథము పేజీలు ౧౪౪.

ము పొటుదలగలది. పురముపై వికారములు తోప వచ్చును. వివిధరాగములు తల్రొక్క త్తవచ్చును. కాని ప్రవాహము ప్రవాహమే. ఇట్లని యెఱుగక మనుష్య చారిత్రమును కదుంగడు విపరీతములైన విడ్డూరముల మూట చేసివేసి, యిది ప్రకృతిధర్మమని యెంచు నాటక కర్త సత్యసందీప్తములైన పాత్రలనుగాక పిశాచము లనో మతివిరింత జీవములనో, అబద్ధపు జీవములనో సృష్టించును.

మనుష్యప్రకృతియందును, బాహ్యప్రకృతియం దును వివిధశక్తులు విజృంభించునంటినిగదా! ఇవి యెట్టి పైనను, వీనినడుమ నంతఃస్సలిలవలె నాధ్యాత్మికభావము ప్రవించుచునే యుండును. * గులాబివృంతమందలి జీవ గసముకతన స్వర్గసామ్రాజ్యమునకేనయైన పూవు దానిపై మొలుచులీల, నీభావపూరముకతన బాహ్యప్రకృతి నుండియు, మనుష్యప్రకృతినుండియు దివ్యసౌందర్యము ప్రస్ఫుటించును. కుసుమసంశోభితవన మెట్టిదో, సుగుణ విలసితమనుష్యచారిత్రమును నట్టిదే. రాగప్రదీప్తగగన మెట్టిదో భాసమానమనుష్యచారిత్రమును నట్టిదే. అపు డపుడు తీవ్రఝంఝానిలము పిశాచనృత్యము సలుప వచ్చును. రక్కసు లట్లురుములు అఱువవచ్చును. వీని యాయు వల్పమైనది. ప్రకృతి తనసహజసౌందర్యమును తా నందితీఱును. ఎన్నియరిష్టములు పైన దుల్లి పడినను మనుష్యప్రకృతి సహజసౌందర్యసందీప్తముకాకపోదు. కళకు చావులేదు; సద్గుణమునకును చావులేదు. రెండును కవలలని ఒకమాఱుకాదు, వేయిమాఱులు తెలుపును.

వేనరాజు చక్కనికళోపాసకుడని చదువరులు గ్రహింతురు. "మిత్రమా! పాతకములన్నియుఁ జేసినది నేను. దానిఫలము నేననుభవించితిని. నా దక్షిణబాహు దళనమున నీవు నిమిత్తమాత్రుండవు. ఇది యొకతపో మూర్తియైన బ్రాహ్మణునిశాపముచే నిదివఱకే తెగినది" (పుట ౧౩౪) అని వేనరాజనినపిదపగాక (పిదప నాతడు చావనేచచ్చినాడు) బుజము తెగుటకుముందు అతడు కొంతయంతరంగసంస్కరణమందినపిదపగాక, జఘన్యమైనజీవన మాతడుకడుపుగడంగినప్పటినుండియు కళోపాసనాతుళలుడని పాఠకులు గ్రహింపకపోరు.

కిణాతంత్రిని మీటుచు వేనరాజు ముఖపత్రముపై ప్రత్యక్షమైనాడు.

వేనుని వాక్కులను పరికింపుడు:

"...ప్రేమించుటకు, నీసౌందర్యవంతమైన మొగమును జూచిచూచి మోహము పొందుటకు, నీమనసులో సౌకుమార్యపులోఁతులు తడవిచూచుకొనుటకు, అలోఁతులలో నవ్యక్తముగా దాగియున్న నూతననూతనములైన గానమాధురులను ప్రతిధ్వనింపఁజేయుటకు" (పుటలు ౫, ౬).

"ప్రాతస్సమయవికసిత నవనీరేజసదృశములై నెన్నెలవలెఁ జల్లనైన నీకన్నులు"

"లీలావిసకాండములఁ బోలిన నీచేతులు."

"వసంతకోకిలగొంతువోలె సన్ననై, మధురమైన నీకంఠము"

"చిన్ననాఁటినుండి మనయాత్మలు ఒకచోట నుంచిన రెండుపువ్వులవాసనవలెఁ గలిసిపోయినవి."

(పుటలు ౯,౧౦)

"మణుల నీమేనఁ బూవులు లేవు. నీచేతిలోఁ దామరపూవు లేదు. ముంగురులలో మొల్లలమొగ్గలు లేవు. చెవిలో దిరిసెనపూవు లేదు. తలలో మందారము లేదు. మెడలో గోరంటపూలు లేవు. ముంజేతుల దండలమల్లెలు లేవు. పూవులచేత నలంకరింపబడని నీసొగసు నేను చూడను." (పుట ౧౩)

"వేసంగిలో రెండి కొండలోయిలలో దమ్ము కొన్న చెట్లనీడలందు పడెలుకట్టిన చిన్నిసెలయేటినీటి వలె చల్లనైననీచేతులు నామెడకుఁ దగిలించుము. ప్రేమలోఁతు లెరదాక సెతెఁగియున్నప్రియురాలి నిశ్చలదృక్కులవలె నూదులలోఁ బోడుచుచున్న నీచూపులు నా చూపులతో మేళవించుము. తెల్లవారువరకు రేకలు విరిసిన యాకాశమల్లివలె, కాపుసొగసుకాని కదలనిచెవి

* "God is not only trancendent but also immanent."

జంపువోలె, నిడివియై తుదవిరిసి సొగసులొలుకు నీనాసాగ్రంబున వెడలు కమ్మనినిశ్వాసములు నామెడమీఁదఁ బూలమాల కదలినట్లు కదలనిమ్ము." (పుట ౨౪)

"గాలి మనయొడలికిఁ దాకుచున్నది. సుళ్లుతిరుగుచున్నది. చెట్లయాకు లల్లలాడించుచున్నది. వెదుళ్లఁ బోసుకొని రొదచేయుచున్నది. సముద్రపుటొడ్డునఁ జిన్ని చిన్ని పొదలడ్డముచేసికొని పొడుగైనసుయికతిప్పలు కోరడిగాఁ బోయుచున్నది. చిన్నిచిన్నిచెరువులలో బుల్లిబుల్లి కెరటములఁ గలిపించుచున్నది. నీముంగురులలో నాడుకొనుచున్నది" (పుట ౩౬)

"ఈ వేసంగివెన్నెల పుష్యరాగములకాంతులు వెదఁజల్లినట్లు, మల్లెపూవులు పారబోసినట్లు, మబ్బులు విరిసిపోఁగా లేతయెండలు తళతళలాడినట్లు మాపృథు నవ్వినట్లు విరఁబోసికొన్నది. మాపృథు నవ్వినతెల్లని కాంతులలో నామెడంతములు కనఁబడీకనఁబడనట్లు ఈ వెన్నెలలో దూరాన తోఁటచివరఁగల రెల్లుపూవులు కనఁబడీకనఁబడకుట లేదు. ఈచల్లనిగాలి స్నేహితునివలె వెనుకనుండి వచ్చి నన్ను మెల్లగాఁ దాకుచున్నది. ... ఓయీ! నాయెదలో నుంచుకొన్నచిన్నారిదీపమ! ... ......ఈరాత్రి చంద్రికేతకీప్రాసాదమునందు వీణ వాయించుకొందును." (పుట ౫౪).

"ఇంత సంగీతవిద్య నాకెలవచ్చినది? ఇంతటి విద్యయు నాకు గౌతమునిసంగతి కూర్చిన యానందము కలిగించలేదు. ఓహో! ఈవాయువీథులు నాగానశ్రుతులను మేళవించుకొని, యింకొకధ్వని నెక్కనీయుట లేదు. ఈవాయుతరంగములు శ్రుతులు కలుపుకొని, మెల్లగాఁ బూలకొమ్మ లల్లలనాడిన ట్లల్లలనాడుచున్నవి. నాయాత్మ అదొకరీతి మైమరపులోఁ దన్మయభావమును బొందుచున్నది. ఏమో! నాల్గునాళ్లుగా లేని యీసౌందర్య మీ యంతఃపురమున కెచ్చటినుండి వచ్చినది?" (పుట ౫౮)

"నేను (వీణ) వాయించినంతసే పున్నాఁడు... మొగ్గవేసిన ప్రాగ్దిశాంగనమొగమువలె చంద్రుఁడు వాలియున్నాఁడు." (పుట ౫౯).

"నీతరువాతి నెచ్చెలియైన వీణవద్దకుఁ బోయితిని." (పుట ౬౦).

"చంద్రుఁ డికెంతలోనో అస్తమించఁడు. చూడుము. క్రమక్రమముగా నెఱ్ఱపడుచున్నాఁడు. తూర్పుదిక్కంతయు పునుగుపూసిన ట్లగుపడుచున్నది. పాలుత్రాగుపసిబిడ్డ తనమొగముతోఁ గొంతభాగ మాక్రమించుకొనఁగా మిగిలిన మాతృదేవీస్తనమండలమువలె నీసుక్లాపమీపరివర్గమానార్ధాధిక చంద్రబింబము రమ్యతరముగా నున్నది. అతఁ డింకొక్క కళ సవరించుకొనఁబోవులోపల నన్ను గాఢముగాఁ గౌఁగిలించుకొనుము. నీవిరోగపరితప్తమైన నాయీ సౌధదేహాళికి మెఱుంగుపూఁత పెట్టుము. కౌశికా! ఆమాణిక్యదీపము నటునుండి తీసివేయుము. దాని కృత్రిమదీప్తులచేత గౌతముని ముఖమండలి యకృత్రిమ సౌందర్యము మగటువేయుచున్నది. పండిన రొట్టని మొక్కజొన్నగింజలు రాశివోసినట్లున్న యీచంద్రబింబము చెట్లడ్డము లేకపోవుటచేత మనవంకనే చూచుచున్నది. దౌర్భాగ్యపుఁ జీఁకటిలో నీవెన్నెలతీగవంటి యందము నామనస్సునకు చూడఁజూడ బాధ కలిగించును." (పుట ౬౧)

"కవిత్వ మందుఁగూడ నంతియ. ఒక చిక్కని తియ్యనిశైలి కలవాని కవితయంతయు భావముల వెంట మారక నొకతెరీతిని నడుచుచుండును. భావమునకే ప్రాధాన్యమిచ్చు కవిత్వము శయ్యలో భావమునుబట్టి మారును." (పుట ౬౨)

"నీకు నిద్ర కన్నులవెంటఁ గారుచున్నది. నీపసి కన్నులు మూసుకొనుచున్నవి. చంద్రునిఁ జూడుము. చెంగావిరంగువేసిన సన్ననిగుడ్డపేలికవలె నెంత మిగిలియున్నాఁడో? ... పండిన సంపంగిరెక్కల వలె నీ ఱెప్పలు కనీనికలమీఁదికి వ్రాలుచున్నవి...ఈప్రపంచకమంతయు బసివాంద్రలతోనే నిండియుండరాదా? అప్పుడు స్వర్గమువలె నుండునే ... ... సన్నగా నీల సేయుచుఁ జల్లని యీరాత్రియామాళ్ళంగాటకముల రక్షకభటునివలె నాపక్షి కాచుచున్నది. ఓహో! ఆ మూఁత యేమి బాగున్నది! వీణ చివరితంత్రిమీఁద గోటితో

నిట్లున్నట్లున్నది. శబ్దమంతయుఁ బక్ర్పతినిండమున్నది. అది గానవిద్యలోనికి నేమూలవచ్చినది? ఏదో నిరాకారతలో సాకారత తోఁచి మనస్సున కానంద మగుచున్నది. నా కీ రాత్రియంతయు మహానందమయమైపోయినది... మరల నాయీజన్మకు నిట్టిరాత్రి యింకొక్క డనుభవింతునా ?" (పుట ౬౪)

"విషాదపు టెండచేఁ దపించిన నాయొడలను నీ నవ్వువెన్నెల చల్లఁదనము దెచ్చునను కొందును."
(పుట. ౧౦౭)

"ఈవెన్నెలలు వెండిసాలీడుదారము లల్లినట్లు ధగధగలాడిపోవు చున్నవి. శుక్లాష్టమినాఁటికన్న నివి ముదిరి సందులందుఁగూడ దలుపెక్కినవి." (పుట ౧౩౧)

"చివరిసారి నీవుకూడ వీణవిందువని చాలసేపెదురుచూచితిని...."

"ఈ వెన్నెలబాటలలో వీణవాయించుకొనుచుఁ బోయెదను" (పుట ౧౩౨)."

* * * *

వేనుఁ డసామాన్యకళోపాసకుఁ డనుట కొరుల వాక్కులుకూడ తార్కాణములు:

పృథువు—... 'నీ వింతగాయకుఁడ వౌదువా ? ......" (పుట ౩౪)

గౌతముఁడు—"...నీసంగీతము, నీశిల్పము, నీ కవిత్వము - వీనిమాధుర్యముచేతనయినను బ్రతుకఁదగిన వాఁడవే." (పుట ౫౬)

పృథువు—..."నీవు వీణవాయించునపుడు నీ యాత్మలో దేవతలు నిలుచుచున్నారు. ఆపాదమస్తకము నీ వొకదివ్యపురుషుఁడ వగుచున్నావు. నీయాత్మయు, మనస్సును ననంతమైనసౌందర్యమును గడించుకొనుచున్నవి. ఇప్పు డందుచేత నీకు సర్వమును సుందరాతిసుందరముగాఁ గన్పించుచున్నది. (పుట ౫౭).

గౌతముఁడు—"...ఇందాకటినుండియు నీగానవాహినిలో స్నానమాడుచుంటిని. తత్సౌరభములో నోలలాడుచుంటిని" (పుట ౫౯)

గౌతముఁడు—"...వేనా ! దివ్యపురుషునివలె నుంటివి. ఇందాకటినుండియు వీణవాయించుచుంటివి కాఁబోలు" పుట ౧౩౨)

గౌతముఁడు—"...మహాగాయకుని, సత్కవిని, మహాశిల్పిని నిన్నుఁ జంపి నేను లోకద్రోహి నైతిని" (పుట ౧౩౭)

ఇట్టి 'మహాగాయకుఁడు', ఇట్టి 'సత్కవి', ఇట్టి 'మహాశిల్పి' హృదయరహితుడైనకట్టిసి యని గ్రంథకర్త తెలుపదలచినాడు. "నాయాత్మ అదొకరీతి మైమరపులోఁ దన్మయభావమును బొందుచున్నది." ఈతన్మయభావమును, ఆధ్యాత్మికమైన ఈ 'మైమరపును' మహనీయనుఁగరిష్ఠుడైన కళోపాసకునకును మహాభక్తునకును సాధ్యములు. వేనుఁడు 'నాస్తికుడట' ! నిష్ఠురుడట !! "ఆపాదమస్తకము దివ్యపురుషు"నివలె నుండువానికెట్టికా దురంతదౌష్ట్యము గట్టుట !

పైన నుల్లేఖింపబడిన వేనునివాక్కులను, ఒరుల పల్కులను వినిన ప్రేక్షకులు వేనునిహృదయము నందన సౌరభమును వెదజల్లుచునదని గ్రహింతురుగాని, నిరయాగ్నిని గ్రక్కునదని గ్రహింపరు.

పృథువునెడల వేను డెంతో ఆనురాగమును జూపినాడు. ఈయనురాగము మిగుల పవిత్రమైనది. పిశాచహృదయమున నిట్టియనురాగ మెట్లుప్పతిల్లును ? అనురాగమయమైన హృదయమున నిష్ఠురత్వము ప్రవేశింపజాలదు. ప్రవేశించినను, అందు నిలుకడగ నిలువనేరదు. ఇట్లని యెన్నిసార్లో మున్నగుమహాకవులు నిరూపించినారు. "ఈ ప్రపంచకమంతయు బసివాండ్రతోనే నిండియుండరాదా ? అప్పుడు స్వర్గమువలె నుండునే." అని వేనరాజనినాడు. ఇట్టిభావమునే వేలుతీయున నేసుసంయమి వ్యక్తీకరించినాడు. స్వర్గనిభమైనహృదయమే స్వర్గమును కాంక్షించును. చెనటికి స్వర్గముయొక్క వర్ణక్రమమే తెలియదు. దాని నాతడు హృదయపూర్వకముగ నుచ్చరింపనొల్లడు. పసిపాప్రడను వలచుహృదయము రమ్యమైనది. ఇట్టిహృదయముచేతనే శ్రీసరభట్టను పసివానిని గ్రంథకర్త చంపించినాడు. అసంభవవ్యతిరేక

ములన్నిటిని ఒకమూటగట్టి, గ్రంథకర్త దానికి వేనుడని పేరుపెట్టినాడు.

వేనుడు దుర్మతియని తెలుపుట గ్రంథకర్త యొక్క ముఖ్యోద్దేశము. ఈయుద్దేశమువిూదనే ఈతడు నాటకము నాధారమొనరించినాడు. ముఖ్యపాత్రమ చిత్రించుటయందే గ్రంథకర్త అపజయమందినాడు.

గులాబిపూవు కంపుగొట్టునపుడే, లలితకళలనీను హృదయము దురంతదుర్గంధమును వెదజల్లును. **'Murder, as fine art'** అని ఒకసుప్రసిద్ధఆంగ్లకవి అనినాడు. ఇందు వేడివిసముబోలు వ్యంగ్యమున్నది. ఇది **'Heaven is Hellish'** అనుటవంటిది. కళోపాసకు డెన్నటికిని నాస్తికుడు కాడు. షెల్లీ నాస్తికుడనియెంచి కొందఱు పెద్దలాతని కళాశాలనుండి తఱిమివేసిరి. అతడు నాస్తికుడో కాడో ఆతనివాక్కులను పుంఖానుపుంఖముగ పరిశీలించిన బుద్ధిమంతు లెఱుగుదురు. వేనరాజు నాస్తికుడు కాడు. నాస్తికుడే యని గ్రంథకర్త వాదించుచో, అతడు సహృదయుడు కాని జగదీశుని పడపన్నిన దుష్టుడు కాడని పాఠకులు గ్రహింతురు. ఇతడు "పిశాచబంధు" వనిగాని, "మృత్యుదేవతాసహాధర్మ చారి" యనిగాని వారు గ్రహింపజాలరు.

పిశాచమును, నరకమును కొందఱు మనుజులందు జూపినమహాకవు లున్నారు. ఈపాత్రలందు దివ్యసౌరభము సున్న. పాత్రవాక్కులును, క్రియలును పాత్ర గుణమును నిర్దిష్ట మొనరించును. వ్యతిరేక భావసంఘర్షణ మున్నపుడే, ప్రతిహులశక్తులు పెద్దరూపులుదాలిచి కనులెదుట చూపట్టును. వాల్మీకి రావణునికెదుట రాముని, రామునికెదుట రావణుని నిలిపినాడు. రాముని కించుక యూడిగముజేసిన ఉడుత నాతడు రావణునితో పోర బురికొలుపలేదు. రావణుని వాంఛావృత్తులను లోకపావనియైన సీతపై బ్రాలజేసినాడు. కాని మగనిచే నీస్వబడిన చాకలిదానిపై కాదు. ఆవృత్తులను కనిన బ్రహ్మను పిడుప నూడవెడలిరినాడు. సృష్టి నాకర్షించు ప్రతిద్వంద్వినే కావ్యకర్తలు సంఘర్షణమున నెదుట నిలిపెదరు. కురుపాండవుల సంఘర్షణము భారతమును సృష్టించెను. వీరిలో నొకపక్షమువారు ఎట్టి ప్రాముఖ్యము లేని నొక్కెలమందయగుచో మహాకావ్య మొకటి సృష్టియయ్యెడిది కాదు. షేక్స్‌పియరు మహాకవి, అయాగో ఘోరపిశాచ మని యెట్లు నిరూపింప గలిగినాడు? ఇతడు వంకాయవంటి ఒక"వుగ్రవంది"నిగాని, బీరకాయవంటి ఒక "వినీత భట్టును"గాని అయాగోముందు నిలుపలేదు. పావనగుణ సంశోభితయైన డెస్డిమోనాను, మహానుభావుండైన ఒథెల్లోను అయాగో కెదుట నిలిపినాడు. తన మహానాటకములందు ద్విజకవి ఈ నియమమును పాటించినాడు. అపర్నకావ్యకర్తలు నరకమున కెదుట స్వర్గమును నిలిపినారు. వీని సంఘర్షణమే పఠితృహృదయమును గాని, ప్రేక్షకుని హృదయమునుగాని బలముగాతట్టును. గ్రంథకర్త ఈవిషయమును గుర్తింపలేదనుట స్పష్టవిషయము.

నిజమైన పిశాచములకు అపర్నాటకకర్తలు అరనిముసము సేపు రంగస్థలిపై చోటొసగిరి. హేమ్‌లెట్ తండ్రిదీనిడను నిముసకాలము మాపి షేక్స్‌పియ రాతని చెవియందు జరిగిన దురంతక్రియోదంతమును ద్రుటిలో జెప్పించి మాయముచేసినాడు. సోదరుని, సోదరపుత్రులను జంపిన గ్లస్టరునకు కొంత యాంతరంగిక యాతనమును గల్పించినాడు. "వేనరాజు" గ్రంథకర్త రక్తమాంసములుకలపాత్రలకంటె నివిలేని పిశాచములకు, ఆత్మలేని జీవములకు చాలకాలము రంగస్థలిపై తావొసగినాడు. పెక్కురంగములందు వేనరాజు పద్యములతో దీర్ఘప్రసంగములు సలిపినాడు. కళ, అందును నాట్యకళ **Sense of Realism** ను అపేక్షించును. ఇది "వేనరాజు" లో ఒప్పినదికాదు.

వేనుడు శ్రీధరభట్టుయొక్క పిశాచముతో నిట్లనును. 'నీవు నాకుఁ గైవారముచేసినప్పటినుండి నాస్థితి యెంతమారినది! ఇప్పు డెంతమారినదో నాకుఁ దెలియదు కాని నిన్నటివరకు మారినస్థితి మీనాయనమ్మ (యీమెయూడ పిశాచమైనది) పాడినది" వేనుఁ డెట్లు మాఱినాడు? పిశాచదర్శనమువల్లనా? పిశాచపు నవ్వువల్లనా?

మహానాటకములందు **Work of Nemesis** కు తప్పనిసరియైనచోటున్నది. ఘోరఝంఝానిలము వీచి ఆగినపిదప "అమ్మయ్యా!" అనుకొందుము. కారుమొయిళ్లు తొలంగిపోయినపిదప వినీలవిశాలవిహాయసమును చూచి ఆనందింతుము. గాఢాంధకార మదృశ్యమైనపిదప ప్రభాకరమరీచిని గాంచి సంతసంపడుదుము. ఆవిషాదము లేకున్న నీయానందమునకు పుట్టుకయే లేదు. ఆ యరిష్టము లేకున్న నీహాయికి జన్మము లేదు. తీవ్రసంఘర్షణానంతరమందే **Nemesis** గోచరించును. విజయలక్ష్మి తనపతాక మెత్తును. వేనరాజు నేపథ్యమున నేమేమిచేసినాడో పఠితలుగాని, ప్రేక్షకులుకాని యెఱుగరు. సందర్భ్భ్తిలోని మూవురను, ఒకసేవకుని అతడు సంపించినాడు. నాలుగు కూరగాయలను తరిగించినాడు; "మాటినాడు." ప్రత్యక్షసంఘర్షణ కడచినంతన **Nemesis** ప్రత్యక్షమగును. అపుడు మనుష్యహృదయమున విజృంభించిన దుర్మతి చచ్చెననియు, అతడు **Resurrection** అందెననియు, **Inward renewal** ను పడసె ననియు పలికెదము. అపుడే **Dramatic effect** గోచరించును. వేనరాజు "మార్పు" నందు ఇట్టిదిలేదు. అందున్నది **Mock-heroic effect.**

వేనుడు మాఱెననగనే, వెనుకటివేనుడు చచ్చెనన వచ్చును. చచ్చినవాని చేయి ప్రదింపించు టెందులకు?

నాటకమునకు వలసినతీవ్రభావము కథయందు కలదు. ఆదేసమయమున, నేకథాఘట్టమున, నెట్లు ప్రయోగింపబడవలెనో గ్రంథకర్త గ్రహించలేదు. వేనుడు తండ్రిని పదచ్యుతుని జేసినాడు. ఈదురంత క్రియయందు నాటకమున మంటలను, పొగలను చిమ్మ కథాంశముల నాతడు సృష్టించవలసినది. ద్విజేంద్రుడేమి చేసినాడు? "షాజహాన్" ను పరికింపుడు. ఔరంగజేబు షాజహానును పదచ్యుతుని జేసినాడు; ఖైదునం దుంచినాడు. అత్యాచారమునకు గుఱియైన షాజహానుపాత్ర నత్యద్భుతముగ చిత్రించినాడు. ఏల? ఆ వేశము బుట్టించుసంఘటనము నాటిలినందువలన. కలమున కావేశము కలుగనిచో కథ అక్కరగునతటి వేడి నీసమువంటి భావమును వెడలగ్రక్కలేదు. ఇదియున్న గాని నాటకమునకు శక్తియుండదు. ద్విజేంద్రుడు తన 'షాజహాన్' నాటకమునంతను షాజహాన్ చుట్టు అల్లి వేసినాడు. ఘోరమైన ఝంఝానిలమును సృష్టించినాడు; షాజహానును పిచ్చివాని జేసినాడు. ప్రేక్షకుల దృష్టిని రంగస్థలమునకు బిగించివేసినాడు. ద్విజకవి షేక్స్పియరును మేలుబంతి గావించుకొనినాడు. కింగ్ లియరునకు సరిపోయినట్లు షాజహాన్ను సృష్టించినాడు. గానరిల్ రీగాన్లకు సరితూగు ఔరంగజేబును సృష్టించినాడు. తొలినుండియు నే దెలుపుచు వచ్చిన ఘోరసంఘర్షణమును కనులెదుట కేకత్తించినాడు. మనుష్యహృదయమందలి తుపానును బాహ్యప్రకృతియందు షేక్స్పియరట్లు చూపినాడు. మరల షేక్స్పియరువలెనే **Nemesis** ను చూపినాడు. ఉన్నతాశయమునకు విజయమనినాడు. ప్రేక్షకులచే 'నిస్సీ'! యనిపించక, కడుంగడు సుందరమైన పాత్రను సృష్టించి అందాశయప్రదీప దీప్తిని చూపినాడు. ఈవిషయమున నితడు షేక్స్పియరును మించినాడు. షేక్స్పియరు సృష్టించిన కార్డీలియాను దలపించుపాత్రను ద్విజకవి 'జాహనారా'లో చిత్రించినాడు. వృద్ధుని సేవించినయువతి యువతీశమంతకమని నిరూపించినాడు. చిరిగి చిందరవందరగు ముదుసలిహృదయమును చేతబట్టి ప్రేక్షకు లుర్విళ్లూరుదురు. వీరి భావమును వీరిహృదయములందు ఖైదుచేయక దానిని చక్కని స్త్రీపాత్రయందు బహిర్గత మొనరించినాడు. షేక్స్పియరుద్విజకవుల పాత్రల కెన కాజాలుపాత్రలీకథయం దున్నారు. ఇందలి యంగరాజునకు, వారి లియర్ షాజహాన్లకు పోలిక లేకపోయినది. ఇందలి వేనునకును వారి గానరిల్ ఔరంగజేబులకును పోలిక లేకపోయినది; ఇందలి పృథువునకును వారి కార్డీలియాజాహనారాలకును పోలిక లేకపోయినది. ఇందు విభిన్నశక్తుల తీవ్రసంఘర్షణము లేదు. సదాశయములవిజయడిండిమము వానియందువలె నిందు కర్ణగోచరము కాదు.

నాటకనవలారచనములందు పాటింపవలయు నియమములను పిడికిట బట్టకపోయినను, గ్రంథకర్త కడుంగడు చక్కని కవితాశక్తిని చూపినాడు. ఈవఱలో పేర్కొనబడిన దృష్టాంతములనేకాక వీనినికూడ పరికింపుడు:

"చిలుకుకలమ్మిపూవుకుడఁ జెందిన తేనెలు......"
అనుపద్యము (పుట ౩౭).

"ఆకసంబునఁ గాంతివాకలై పరుసత్తి"
అనుపద్యము (పుట ౨౯).

"ఓహో! యీగో నెంతరమ్యముగా నున్నది. ఈ మెమూపురము కైలాస శృంగమువలె శృంగములు గంగా సింధునదులవలె నీమెపాదుసు రాజనాలు సందుసారవంతమైన పొలమువలె నీమెపుచ్ఛము ధాన్యలక్ష్మికి వీచినవింజామరవలె మనోహరముగా నున్నవి. నాకీమెను జూచిన గౌఁగిలించుకొని ముద్దాడవలె ననిపించుచున్నది."

"రాకుమారా! నీ కన్నులు తెల్లనిచూపులు మెరుపులై, నల్లనిరెప్పలు చిరుమొగిళ్లై చూచినంత మేర దయావర్షములు కురిపించి సస్యకారకములగుచున్నవి. నీదీర్ఘబాహువులు పైఁడినాగేళ్లవలె నున్నవి."

"......తిరిగిపోవు నీమెపిరుందులు నదీసైకతములవలె, సన్ననివలిపపుఁ బొరలచేఁ దెల్లనినీటిసన్ననిపొరలు ప్రవహింపించుచున్నట్లున్నవి." (పుటలు ౭౮, ౭౯).

"విదియచందిరుని యొప్పిదమైన శృంగసుం
పరమైన శృంగసుందరత మెరసి
మలచి గాలులుతీర్చు తెలిసైకతముల
......................"

అను పద్యము (పుట ౧౦౦).

"ఈ రెంకుకత్తులు వెన్నెలలోఁ దళతళలాడుచు నిసుకతిన్నెలమీఁద బుసకొట్టుచు, గోధుమవన్నె త్రాఁచులు పెనవేసికొనుచున్నట్లున్నవి." (పుట ౧౩౮)

"పైనినిప్పులు ముట్టించి తగులఁబెట్టునే గాని యీలోపలి నిత్యమై పసిమికల యీ యంకురములకుఁ జేటే లేదు."

"ఈ యంకురములపసిమి నిజముగా నెన్నటికిఁ జావదు. నేను కాచిన యెండకే మాడని యీపసిమి సనాతనమైనది." (పుటలు ౧౮౧, ౧౮౨)

"...గంగాయమునలు ప్రవహించినంత మేర దక్షిణమాలామూర్తిగా నుండి కాశ్మీరదేశమున నుత్తరమాల ఘటించిన తల్లిపాదుసునఁ పలకోపు వత్సము కలెనున్నాము. ఉత్తమ మాహేయికమైన నిన్నుఁ జూచికాఁబోలు క్షీరాబ్ధి యీపర్వతరాజు జిట్లునటు"

"మల్లెపువ్వులన్న చేతులు."

"నందివర్ధనిపువ్వులన్న నాకన్నులు."

"తెల్లతమ్మిమొగ్గయన్న నాకుస్తుక."

"......పమ్మిసొగసుసపఁతిమగఁడు ఫ్రాంకేసుల మివులు తుపారసమీకరణము కూడ..."
అనుపద్యము (పుట ౧౧).

"పృథునేత్రములలోన వెన్నెలల్ కలవు." అను పద్యము (పుట ౯౯)

"ప్రాభాతనూత్నసీరజకాంతికలకనుల్."(పుట ౭౬)
"........దిక్సతీముఖో
త్ఫుల్లసరోజమండలి
విముగ్ధరుచుల్ పిహితంబులై చనన్."
అను పద్యము (పుట ౯౫).

"నాయెద యెల్ల........"

"ఇంతకుముందు తెల్లనయి."
అనుపద్యములు (పుట ౧౧౧).

"నాయెదలోఁ బ్రవహించు నీ కాలువ నేను పొలనుకొంటిని. నీవుమధువులని చెప్పితివి."(పుట ౧౧౧)

"ఈసితమేఘముల్ గొడుగులెత్తెను..."
అనుపద్యము (పుట ౧౧౨)

"మతికనులామె......"అనుపద్యము (పుట ౧౧౩)

"నల్లని నీటిబిందువుల చాలునకన్న"
అనుపద్యము (పుట ౧౮౮)

గ్రంథమంతయు మధురభావ బంధురమైయున్నది. గద్యము విశేషమైయున్నను, ఈనాటకము పాడదగినది కాని, ఆడదగినది కాదు.

# పౌరుషము



"నీదగ్గరికి నేనువచ్చి అప్పుడే పదినిముషాలయింది."

"చూసేను"

"వచ్చానని తెలిసే ఇదంతా?...అయితే నన్ను పెళ్లి చేసుకున్నా నీ అభిప్రాయం?"

"ఎందుకు పెళ్లిచేసుకోవడం?"

"ఎందు కేమిటి? నువ్విలా మాట్లాడకుండా కూర్చుంటే నిన్నుచూస్తూ కూర్చోనా నేను?"

"మాట్లాడేందు కేమీ లేదు."

"ఉన్నప్పుడే మాట్లాడుతూ ఉండేవాడివా పూర్వం?...ఎందుకింత మౌనంగానూ, విచారంగానూ ఉన్నావు?"

"విచారాని కేమీ కారణం లేదు."

"డబ్బువిషయమై చిక్కులా?"

"ఖర్చుకి డబ్బు లేకపోలేదు."

"మరేమిటి సంగతి?"

"ఏమీ లేదని చెప్తుంటేనే."

"నీపరీక్షపోయిందని ఎవరైనా కబురుచెప్పేరా, సోమశేఖరం?"

"పరీక్షపోవడం అంటూ ఉండదు. బాగా వ్రాసేను."

"ఏమిటిమరి నీబెంగ?"

"నాకేమీ బెంగలేదు."

"అయినా చెప్పు. నేనేమైనా చెయ్యగలిగితే చేసిపెడ్తాను."

"నువ్వు చెయ్యగలిగినదేమీ లేదు."

"అయితే ఏదో ఉందన్నమాటే బెంగ."

"కొంచెం ఉందిలే."

"ఏమిటో చెప్పు."

"ఏమనిచెప్పను, రామం, నాకు? నాలోకం అంతా తల్లక్రిందులైపోయింది."

"అంటే?"

"నా అంత దౌర్భాగ్యుడు ఈలోకంలో లేడు."

"అంతమాటనకు."

"నిజంగా. రెండురోజులనుంచి నిద్రలేదు. ఒకటే విచారం."

"ఇంకా చెప్పు."

"ఎవరితోటీ మాట్లాడడం ఇష్టంలేదు. నలుగురిలోనూ వీధిలో నడవడానికికూడా మనస్కరించడం లేదు."

"అసలు జరిగిందేమిటి?"

"చెప్పనా?"

"ముఖ్యంగా."

"అది చాలాపెద్దకథ. నీకావిషయాలేన్నడూ చెప్పలేదు. మొదటినుంచీ చెప్పాలి... వినేందుకు ఓపిక నీకుందో లేదో."

"నాకు మరోపనేమిటి?"

"అయితేవిను...... మూడేళ్లయింది, రామం, నేను కృష్ణయ్యగారింటికి చనువుగా వస్తూఉండడం మొదలుపెట్టి. వారిది బ్రహ్మసమాజపు కుటుంబం కనుక ఆయనతో ఒక్కరితోనే కాకుండా ఆయనభార్యతోనూ, ఆయనకూతురుతోనూకూడా నాకు పరిచయంకలిగింది. నేను మొదలు చూసినప్పుడు సత్యవతికి పదిహేడేళ్లు."

"సత్యవతంటే ఆయనభార్యా?"

"కాదోయ్... నువ్వు వింటున్నావా? సత్యవతి కృష్ణయ్యగారి కూతురు. ఆయన కొక్కర్తే కూతురు.

ఒక్క...మాత్రం చూస్తాడు...కాని అతను అక్రూరుడు. అప్పటికి అయిదేళ్లుంటాయేమో."

"అప్పటికి అక్షరాభ్యాసం చేసేరా అక్రూరుడికి?"

"ఏమో ... బ్రహ్మసమాజపువాళ్లల్లో అక్షరాభ్యాసం ఉందో లేదో కూడా నాకు తెలియదు."

"అక్షరాలు తెలియకుండానే పండితులైపోతారా వాళ్లు?"

"అవంతా ఎందుకిప్పుడు, రామం? అక్రూరుడికి అక్షరాభ్యాసం అయిందే అనుకో ...ఎరుగక చెప్పేవు అక్రూరుడిసంగతి."

"అక్రూరుడి పేరు చెప్పలేదునువ్వు"

"కేశవచంద్రుడు ......ఇప్పటికైనా సంతృప్తుందా?"

"ఇకను చెప్పు"

"నేను మొదట చూసినప్పుడు సత్యవతికి పదిహేడేళ్లు. చాలాఅందమైన పిల్ల అని మొదటినుండీ తెలుసును నాకు. తను నాతో కూర్చుని ఆవేళసాయంత్రం రామ్ మోహన్ రాయ్‌గురించి మాట్లాడేసరికి తనంతటి తెలివైన పిల్ల ఈలోకంలో ఎవత్తీ లేదని నేను నిశ్చయించుకున్నాను."

"అంతకంటె తెలివైనవారు లేరని నిశ్చయించుకునేందుకు అప్పటికీ ఇప్పటికీ మిగిలిన పిల్లల్ని ఎవరినైనా చూసేవా?"

"అప్పటికి సత్యవతితో తప్ప మరి ఏ ఆడపిల్లతోనూ మాట్లాడలేదు నేను."

"అదే అనుకున్నానులే. ఎంతవరకూ చదువుకున్నారావిడ?"

"మెట్రిక్యులేషన్ వరకూ చదువుకుని ఎందుకల్లనో అక్కడ మానేసింది......నెమ్మదిగా మా పరిచయం వృద్ధిపొందింది."

"ఆ సత్యవతన్నావిడతో పరిచయమా?"

"అవును. మొదటిసారి వచ్చి వెళ్లిపోతుంటే మళ్లీ ఎప్పుడైనా రమ్మని కృష్ణయ్యగారు చెప్పేరు నాతో. రెండవసారి వచ్చి వెళ్లిపోతుంటే కృష్ణయ్యగారిభార్య వీలైతే మళ్లీ రమ్మని నన్నడిగేరు. మూడవసారి వచ్చి వెళ్లిపోతుంటే సత్యవతే నన్ను మళ్లీ రమ్మంది. నాల్గవసారి నేనువచ్చి వెళ్లిపోతుంటే ముగ్గురూ కూడా నన్ను మళ్లీ రమ్మనక్కరలేదని గ్రహించేసేరు. ఆతర్వాత క్రొత్తలో వారుముగ్గురూ నేనూ కూర్చుని హిందూమతంలో ఉన్నటువంటి అసందర్భాలన్నిటి గురించీ మాట్లాడేవాళ్లం. కొంత క్రొత్త తీరేక ఆయన పనిమీద ఊళ్లోకి వెళ్లేవారు. తల్లీ కూతురూ నేనూ హిందూసంఘంలో ఉన్నటువంటి అన్యాయాలన్నిటి గురించీ చర్చచేసేవాళ్లం. ఇంకా కొన్నాళ్లయాక సత్యవతీ నేనూ మట్టుకు కూర్చుని ముందుముందు చదువులయాక నేనేమి చెయ్యదలచుకున్నానో, ముందు ముందు తనేమి చెయ్యదలచుకుందో ఇటువంటి విషయాలు మాట్లాడుకునేవాళ్లం."

"అంటే......ఇద్దరూ వేరువేరుగా చెయ్యదలచుకున్న విషయాలేనా?"

"రామం, నువ్వెప్పుడూ ఇటువంటి వికటపు మాటలే మాట్లాడుతూ ఉంటావుకదా ......అదేమీ కాదు. మతాన్నీ, సంఘాన్నీ ఒక మూలపెట్టి ఊరికా మా సంగతులే మాట్లాడుకునేవాళ్లం. ఏ సాయంత్రం అయినా సత్యవతిని నేను చూడకపోతే నా కారాత్రి నిద్రపట్టేదికాదు. ప్రొద్దున్న లేచీలేవగానే కృష్ణయ్యగారింటికి వెళ్తేనేకాని పిచ్చెత్తినట్టుండేది. అప్పుడు 'నిన్న కనబడనేలేదే' అంటూ సత్యవతి నాకేసి అతి కోపంగా చూసేది. ఆకాలంలో కొంత పిచ్చెత్తినట్టున్నప్పటికీ ఎంతో సరదాగా ఉండేవి రోజులు నాకు... నన్నుగురించీ, నాచదువులగురించీ ఎంతో శ్రద్ధతీసుకుని ఎన్నో ప్రశ్నలు వేస్తూఉండేది సత్యవతి."

"అదీ సగమేనా నీకు? ఈఆడవాళ్లకి అక్కరలేని అంశం లేదనోయ్. మొన్న మానాయనమ్మ నన్ను ......ఏమిటి చెప్పబోతున్నావు?"

"నెమ్మదిగా మా స్నేహం ముదిరిపోయింది. ఒకనాడు, వన్నెరుగున్న అయిదారునెలలలో సత్యవతి నన్ను నాపుట్టినరోజు ఏదని అడిగింది. పెంకితనానికి తప్పురోజు చెప్పేను."

"అసలు నీపుట్టిన రోజు ఏది?"

"జూలై నెల ఇరవైయ్యవతారీఖు. డిసెంబరునెల పదహారవతారీఖని చెప్పేను. డిసెంబరు పదహారవతారీఖున తన ఇంటికి వెళ్లేసరికి నాచేతిలో ఒకపుస్తకం పెట్టింది. లోపల చూద్దును కదా, పుట్టినరోజుకి బహుమానం అని అందమైన అక్షరాలు చెక్కబడి ఉన్నాయి. కొంతసేపటివరకూ బోధపరచుకోలేకపోయాను. నేను......అప్పటినుండి ఈరోజువరకూ అది నాపుట్టినరోజు కాదని చెప్పేందుకు నాకు మనస్సొప్పలేదు. మూడేళ్ల బట్టి సత్యవతి డిసెంబరునెలలో ఏదో ఒక బహుమానం నాకిస్తోంది."

"క్రిందటి సంవత్సరం నీకేమిటిచ్చిందావిడ?"

"ఒక పార్కర్ కలం."

"అదృష్టవంతుడవోయ్! నేనే నువ్వయ్యుంటే ఈపిల్లవంటి పిల్లల్ని మూడువందల అరవైమందిని చేరదీసి ఒక్కొక్కరికి ఒక్కొక్కరోజు నాపుట్టినరోజని చెప్తును...మంచిపన్నాగమే అంటావా?"

"ఈపన్నాగాలే నాకొంపతీసినవి......వాళ్లందరి పుట్టినరోజులకీ నువ్వివ్వవలసిన బహుమానాలో?"

"అదొకటి కూడానా?"

"నేను చెప్పేదంతా వినుమరి...... ఒకరోజున రమారమి రెండేళ్లక్రిందట కృష్ణయ్యగారింటికి నేను వెళ్లగానే వాళ్లంతా మంచిబట్టలుకట్టుకుని వాళ్ల గుర్రపుబండి ఎక్కబోతున్నారు. నన్ను చూడగానే నేనుకూడా వాళ్లతో వెళ్లకతప్పదన్నారు. ఎక్కడ కనడిగితే నాటకానికన్నారు. నాకు నాటకాలంటే తలనొప్పి. అందుల్లో మననాటకాలు చెప్పాలా? రావణాసురుడివేషం వెయ్యవలసినవాడికి రవికతొడిగి సీతగా పంపిస్తారు. వాడు సీతగావచ్చి ఏవో హూనిరాగాలో, 'హూణీ' రాగాలో తీస్తుంటే సభలో ఉన్న పెద్దమనుష్యులు నాటకం నిలిపేసి వాడిచేత రాముడు పాడవలసిన పాటలన్నీ పాడించేస్తారు....అందువల్ల వాళ్లతోనే నారోజున నాటకానికి రానన్నాను. కాని సత్యవతి మూతిముడిచేసరికి ఇటూఅటూ చూసి నేనూ ఎక్కను బండి. నాటకశాలలో పడ్డాక కుర్చీలలో కూర్చునేటప్పుడు కొన్నివిచిత్రాలు జరిగేయి."

"ఏమిటా నాటకం?"

"ఏదో ఒకటి. 'హరిశ్చంద్ర' అనుకో. లేకపోతే 'లవకుశ' అనుకో. అదంతముఖ్యమైనవిషయం కాదు... కూర్చునేటప్పుడు శశిచంద్రుడూ, కృష్ణయ్యగారి భార్యా ముందు లోపలికి వెళ్లేరు. కృష్ణయ్యగారు కొంతసేపటివరకూ సత్యవతి ఆయనకీ భార్యకీ మధ్యని కూర్చుంటుందనుకుని, సత్యవతిని తల్లి వెంట వెళ్లనిచ్చేందుకు వెనకకి నిలిచిపోయారు. ఎంతకీ సత్యవతి తల్లి వెంట వెళ్లకపోయేసరికి ఆయనే ముందు లోపలికి వెళ్లేరు. ఆఖరికి సత్యవతికి ఒకపక్కని నేను కూర్చున్నాను. పాపం, కృష్ణయ్యగారు నిముషనిముషానికీ సత్యవతితో 'అక్కడకంటె నేను కూర్చున్నచోట నీకు బాగా కనిపిస్తుందేమో' అంటుంటే, 'ఫరవాలేదు నాన్నా, ఇక్కడే బాగుంది' అంటూ ప్రదర్శనం జరిగినంతసేపూ నాపక్కనే కూర్చుంది."

"తల్లితండ్రులప్రేమ ఎటువంటిదో చూడు! కూతురికి నాటకం సరిగ్గా కనబడదేమో అన్నవిచారమే కాని స్థలాలు మార్చుకుంటే తనకే ఆనాటకం కనబడదన్న విచారం లేదుకదా ఆయనకి."

"అంతేకాదు. దీపాలన్నీ ఆర్పేసినతర్వాత నాటకం మధ్యలో రెండుమూడుమాట్లు ఎవరో నాచెయ్యి తడిమినట్టయింది."

"ఎవరో తెలియలేదా?......నీ రెండవపక్కని ఎవరు కూర్చున్నారు?"

"జ్ఞాపకం లేదు."

"అయితే నీ సందేహం......?"

"సందేహం లేదులే...... ఆ సమయాలలో కృష్ణయ్యగారు చూస్తారేమో అని నా కెంతో కంగారు. సత్యవతికి ఆ కంగా రున్నట్టు నాకు తోచలేదు. అయినా, నేను ధైర్యంతెచ్చుకుని చీకట్లో తన చెయ్యి రెండుమూడుమాట్లు గట్టిగా పట్టుకున్నాను. నాటకం అయిపోయాక అందరూ అది అద్భుతంగా ఉందంటుంటే సత్యవతిమట్టుకు ఇంతమంచినాటకం తానెప్పుడూ చూడలేదని పొగడడం మొదలుపెట్టింది. అదేకాక ఊరికి మళ్లీ ఎప్పుడైనా నాటకంవస్తే నేను మళ్లీ వాళ్లతో వెళ్లకతప్పదని నాదగ్గర మాటపుచ్చుకుంది. అంతేకాని ఆరాత్రి నాటకశాలలో మాచేతులు నడిపిన నాటకంగురించి తనూ మాట్లాడలేదు, నేనూ మాట్లాడలేదు."

"ఆచేతులాటని నాటకంలో మొదటి అంకం అనుకొని నాటకం యావత్తూ అనకు."

"ఏదో ఒకటి ...ఇలాఉండగా ఈనాటకంజరిగిన కొన్నిరోజులకి గ్రామంనుంచి మానాన్న నాకొక ఉత్తరంవ్రాసేరు — నాపెళ్లిముహూర్తం నిశ్చయం అయిందనీ, నామేనమామ కూతురు నాకు పెళ్లాంకాబోతుందనీ, నేనావేళకి సెలవుపుచ్చుకుని రావాలనీ."

"సరిపోయింది! దీనికిముందు కృష్ణయ్యగారితో మీనాన్నగురించీ, మీకుటుంబంగురించీ ఎప్పుడైనా మాట్లాడేవా?"

"మాట్లాడకేమి? మాకుటుంబంగురించీ,మాఆస్తుల గురించీ మొదట్లోనే చెప్పడంఅయింది. అప్పుడు కృష్ణయ్యగారి భార్య నన్నడిగినప్రశ్నలు ఇన్నీఅన్నీకావు... ఆఉత్తరంమాట నేను కృష్ణయ్యగారింట్లో చెప్పేసరికి కృష్ణయ్యగారు భార్యకేసి చూసిచూసి సావిట్లోకి వెళ్లిపోయారు. సత్యవతి మాట్లాడకుండా నాకేసైనా చూడకుండా పక్కగదిలోకి వెళ్లిపోయింది. కృష్ణయ్యగారి భార్య ఆవిడకుర్చీ నాకు దగ్గరగాలాగి "అంతా బాగానే ఉందికాని, అందరూ సత్యవతిని నువ్వు పెళ్లాడుతావని అనుకుంటున్నట్టు నీకు తెలియదా?" అని అడిగేరు. నేనామాటవినలేదని జవాబు చెప్పేను.

'ఇన్నిరోజులబట్టీ మా ఇంటికి అంతతరచుగానూ, అం[illegible] చనువుగానూ రావడంలో అర్థం ఏమిటి?' అని ప్రశ్నించారావిడ. నే నీవిషయాలన్నీ అంత జాగ్రత్తగా ఆలోచించుకోలేదని సమాధానంచెప్పేను. ఆడపిల్లలు పెద్దవాళ్లై పెళ్లిళ్లుకాకుండా ఉన్న ఇళ్లకి ఇంతతరచుగా ఈడుగల మొగపిల్లలు వస్తే లోకం అంతటా ఒకటేఅర్థం అన్నారావిడ. దీర్ఘాలోచన చెయ్యకుండా బుద్ధిపొరపాటున చేసిన పని కనుక క్షమించమని కోరే నావిడని. క్షమార్పణలతో పని లేదు కాని సత్యవతిని నేను పెళ్లిచేసుకోకతప్పదన్నారావిడ. మానాన్న చాలా గట్టిమనిషనీ, తనమాట నేను జవదాటలేననీ బోధపరుచబోతుంటే పక్కగదిలో పెద్దపెట్టున సత్యవతిఏడుపు వినపడింది. 'అయ్యో, అయ్యో' అంటూ కృష్ణయ్యగారి భార్య ఆగదిలోకి పరుగెత్తేరు. నేనూ వెళ్లి గుమ్మంలో నుంచున్నాను. తల్లీ కూతురూ కలసి ఘోరమైన ఏడుపులు మొదలెట్టేరు. కృష్ణయ్యగారు సత్యవతిని నేను పెళ్లి చేసుకోక తప్పదన్నారు. ఆహడావిడిలో 'సరే' అన్నాను. ఆతర్వాత నేను పడ్డబాధలు ఇన్నీ అన్నీ కావు. ఎలాగో ఒకలాగు మానాన్నచేత మా మేనమామసంబంధం అంత మంచిదికాదని ఒప్పించేను. వస్తున్న సంబంధాలన్నీ కూడా పడగొట్టేను. కృష్ణయ్యగారింట్లో మట్టుకు సత్యవతిని నేను పెళ్లిచేసుకుంటానని స్థిరపడిపోయింది. చదువులయిపోయి ఉద్యోగం దొరికేవరకూ పెళ్లికి బలవంతపెట్టం అన్నారు కృష్ణయ్యగారూ, భార్యా కూడా. ఉద్యోగం అయేవరకూ ఈసంగతులేమీ లోకానికి తెలియనివ్వకూడదని వారిని నేను ప్రతిమాలుకున్నాను. 'సరే' అన్నారు. మానాన్నకేవిధంగానైనా ఈకబురు తెలిసిపోయిందంటే నాబ్రతుకు చెప్పాలా?"

"ఇదా నీ[illegible]?"

"ఇంకా విను. అసలుసంగతి చెప్పనేలేదు.

"అదేమిటి?"

"వినుమరి. కృష్ణయ్యగారింటివాళ్లకీమాత్రం సత్యవతిని నేను పెళ్లిచేసుకుంటానని తెలుసును కాని ఊళ్లో ఎవరికీ తెలియదు."

"మరి కృష్ణయ్యగారి భార్య ఊళ్లో అందరూ ఆమాట అనుకుంటున్నారని చెప్పేరన్నావు?"

"ఆవిడ కానిముహంలో అలాతోచింది. కాని ఎవరికీ తెలియదు. రెండేళ్ల క్రిందట నరసింహంపంతులు గారు ఈఊరికి డిప్యూటీకలెక్టర్‌గా వచ్చారు. చిన్నతనంలో ఆయన కొడుకు సాంబమూర్తీ, నేనూ కలసి చదువుకున్నాం. అందువల్ల నేనంటే ఆయనకి కొంత గారాబం. సాంబమూర్తి చెన్నపట్నంలో చదువు కుంటున్నాడు. సాంబమూర్తిచెల్లెలు, పాపం, చిన్నతనంలో కాపురానికి వెళ్లకుండానే భర్త చనిపోవడం వల్ల తల్లితండ్రులతో ఉండిపోయింది. పాఠశాలలకు వెళ్లీ, కళాశాలలకు వెళ్లీ చదువుకోలేదు. ఇంట్లోనే చాలావరకు నేర్చుకుంది."

"ఆవిడ పేరేమిటి?"

"ఇందిర. చాలా తెలివైనదీ, చాలా నెమ్మదైనదీ. ఒకసారి చూడగానే ఎందుకల్లనో ఇందిర నాకు ప్రత్యేకంగా నచ్చింది. ఎన్నోసార్లు నేను వారింటికి వెళ్లగానే తను సావిట్లోంచి లోపలికి వెళ్లిపోయేది. నరసింహం పంతులుగారు 'మరెవరూ కాదు. మన సోమశేఖరమే' అన్నా కూడా మళ్లీ కనబడేది కాదు. వారీఊరికి వచ్చిన అయిదారునెలలవరకూ నాతో ఇందిర సమంగా మాట్లాడనే లేదు. అప్పుడైనా వేసవికాలపు శెలవలకి రెండు నెలలూ సాంబమూర్తి ఈ ఊళ్లో ఉండడంవల్ల తన అన్నకీ నాకూ ఉన్న చనువుచూసి నన్నొక పరాయి వాడినిగా ఎంచడం మానేసింది. అంతవరకూ పరాయి వాడినే. నాతో మాట్లాడే క్రొత్తలో తల వంచుకుని ముక్తసరిగా జవాబులు చెప్పేది. నేను కూడా ఇందిరతో మాట్లాడేందుకు సిగ్గుపడేవాడిని. సత్యవతిదగ్గర ఎంతధైర్యంగా మాట్లాడేవాడినైనా ఇక్కడ పిల్లి కూనలాగ బెదరిపోయేవాడిని. ఇందిరతో సహవాసం కుదిరినకొలదీ తనంటే నాకు అభిమానం, ప్రేమా హెచ్చిపోయాయి."

"మరి.....అసత్యవతన్నావిడ మాటో?"

"అది నిజం. కృష్ణయ్యగారింటికి ప్రతిరోజూ వెళ్లడం మానేసి రెండుమూడు రోజులకి ఒకసారి వెళ్లేవాడిని. వెళ్లినప్పుడు మట్టుకు నడతలో ఏమీ మార్పు కనబడకుండా చూసుకునేవాడిని. రెండుమూడుసార్లు నేను రోజూ రావడంలేదని సత్యవతి చికాకుపడింది కాని ఏవో మాయమాటలు చెప్పి తప్పించుకున్నాను."

"ఊ...సత్యవతన్నావిడకి ఈ...ఇందిరన్నావిడసంగతి తెలియదా?"

"చాలాకాలంవరకూ తెలియదు. కాని ఒకసంవత్సరం క్రిందట సాంబమూర్తి శెలవలకి ఈఊళ్లో ఉండగా నరసింహంపంతులుగారూ ఇందిరా సాంబమూర్తీ నేనూ శివాలయానికి షికారుకి వెళ్తే కృష్ణయ్యగారి సుబ్రహ్మణ్యం బండి మాకు త్రోవలో కనబడింది. నన్నుచూసి బండి ఆపి వాళ్లంతా దిగేరు. అప్పుడు రెండుకుటుంబాలకీ ఒకరితో ఒకరికి పరిచయం కలిపేను. మొన్నాడు కృష్ణయ్యగారింటికి వెళ్లినప్పుడు సత్యవతి ఇందిరనుగురించి అడగకలసిన ప్రశ్నలన్నీ నన్నడిగింది. ఆకుటుంబంతో నాకు సంబంధంఅంతా సాంబమూర్తికీ నాకూ ఉన్న చిరకాల స్నేహం అనిబోధపరచాను. ఇందిర నాతో మాట్లాడనైనా మాట్లాడదన్నాను."

"నమ్మిందీ ఈ...సత్యవతన్నావిడ?"

"నమ్మిందనే ఆవేళ అనుకున్నాను. ఏమైనా అంతమట్టుకీ అపనమ్మకం పెట్టుకోలేదు. కాని కొంతవిచిత్రంగా ప్రవర్తించింది. ఇందిర తనకి చూడగానే మంచిపిల్లలా కనబడింది కనుక ఇందిరతో తనకి స్నేహం కుదిర్చిపెట్టాలని నన్ను కోరింది. ఏమి అనడానికీ తోచక సాంబమూర్తితో చెప్పిచూస్తానని జవాబిచ్చాను. ఇదయిన వారంరోజులలోపున సత్యవతి వచ్చి ఇందిరని చూడడం, ఇందిర వెళ్లి సత్యవతిని చూడడం రెండూ జరిగేయి."

"ఇద్దరూ గొప్పస్నేహితులయారన్నమాట."

"ఆడపిల్లలస్నేహాలకేమిటిలే. ప్రొద్దున్న ప్రాణాంతకస్నేహం. సాయంత్రానికి సంపూర్ణవిరోధం

మొత్తానికి ఇద్దరూ స్నేహంగానే ఉండేవారు. సత్యవతి తనూ, నేనూ పెళ్లిచేసుకుంటాం అని ఇందిరతో చెప్ప డనిమట్టుకు రూఢిగా నాకు తెలుసును. ఆవిధంగా మాటపుచ్చుకున్నాను...ఇలాఉంటూఉండగా సాంబ మూర్తి మళ్లీ చెన్నపట్నంపోయాక కూడా నరసింహం పంతులుగారింటికి యథాప్రకారంగా వెళ్తూ ఇందిరతో చనువుగా మాట్లాడుతూ ఉండేవాడిని. ఎన్నాళ్లవరకో ఇందిరకి నాప్రేమ ఎలాసూచించడమో నాకు తెలిసిందికాదు. ఇందిర పూర్వంలా కాకుండా నేనువెళ్లగానే వచ్చి నాదగ్గరకూర్చుని సరదాగా మాట్లాడుతూ ఉండేది. అప్పుడప్పుడు నరసింహంపంతులుగారు కూడా మాతో కూర్చునేవారు. ఒకసారి ఆయన లేనప్పుడు ఇందిరకి చదవమని ఒకపుస్తకం ఇచ్చాను. అందులో తనకి నేనొక ఉత్తరం వ్రాసిపెట్టేను. ఉత్తరం కవరులో పెట్టి అంటించేసి కవరుమీదమట్టుకు ఎవరిపేరూ వ్రాయలేదు. పుస్తకం తిరగేస్తూ అందులో ఏదో ఉత్తరం ఉండిపోయిందంటూ ఇందిర నా కా ఉత్తరం ఇచ్చెయ్యబోయింది. దానిని మళ్లీ పుస్తకంలో పెట్టేస్తూ తను చదువవలసినదానిలో అదీ ఒకభాగమే అన్నాను. రహస్యం వెంటనే గ్రహించింది. నాకేసి కోపంగాచూసి మాట్లాడకుండా ఉత్తరం పైకితీసి నా వైపు తోసేసింది. కాని ఆవేళ వెళ్లిపోబోతూ ఆ ఉత్తరాన్ని మళ్లీ తనలో ఉండిపోయే పుస్తకంలో నేను పెట్టుంటే చూసికూడా చూడనట్టు నటించి ఆపుస్తకం తీసుకుంది."

"నాకేమీ బోధపడడం లేదు. ముందర తీసుకోకపోవడం ఎందుకు? తర్వాత తీసుకుంటూ తెలియనట్టు నటించడం ఎందుకు? తీసుకోవాలని ఉద్దేశ్యం ఉంటే ముందే తీసుకోకూడదా? లేకపోతే మానెయ్యకూడదా?......ఓహో! ఇప్పుడు బోధపడింది."

"ఏమిటి?"

"తండ్రిగారికి చూపించి నీమీద ఫిర్యాదు చేసేందుకు తీసుకుంది అ......ఇందిరన్నావిడ. అంతేనా?"

"అబ్బెబ్బే. ఆయనకి చూపించడానికి కాదు తను చదవాలనే తీసుకుంది...ఆఉత్తరంలో నేను నా హృదయంలోఉన్న ఆవేశం అంతా వొర్లించేసేను. తను నాకంటబడిన మొదటిరోజునే పరవశుడనై పోయానన్నాను. తనులేని జీవితం జీవితం కాదన్నాను. నేను సాంఘికనిర్బంధనలు పాటించేరకం కానన్నాను. తను నన్నేమి చెయ్యమంటే అది చేస్తానన్నాను. నిద్రాహారాలు లేక శల్యమైపోతున్నానన్నాను. ఇంకా ఏమిటేమిటో వ్రాసేను."

"ఒక్కమాట. నువ్వు వ్రాసినదంతా నిజం అనుకుంటూనే వ్రాసేవా?"

"అదా నీప్రశ్న? ప్రేమయొక్క దౌర్బల్యంలో వ్రాసిన ఉత్తరాలకి 'నిజం', 'అబద్ధం' అంటూ రెండు వేరువేరుమాటలున్నాయా?"

"ఊరికా అడిగేనులే. నాకీఉత్తరాలసంగతి ఏమితెలుసును? నెలకొకసారి మానాన్నకి డబ్బుకోసం తప్ప మరే ఉత్తరాలూ వ్రాసినపాపాన్ని పోలేదు."

"ఆ ఉత్తరం ఇందిరకిచ్చిన రాత్రి నాకు నిద్ర లేదు. చదివి ఏమనుకుందో అని కంగారు. మొన్నాడు ప్రొద్దున్న తన ఇంటికి వెళ్దాం అనుకుంటే ధైర్యం చాలలేదు. సాయంత్రంకూడా వెళ్దామా వద్దా అనుకుంటూ ఆఖరికి గుండె నిబ్బరంచేసుకుని వెళ్లేను. వీథి సావిట్లో నరసింహంపంతులుగారు కూర్చున్నారు. నన్నుచూసి కూర్చోమనైనా అనలేదు. దానితో హడిలిపోయాను. పదినిముషాలయ్యాక ఏవేవో సామాన్యమైన మాటలుచెప్పి, ముందటి రాత్రినుండీ ఇందిర ఏడుస్తూ పడుకుందనీ, ఎంత ఓదార్చినా ఏడుపుమానడం లేదనీ, ఇంట్లో అందరూ మతిపోయినట్టున్నారనీ చెప్పేరాయన. ఆయనామాట చెప్పేసరికి నాగుండె నీరింతలయిపోయింది. ఒక్కటే సుగుణం కనబడింది నాకు; ఇందిర నా ఉత్తరం తండ్రిగారికి చూపించలేదని తోచింది......మర్యాదగా ఏవో రెండుముక్కలు చెప్పి వెళ్లిపోబోతుంటే, ఏమి బుద్ధిపుట్టిందో ఆయనకి

లోపలికివచ్చి ఇందిర నొకసారిచూసి మాట్లాడివెళ్లిపొమ్మన్నారు. నాకంగారు చెప్పాలా? ...లోపలికివెళ్లేను."

"ఎలావెళ్లి మాట్లాడగలిగేవోయ్? నేనే ఆఅవస్థలో ఉంటే ఆనిముషం నాప్రాణం పోయుండును."

"ఏమిటి చెయ్యాలంమరి? తప్పనిసరిగా వెళ్లేను. జుట్టు విరబోసుకుని రెండుమూడునెలలు తిండీ నిద్రా లేనిదానిలా ఇందిర పక్కలోపడుంది. నరసింహం పంతులుగారి భార్య, పాపం, పాలు త్రాగమని బ్రతిమాలుకుంటున్నారు. మమ్మల్ని చూడగానే ఇందిర తలగోడవైపుతిప్పేసింది. 'సోమశేఖరం వచ్చినా కూడా ఇలా అసందర్భంగా ఉంటే ఎలా ఇందిరా?' అన్నారాయన. నేను కొంతసేపటివరకూ మాటాడలేదు. ఆలోచించి ఆలోచించి ఆఖరికి 'ఒళ్లో చాలా జ్వరాలున్నాయి. ఇది జ్వరమేమో. వైద్యుడిని పిలిపించారా?' అన్నాను. నేనావిధంగా మాట్లాడినప్పుడు ఇందిర నామీదవేసిన చూపు నాజన్మన్నంతకాలం మరచిపోలేను. నానటనచూసి అది కోపమో ఆశ్చర్యమో ఆనందమో ఇప్పటికింకా నేను చెప్పలేను...మొన్నాడు వస్తే తండ్రీకూతురూ సావిట్లో కూర్చున్నారు. ఇందిర నాతో మాట్లాడింది కాని ఇంకా కొంతసిగ్గుపడుతోందని గ్రహించాను. నేనుమట్టుకు మామూలుగానే మాట్లాడేను. తర్వాత రెండురోజులయాక నేను వెళ్లినప్పుడు ఇందిర ఒక్కతే ఉంది. నేనిచ్చినపుస్తకం చదివేసేనంది. 'అంతా చదవడం అయిందా?' అనడిగేను. 'అంతా చదవడం అయింది' అని జవాబిచ్చింది. ఆపుస్తకం తనకి చదవడాని కివ్వడం పొరపాటేమోనని ఇన్నాళ్లూ బెంగపెట్టుకున్నానన్నాను. పొరపాటేమీ లేదంది. లోపలికి వెళ్లి ఆపుస్తకం తెచ్చి నాకిచ్చేసింది. అందులో నాఉత్తరాని కొకప్రత్యుత్తరం ఉంది."

"ఏమిటేది?"

"ప్రత్యుత్తరం"

"నిజంగా? ఏమి పన్నాగాలు! ఏమి దారుణం! ఈకాలప్పు ఆడకుర్రజట్టంతా ఇంతేః మానాయనమ్మతో ఈమాటచెప్తే, వైకుంఠఏకాదశివరకూ బ్రతికి ఆవేళచచ్చిపోవాలనుకుంటున్నది, ఈవాళే చచ్చిపోతుంది...ఏమిటుందా ప్రత్యుత్తరంలో?"

"తనకీ నేనంటే అభిమానమేననీ, నన్ను చూసినప్పటినుండీ తనకికూడా నాకు స్నేహితురాలనవాలన్న కోరిక కలిగిందనీ, ఇన్నాళ్లూ తనంటే నాకు ప్రత్యేకమైన ప్రేమలేదని నిరాశచేసుకున్నాననీ, తనజీవితానికి నేనిప్పుడొక అర్థం తెచ్చిపెట్టేను కనుక తనఆనందానికి అంతులేదనీ—కాని, తనజీవితంలో స్నేహభావానికి తప్ప మరొకభావానికి చోటులేదనీ వ్రాసింది."

"తర్వాత ఏమిటి చేసేవు నువ్వు? అన్నట్టు ఆ... సత్యవతన్నావిడ సంగతేమిటి?"

"చెప్పేదంతా వినుమరి. ఎలాగైనా ఇందిరని నేను పెళ్లిచేసుకోవాలని నిశ్చయించుకున్నాను. ఈ ఉత్తర ప్రత్యుత్తరాలు జరిగినతర్వాత ఇందిరతో కూర్చొని మాట్లాడడం, ఇందిరకి ఉత్తరాలు వ్రాయడం ఇందిర నాకు వ్రాసిన ఉత్తరాలు చదువుకోడం నాకెంత ఆనందం కలుగజేసేవో నేను చెప్పలేను. అనుభవించాలికాని వర్ణించడానికి వీలులేదు. సత్యవతి నెలా తప్పించుకు ఇవతలపడడం అన్నబాధలో పడ్డాను. నాకేమార్గం కనబడలేదు. రాత్రింపొగళ్లొక్కటే ఆలోచన. ఈఏడాదితో నాచదువు లయిపోతే ఒక సంవత్సరంలోపున ఎక్కడో ఏదో ఉద్యోగం సంపాదిస్తాననీ, ఉద్యోగం దొరకిన మొన్నాడు పెళ్లిచేసుకుని తనతో కాపురం పెడ్తాననీ సత్యవతిఅభిప్రాయం. ఉన్నబెంగలు చాలనట్టు సత్యవతికీ ఇందిరకీ, స్నేహం పెరిగిపోతోంది. సత్యవతి నాతో మాట్లాడినప్పుడల్లా ఇందిర తనతో నన్నుగురించి మరీ తరచుగా మాట్లాడుతుందని చికాకుపడుతూ చెప్పేది. ఇందిర ఇంటికి వీలైనంతవరకు వెళ్లవద్దని నన్ను ఆజ్ఞాపించేది. సత్యవతి ఎప్పుడూ నన్నుగురించే మాట్లాడుతుందనీ, సత్యవతిని నేనెన్నడూ వెళ్లిచూడకూడదనీ ఇందిర ఘోషపెట్టేది. ఏరోజు సత్యవతి ఇందిరకి నారహస్యం చెప్పేస్తుందో అని పట్టరాని కంగారు నాకు."

"మరి......మాటవరసకి అడుగుతున్నాను. మీ తండ్రిగారు నిన్ను పెళ్లిచేసుకోమని బలవంతపెట్టడం మానేసేరా ?"

"ఆయనా మానెయ్యడం? ఎలాగో మంచి మాటలుచెప్పి ఆరునెలలలో చేసుకుంటాననీ, వచ్చే ఏడాది చేసుకుంటాననీ, చదువులు సమాప్తి కానివ్వమనీ ఇంతవరకు తన్నుకొచ్చాను. రేపు గ్రామం చేరగానే ఏ అనాగరికపు అందవికారపు అంగ్రవనితనో అంట కట్టాడని నాకు తెలుసును."

"నీబాధలకి నాబాధ లేమాల కాని — మా నాన్న కూడా నన్ను చాలా బాధపెట్టున్నాడోయ్, సోమశేఖరం. నాకు చదువు అబ్బడం లేదని కనిపెట్టి మా మేనమామ తన కూతురుకోసం బెంగాల్‌నుండి సిలోన్‌వరకూ వేరే సంబంధాలు వెతికేడు. మ మేన మామకి బాగా చదువుకున్నవాడు కావాలి. ఎక్కడా దొరక లేదు. ఆఖరికి నేనే గతయాను. తప్పనిసరిగా నా కివ్వడలచుకున్నాడిప్పుడు. నాకా, ఇంతలో పెళ్లి చేసుకోవాలని లేదు. మంచికట్నం అనేసరికి మా నాన్న ఆనందపరవశుడై పోయాడు ...... అన్నట్టు నీ కథ చెప్పు."

"ఎంతవరకూ చెప్పేను?... అవును. వాళ్లిద్దరికీ స్నేహం హెచ్చిపోతోంది. సత్యవతిని వదలగొట్టుకునే సాధనం చిక్కడం లేదు. ఇలాఉండగా ఒకనాడుసాయింత్రం సత్యవతీ నేనూ కృష్ణయ్యగారిభార్యా బండిలో వెళ్తుంటే బోగంకొంపలలోనుండి బయటపడుతూ మన వాడు లంకా సోమసుందరం కనబడ్డాడు. నీకు తెలుసును కాదూ వాడికి త్రాగుడూ, తదితరమైన దుర వ్యాపాలూ పూర్తిగా అలవాటయాయని? ఆ సాయింత్రం వాడు జల్తారుఖండువా వేసుకుని మీసం దువ్వుకుంటూ తూలిపోతూ నడుస్తున్నాడు. వాడిని చూపించి 'ఆ త్రాగుబోతువెధవని చూడూ!' అంది సత్యవతి. వాడిని నేనెరుగుదునని చెప్పేను. ఒకానొక కాలంలో నాకు గొప్పస్నేహితుడన్నాను. అకస్మాత్తుగా తండ్రిచచ్చిపోయి చిన్నతనంలోనే డబ్బు చేతిలో పడడంవల్ల ఈవిధంగా పాడయిపోయాడని బోధపర చాను. అసహ్యించుకుంటూ, 'ఇంకా వాడితో నీకు స్నేహమేనా?' అని నన్నడిగింది సత్యవతి. తనాప్రశ్న వేసేసరికి నాచిక్కులు తొలగించుకునేందు కొక త్రోవ కనబడిందినాకు. అప్పటి కేదోసమాధానం చెప్పి, బండిలో ఆప్రశంస మానేసి ఇంటికి వెళ్లేక సత్యవతీ నేనూ ఇద్దరమే కూర్చున్నప్పుడు మళ్లీసోమసుందరం గురించి మాటలు మొదలుపెట్టేను. రెండునూడేళ్ల క్రిందటివరకూ నాకందరికంటే కూడా సోమసుందరం ముఖ్యస్నేహితుడనీ, ఇప్పుడు పూర్వకాలంలో ఉన్నంత గొప్పస్నేహితుడు కాకపోయినా ఇంకా స్నేహితుడే అనీ చెప్పేను. వాడితో పూర్తిగా స్నేహం మానుకుంటానని నన్ను వాగ్దానం చెయ్యమంది సత్యవతి. అటువంటి దిరిద్రులని చూసి భరించలేనంది. అటువంటివాళ్లతో సహవాసం పెట్టుకోడం నామర్యాదకి లోటంది. మానేందుకు ప్రయత్నం చేసేటట్టు మాటిస్తానన్నాను. అలా పనికిరాదంది. 'చిన్నతనంనుండీ నా స్నేహితుడుకదా!' అన్నాను. వాడితో స్నేహం వదులుకోకపోతే నాతో నికమాట్లాడనంది. నాకు తను ముఖ్యమో వాడు ముఖ్యమో ఇప్పుడే నిశ్చయించుకోమంది. అయిష్టంగా వాగ్దానం చేస్తున్నవాడిలా నటించి వాగ్దానం చేసేను ...అదకూక నాపన్నాగం సాధించడం ప్రయత్నంలో పడ్డాను."

"ఏమిటా పన్నాగం ?"

"వినుమరి. లంకాసోమసుందరంతో నేనెన్నడూ అంత స్నేహంగా ఉండలే దసలు. వాడు శుద్ధపోకిరీనే ననుకున్న దిదీ. చేసిన వాగ్దానం లెక్కచెయ్యక సత్యవతి చూస్తూ ఉండగా వాడితో జోస్తీగా తిరిగి నేనూ పాడయిపోయినవాడిలా నటిస్తే చూసి అసహ్యించుకుని సత్యవతి నన్ను వదలిపెట్టేస్తుందని ఆశ."

"భేష్! తెలివితేటలంటే అలా ఉండాలిమరి, మా మేనమామసంబంధం తప్పించుకునేందుకు నాకటువంటి పన్నాగం తోచాలంటే తోస్తుందా? ...ఏమి పన్నాగం! ఏమిపన్నా[illegible]...అయితే ఏమయిందికో"

ఉన్నవూ దిక్కావు! ...మొన్నాడు సోమసుందరం ఇంటికి వెళ్లేను. వాడు నన్ను అనుమానిస్తూ అనుమానిస్తూ లోపలికి రానిచ్చాడు. నేనెవరినో వాడికంత బాగా జ్ఞాపకం లేదన్నాడు. చిన్నతనంలో ఇద్దరం కలసి చదువుకున్నామనీ, ఈమధ్యనే తనమాట ఎవరో నాకు చెప్పడంవల్ల ఈవిధంగా వచ్చాననీ బోధపరచాను. మధ్యాహ్నం వాడింటి దగ్గరలో ఉన్న ఉడిపి కాఫీ హోటల్‌కి తీసుకువెళ్లి దిట్టంగా తిండిపెట్టేను. అప్పటికి వాడు నాతో పరవాలేదనుకుని సరదాగా మాట్లాడడం మొదలుపెట్టేడు. సాయంత్రం చీకటిపడబోతూ ఉంటే షికారుకి వెళ్దాం రమ్మన్నాను. ఎక్కడకని వాడు నన్నడిగితే 'నువ్వు తరచుగా ఎక్కడకి వెళ్తే అక్కడకే' అన్నాను. నవ్వుతూ వాడు సిగరెట్టుముట్టించి జల్తారుకండువా వేసుకొని మీసం దువ్వుతూ బయలుదేరేడు. నేనూ వాడివెంట పడ్డాను. వాడు వేరేవీధిని వెళ్లాలనుకుంటుంటే కృష్ణయ్యగారి వీధివెంట వెళ్దాం అన్నాను. సత్యవతీ, కృష్ణయ్యగారూ కూడా వీధిఅరుగుమీద రోజూ ఈవేళకి కుర్చీలువేయించుకుని కూర్చుంటారని నాకు తెలుసును. అనుకున్నట్టే వాళ్లు అరుగుమీద కూర్చుని కబుర్లుచెప్పుకుంటున్నారు. వీధిలో చీకటిగానే ఉంది కాని, ఏమాత్రమో కొంచెమైనా ఎరుగున్నవాళ్లని నడుస్తూఉండగా పోలికపట్టడం అసాధ్యం కాదు. సత్యవతి నన్ను పోలికపట్టింది. సోమసుందరాన్ని కూడా పోలికపట్టేఉండాలని నాకు తెలుసును. వెంటనే కృష్ణయ్యగారితో ఏదోచెప్పింది. ఆయన లేచి నుంచుని 'సోమశేఖరం! సోమశేఖరం!' అని పిలిచారు. పక్కనివాడు 'నిన్ను వాళ్లు పిలుస్తున్నారు. వినబడడంలేదా?' అన్నాడు. ఒకసారి వెనక్కి తిరిగి నేను సోమశేఖరాన్ని కానట్టు నడచి వెళ్లిపోయాను. మొన్నాడు కృష్ణయ్యగారింటికి నేను వెళ్లలేదు. ఆ తర్వాతరోజున వెళ్లగానే సత్యవతి అతికోపంగా నాకేసి తిరిగి 'మొన్నసాయంత్రం నాన్న నిన్ను పిలిస్తే ఎందుకు పలుకలేదు?' అనడిగింది. 'మొన్న సాయంత్రమా?' అన్నాను, ఆశ్చర్యపోతున్నవాడిలా నటిస్తూ. తనుచూసిన దంతా చెప్ప[illegible]నేను నవ్వేసేను. 'అపోకిరీ వెధవతో తిన్న వెళ్తున్నది నువ్వే. నా కళ్లారా చూసేను' అంది. నేను తలనొప్పిగా ఉండి ఆరోజల్లా నాగదిలో పడుకున్నానన్నాను. మొదట నమ్మలేదు. ఆఖరికి కృష్ణయ్యగారు, 'నేనా రోజునసే అన్నాను కాదమ్మా? సోమశేఖరం అయితే ఎందుకు మాట్లాడకుండా వెళ్లిపోతాడు? ఆచీకట్లో ఎవరినో చూసి సోమశేఖరం అనుకున్నాం' అన్నారు. ఆరోజు ఆవిధంగా గడచిపోయింది. సత్యవతి మట్టుకు మనస్సులో ఇంకా కొంచెం అనుమానం పెట్టుకుంది. ఇది జరిగిన కొన్నాళ్లకి కృష్ణయ్యగారు బ్రహ్మసమాజపు పనిమీద కలకత్తా వెళ్లేరు."

"బ్రహ్మసమాజపువాళ్లే మకాముదీనాలం కలకత్తాయేనా?"

"అలా అనే చెప్పవచ్చును ...కృష్ణయ్యగారు ఊళ్లో లేనప్పుడు సత్యవతి తమ్ముడితో ప్రతిసాయంత్రమూ రైలుపట్టాలుదాటితే ఉన్న సరుగుడుతోటల దగ్గరికి గుర్రపుబండిలో షికారుకి వెళ్లేది. ఆమాట తెలిసి ఒకసాయంత్రం సోమసుందరాన్ని అక్కడికి తీసుకుపోయాను. ఇంకా సత్యవతి రాలేదు. వాడు సిగరెట్టు ముట్టించాడు. అంతవరకు ఎన్నడూ సిగరెట్లు నేను కాల్చలేదు. వాడిదగ్గర ఒకటి పుచ్చుకుని ఆసాయంత్రం నేనూ ఒకటి ముట్టించాను. పీల్చేటప్పుడు గుక్కతిరగకా, పొగ కళ్లల్లోకి వెళ్లి కళ్లుమండి బాధపడుతూ సిగరెట్టు కాలుస్తున్నాను. సమయంలో సత్యవతిబండివచ్చింది. మేము కూర్చున్నచోటుకి ఇరవైముప్ఫైగజాలదూరంలో బండివెళ్తోంది. సత్యవతి మమ్మల్నిద్దరినీ చూసింది. బాగా పోలికపట్టింది కూడాను. నేను గబాలున లేచి సోమసుందరంతో 'ఆబండిలోవాళ్లు మనని చూడకూడదు. ఈచెట్లసందులో దాంకోవాలి. లే' అన్నాను. వాడుఎందుకని ప్రశ్నలువెయ్యడం మొదలెట్టేడు. 'తర్వాత చెప్తానులే' అన్నాను, వాడు సణుగుకుంటూ నావెంట వచ్చాడు. సత్యవతి బండి నిలిపించింది. అంతా జరగవలసిన విధంగానే జరుగుతోందని సంతోషించాను. సోమసుందరంతో, 'మనం పరుగెత్తి ఊళ్లోపడాలి'

అన్నాను. వాడి చికాకు చూసి నవ్వాలోడమో, జాలి పడడమో నాకు తెలియలేదు. పాపం తొందర తొందరగా పరుగులువేస్తూ వాడు నాతో వచ్చాడు. సత్యవతి బండితిప్పించి మళ్లీమావెంట బయలుదేరింది. మాదగ్గరకి బండి వచ్చినప్పుడు నాకేసి ఒకసారి చూసి కళ్లెర్రజేసి మరోకవైపు చూస్తూ కూర్చుంది. కేశవ చంద్రుడు నవ్వుతూ 'అక్కయ్యా ఆయనరుగో' అన్నాడు. బండి వెళ్లి పోయింది. సోమసుందరం పరుగులతో ప్రాణం పోయిందని నడివీథిలో చతికిలబడ్డాడు. వాడిని లేవ దీసుకుని మంచి మాటలు చెప్పి వాడింట్లో దిగబెట్టి నేను నాగదికి పోయాను. మొన్నాడు కృష్ణయ్యగారింటికి వెళ్లేను. దూరంలో నన్ను చూసి సత్యవతి లోపలికి వెళ్లిపోయింది. సావిట్లో పదినిముషాలు కూర్చున్నాను. కృష్ణయ్యగారిభార్య మూలగానుంచుని ఒక్కక్షణం చూసీచూడనట్టుగా నాకేసి చూసి మళ్లీ వెళ్లిపోయారు. మరోక అయిదునిముషాలయాక ఆవిడ సావిట్లోకి వచ్చారు. నమస్కారంపెట్టి 'సత్యవతి ఇంట్లో ఉందా?' అని అడిగేను. 'ఇంట్లోనే ఉంది కాని తీవ్రంగా తలనొప్పిగా ఉందట. నిన్నిప్పుడు చూడనంది' అన్నా రావిడ. 'చాలా ముఖ్యమైన విషయమై మాట్లాడాలి. ఒక్కసారి రమ్మని బతిమాలుకుంటున్నానని చెప్పండి' అన్నాను. సత్యవతి వచ్చింది. మాట్లాడకుండా నాయెదురుగా ఒకకుర్చీలో కూర్చుంది. నేనూ ఏదో తప్పుచేసినవాడిలా నిజంగా బెదిరిపోయి చూస్తున్నాను. 'ఎందుకు నన్ను రమ్మనడం?' అంది ఆఖరికి. 'ఇన్నాళ్లూ నిన్ను చాలా మోసపుచ్చాను, సత్యవతీ. నా అంతదుర్మార్గుడీలోకంలో లేడు. నీఅంత పవిత్రమైన పిల్లకి నేనెన్నడూ తగిన వాడిని కాను' అన్నాను. ఇంకా ఏమిటేమిటో గొణిగేను. 'ఆసాయంత్రం నాన్నా నేనూ చూసినది నిన్నేనా... ఆమనిషితో?' అని అడిగింది సత్యవతి. ఇటూ అటూ చూస్తూ అతిఅయిష్టంగా 'నన్నే' అని సమాధానం చెప్పేను. సోమసుందరం నాకన్నేళ్లబట్టి స్నేహితుడో చెప్పమంది. నాచిన్నతనంనుండీ ప్రాణస్నేహితుడు కనుక అతనితోపాటు నేనూ చెడ్డమార్గాలలో పడ్డాననీ, తప్పించుకుందాం అని ప్రయత్నంచేసినాకూడా తప్పించుకోలేక పోయాననీ, ఇన్నేళ్లబట్టీ కృష్ణయ్యగారినీ తననీ ఈవిధంగా మోసపుచ్చడం నాకు చాలా సిగ్గుకలుగజేసిందనీ, ఇప్పటికి తనకి పట్టుబడడం సంభవించిందనీ చెప్పేను. చేసినతప్పు కంతటికీ క్షమార్పణ కోరి ఈరోజునుండి తన కికనేమీ హానిరాకుండా తనజీవితానికేమీ భంగం కలుగకుండా నామార్గాన్ని నేనుపోయి తనయిష్టాస్వేచ్ఛ తనదయేటట్టు చేస్తానని కూడా అన్నాను. 'చెడ్డమార్గాలలో దిగనవడంలో అర్థంఏమిటి?' అంది సత్యవతి. నేనేమీ జవాబుచెప్పలేదు. 'తాగుడుఅలవాటుందా?' అని అడిగింది. 'ఒకటిరెండుసార్లు తాగినా అలవాటు కాలేదు' అన్నాను. 'ఇంకా ఏమి తప్పుపనులుచేసేవు?' అని ప్రశ్నించింది. 'ఏమనిచెప్పను? నేను చెయ్యని తప్పుపని లేదు' అన్నాను. 'నిజంగా?' అని సత్యవతి అంటే 'నిజంగానే' అని జవాబు చెప్పేను. ఒక్క నిముషం కనురెప్పలు మూయ్యకుండా నాకేసి చూసి చూసి చటుక్కున ఏడుపు ప్రారంభించింది. చీర కొంగుతో కళ్లద్దుకుంది. నేను లేచి ఇటూ అటూ పచార్లు మొదలుపెట్టేను. నావంటి మర్యాదహీనుడు లేడని ఒప్పుకున్నాను. మర్యాదస్థుల ఇళ్లల్లోకి రావడానికి నాకు హక్కులేదన్నాను... సత్యవతి నేనూ మాట్లాడడం ప్రారంభించగానే మరీఏడవడం మొదలుపెట్టేది. తను లేచి లోపలికివెళ్లిపోబోతుంటే త్రోవలో అడ్డంగా నుంచుని నన్ను క్షమించమని బతిమాలుకున్నాను. 'నాతో మాట్లాడవద్దు. నన్ను చూడవద్దు. ఇప్పుడిప్పుడే ఈఇంటికి రావద్దు. వెళ్లిపో' అంటూ నన్ను తప్పించుకుని లోపలికి వెళ్లిపోయింది. కృష్ణయ్యగారి భార్య నాతో మాట్లాడడానికి రాకుండానే నేను వారి ఇల్లు విడచి వెళ్లిపోయాను."

"అంతా బాగానే ఉంది కాని ఆ... ఇందిరన్నావిడ సంగతేమిటి?

"చరిత్రంతావిను. తొందరపడకు."

"ఇదొక చరిత్రే... అంతా. ఏదో కప్పుతక్కడే వ్యవహారంలా [illegible] కాని....."

ఒకవారంరోజులవరకూ సత్యవతిని చూడడానికి నేను వెళ్లలేదు. ఉత్తరం మట్టుకొకటి వ్రాశాను. ఉత్తరంలో తను నన్ను మరచిపోలేకాని తనకి మనశ్శాంతి ఉండదన్నాను. మల్లెపువ్వుపరిమళంవంటి స్వభావంకల తను నాదానిగా ఇన్నాళ్లుండడం తనదురదృష్టం కాని మరొకటి కాదన్నాను. తన సుగుణాలు నేనెప్పటికీ మరచిపోలేనన్నాను. నేనెటువంటివాడనైనా నాహృదయంలో అగ్రస్థానం ఎల్లకాలాలకీ తనదే అన్నాను. అయినా నేనింక తన జీవితంలో జోక్యం కలుగజేసుకోననీ, నాఘోరమైన తప్పులన్నీ క్షమించమనీ వ్రాశాను...సత్యవతిని చూడని వారం రోజులలోనూ ఇందిరని చూడడానికి తరచుగా వెళ్లేవాడిని. వెళ్లిన మొదటి మూడునాలుగుసార్లూ ఇందిర నాతో హాయిగా మాట్లాడింది. నరసింహంపంతులుగారుకూడా సరదాగా మాట్లాడేరు. కాని ఆఖరిసారి వెళ్లినప్పుడు ఆయననడత నాకు చాలావిచిత్రం అనిపించింది. నేను వెళ్లగానే పత్రిక చదువుతూ కూర్చున్నవారు చటుక్కున లేచి 'చాలా తొందరపని ఉన్నాయి. క్షమించు' అంటూ లోపలికి వెళ్లిపోబోయారు. 'ఇందిర ఇంట్లో ఉందా?' అని నేనడిగితే 'లేదు' అని కఠినంగా జవాబిచ్చి లోపలికి వెళ్లిపోయారు. ఆవేళప్పుడు ఇందిర ఇల్లువదలి బయటకివెళ్లడం నేనెన్నడూ ఎరుగను. నరసింహంపంతులు గారు అబద్ధం చెప్తున్నారా?' అని అనుమానపడ్డాను. అయినా ఎందుకు నాకాయన అబద్ధంచెప్పాలి? ... నిజంగా ఇందిర ఇంట్లోలేదనే నిశ్చయించుకున్నాను. ఈ విషయమై ఆలోచిస్తూ తిన్నగా సత్యవతిఇంటికి వెళ్లేను. సత్యవతి వెట్టుసరి చెయ్యకుండా నాదగ్గరికి వచ్చి కూర్చుంది. 'కృష్ణయ్యగారు వచ్చేసేరా?' అని నేనడిగితే 'ఇంకా రాలేద'ని జవాబిచ్చింది. తనంతట తనే నా ఉత్తరం అందిందని చెప్పింది. ఈవారం రోజులూ తను అనుభవించిన దుఃఖం ఇంతా అంతా కాదంది. తన బాధ ఎవరితో చెప్పుకునేందుకూ తోచలేదట. తన స్వంత తల్లికే అంతా విపులంగా చెప్పేందుకు మనస్సొప్పలేదంది. ఒకటిరెండుసార్లు ఎందువల్లనో వెళ్లి ఇందిరకి తనదుఃఖం అంతా బోధపరచాలని బుద్ధిపుట్టిందట. కాని చూడడానికి వెళ్లికూడా ఈవిషయమై ఏమీ మాట్లాడలేదంది ... సత్యవతి సావకాశంగా ఈ మాటలన్నీ చెప్తుంటే నాగుండెలో రాయిపడింది. ఒకవైపున 'కొంపతీసి ఇందిరతో నావిషయం అంతా చెప్పేసిందా?' అని కంగారు. మరొకవైపున 'సత్యవతి కోపం అంతా ఎక్కడకి పోయిందా!' అని ఆశ్చర్యం...కాసేపట్లో నాపన్నాగం అంతా వృథా అయిపోయిందని నాకు బోధపడింది. చెడ్డసహవాసంవల్ల చెడ్డమార్గాలలో పడినప్పటికీ నిజానికి నేను దుర్మార్గుడిని కానని తను వారంరోజులు ఏడ్చిఏడ్చి ఆఖరికి గ్రహించానంది. స్నేహితుడెవడైనా దుస్సహవాసంవల్ల పాడవుతున్నాడని కనిపెట్టినప్పుడు ఎవరిదైనా కర్తవ్యం ఆస్నేహితుడిని బాగుపరచడంకాని జరిగేదేదో జరగనివ్వమని ఊరుకోడం కాదంది. తనకర్తవ్యం ఇప్పుడు నన్ను బాగుపరచడం అంది. స్త్రీసాంగత్యం స్త్రీసహాయం కావలసినంతా లేకనే ఇలా నేను పాడయిపోయానన్నమాట నిశ్చయం అంది. కోపాలకీ, శాపాలకీ ఇది సమయం కాదంది. నన్ను బాగుపరచడానికి తను ఆలోచించగలిగినంతవరకు ఒకటే మార్గం కనబడుతోందంది. నాపరీక్ష ఎలాగో అయిపోయింది కనుక, ఎలాగా నేను పరీక్షలో ఉత్తీర్ణుడనవడం స్థిరం కనుక ఉద్యోగం అయేవరకూ పెళ్లికోసం ఆగకుండా ఎంత త్వరలో మేమిద్దరం పెళ్లిచేసుకుంటే అంతమంచిదంది. పెళ్లయాక సోమసుందరం వచ్చి నన్ను పాడుచెయ్యకుండా చూసే బాధ్యత తనదంది. స్త్రీలు ఎంత అసాధ్యమైన కార్యాలైనా సాధించగలరని తనకి తెలుసునంది. కృష్ణయ్యగారు కలకత్తానుంచి రాగానే ఈపెళ్లిమాట ఆయనకి నన్నే చెప్పమంది. నేనే మరొక కారణానికి తొందరపడుతున్నట్టుగా బోధపరచమంది. పెళ్లయాక ఉద్యోగం లభించేవరకూ ఇద్దరం వాళ్లనాన్నతో ఈఇంట్లోనే ఉండొచ్చునంది... ఈవిధంగా సత్యవతి మాట్లాడుతుంటే నేను మారుమాట్లాడలేకపోయాను. నానోరు కుట్టేసినట్టయిపోయింది. నామెదడు జ్వరతీవ్రంలో కొట్టుకుంటున్నవాడిమెదడులా కృశించి

పోయింది. తను నన్నీవిధంగా క్షమించినందుకు ఆనందిస్తున్నవాడిలా ఏవో నాలుగు తెలివితక్కువ ముక్కలు విదజల్లి వీథిలో పడ్డాను."

"అయితే ఆవిడ నీతో ఈవిధంగా మాట్లాడటం తల్లిగారి ప్రోత్సాహంవల్లనే అంటావా?"

"సందేహం లేదు."

"నువ్వు దుర్వ్యసనాలలో దిగేవని తెలిసికూడా నిన్నావిడ వదలదలచుకోలేదన్నమాట."

"నేను చెప్తున్నదేమిటి మరి?"

"నాకు తెలియక అడుగుతున్నాను — స్త్రీలు పురుషులలో మర్యాదస్థులకంటె పోకిరీలని ఎక్కువ ప్రేమిస్తారట నిజమేనా? మానవస్వభావం సంపూర్ణంగా పరీక్షచేసిన పాశ్చాత్యపండితు డెవడో అన్నాడని విన్నాను."

"ఏమో, ఎవరు చెప్పగలరు? నాకు తెలిసినదల్లా స్త్రీస్వభావం ఈజన్మలో నేనెప్పటికీ బోధపరచుకోలేనని."

"స్త్రీలవిషయమై ఆమాత్రం బోధపరచుకుంటే వాళ్లని పూర్తిగా బోధపరచుకున్నట్టే అంటారు. నేను కూడా వాళ్లను గురించి చర్చ మొదలుపెట్టాలి... ... తర్వాత సంగతి చెప్పు."

"ఇక చెప్పవలసినదంత లేదు. ఇంటికి వచ్చేసరికి ఇందిరదగ్గరనుంచి ఒక ఉత్తరం ఇక్కడ పడుంది. ఆ ఉత్తరం చదవగానే ఉన్న ప్రాణం కాస్తా కూడా పోయింది నాకు."

"ఏమిటి వ్రాసిం దావిడ?"

"ఏముం దేమిటి!... సత్యవతివెళ్లి ఇందిరతో ఆ ఆందోళనలో నాచరిత్ర మొదటినుండీ చెప్పేసిందట."

"ఇప్పుడే కాదూ చెప్పలే దని ఆవిడ చెప్పేరన్నావు నీతో?"

"సత్యవతి నాతో అబద్ధం చెప్పింది."

"ఏమిటి వ్రాసింది. ఆ... ఇందిర నావిడ?"

"సత్యవతికీ నాకూ ఉన్న సంబంధం ఇన్నాళ్లూ తనకి తెలియపరచకుండా దాచడంకంటె అవమానమైన నడత మరొకటి లేదని వ్రాసింది. తర్వాత, సత్యవతివెళ్లి నేను లంకా సోమసుందరంతో తిరిగి సారాయిరాయుడి నయానసీ, ముండల ముఠాకోరునయానసీ కూడా చెప్పిందట. సత్యవతికి క్షమార్పణ కోరుతూ నేనీమధ్య వ్రాసిన ఉత్తరంకూడా సత్యవతి ఇందిరకి చూపించిందట. అంతకంటె సిగ్గుచేటు మరొకటి లేదని వ్రాసింది ఇందిర. తనతో నాకిక నేమీసంబంధానికీ వీలు లేదనీ, తను నాకు వ్రాసిన ఉత్తరాలన్నీ నేను చింపెయ్యాలనీ, నాఉత్తరాలన్నీ అప్పుడే ముక్కలు ముక్కలుగా మ్యునిసిపల్ బండిలో ప్రయాణం చేస్తున్నాయనీ, చూడడానికి తనఇంటికి నేనెన్నడూ రా కూడదనీ, నన్ను గురించి ఈవిషయాలు కొన్ని తెలియడం వల్ల నరసింహంపంతులుగారుకూడా, నేను వారింటికి రాకుండా చూసేటట్టు శపథంపట్టేరనీ తనకి నాద్వారా వల్ల కలిగిన దుఃఖం జన్మజన్మలకీ మరచిపోలేననీ వ్రాసింది... ఇదీ నాపన్నాగంయొక్క ఫలితం. వదిలిపెట్టిందనుకున్న సత్యవతి నన్ను పూర్వం అనుకున్నకంటె ముందుగా పెళ్లిచేసుకుంటానంటుంది. పెళ్లిచేసుకుందాం అనుకున్న ఇందిర నన్నికను చూడనే చూడనంటుంది. ఇవన్నీ ఇలాఉండగా..."

"నే నొకమాట చెప్తాను వింటావా?"

"ఇవన్నీ ఇలాఉండగా లంకాసోమసుందరంతో స్నేహంచెయ్యడంవల్ల పైగా ఇరవై రూపాయిలు క్షవరంకూడాను."

"అ దెందుకువల్ల?"

"వాడు స్నేహం మొదలుపెట్టిన మూడవరోజున ఇరవై రూపాయిలు అప్పిచ్చేవరకూ చంపుకుతిన్నాడు. మంచిమాటచేసుకుంటే ఎందుకైనా మంచిదని వెంటనే అప్పిచ్చేను. ఆ ఇరవై ఈజన్మలో మళ్లీ నాకళ్లపడదు."

"శభేష్!......ఆ ఇరవై రూపాయిలూ పోతే పోయాయి కాని, నీపెళ్లిమాట..."

"ఇంకా నాపెళ్లిమాటేమిటి? సత్యవతిని నే నెప్పటికీ పెళ్లిచేసుకోను. ఇందిర నాకేసి చూసిందింక"

"అందుకేనోయ్...మా మేనమామకి సరిగ్గా నీ వంటివాడే చదువుకున్న అల్లుడు కావాలి. నువ్వు ఎందుకు చేసుకోకూడదూ అతని కూతుర్ని?"

"సరిసరి! ఆసంబంధం ఇలా తప్పించుకోవాలని పన్నాగం పన్నుతున్నావా నువ్వు?"

"తప్పించుకోవాలని కాదు... నిజంగా. మా మేనమామకూతురంటే నాకెంతో అభిమానం. ఆపిల్ల నాతోకంటె నీతో ఎక్కువ సుఖంగా ఉంటుందని నాకు తెలుసును. ఆపిల్లసుఖమే నాసుఖం..."

"కట్టిపెట్టు నీ........"

"చాలా అందమైనది. ఆపైన నీఇష్టం. జుట్టు మోకాళ్లవరకూ వేళ్లాడుతూ ఉంటుంది. శరీరచ్ఛాయ చెప్పనలవికాదు..."

"అంతేనలుపా?"

"ఆహా నువ్వొతీ నేఅర్థం! ......వేగు విలాసిని. శృంగారకావ్యాలిచ్చేదు. నాకువ్రక్కి లాటులేను. భాగవత భాగవతాలు అనర్గళంగా అప్పచెప్పగలదు."

"ఇంగ్లీషు రాదా?"

"ఇంగ్లీషా?...కొంచెం వచ్చునసే బుకాదు...... పదివేలదాకా కట్నం ఇవ్వడానికి సిద్ధంగా ఉన్నాడు మా మేనమామ."

"పదివేలే!...ఎన్నేళ్లాపిల్లకి?"

---



మ్యూజియము-తిరువనంతపురము    A. A. C.




## పోట్లాడెడి భటులు

కొ. నరసింహాచారి

ఇదియొక కదలెడిబొమ్మ. ఇందు రెండు ముఖ్యభాగములు కలవు. (౧) ఇద్దఱు భటులు, (౨) పీట.

### ౧. భటులు




ఒక గట్టి అట్టపైని ౧౦అంగుళముల నిడివికి మించక చిత్రము నందలి రూపమును వ్రాయవలెను. ఇందలి కాలు సేతులు చక్కగా గుర్తించుకొనవలెను. తర్వాత దీని యందలి కొలతల ప్రకారము చేతులు వెనుకటి కాలు లేక తక్కిన భాగమును మాత్రము మఱియొక గట్టి అట్టపైని చిత్రించుకొని కోసికొనవలెను. (చిత్రము 3). పిమ్మట వేర్వేరు తునుకలుగా, వెనుకటికాలు (చి. ౨)ను, ముందటికాలు (చి. ౭)ను, రెండు ఎడమ చేతులు (చి. ౫)ను రెండు కుడిచేతులు (చి. ౬) ను కోసికొనవలెను. కాళ్ల యందు a అనుభాగము అధికముగా నుండినయెడల బొమ్మతో చేర్చి బిగించుట కనుకూలముగ నుండును. తర్వాత మొదట వ్రాసిన బొమ్మయందు చేతులను, ముందటి

కాలిని కోసివేసి మిగత భాగమును (చి. ౮) కోసియుంచుకొనవలెను. పిమ్మట చిత్రము 3 నందలి రూపమునకు (చి. ౨) నందలి కాలును, ఒకకత్తిగల చేయియు, ఒక ఒకకత్తిలేని చేయియు చేర్చిపెట్టుకొనవలెను. చి. ౯ a యందలిబిళ్లసూదు(Paper fastner) లను తీసికొని చి. ౧ a వద్దనుండు విధముగ కాలినిచేర్చి బిళ్లసూదినిదూర్చి వెనుకప్రక్క సూదిమొనలను చి. ౯ b వలె శీలదీసి అదుమ వలెను. తర్వాత కుడిప్రక్క కత్తిగలచేతి నిన్ని, ఎడమప్రక్క కత్తిలేని చేతినిన్ని చేర్చి పెట్టి చి. ౧ b వలె మఱియొకసూదినిబిగించ వలెను. ఇదేరీతిని మిగతభాగములను చేర్చి రెండవమనిషినిగూడ సిద్ధపఱచు కొనవలెను.

## ౨. పీట




౧౬ అంగుళములు నిడివియు ఆంతియు పొడవును గల యొక యట్టపైని చి. ౧౦ యందు గుర్తించబడి యుండు కొలతల ప్రకారము రేఖలు వేసికొని మూలగీతలు వేసియుండు (Hatched) భాగములు నన్నిటిని కోసి (Portions) తీసివేయవలెను. ఇందు A పైభాగము. దీనిపైననే భటుల నమర్చవలసియున్నది. B వెనుకభాగము C అడుగుభాగము. D ముందుభాగము. దీనినే కడపటమూతగా నుపయోగించవలెను. E F భాగములు కుడియెడమప్రక్కలగును.

A యందు a, a అను రెండు నిడుపాటి సందులను b, b అను రెండుచిన్న సం

దులనుకోయవలెను. వీటిస్థానములు చిత్రము నగుర్తించియుండు కొలతల ప్రకారము ఉండవలెను. ఈరెండువరుసల సందులును (Slits) అట్టలో మధ్యభాగమున నుండవలెను. b b సందుల మధ్యభాగమునకు నేరుగా B యందు s, s అనుచోటులందును D యందు t, t అనుచోటులందును కమ్ములు దూరుటకుతగిన రంధ్రములను చేయవలెను. A యందు e వద్ద నొకరంధ్రమును, D యందు d వద్దనొక సందును ఉండవలెను.

పెట్టెను మూసినతర్వాత A యందలి a, a సందులకు సరిగా నుండునటుల E F అను ప్రక్కలందు c c అను రెండుసందులను చేయవలెను. (చి. ౮ a c చూడుడు). f అను అతుకుతునుకను, g అను అంచునకు లోప్రక్కగను, h ని i కి లో ప్రక్కగను, J ను, K కు లోప్రక్కగను, l ను m కు లోప్రక్కగను వచ్చునటుల మడిచి అతికించవలెను. అపుడు A B C E F లు మాత్రము మడువబడి ఒక తొట్టివలె నేర్పడి తొట్టిలో పలిభాగము మన కెదురుగా చిత్రము ౮ యందువలె నుండును. పిమ్మట చి. ౧౧ నందువలె ఒక ౧౮ అంగుళములు పొడవును ౪ అం. వెడల్పునుగల గట్టి అట్టముక్కను దీసికొని చి. ౧౦ లోని E F లందుండు c c సందులగుండా దూర్చిపెట్టవలెను (చి. ౮ r r).

చిత్రము ౮ యందలివిధముగ A భటుని మొదమకాలియొక్క క్రింది అతుకు తునుకను a సందుగుండా దూర్చి, r r తునుకకు ఒక బిళ్ల సూదితో (s) బిగించవలెను. ఈ విధమున B భటునియొక్క కుడికాలిని గూడ రెండవ a సందుగుండా దూర్చి S వద్ద బిళ్ల సూదితో బిగించవలెను.

తర్వాత ఒక్కొక్క భటుని యొక్క రెండవకాలిని b, b సందుల గుండా దూర్చి వానిగుండా t, t లవద్ద రెండు కమ్ములను దూర్చవలెను. ఈకమ్ములు చి. ౧౨ నందలి విధముగ నుండవలెను. ఒకకొననుముందుగా వలయాకారముగ వంచుకొని, భటులను అమర్చుకొనినతర్వాత D అనుపీట మూతను గూడమూసి దానియందలి రంధ్రములగుండా (చి. ౧౦ s s-t t) దూర్చి కమ్ముల రెండవ కొనలనుగూడ వలయాకారముగ వంచుకొనవలెను. ఈకమ్ములు r r అను అట్టముక్కనుఆటంకపఱుచ రాదు. ఇట్లు భటులను బిగించి D మూతను మూసినపుడు అందలి d సందుగుండా A యందలి e దూర్చి e రంధ్రములో బిళ్లసూదిని వేసినమొదల మూత ముందుకు వాలక నిలిచియుండును.

తర్వాత r, r తునుకను ముందువెనుకలకు లాగినమొదల దానికి బిగించబడినభటుల కాళ్లు ముందు వెనుకలకు జరిగి ఒకరినొకరు కొట్టబోయివట్లు తోపజేయును. కమ్ములు దూర్చబడిన తక్కిన కాళ్లు కదలవు కాని కమ్ములపైని తిరుగ గలిగియుండును. ఇందలి రంధ్రములును సందులును వాటి యందు దూర్చబడిన అట్టముక్కలు గాని, కమ్ములు గాని వదులుగా తిరుగునట్లుండవలెను.



కృష్ణాష్టమి

(శ్రీ కాశీనాథునాగేశ్వరరావుగారి తంజావూరు ప్రాచీనచిత్రసంగ్రహమునుండి)

# వేదము వేంకటరాయశాస్త్రులవారి జీవితము

వే. వేంకటరాయఁడు

దక్షిణభారతదేశమందలి సంస్కృత విద్వాంసులలో మేటియు, ఆంధ్రదేశమందలి పండితులలో నగ్రగణ్యులును, "ఉషాప్రతాపరుద్రీయాది నాటక-ఆంధ్రాభిజ్ఞానశాకుంతలాద్యనువాద ఆముక్తమాల్యదా శృంగారనైషధాది వ్యాఖ్యాన - కథాసరిత్సాగరాది గద్య-ఆంధ్రప్రసన్నరాఘవనాటకవిమర్శకాది విమర్శన-గ్రంథకర్తలును, అధిష్ఠితమదరాసు క్రిస్టియన్ కాలేజీ సంస్కృత మహోపాధ్యాయత్వ ప్రాచ్యభాషా ప్రవచనాధ్యక్షత్వపదులును", "నాటకకళాభరతమునియు", 'జంకుకళంకము లేని కవిచంద్రు'లును, మహామహోపాధ్యాయ, సర్వతంత్రస్వతంత్ర, విద్యాదానవ్రతమహోదధి, పండితరాజ, వ్యాఖ్యాతృచక్రవర్తి, అభినవమల్లినాథ, కళాప్రపూర్ణేత్యాద్యసంఖ్యాక బిరుదవిరాజితులును, కరుణాసింధువులును, 'విమతులకు పులియు విశ్వాసభాజనులకు చెలియు', విద్యార్థి కామధేనువులును, "యథాశక్తి త్యాగియు", ఋషికల్పులును, ఎల్లవారికిని ఆదర్శప్రాయులును, నను నస్మత్పితామహులు బ్రహ్మశ్రీ వేదము వేంకటరాయశాస్త్రులవారి జీవిత చరిత్రాంశములను అటనట వారి గ్రంథములయందే చెదరి యున్న వానినెల్ల "ఒక్కచోటనే యొడఁగూర్చ నుత్సహించి" వానితో నేను వారి శుశ్రూషలో పలుమార్లు వినియుండిన విషయములనుంగూడ చేర్చి కేవలము జాపితాగా నీ చిన్నివ్యాసమును వ్రాయుచున్నాఁడను.



శ్రీ వేదము వేంకటరాయశాస్త్రిగారు

* * *

నెల్లూరుజిల్లా కావలి తాలూకాలో సముద్ర తీరమున, ఇసుకపల్లెకు సమీపమున, మల్లయపాళెమని గ్రామమొకటి గలదు. అందు వేదము వేంకటరాయ శాస్త్రులవారని 'వేదశాస్త్రముల యందు ప్రఖ్యాతులు, అప్రతిగ్రాహకు' లుండిరి. వారి కుమారులు వేంకట రమణ శాస్త్రులవారు. వీరు కంచిలో నివర్తి వేంకటరామశాస్త్రులవారికడ విద్యాభ్యాసమొనర్చి, మదరాసులో సంస్కృతాంధ్రద్రావిడ పాఠశాలలో ప్రధాన పండితులుగాను, కాకినాడ హైస్కూలు సంస్కృత పండితులుగాను, నరసాపురం నార్మలు స్కూలు ప్రథమోపాధ్యాయులుగాను, పోడూరు స్కూలు హెడ్మాస్టరుగాను, పిమ్మట విశాఖపట్టణము నార్మలు స్కూలు పండితులుగాను, అనంతరము రాజమండ్రి కాలేజీ సంస్కృతప్రధాన పండితులుగాను నుండి విశ్రాంతివేతనముం బొందిరి. మఱియు వీరు "వైయాకరణపతంజలి యని ప్రఖ్యాతులు, మహారసజ్ఞులు,

అద్భుతసాహిత్యపండితులు, సౌజన్యపరమావధి, శిష్టులు, సత్యసంధులు, కరుణాపరాయణులు, యథాశక్తి త్యాగి." వీరికి "అనారోగ్యము అరుదు." పట్టిసము పుష్కరాలలో కొంతమీఁద ఆలుమాసములు దోసెఁడు శేఁగుఁబండ్లు మాత్రము భుజించుచు నేలు ఆహారముగాని, తపస్సానర్చిరి. ౮౩ సంవత్సరములు జీవించి ౧౯౦౦



వేదము వేంకటరాయశాస్త్రిగారి తలిదండ్రులు వేదము లక్ష్మమ్మ. వేదము వేంకటరమణశాస్త్రి.

సంవత్సరమున పరమపదించిరి. వీరు రచియించిన గ్రంథములు రెండు-లఘువ్యాకరణ, ఆత్మబోధవివరణమును.

ఈ మహనీయుని ప్రథమపుత్రులు బ్రహ్మశ్రీ వేదము వేంకటరాయశాస్త్రులవారు, వారు మదరాసులో నుండఁగా ౧౮౫౩ సం. డిసెంబరు ౨౩ తేది నాఁడు జనించిరి. శాస్త్రులవారి బాల్యమంతయు ఆంధ్రదేశమున పలుతావుల గడచెను. కడపటి దినములలో వారు తమ జీవితచరిత్రమును 'వేంకటరాయశాస్త్రి భాగధేయ' మను శీర్షికతో వ్రాయనారంభించి అసంపూర్తిగానే వదలివైచిరి. అందు తమ బాల్యవృత్తాంతమును తామే యిట్లు చెప్పికొనియున్నారు.— "మదీయ నరసాపురచరిత్రము.... ......అక్కడ ప్రతి తరగతిలోను నేనే మొదటివాఁడనగుదును. పై తరగతిలో నన్ను వేయఁగానే క్షణములో నేనే మొదటివాఁడ నగుదును. మఱి నా తోవు తప్పింప నొరులతరము గాదు. నాకు ఒకమాఱు చెప్పిన చాలును. ఒకమాఱు చదివిన వచ్చును; నాకు సులువుగరానిది గణితము, కుదురనిది చేతివ్రాఁత. నేను దెబ్బ లెఱుఁగను, అబద్ధము చెప్పను. సాలాఖరు పరీక్షలో నాకు పుస్తక బహుమానము, 'For General Proficiency' అని వ్రాసియిచ్చినారు.

"విశాఖపట్టణము నార్మలు స్కూలులో చదువుచుంటిని—రు. ౯ లు స్టయిపెండు, (విద్యార్థివేతనము). అట మెట్రికుయ్లేషను (౧౮౭౯) మొదటి తరగతి (First Class). అనంతరము పది పదునొకండు రూప్యములు స్టయిపెండుతో మదరాసులో నార్మలు స్కూలులో చదువుట ప్రయివేటు పొందుట —అచట బహుజనపల్లి సీతారామాచార్యులవారు ప్రథమాంధ్రపండితులు, చెదలువాడ సీతారామశాస్త్రులవారు ద్వితీయాంధ్రపండితులు— ఇరువురు ప్రామాణికులు ఆంధ్రమున గొప్ప పండితులు— వే— లుపిళ్లె లోనగు యాపార్వుల క్రిస్టియనులు సంగీతలోలురు, ఈ సీతారామాచార్యులతో చెలిమి చేసికొని వీరి ప్రతిశనివార వేశ్యాది సంగీతగోష్ఠులకు జందాదారులై వచ్చుచుందురు."

"ముత్యాలపేటలో తొలుత సంస్కృతాంధ్ర ప్రవిత పాఠశాల యుండెను. దానికి మానాయనగారు వేదము వేంకటరమణశాస్త్రులవారు ప్రధానపండితులుగా నుండిరి. సీతారామాచార్యులవారు ఆంధ్రపండితులు. తోటపల్లి సీతారామయ్యగారు ద్వితీయాంధ్రపండితులు.

అరవయునకు జ్ఞానసుందరపండారాను లుండిరి. నా నాయనగారు శాస్త్రోక్తాచారనిష్ఠులు, అనన్యసూరులు, అప్రతిగ్రాహకులు, వ్యాకరణమున అపరపతంజలియని పేరొందినవారు. సీతారామాచార్యులను ఆంధ్రవిద్యకు మెచ్చియు వేశ్యాలంపటుడని విగర్హించు చుండిరి. అందువలన సీతారామాచార్యులవారు తమ శనివారపు సంగీతగోష్ఠులకు నన్ను పిలుచుట లేదు. అట్టివానికి నేను పోవుటయు లేదు."

తాతగారు ఆపాఠశాలలో చేరిన మొదటిదినములలో ఆచార్యులవారి పాండిత్యాతిశయములను చక్కగా తెలిసికొనక వారిని మాటిమాటికిని ప్రశ్నలువేసి వేధించుచుండువారట. అటుపిమ్మట నొకప్పుడు తండ్రిగారిని దర్శించి వారి కీవిషయమును తెల్పగా వారు, "నీవు పొరపడితివి. వారు ఆంధ్రమున మహాపండితులు" అని వచించిరట. అటుపిమ్మట శాస్త్రులవారు ఆచార్యులవారిని చూచి తమ యవినయమునకు క్షమాపణకోరిరట. అంత ఆచార్లవారు 'నీవు గడుసు వాడవు' అని అభినందించిరట. తాతగారు ఆపాఠశాలను వదలినకొంతకాలమునకు మరల గురువర్యులను దర్శించి తమకు యోగ్యతాపత్రమునొకదానిని దయచేయుడని కోరిరి. అప్పుడు వారు ఈవిధముగా వ్రాసిరి.

"ఇది వేదము వేంకటరాయశాస్త్రి యోగ్యతను తెలియజేయు పత్రిక. * * * * * వీరు కొన్ని యేండ్లవఱకు రమారమి యొకటిన్నర సంవత్సరము నార్మలు స్కూలులో నాయొద్ద తెనుగు చదువుచుండిరి. అదిమొదలు నేను వీరిని బాగుగా నెరుగుదును. చదువునప్పుడు వీరుచేయు విద్యావిషయకమైన ప్రశ్నలకు సదుత్తరములు చెప్పి వీరిని సమాధానపఱచి నా పాండిత్యగౌరవమును మాటిమాటికి నిలువఁబెట్టుకొన వలసివచ్చుచుండెను. ... ... ౧౮౮౨ ... ..."

ఈ యోగ్యతాపత్రము ఇప్పటికి కొంత శిథిలమైనను ఇంకను పదిలముగనే యున్నది.

శ్రీశాస్త్రులవారు బాల్యమందే సంస్కృతాంధ్ర గ్రంథములను నిరంతరము చదువుచుండువారు. వీరి తండ్రిగారు వీరిని బాల్యమునుండి [illegible] శ్రద్ధ వహించువలయును [illegible]. [illegible] ములనే విశేషముగా చదువుచు, [illegible] లో పెద్దలైనవారు [illegible] చెప్పుచుండ విని గ్రహించుచు [illegible] భాషాజ్ఞానమును [illegible]. కాని ఆంగ్లమును నేరలేదు. ౧౮౭౫ సం. ఎఫ్. ఏ. పరీక్షయందు ఉత్తీర్ణులైరి. [illegible] చేసిరి, తండ్రిగారి [illegible] [illegible] గా—

౧. శ్రీ[illegible] కళాశాల మొదట్ల, ౨. [illegible] ప్రధానోపాధ్యాయులు, ౩. [illegible] హైస్కూలు ప్రధానోపాధ్యాయులు, ౪. రాజమహేంద్రవరము, [illegible] ప్రధానోపాధ్యాయులు, ౫. మదరాసు [illegible] (మిడిల్) స్కూలు ప్రధానోపాధ్యాయులుగా, అయి ౧౧ సంవత్సరములు గడపిరి. ఆ కాలములో శ్రీశాస్త్రులవారు [illegible] ఎక్కువ వీగ్రంథము ముద్రితమైనను కాలవిలంబమైనను తెప్పించి చదువుచుండిరి. ప్రతిదినము [illegible] కొంత ఈవిధముగా వ్యయించువారు. ఆదినములలో వచ్చిన గ్రంథములలోను ప్రచారములోనున్న తాళపత్ర గ్రంథములలోను వారు "చదువక విడిచినది లేదు, చదివి మఱచినది లేదు."

ఇట్లుండగా, ఇంచుమించు [illegible] సమయమున శాస్త్రులవారు [illegible] కాలమున ఆంధ్రదేశమందును ఇతరస్థలములందును వితంతూద్వాహ ప్రోత్సాహక వాదములు బయలుదేరఁ జొచ్చినవి. అప్పుడు వీరితండ్రిగారు వేంకటరమణశాస్త్రులవారు, తాము [illegible] వితంతు వివాహమును శాస్త్రసమ్మతము కాదని వాదింపం దొడంగిరి. ఇంతలో వారు విరామహేతువుం బొంది వెల్లూరుచేరవలయుటయు, తా మొనర్పం దలంచిన ధర్మ

కార్యమునకు కడ్డుకలిగెనే యని కరము చింతిల్లిరి. అప్పుడు వేంకటరాయశాస్త్రిలవారు "అందులకు నేను గలను" అని పలికి, పలుతావుల కేగి పెక్కుగ్రంథములం బరిశోధించి, మదరాసు హిందూసభవారి ప్రాపున ఖండనోపన్యాసములం గావించుచుండిరి.

మధ్య కొంతశ్రమాపనోదార్థము విద్యార్థుల యవగాహనమున కనుకూలముగా సులువైన కంఠపద్య ములలో చంద్రాలోకాద్యనేకగ్రంథముల సారాంశ ముగా 'అలంకారసారసంగ్రహ' మను గ్రంథమును రచించిరి. పెద్దగ్రంథములను రచియింపం బూనుకొనియుండు కాల మున తన్నిరంతర రచనాపరిక్లేశము వారికి మఱియొకదిన్ని గ్రంథము రచించుటచే తీరుచుండెడిదట. ఒకవిషయము నుండి మఱియొకదానికి మరలుటయే విశ్రాంతి యని పలుమారు వారు వచించియుండఁగా విని యున్నాఁడను. (అట్లే ఆముక్తమాల్యదావ్యాఖ్య రచించు దినము లలో ఆశ్రమను మఱచుటకై మధ్య పెక్కుసంస్కృత నాటకములను ఆంధ్రీకరించిరి.)

శ్రీశాస్త్రిలవారు మరల ఆవాదములనే సాగిం చుచు ఆవిషయములనెల్ల గ్రంథరూపముగా రచియించి ప్రకటించిరి. వారే యిట్లు వ్రాసియున్నారు. "ఇందుం గడపట పేర్కొన్నపదమం దుండఁగా ౧౮౮౩ సం.౨౦ 'స్త్రీపునర్వివాహ దుర్వాద నిర్వాపణ' మను ధర్మశాస్త్ర విషయకనిబంధన గ్రంథమును రచించి ప్రకటించితిని. బహుగ్రంథపరామర్శపూర్వకముగా నిద్రాహారాదుల నొప్పరికించి దానిని రచించిన ఫలము ఇరుదెఱంగు లయి నది నాకు దారిద్ర్యానారోగ్యాది క్లేశములును, తద్గ్రంథ ముచే నిరస్తవాదులయిన మతద్రోహులకు బిరుదాంక ములును లబ్ధమయినవి. ఆ నిర్వాపణగ్రంథమునకు ఇప్పటి కిని ఎవరివలనను ఉత్తరము పుట్టలేదు. అయినను, 'తపస్సు ఫలింపకపోయినను తనువు తేలిక పడిన' దను రీతిగా ఆవాదగ్రంథమువలనను తత్కాలమందు మహా జనసంఘముముందాల నాకావించిన ఖండనోపన్యాసముల వలనను, నన్ను మదరాసులోని ప్రముఖులెల్ల రెఱుం గుటయు, డాక్టరు ఆపర్టు, మిల్లరు లోనగు మహాను లకు నేను పరిచిత గీర్వాణభాషుఁడనుగా గోచరీభూతుఁడ నగుటయు సంభవించినది. శ్రీ సమర్థి రంగయ సెట్టిగారు నన్ను మదరాసు క్రిస్టియన్కాలేజి సంస్కృతప్రధాన పండితుం గావింపం దలంపు గొనిరి. నేనును అపదమునే కోరుచుంటిని.

ఆసమయమందే డాక్టరు ఆపర్టుదొరగారికి నేను ఇంచుకంత ఉపకరించితిని. ఎట్లన.— వారు అప్పు డను ఏండ్లనుండు 'నరపతివిజయము' ను ముద్రింపం దొరంకొని ప్రాయికముగా పండితపరిష్కృతము సేయిం చియు, అందొక చూర్ణిక బిరుదాంకాదిభూయిష్ఠము, ఆదిలో కవిపెట్టినరూపుం గోల్పోయి లేఖకాదికారణం బున శబ్దస్వరూపవాక్యావాంతరవాక్యాది విభజన లేర్ప డక క్రంక బలిసియుండ దానిని సంస్కరింపుఁడని మదరాసులోని సుప్రసిద్ధాంధ్ర పండితులు ముప్పురకడ నైదేండ్లు ఉంచియు భగ్నమనోరథులైరి. వారిని నేను కార్యవశంబున దర్శింపఁగా వారు ఆమాన్త్రికను తదీయ దురూహతా వృత్తాంతముం జెప్పక నాచేతికిచ్చి సవ రింపుమనిరి. నేనును వారముదినములు ఉన్మత్తునివలె తదేకతానుఁడనై దానిని సవరించి సాధువుగా వ్రాసి ఆంగ్లానువాదసమేతముం గావించి కొనిపోయి వారి కిచ్చితిని. వారు నాయిచ్చినదానింగైకొని పండిత సమేతముగ రెండువారములు పరిశోధించుకొని అంగీక రించి అనంతరము నాకు దాని యైదేండ్లవృత్తాంతమును వక్కాణించిరి.

ఆయిరువురనుం బ్రతిబోధకులై డాక్టరుమిల్లరు గారు పూర్వోక్తమైన మదరాసు క్రిస్టియన్కాలేజి సంస్కృతోపాధ్యాయపదమును ౧౮౮౬ సం. నవంబ రులో నాకొసంగిరి.

౧౮౮౪ సం. బి. ఏ. పరీక్షకు నియతములైన సంస్కృతాంగ్లేయ భాషలలో మదీయ శిష్యులతోఁ గూడ నేనును పరీక్షితుఁడనైతిని. రెంటను జయమొంది తిని. సంస్కృతమందలి జేతలలో మొదటివాఁడనై విజయనగరమహారాజ నైశాఖపుర గోడెగజపతిరాయ దాతవ్యములయిన రు. ౨౦౦ పరిమితిగల బహుమానముల

నకుం బాత్రమనైతిని. కాని ఆసంవత్సరము డిగ్రీని పూర్తిచేసికొనందున ఆబహుమానములం బడయనైతిని. ఉక్తకారణంబున ఈబహుమానము నాకు తప్పిపోయినదని నాతో ఆపర్టుగారు సెలవిచ్చిరి." ఈవిధముగా నిరంతరపరిశ్రమచే తమ చిరకాంక్షితమైన గీర్వాణోపాధ్యాయ పదమును శాస్త్రులవారు పొందిరి. అప్పటికే కరము రూఢమైయున్న శాస్త్రులవారిఖ్యాతిచే పలువురు విద్యార్థులు రాజధానిలోని పెక్కుకళాశాలలవారు గీర్వాణశిక్షకై వెదకుకొని క్రిశ్చియనుకాలేజికి రాదొడంగిరి.

*           *           *

ఆంధ్రవాఙ్మయమునకు ౧౯-వ శతాబ్ద్యుత్తరార్థమున నూతనవికాసము కలిగినది. అట్లే దేశమంతటను ఒక్క భాషకేఅననేల పెక్కింటికి నూతనోజ్జీవము కలుగం జొచ్చినది. విశ్వవిద్యాలయస్థాపనము, ఆంగ్లవిద్యాప్రాబల్యము, పత్రికాప్రచారము, పాశ్చాత్యనాగరికతాప్రాబల్యము, ఇత్యాద్యనేకకారణములచే జనుల రుచులు వేషభాషలు మారంజొచ్చినవి. తత్పూర్వము దేశమందు లేనివి, వాఙ్మయమునకు జీవాతువులు ముద్రాయంత్రములు వెలయంజొచ్చినవి. దేశమంతయు మేలుకొనందొడంగినది. అట్టి యీసంధికాలములో పలువురు పండితులును, వర్తకులును సంస్కృతాంధ్రగ్రంథములను కనంబడినవానినెల్ల వీలున్న సంస్కరించి, లేనిచో సంస్కారములేకయే ముద్రించి యథేచ్ఛముగ హెచ్చువెలలకు విక్రయించుచుండిరి. కవులును కొందఱు నూతనమార్గములలో కవనములకుం దొడంగి తత్పూర్వము ఆంధ్రమున లేనివానిని నాటకాదులను గీర్వాణాంగ్లాద్యాకరములనుండి తెచ్చి ఆంధ్రమున నుంచుచుండిరి.

అట్లు క్రొత్తఆవేశముతో గ్రంథములు ముద్రితములగు నాదినములలో జరుగు 'భాషాచిత్రవస్తు' ఆమాసపడి శ్రీశాస్త్రులవారు కష్టనష్టములకోర్చి ముద్రాయంత్రమును స్థాపించి, సంస్కృతాంధ్రగ్రంథములను నిర్దుష్టములనుగా ముద్రింపం దలపెట్టిరి; స్వతంత్రగ్రంథములను నూతనమార్గములలో వ్రాయనారంభించిరి. ఈయుద్దేశములతో ౧౮౭౬ సం. ప్రక్రియాఛందస్సను గ్రంథమును బాలురకొఱకై రచించి ప్రకటించిరి. అదియే శాస్త్రులవారిచే పునర్లిఖితమై 'ఛందస్సు' అను పేరు ముద్రితమై యిపుడు ప్రచారముం బొందుచున్నది. ౧౮౮౦ సం. విద్యార్థులును, జిజ్ఞాసువులును ఉపాధ్యాయునిరపేక్షముగాను, స్వశక్తిచేతనే సులువుగాను చదివి రసముగ్రహించుట కనుకూలముగా, సంస్కృత-విక్రమార్క భోజచరిత్రలను, లఘుటీకచేర్చి అచ్చువేయించిరి.

ఈయుద్యమము క్రమముగా చిగుర్పందొడంగినది. ౧౮౮౧ సం. శ్రీ శాస్త్రులవారు నాగానంద నాటకము నాంధ్రీకరించిరి. ఈ యాంధ్రీకరణప్రకటనము ఆంధ్ర (నాటక) వాఙ్మయమునందు నూతనయుగ ప్రారంభమును సూచించుచున్నది. చెప్పియుంటినిగదా ఆంధ్రమందు నాటకరచన అప్పుడే ప్రారంభమయినదని. వానిలో అనువాదములు మొదటివి. శాస్త్రులవారు, "దృష్టబహుప్రయోజనంబు గావునను, ముఖ్యముగా నమందసౌహృంది గావునను, పెద్దనాది లక్షణకారులచే ననుజ్ఞాతంబు గావునను, మఱియుం బ్రబంధములతోం బ్రాణము విసిగి పోయినది గావునను, నాటకము మనకు ఉపాదేయమే." యను నభిప్రాయమును విశదీకరించుచు పలుతావుల నుపన్యాసము లిచ్చుచు, తాముము నాటకరచన సేయుటయె గాక నాటకములలో పాత్రోచితభాషయుండవలయునని నాగానందమందు నీచపాత్రములకు గ్రామ్యముం బ్రయోగించి నవ్యమార్గోపదేశకులైరి. "సంస్కృత నాటకములం దొలితొలిం దెనిగించినవారు నడుమం బొడమిన తదీయ హరాణానువాదము ౹ మర్యాద నవలంబించి తమ యనువాదములందు సంస్కృత మూలములందలి ప్రాకృతాది భాషాభేదప్రపంచప్రయోజనమును నిర్వహింపక ఏకరూపముగా సంస్కృతప్రాకృతములకు వ్యాకృతాంధ్రమే పెట్టం దొడంగిరి." అనిరి శాస్త్రులవారి నూతన మార్గముంగని పండితులు కొందఱు కడుంగడు హర్షించిరి.

మ. రా. రా. శ్రీ వడ్డాది సుబ్బారాయకవి గారు శాస్త్రులవారికి ఇట్లు వ్రాసిరి—

"పండితోత్తమా, భవద్విరచితమగు నాగానంద నాటకము పుటములుతీరిన హాటకమువలెఁ గావ్యేందిర కలంకారమై ప్రకాశించుచున్నది.

నీచపాత్రములకుఁ దెలుఁగు నాటకములందుఁ దమరు చూపినదారి నామట్టు కాదరణీయముగానే తోఁచుచున్నది. మఱియు దానివలన ననేకలాభములున్నట్లు నేను దలంచుచున్నాఁడను. గ్రామ్యములేవో అగ్రామ్యములేవో యెఱుంగనివార లనేకు లుందురు గాన వారికి గ్రామ్యము లివి, యగ్రామ్యము లని తెలిసికొనుటకు వీలు కలుగుచున్నది. మఱియు నాటక ప్రకారము అట్టి గ్రామ్యరూపములు వ్రాయుట కష్టమే. నాకుఁ జూడఁ దన్నాటకము బహు రసవంతముగా నున్నది" అని.

కొందఱు పండితులు ఔచిత్యాక్షేపణలు హర్షించినను మఱికొందఱు ఈపద్ధతి నంటనే హర్షింపలేదు. ఈవిషయము పండితులలో నొక యల్లరి బుట్టించి వృద్ధి చేయుచుండినది.

ఇది యిట్లుండఁగా శ్రీ శాస్త్రిలవారు తాము ప్రారంభించిన యుద్యమమును జరుపువారయి ౧౮౯౧ వ సంవత్సరమున నాగానందముద్రణానంతరము, జ్యోతిష్మతీ ముద్రాక్షరశాలను స్థాపించిరి. ఒకవైపు కాలేజీ యుద్యోగమును నిర్వహించుచు, మఱియొకవైపు ముద్రాక్షరశాలను నిర్వహించుచు, మహా గ్రంథములు రచించుచు చదువుచును, శాస్త్రిలవారు తాముగు యంత్రముంబోలె కృషి సల్పుచుండిరి. తమ యచ్చాఫీసునందే శాస్త్రిలవారు అంతకుముందు కొంతకాలమునుండియు తాము ఆంధ్రమున సులువైన వచనముగా రచించుచుండిన కథాసరిత్సాగర గద్యప్రబంధమును, 'నానాఖ్యాన మనోహరంబును' చిన్న యక్షరములలో ముద్రింపసమకట్టి కొంతవరకుముద్రించి ఆర్థికముగా కొన్నిచిక్కులకు లోనై ఆయుద్యమమును అంతటితో నిలుపవలసినవారైరి. ఇంతలో ఏతద్గ్రంథముద్రణాపరిసమాప్తిని వేంకటగిరి ప్రభువులు, కే. శ్రీ. శ్రీ వెలుగోటి రాజగోపాలకృష్ణ యాచేంద్ర బహద్దర్ కె. సి. ఐ. ఇ. వారు, ఆప్తవర్గము వలన విని ఏతద్గ్రంథ ముద్రణ పర్యాప్త సర్వ ధనమును పరమాదర పూర్వకముగా నొసంగి ఆ ముద్రణకార్యమును నెఱవేర్పించినారు. వారి సాయముచే మరల ప్రారంభించి, ఇతరాముల గ్రంథములను సైతము ముద్రింపించుచు, కొంతకాలము జరిపిరి. అట్లయ్యును ఆయుద్యమము చక్కఁగా కొనసాగక శాస్త్రిలవారిని కొంత ఆర్థికక్లేశములపాలు గావించుటయు, వారు ఆ యచ్చాఫీసును విక్రయించివైచిరి. అయినను తాము ప్రారంభించి కొంతవరకు జరిపిన యాయుద్యమమును మరల ప్రారంభించు నుద్దేశమును మాత్రము మానలేదు.

శ్రీశాస్త్రిలవారు ౧౮౯౬ సం. కాళిదాసమహాకవి విరచిత శాకుంతలమును ఆంధ్రమున కనువదించి, యందు పూర్వము నీచపాత్ర గ్రామ్యముం బ్రయోగించిరి. వారే పీఠికలో "నాగానందమునఁ బ్రాకృతస్థానమున నేఁ బ్రయోగించిన గ్రామ్యభేదములకు నాంధ్రాంగ్లేయ భాషాపారీణులగు విపుల హృదయు లామోదించిరి. దీని యందును గణ్యాకర్ష్యపులను దలారిచెంబకులకును నేక విధ భాషణముం బ్రయోగించుట యనుచితమని కావలి వాండ్రకును మత్స్యఘాతకునికిని గ్రామ్యముం బ్రయోగించితిని" అని వ్రాసియున్నారు. శాస్త్రిలవారు ఈ విధముగా నూతనమార్గముం జూపుటంగని కొందఱు పండితులు తమ నాటకములలో నీచపాత్రలకు అచ్చ తెలుగుం బెట్టసాగిరి. దీనింగూర్చి వారే తమ గ్రామ్య భాషాప్రయోగనిబంధనమందు ఇట్లు వ్రాసిరి.—

"కొందఱు మదీయనాగానందముం గని, భాషాభేద మావశ్యకమని గ్రహించియు, నామార్గమవలంబించిన నాశిష్యులగుదురని ద్వేషించి, నీచపాత్రముల కచ్చ తెలుంగని యొక రసాభాసంపు నియమము కల్పించుకొని నిర్వహించుకోలేక పరమనీచపాత్రములకు నిజనియమవిరుద్ధముగా తత్సమముం బెట్టుచు, ఋషికన్యాది సత్పాత్రములచే మాలమాదిగలచేతనుంబోలె మహారాజును 'పబువులు' అనిపించుచు, నీచ నీచతరపాత్రములైన చేటికాదులచే సీతారాజకన్యాములను, అతినమ్రతతో అతి సుకుమార సంబోధనచేయవలసినచో, అతితిరస్కార

కొందఱునుంగా నప్పటి పండితులు ఇరువాగులైరి. ఈ మతము నొల్లని వారు తమనాటకములలో గ్రామ్యమును బ్రయోగింపనివారు. వీరు ఒకసంఘముగాచేరి ఈవిషయమును చర్చించి గ్రామ్యము నాటకానర్హమని సిద్ధాంతింప సమకట్టి ఆంధ్రదేశమందలి పండితుల నెల్లర నాహ్వానించి సభలు జరుపందొడంగిరి. ఆసభలలో శ్రీ శాస్త్రిలవారు ఆపండితుల వాదముల ఖండించి నాటకములలో గ్రామ్యము అవశ్యముగా ప్రయోజనీయమని సిద్ధాంతీకరించిరి. శాస్త్రిలవారు ౧౯౧౧ సం. మున తమ సిద్ధాంతమును గ్రంథముగా రచించి గ్రామ్యభాషా ప్రయోగనిబంధనమని పేరిడి శారదాకాంచికలో నాలుగవ కింకిణిగా గ్రుచ్చినవారు.

పైసభ కగ్రాసనాధిపత్యము వహించినవారు "అష్టాదశభాషా లక్ష్యలక్షణాభిజ్ఞ సార్వభౌములు" శ్రీయుత శేషగిరిశాస్త్రిలవారు వేంకటరాయశాస్త్రిల వారికి వారిపాండిత్యము కతంబున పరమ మిత్రులయిరి. వీరిరువురును కలసికొనని సాయంత్రములేదు. ప్రతివిద్యా విషయమందును ఇరువురును పరస్పరము సంప్రతించుకొనుచు సందేహములం దీర్చుకొనువారు. ఆదినములలో వీరిరువురును కలిసి ఆధునికాంధ్రవాఙ్మయమునంతయు శారదాకాంచికల వడువున విమర్శింప సంకల్పించిరి. కాని యీపండితాఖండలు లిరువురయు స్నేహలత మొలకెత్తి దినదినాభివృద్ధి యగు నాదినములలో దుర్దైవవశమున శేషగిరి శాస్త్రిలవారు హఠాత్తుగా తమ ౫౬ వ యేట పరమపదించిరి. వేంకటరాయశాస్త్రిలవారు అట్టి మిత్రరత్నముం బోగొట్టుకొన్నందులకై వగచి, అప్పుడు తాము రచించుచుండిన యుషానాటకమును వారికి అంకితము గావించి కొంత చిత్తశాంతిం జేసికొనిరి. 'అధ్యర్ధయామ మాత్ర ప్రయోజనీయ'మైన నాటకమది.

అప్పటికే శాస్త్రిలవారికి ఏర్పడియున్న శిష్యకోటిలోనివారు కొందఱు నెల్లూర నొకసంఘముగాచేరి ఆంధ్రగీర్వాణనాటకములను శాస్త్రిలవారికడనే చక్కగా నేర్చి ప్రదర్శింపం దలంపుకొనియుండిరి. వారి యీయుద్దేశము నెఱింగి శ్రీయుత పూండ్ల రామకృష్ణయ్యగారును, శ్రీయుత గునుపాటి యేనాదిరెడ్డిగారును, కొందఱు నెల్లూరి పెద్దలును చేరి ఆంధ్రభాషాభిసమాజమును ౧౯౦౧ వ సం.రం స్థాపించిరి. దీనికి శాస్త్రిలవారు అగ్రాసనాధిపతులు, ద్రవ్యవిషయవ దక్క నన్నిటను సర్వాధికారులు. ఈ సమాజము శ్రీశాస్త్రిలవారి నాటకములం దప్ప నితరాంధ్రనాటకములం బ్రదర్శింపరా దనియు, ఇతరుల నాటకము నాటకములే కావనియు, శాస్త్రిలవారి కడ సంపూర్ణముగా శిక్షనొంది ఒద్దికలు కుదిరినవని శాస్త్రిలవారు తలంచువరకును నాటకములం బ్రయోగింపరా దనియు, శాస్త్రిలవారివాక్యములు వేదవాక్యములుగా సభ్యులు పాటింపవలయుననియు నిబంధన లేర్పఱచుకొని కట్టుదిట్టములతో ౨౫ సంవత్సరములు-౧౯౨౫ వ సంవత్సరము వరకును-జరిపిరి. ఈవిధముగా నటులు సుశిక్షితులగుటచేతను, అందును శాస్త్రిలవారే ప్రతియొకరసము నేర్పుటచేతను వీరి ప్రయోగములు కరము శోభిల్లుచుండెను. ఆశిష్యులలో పెక్కురు వారుండఁగా నేగుటం జేతను, శాస్త్రిలవారికిని వృద్ధాప్యము పైకొనినందునను ౧౯౨౫ సం. తో నాసమాజమును నిలిపివైచిరి.

శాస్త్రిలవారు ౧౯౨౦ సం. కాళిదాసనివేసందేశమునకు 'పద్యప్రయోజనిక' యనునాంధ్రవ్యాఖ్య రచించిరి. ఇయ్యది మల్లినాథవ్యాఖ్యతోను, పెక్కు ఆక్షేప సమాధానములతోను, ఎల్లవారును ఉపాధ్యాయనిరపేక్షముగా చదువుకొనుట కనుకూలముగా, ఒలిచిన పండువోలె ఆస్వాదనీయమై ఆంధ్రదేశమున ప్రచారము బొందుచున్నది.

ఈగ్రంథములు గాక శాస్త్రిలవారు మఱియెన్నియో పనులం గావించియున్నారు. ఆకాలపు పత్రికలకు—సూర్యాలోకము, అముద్రితగ్రంథచింతామణి మున్నగువానికి—పెక్కు వ్యాకరణాంశములను వివరించుచు వ్యాసములు వ్రాసియున్నారు. మదరాసు విశ్వవిద్యాలయమువారికి వీరియందు అపారగౌరవముండెను. వీరు క్రిశ్చియను కాలేజిచేరిన సంవత్సరమే తమిళమునకు పరీక్షకులైరి. తర్వాత కొంతకాలము సంస్కృతాం



అస్తమయము



ఉదయము

(కన్యాకుమారివద్ద)
A. A. C.

ములకు పరీక్షకులుగా నుండిరి. వారు బోధించు విష యములను విద్యార్థులు ఎక్కుడు శ్రద్ధతో పఠించువారు.

శ్రీ శాస్త్రులవారు మరల ముద్రాక్షరశాలను స్థాపించి ఉద్యోగమును వదలి గ్రంథములు వ్రాయుచు, ముద్రించుచు వాఙ్మయసేవలోనే తమ జీవితశేషమును గడుపగోరి తమ జీతములో కొంతమిగులంబెట్టుచు అర్బత్ నాటు బ్యాంకిలో మూడువేల రూప్యములవరకును ద్రవ్యము చేర్చియుండిరి. ఆ ధన మున్నదికదా యను ధైర్యముతో తాము ఉద్యోగమును వదలెదమని కళాశాల ప్రిన్సిపాలుగారితో చెప్పగా అంతటి గీర్వాణ పండితుని తమ కళాశాలనుండి పంపివేయుట కిష్టము లేక, శాస్త్రులవారిని 'ఇంక కొంతకాల ముండుడు, పై సంవత్సరము పోవుదురుగాని' అని చెప్పుచు వారిని రాజీనామా పెట్టనీయక ఆపివైచుచుండిరి. ఒకదినము శాస్త్రులవారు గట్టిగా తాము కళాశాలను వదలదలచుకొని యున్నారమని తెల్పుటయు ప్రిన్సిపాలును తదితర పాశ్చాత్యపండితులును మరల వీరిని కొంతకాలమువరకు ఆపివేయ దలంచి "ఆలోచించుకొని చెప్పుడు. నేడే ఆపని చేయకుడు" అని పలికి ఆ దినము ఆపివైచిరి. ఆదినము సాయంత్రము వారింటికి వచ్చుచుండగా అర్బత్ నాటు నిధి మునింగిపోయినదనియు, అందు తమద్రవ్యమును నష్టమైనదనియు తెలిసి కొనిరి. "ఆహా! నాకు ఉద్యోగము దక్కినది. దీనిని నమ్మి దానిని వదలియుంటినేని నాగతి ఏమైయుండునో గదా." యని తలంచి ౧౯౧౦ సం. వరకును కళాశాలయందే యుండి తర్వాత విరామమును బొందిరి.

౧౯౧౯ సంవత్సరమో, అంతకు కొంతముందో ఎట్లో ధనము గూర్చుకొని జ్యోతిష్మతీ ముద్రాక్షర శాలను, క్రొత్తయంత్రములతో, మరల ప్రారంభించి జరుపదొడంగిరి. ఇందు తొలియట్లుంబోలెగాక శాస్త్రుల వారు పెక్కుగ్రంథములను ముద్రింపింపగల్గిరి. ౧౯౧౦ సం. అమరుకావ్యము, పుష్పబాణవిలాసము, రసమంజరి, భర్తృహరి శతకత్రయము మున్నగు గీర్వాణ గ్రంథములను టీకావివరణములతో పరిష్కరించి ముద్రించిరి. పారిజాతాపహరణము, బిల్హణీయము, మనుచరిత్ర, శృంగారనైషధము, వసుచరిత్ర, సింగనవాసిష్ఠరామాయణము, ఇత్యాది ప్రబంధములను దిద్ది ప్రకటించిరి. శ్రీ శాస్త్రులవారి పారిజాతాపహరణములోని పాఠముల దిద్దుబాట్లను, 'వాణీయ స్తర' త్యాగములను గ్రహించియే పండితవతంసులు దీనికి వ్యాఖ్య రచించినారు. "ప్రఖ్యాతి కెక్కుల బమ్మెరపోతన మధుర వైభవంబున చేమకూర వేంకటపతి అమృతంపుం గూర గా రచియించిన" సారంగధరచరిత్రము సటీకముగా" శ్రీ శాస్త్రులవారు ౧౯౧౧ సం. ముద్రించినారు. ఆపై నెల లోనే "అద్దములోని లిఖ్యపటె రసికులకు సవ్వియు నబ్బని యర్థములచే నబ్బురమొందగను రంగగీరమును బోలె మధురంబయ్యును నస్పష్టంబై, రసికగోష్ఠుల యందు సందేహాంతస్సారకుం గాఢంబైన కాటిమెలంకువలతోనిండి సంపూర్ణానుభవమునకు రాకయున్నట్టి రసోత్తరప్రబంధమును", చేమకూర వేంకట రాజవిరచిత విజయవిలాసమును, ఎల్లవారికిని సుబోధం బగునట్లు సటీకముగా ప్రకటించినారు. ఆసంవత్సరమే కథాసరిత్సాగరము ద్వితీయముద్రణమును బొరసినది. ౧౯౧౩ సం. విసంధివివేకము, గ్రామ్యదేశనిరసనము అను వ్యాసములం బ్రకటించిరి.

ఇట్లుండగా శ్రీనాథమహాకవివిరచిత శృంగార నైషధమునకు వ్యాఖ్యను తత్పూర్వము కొంతకాలము నుండి వ్రాయుచున్నదానిని ఆసంవత్సరమే పూర్తి గావించిరి. ఆ నడుమనే మద్రాసులోను నెల్లూరులోను కొన్ని యుపన్యాసము లొసంగిరి. ఆయుపన్యాసములలో నొకదానిని వినుటకు 'శ్రీ విక్రమసింహపురీ పౌరవతంసులు, శ్రీయుత రేబాల లక్ష్మీనరసారెడ్డిగారు, విజయంచేసి, విని తత్ప్రబంధ ప్రౌఢికి కరమానందించిరి. అనంతరము శ్రీ శాస్త్రుల వారి మిత్రులు కొందఱు ఆవ్యాఖ్యకు సముంజసము ద్రణమును సమకూర్ప నుత్సహింపగా శ్రీ రెడ్డిగారు వారియుత్సాహమును తామందుకొని శ్రీశాస్త్రులవారిని శ్రీ గునుపాటి ఏనాదిరెడ్డిగారి ప్రోత్సాహముచే 'నిజాస్థానికి ఆహ్వానించి, తద్గ్రంథముద్రణార్థము వలయు సర్వధనమును రూప్యద్విసహస్ర పరిమితమును వెరవాదర సత్కారపూర్వకముగా నొసంగిరి."

మహోపాధ్యాయ, విద్యాదానవ్రతమహోదధి, పండితరాజ, వేదవేదాంగశాస్త్రజాలమహోదధి, సర్వతంత్రస్వతంత్ర, వ్యాఖ్యాతృచక్రవర్తి" యను వానిని ఒసంగిరి. పైగా పుత్త్రపౌత్త్ర పారంపర్యముగా నెలకు నూటయేబదిరూప్యములు మఠమునుండి పంపునట్లు ఏర్పాటునుగావించిరి. ఆసభకు దక్షిణభారతదేశమందలి ప్రముఖులెందఱో వచ్చియుండిరి. కలిమిలేములును సుఖదుఃఖములును కావడికుండలుగదా. ఈయుత్సవానంతరము వారికి గొప్ప దుఃఖము వాటిల్లినది. వ్యాధిగ్రస్తులుగానుండిన మహానాయనగారు—వారి ఏకైక సంతానము—౧౯౨౨ సం. డిసెంబరు ౧౪-తేది పరమపదించిరి. వార్ధక్యమునంగల్గిన యీదుఃఖముచే తాతగారు కరము కృశించిపోయిరి. వారి అనారోగ్యము సయితము కలుగఁజొచ్చెను. స్వాములవారి యీవియు కొన్నికారణములచే నిలిచి పోయెను. అప్పుడింక నూత్రము హృదయశల్యమై బాధించుచుండెను. ఈ ఇక్కట్టులలో తాతగారికి చిరకాలమిత్రము, సునుపాటి ఏనాదిరెడ్డిగారు ఋణవిముక్తికి తాము పాటుపడెదమని చెప్పి తాతగారిని ఓదార్చుచు అందులకై ప్రయత్నములు సల్పుచుండిరి.

తాతగారు ౧౯౧౭ సం. శ్రీగద్వాల మహారాజా శ్రీ శ్రీ సీతారామ భూపాలరావు బహద్దరువారిని దర్శించుటకై గద్వాలుకు పోయి యుండిరి. అపుడు శ్రీమహారాజావారు తాతగారిని తమదేశమున కొంతకాలముంచుకొని మర్చి అరా తాగీఖున, ౮౦౦ రూప్యములును, బంగారుకోడా జోడుశాలువలు నొసంగి సత్కరించి వీడ్కొలిపిరి. ఆస్థానపండితులు, వైష్ణవోత్తములు "మేము ఎన్నడును స్మార్తవులకు నమస్కరించినదిలేదు. ఇదిగో సరస్వత్యంశ సంభూతులగుచు మీకు నమస్కరించుచున్నారము" అని పాదానతులైరి.

ఇన్నిచిక్కులలోను వారు గ్రంథరచనను మానలేదు. ఆముక్తమాల్యదావ్యాఖ్యను ముగించి దానికి ఉపోద్ఘాతమును వ్రాసిరి. హితోపదేశమును పూర్వము తాము గద్యముగా నాంధ్రీకరించి యుండిన దానిని చంపువుగా వ్రాసిరి. ఇయ్యది వారి మరణానంతరము ముద్రితమయినది. ఇటుండఁగా ఆముక్తము ముద్రణమునకు సిద్ధమగుడు మదరాసునకువచ్చి ముద్రణ మారంభించిరి. తత్పూర్వము ఏతద్గ్రంథముద్రణమునకై వారు వారొసంగిన ద్రవ్యము వ్యాఖ్యారచనకే వ్యయమైనది. ఇంతకాలము నిద్రాహారముల నొప్పరికించి వారు చేసిన కృషికి వారికి బలీయమైన నేత్రవ్యాధి కలిగెనది. ఆసంవత్సరము నేత్రములకు చికిత్ససైతముచేసికొని ముద్రణ మారంభించిరి. కాని ద్రవ్యసంపత్తి చాలమిచే మధ్యలో నాగిపోయినది. అప్పుడు నెల్లూరుజిల్లా కావలితాలూకా, ఇందుపూరుగ్రామ వాస్తవ్యులు, శ్రీయుత ఎఱబోలు రామచంద్రారెడ్డిగారు రు. ౨౫౦౦ వరకును విరాళమొసంగి ఆగ్రంథమును ముద్రింపించినారు. ఇయ్యది వెలువడునప్పటికి మూఁడేండ్లయినది. మధ్యలో వారుపడిన శ్రమ యపరిమితము ఆగ్రహము ౧౯౨౬ సం. జూలైలో ప్రకటితమైన వెంటనే, ఆంధ్రవిశ్వవిద్యాలయమువారు వారికి 'కళాప్రపూర్ణ' బిరుదము నొసంగి ఆనాడే బెజవాడ పురపాలకసంఘమువారు వారికి 'Freedom of the city of Bezw:da' గౌరవము నొసంగిరి.

ఆముక్తమాల్యదా రచనానంతరము తాతగారు మఱిగ్రంథములు వ్రాయలేదు; ఎప్పుడును మందముననే పరుండి, ఎడమచేతపుస్తకము కుడిచేతకలము ధరించి ఏదో వ్రాయుచును చదువుచును ఉండువారు. ఋణవిముక్తికై నిరంతరము చింతించువారు రానురాను వారికి దిగులు వృద్ధికాఁజొచ్చినది. శ్రీ సునుపాటి ఏనాదిరెడ్డిగారు తాతగారి ఋణమును తీర్చుటకై శ్రీయుతులు, గా. బెజవాడ రామచంద్రారెడ్డిగారి, (శాసనసభాధ్యక్షులు,) సాయమున నెల్లూరు జిల్లాయందు సంచరింప దొడంగిరి. "ఇప్పటియే కాని అడుగుట యెఱుఁగని" యీ పెద్దలు తాతగారికొఱకై సంచరించి జిల్లాలోని ప్రముఖులెల్లర చేతను చందాలు వేయించి పదివేల రూప్యములు వసూలు చేసి తాతగారి ఋణమును వారి నిర్యాణమునకు కొన్ని నెలలు ముందు తీర్చిరి. ౧౯౨౯ సం. జనవరినెల శ్రీ సునుపాటి ఏనాదిరెడ్డిగారు తాతగారిని దర్శించి 'తమ ఋణమును నేడే తీర్చివైచితిమి.' అని చెప్పినప్పుడు తమ ఋణము తమ చిరకాలమిత్రుల సాయము చేతనే తీరెను

| | సంవత్సరములు |
|---|---|
| కాళహస్తిమాహాత్మ్యముద్రణ విమర్శనము | ౧౯౦౦ |
| గ్రామ్యభాషాప్రయోగ నిబంధనము | ౧౯౦౧ |
| ఉషానాటకము | ,, |
| బొబ్బిలి యుద్ధనాటకము | ౧౯౧౬ |
| విమర్శవినోదము | ౧౯౨౦ |
| తిక్కనసోమయాజి విజయము | ,, |

## అనువాదములు

| | |
|---|---|
| నాగానంద నాటకము | ౧౮౯౧ |
| కథాసరిత్సాగరము | ,, |
| ఆంధ్రాభిజ్ఞానశాకుంతలము | ౧౮౯౬ |
| ప్రియదర్శికా నాటిక (సం) సంస్కృతటిప్పణము. తెనుగు ప్రాకృతచ్ఛాయ. గద్యపద్యములుగా ఆంధ్రీకరణములతో | ౧౯౧౪ |
| హితోపదేశము, తెనుగు తర్జుమాతో | ,, |
| దశకుమారచరిత్రము ,, | ,, |
| ఆంధ్ర దశకుమారచరిత్రము | ,, |
| భేతాళపంచవింశతికలు, సులభవచనము | ,, |
| విక్రమార్కుని యద్భుతకథలు ,, | ,, |
| మాళవికాగ్నిమిత్రనాటకము | ౧౯౧౯ |
| ఉత్తరరామచరిత్రము (సవిమర్శనము) | ౧౯౨౪ |
| విక్రమోర్వశీయ నాటకము | ౧౯౨౧ |
| రత్నావళీనాటిక | ,, |
| ఆంధ్రసాహిత్యదర్పణము | ,, |
| ఆంధ్రహితోపదేశచంపువు | ,, |

## సంస్కరించినవి

| | | |
|---|---|---|
| భోజచరిత్రమ్. (సం) | | ౧౮౯౦ |
| విక్రమార్కచరిత్రమ్. (సం) | | ,, |
| పంచతంత్రమ్ | | ౧౯౧౪ |
| (చేమకూర) సారంగధరచరిత్రము, సటిప్పణము | | ,, |
| ,, విజయవిలాసము | ,, | ,, |
| (గౌరన) హరిశ్చంద్ర ద్విపద | ,, | ,, |
| మడికిసింగన జ్ఞానవాసిష్ఠ రామాయణము, విశ్వకర్మమతస్థుడగు బాణాల శంభుదాసకవి ప్రణీతము, సారంగధరద్విపద | | ,, |
| కావ్యాలంకార చూడామణి | ,, | ,, |
| పారిజాతాపహరణము | ,, | ,, |

## వివరణాదికములు వ్రాసినవి

| | | |
|---|---|---|
| మేఘసందేశవ్యాఖ్య | | ౧౯౪౨ |
| పుష్పబాణవిలాసము (సం) వ్యాఖ్య | | ౧౯౦౯ |
| రఘువంశము, ఆఱుసర్గలు, తెనుగుటీక | | ౧౯౧౪ |
| కుమారసంభవము ,, | ,, | ,, |
| అమరుకావ్యము | ,, | ,, |
| రసమంజరి | ,, | ,, |
| భర్తృహరి శతకత్రయము (సం) సంపూర్ణాంధ్రవ్యాఖ్యతోను తెనుగుపద్యములతోను ముద్రితము | | ,, |
| శృంగారనైషధవ్యాఖ్య | | ౧౯౧౩ |
| ఆముక్తమాల్యద. సంజీవనీవ్యాఖ్య | | ౧౯౨౮ |

## ఉపన్యాసాదికములు

విసంధివివేకము

గ్రామ్యాదేశనిరసనము

ఆంధ్రగ్రంథవిమర్శనప్రకారలేశము

భారతాభారతరూపకమర్యాదలు

ఆంధ్రవ్యాకరణసర్వస్వవిమర్శము

దశరూపకోక్తమైన అభిసారికావాక్యమున కర్థనిర్ణయము.

(అముద్రితగ్రంథములజాబితా నిందుచేర్పలేదు)

# డల్హౌసీ

మ. విద్యారాజు, కపిస్థలం శ్రీరంగాచారి

లాహోరునగరమునకు ౨౦౦ మైళ్లదూరమున, సముద్రమట్టమునకు ౭౦౦౦ అడుగులఎత్తున హిమాలయపర్వతశ్రేణిలో ఉన్నది డల్హౌసీ. మునుపు ఇది పంజాబుప్రభుత్వపు వేసవివిడారముగ ఉండినది. కాని, ఇప్పుడు ఆప్రభుత్వమునకు సిమ్లా వేసవి మకామైనది. డల్హౌసీవఱకు రైలుదారిలేదు. దగ్గరిరైలు స్టేషనునుండి దీనికి ౫౦ మైళ్లు బస్సులలోగాని, లారీలలోగాని ప్రయాణముచేయవలయును. డల్హౌసీ చేరుటకు ఈ మోటారుదారి తప్ప వేరుదారిలేదు. దీనికి ప్రక్క



చిత్రము ౧

బలూన్ అని యొకమిలిటెరీ ట్రెయినింగ్ స్టేషన్ ఉన్నది. సుమారు ౨౦ మైళ్లదూరమున బక్లాహ్ అను మిలిటెరీ స్టేషన్ ఒకటియున్నది. గూర్ఖాసేనలు ఎండకాలమున ఇక్కడ విడిసి యుండును. ఇది మిక్కిలి సుందరమును, ఆరోగ్యకరమును అయినచోటు. కొండలమీద చాల దూరము షికారువెళ్లుచు, అలసినప్పుడు ఇంటికివచ్చి ఫలహారము పుచ్చుకొని, సాయంకాలము టెన్నిస్ ఆడుచు, నిద్రవచ్చినప్పుడు చల్లగా సుఖముగా నిద్రపోవుచు, ఇక్కడి కాలము కులాసగా వెళ్లబుచ్చవచ్చును.

డల్హౌసీ మిక్కిలి పెద్దఊరుకాదు. (చిత్రము ౧) చిత్రమున X అను గుర్తుగల బంగళా నా స్నేహితునిది. దానిపేరు 'సురాజ్ ముఖి'; అప్పటికి మిక్కిలి ఎత్తైన ఇంటిలో నొకటి. అది సముద్రమట్టమునకు సుమారు ౭౨౦౦ అడుగుల ఎత్తున నున్నది. 'సురాజ్ ముఖి' గదిలోనుండి చూచినచో సుమారు ౧౭ మైళ్ల దూరమునందున్న ఉత్తరహిమాలయ పర్వతపంక్తి కనబడుచుండును. (చిత్రము ౨) మాగదినుండి తీసిన ఈచిత్రమున దూరమున మంచుకొండలు కనబడుచున్నవి. దానిలో ఎన్నో శిఖరములు మబ్బులచాటున మరుగుపడియున్నవి.

డల్హౌసీలో జనసంఖ్య అధికముగా లేదు. ఇక్కడ ౧౦౦కి ౫౦ మంది ఇంగ్లీషువారు. వీరు కాశ్మీరము, చంబ ప్రాంతములకు చేరినవారు. పేదవారైనను, వీరెప్పుడును కులాసగా ఉందురు. ఇక్కడి పురుషులలో చాల

మంది మిక్కిలి అందముగా ఉందురు. ఇచ్చటి సుందరములైన ముఖములును, ప్రకాశవంతములైన నయనములు ప్రపంచమున ఎచ్చటను లేవనియే చెప్పవచ్చును. వీరు సహజముగా హాస్యప్రియులు. అతిథిసత్కారము నందు పేరుగన్న మనదేశ్లు వీరియందు పనికిరారు.



చిత్రము ౨



చిత్రము 3

ఇచ్చటిస్త్రీలు సాధారణముగా పొట్టివారు. వీరిలో చాలమంది సర్వాంగసుందరులు.

అందరును బలముకలవారు; కష్టపడి పని చేయగలరు. వీరిసౌందర్యమంతయును ౧౨ - ౧౮ ఏండ్ల నడుమనే. ౧౪ లేక ౧౫-వ ఏట వీరికి పెండ్లియగును. ౧౬ లేక ౧౮-వ ఏటనే బిడ్డలుపుట్టుటవలన వీరిసౌందర్య మంతటితో క్రమముగా అంతరించును. వీరు సహజముగా ముగ్ధలు.

ఇచ్చటిజనులు ఆవులు, గొఱ్ఱెలు, మేకలు దాదాపుగా వీనిని పెంచుచుందురు. వీనిపాలను త్రాగుదురు, మాంస

మును తినుచు, ఉన్నితో ఉడుపులు చేసికొనుచు వీరు కాలము గడుపుచుందురు. (చిత్రము 3) ఈచిత్రమున



చిత్రము ౪
[హిల్ హాసీప్రక్కన ఒకచిన్నపల్లె. ఇక్కడి కొండవాలులు మొక్కజొన్నలు, గోధుమలు మాత్రమే పండించెదరు. ఆవులను పెంచుచు వీరు నిరాడంబరముగా బ్రతుకుచున్నారు.]

గొర్రెలకాపరి ముసలివాడైనను మిసుగృకాయుడై యున్నాడు. ఈవయసులో శేవదారుఢ్యముతోను, మంచుగడ్డలతోను నిండియుండు కొండలలో తనమందను వెంటబెట్టుకొని తిరుగుచున్నాడు.



చిత్రము ౫
[దిమాక్ కుండ్ (మంత్రకత్తెకోలను). మిక్కిలి లోతుగల లోయ. లోయనుండి పొగమంచు మబ్బులు పైకి లేచుచున్నవి].

ఇక్కడ ముఖ్యముగా వరి, మొక్కజొన్నలు, గోధుమలు పయిరుచేయుదురు. రబీ, ఖరీఫ్, అని ఏడాదికి వీరు రెండుపంటలు పండింతురు. రబీఖాలో గోధుమలు, మొక్కజొన్నలు, నువ్వులు, ప్రత్తి పండించెదరు. ఖరీఫ్‌పంటను డిసెంబర్ నెలలో విత్తులు చల్లెదరు. పొలములు సుమారు మూడునెలలవరకు ఎడతెగని మంచుచే కప్పబడియుండును. ఏప్రిల్ నెలలో వసంతము వచ్చును. వసంతము వచ్చుటతోడనే మంచు కరుగ మొదలిడును; పంటలు మొలకలెత్తసాగును. ఇది ఆకాపువారి ఎడదలు అచటి పూలవలె విచ్చుసమ

యము; అచటి పక్షులవలె వారును తీయగా పాడుచుం డెడుసమయము.

ఖరీఫ్‌లో వరిపంటమాత్రము పండించెదరు. ఈ పంటకు మేనెలలో విత్తులు చల్లెదరు. ఈపొలములు వసంతగ్రీష్మములందు నీటిక్రింద ఉండును. ఇట్లుండుట వలన ఇవి చాలసారవంతములుగా నున్నవి.

రబీపంటను జూలైనెలలోను, ఖరీఫ్‌పంటను అక్టోబర్‌నెలలోను కోయుదురు. కోత కోయుచుండు నప్పుడు వారిపాటలు గాలిలో తేలిపోవుచుండును. వారి ముఖములు కలకలలాడుచుండును. చాలపంటలు పండి



చిత్రము ౬

['రావి' నదితో చేరిపోవుఒకకొండవాగు: కాలా పహాడ్ (నల్లకొండ) నుండి తీసినఫోటో. ఆగ్నేయమున కనబడుచున్నది పవర్‌హౌస్]

నప్పుడు వారు పంటవిందులు చేయుదురు. అప్పుడందరును కలసి పాటలుపాడుచు చాలసంతోషముతో కాలము గడుపుదురు. (చిత్రము ౮)

నవంబరునెలలో పెండ్లిండ్లు చేయుట వీరికి వాడుక. పెండ్లికి కొన్నిదినములకు ముందునుండి, స్త్రీలు ప్రతిదినమును పగటిపూటను, రాత్రిపూటను ఒకటిగా కలిసి పాటలుపాడుదురు. ఒక్కొక్కప్పుడు వీరు ఒకరిభుజములపై ఒకరు చేతులువేసి మూడు నాలుగువరుసలుగా వీథులలో పెండ్లిపాటలు పాడుచు పోవుటయు కలదు. వీరి పెండ్లిండ్లు 'గరానవయ్' (అనగా ఇల్లునెవలుట) తో మొదలుపెట్టబడును. ఇది మన ఎదురుకోలు వంటిది. తరువాత 'హెనాబందీ'. అప్పుడు పెండ్లికొడుకును చేతులకు హెనారసమును పూయుదురు. పిమ్మట పెండ్లికొడుకు మంగళస్నానము చేసి, అలంకరించుకొనును. దీనికి 'దివాగర్' అనిపేరు. తరువాత స్త్రీలొకగుంపుగా కలిసి ఆవరణమున సున్నము, ఎర్రమట్టితో అలంకరింపబడిన పీట మీద పెండ్లికొడుకును నిలువమందురు. అప్పుడు వారిలో వయసుచెల్లిన సుమంగలి యొకతె వచ్చి, పాటలు చెల రేగుచుండగా, చుట్టును మూగియున్న వారు అప్పుడప్పుడు నాణెములను, చక్కెరను పెండ్లికొడుకుమీద చల్లుచుండగా, రెండు దీపములను, రెండుపావురములను వాని ముఖముముందు త్రిప్పును. ఇది మరల పెండ్లికూతురి ఇంటిలోను జరుగును. పెండ్లియైనతోడనే దంపతు లిరువురును ఒకేపళ్లెరములో భుజింతురు. పిమ్మట అగ్నిహోత్రమునిచుట్టును పెట్టబడిన ౭ వెండినాణెములమీద నడువవలయును. తరువాత పెండ్లికూతురు తాను పుట్టి పెరిగిన ఇంటిని, తన్ను కన్న తల్లిదండ్రులను విడిచి, మగనితో మగనింటికి వెళ్లును.

డల్హౌసీ పర్వతదృశ్యము నీలగిరులదృశ్యము వంటిదికాదు. ఇది దానికంటె మనోజ్ఞమైనది. దానికంటె గంభీరమైనది. నీలగిరులు మెత్తనిలోయలతోను, పచ్చని చరియలతోను, దట్టపు టడవులతోను నిండిన ఎత్తయిన కొండలవరుసలు. అంతే కాని ఈపర్వతములో-

మిక్కిలి ఎత్తయినశిఖరములు. ఒక్క అడుగు జారిన నూర్లకొలది అడుగులు జారిపోవలసినదే. చూపుమేర దూరమున ౧౬౦౦౦ అడుగుల (చిత్రము ౫) ఎత్తుగలకొండలు ఎల్లప్పుడును మంచుతో కప్పబడి ఎండలో కన్నులకు మిరుమిట్లు గొలుపుచుండును. ఎక్కడ చూచినను మహోన్నత పర్వతశ్రేణులు. వానిలో లెక్కకు మిక్కిలిగ దేవదారువృక్షములు. అక్కడక్కడ కొండలలో గొర్రెలు బండనుండి బండకు దుముకుచుండగా, భయంకరమైన వేగముతో లోయలకు పారుచున్న కొండవాగుచెంత ఆవులు మేయుచుండును. ఇట్టిదృశ్యమును చూచినవారు మరువలేరు. 'సురాజ్ ముఖి' చెంత— ఇంటియావరణమునందే— ఒకచల్లని మలయామారుతకాల్వ పారుచున్నది; ఒక్కొక్కప్పుడు లోయలలో చిటిపొటితరంగాలతో; ఒక్కొక్కప్పుడు ఘనమైన ఘోషతో, భయంకరమైన వేగముతో దీనిని



చిత్రము ౬

[చలికాలములో డల్హౌసీలోని గృహసీమ. ఇంటికప్పులను మంచుకప్పియున్నది.]



చిత్రము ౭

[డల్హౌసీప్రక్కన మంచుచే కప్పబడిన ఒకపల్లె]

చూచినప్పుడు కర్మ మహత్త్వము ఎట్టిదో తనంతటనే తోచును. (చిత్రము ౬)



చిత్రము ౯

ఇక్కడ జూలై నెల కడపటనే వర్షకాలము ఆరంభమగును. జూలై ముగియులోపలనే ౧౨ అంగుళములవాన కురియును. ఇట్టి (చిత్రము ౭ చిత్రము ౮)



చిత్రము ౧౦
[డల్హౌసీలో నున్న చంబసంస్థానపుమహారాజుగారి సుందరమైన నగరు]

సమయములలో ఉన్నట్లుండి ఉత్తరహిమాలయశ్రేణి నుండి చల్లనిగాలి వీచుటచే శీతోష్ణపరిమాణము ౨౦° కూడతగ్గి, ౮౩°F అగుటకలదు. వెంటనే మంచి ఎండ కాయుటయు కలదు. వర్షాధిక్యముచే పిల్లకాల్వలు ఎన్నో పారుచుండును. పెద్దకాల్వలు నిండి పొంగులగును. ఈ సమయమునందలి చిత్రమే యిది. (చిత్రము ౯) ఇది రావి నది చిత్రము; డల్హౌసీప్రక్కన కొండలలో ఇది మహావేగముతో పారుచుండును. చుట్టును అతిధవళమును, అతిమనోజ్ఞమును, అత్యున్నతమును, అతిభయంకరమును అగు పర్వత

పంక్తులు. వీనిగాంభీర్యము ఏసార్వభౌమునికిని లేదు. వీని ప్రశాంతత మనజ్ఞానమున కతీతమైనది.

ఇట్టిదృశ్యములను చూచునప్పుడు మనలను, మన వ్యక్తిత్వమును మరచిపోదుము. మన మెవరమో, ఏమో, మరచి, ఎదుటనున్న భయంకరసౌందర్య చింతనములో మునిగి, మునిగి, పవిత్ర ప్రకృతిలో లీనమైనట్లుందుము. (చిత్రము ౧౦)



చిత్రము ౧౧
డల్హౌసీ. దూరదృశ్యము

## శ్రీ చిలుకూరి బుచ్చన్నపంతులుగారు



వీరు విజయనగరాస్థానసంగీతవిద్వాంసులగు శ్రీ. వెంకటరమణదాసుగారికి శిష్యులు, గాయకులు, వైణికులు. జంత్రగాత్రముల మేలిచేయి యనిపించుకొనినవారు. జలతరంగిణీవాదనమున మంచి నేర్పు నలవరచుకొనినారు. వీరికి సంగీతశాస్త్రమునను చొరవగలదు. పురందరదాస కీర్తనముల నిపుడు వీరు 'స్వరపరచు' చున్నారు. వీరు గంజాముమండలమువారు. పర్లాకిమిడి వీరినివాసస్థానము.

'సంగీత ప్రియుడు'

# వలసరాజ్యములందు భారతీయ సంస్కృతి

తలిశెట్టి రామారావు



## ౬

## సుమిత్ర, బలి, జావాద్వీపములు

సుమిత్ర ప్రాగ్దేశములందు హిందూనాగరికము యొక్క వ్యాప్తిని తెలుసుకొనగోరువారికి సుమిత్ర యొక్క చరిత్ర తెలిసియుండుట యవసరము.

క్రీస్తుకు కొన్ని శతాబ్దముల పూర్వమే సుమిత్ర (సువర్ణభూమి *)యందు హిందువులు కాపురమేర్పరచుకొని, రాజ్యాధిపతులైనట్టుల కానవచ్చుచున్నది. వీరు క్రీ. తొలిశతాబ్దములందు ఆఫ్రికాదగ్గరనున్న మెడగాస్కరునకు వెళ్లి యాద్వీపమునుగూడ నాక్రమించుకొనునంతటి ప్రబలమైయుండిరి. రామాయణమునందును జాతకకథలందును సువర్ణభూమి పేర్కొనబడినది. టోలెమి పేర్కొనిన జబాడియయు, అరబ్బిగ్రంథములందుకానవచ్చు జబాగు జబేజాలును ఈద్వీపమే యనియు నిర్ణయమైనది. క్రీ. పూ. బహుశః ౨౪౭ సం.ల ప్రాంతములలో అశోకునిచే పంపబడిన సోన, ఉత్తర అనుబౌద్ధసన్యాసులిచ్చటికి వచ్చిరని మహావంశమున గలదు. ఫాహియాను క్రీ. శ. ౪౧౪ సం.లో ఎ-పొ-టియను దేశమునకు (యవభూమి) వచ్చినప్పుడచ్చట అందరును హిందువులైయుండిరని వ్రాసెను. కాశ్మీరరాజవంశమునకు జెందిన గుణవర్మను క్రీ. శ. ౪౨౩ లో నచ్చటికి వెళ్లి యాద్వీపపురాణిని యామె కుమారుని మహాయాన బౌద్ధమతావలంబకులుగ మార్చెనట. నాటినుండియు సుమిత్ర బౌద్ధరాజ్యమైనది. ఆకాలమున నచ్చట శ్రీవిజయమను రాజ్యము మిగుల పేరువడసియుండినది. మలయదేశమునుండి వచ్చిన శైలేంద్రవంశమువారీరాజ్యమున కధిపతులుగ నుండి విశేషముగ కీర్తివంతులైరి. ఇచ్చట సంస్కృతవ్యాకరణమును, బౌద్ధగ్రంథములను చదువుటకు క్రీ. శ. ౬౭౦ లో వచ్చిన ఇత్-సింగు శ్రీవిజయమునకు మలయదేశములో బడియుండెనని వ్రాసెను. ఏడవశతాబ్దమునాటికి సుమిత్ర పలుకుబడికల రాజ్యముగను, నౌకాబలమున సుప్రసిద్ధముగను ఉండెననుట నిశ్చయము. వజ్రపాణి, పద్మపాణి బుద్ధుడు మొదలగుదేవతల యారాధనము కొరకు ౮-వ శతాబ్దమున కొన్ని దేవాలయములును, స్తూపములును ఇటుకలతో నిచ్చట నిర్మింపబడినవి. కాంభోజమును, జావామధ్యభాగమును శైలేంద్రులు జయించిరి. సుమిత్రకు లోబడియుండిన మలయులు చంపాపైకి దండయాత్ర వెడలిరి. తొమ్మిదవశతాబ్దప్రారంభమున కాంభోజులు తమయాధిక్యమును స్థిరపరచుకొనిననాటినుండియు శ్రీవిజయరాజ్యము బలహీనముకాజొచ్చినది.

సుమిత్ర హిందూదేశముతో చాలాకాలము సంపర్కము కలుగజేసుకొనియుండినది. జావాద్వీపమునందలి యొకానొక రాజుయొక్క మనుమడును సుమిత్రకు రాజును అగు బాలపుత్రదేవుని పేరను దేవపాలుడను రాజు క్రీ. శ. ౮౬౦ లో నొకవిహారమును నిర్మించి దానిపోషణార్థము కొన్నిగ్రామముల నర్పించెనని నలంద

* సువర్ణభూమి బర్మాయని కొందరు చరిత్రకారు లిదివరలో ననుకొనిరి కాని సుమిత్రయని యిప్పుడు నిర్ధారణయైనది.

వద్ద దొరకిన తామ్రశాసనమున గలదు. శ్రీవిజయము, కటాహము అనుదేశములు నేపాళగ్రంథములందును, చోళశాసనములందును పేర్కొనబడినవి. శైలేంద్ర నృపుడగు చూడామణివర్మ్మడు నాగపట్టణమువద్ద నొక బౌద్ధాలయమును నిర్మింపజేసెను. క్రీ. శ. ౧౦౭౪ లో శైలేంద్రచూడామణివర్మ యొకవిహారమునకు కొన్ని గ్రామముల నర్పించెను. ఇంతపలుకుబడి గలిగియుండిన శ్రీవిజయకటాహరాజ్యములనుకూడ రాజేంద్రచోళ్లుడు జయించెనని శాసనములవలన దెలియుచున్నది! పదునొకండవశతాబ్దమున విక్రమశిలవిహారమునందుండిన అతీశుడను అభిధాననామముకల దీపంకర శ్రీజ్ఞానుడు సుమి[illegible] సర్వాస్తివాదమును నేర్చుకొనెను. పదమూడవ శతాబ్దమున [illegible]మిత్రదేశీయులు [illegible]ంహళము [illegible] యాత్ర సలిపిరి.

కృతనగరుడను జావారాజు సుమిత్రపైకి దండెత్తి యిరువురురాజకుమార్తెలను తనయంతఃపురమునకు దెచ్చుకొనెను. మజపహిత్తురాజులు సుమిత్రలో కొన్నిభాగములను చిక్కించుకొనిరి.

పదునాల్గవశతాబ్దమునాటికి సుమిత్రయందు మహమ్మదీయుల పలుకుబడి హెచ్చినది. మిగిలిన హిందువులును, బౌద్ధులును బలిద్వీపమును చేరుకొనిరి. సనాతన హిందూనాగరిక చిహ్నములిప్పుడు సుమిత్రయందు కానవచ్చుట యరుదు. మంచిహిందూ, బౌద్ధనిర్మాణములు మృగ్యములు. జావా, చంపా, మలయ, కాంభోజదేశములను కంపింపజేసిన శైలేంద్రులు హిందూ, బౌద్ధాచారముల ననుసరించి యెట్టిదేవాలయముల నిచ్చట కట్టలేదా యను ప్రశ్నకు సమాధానము చెప్పుట కింకను పరిశోధనచేసి నూతనచారిత్రకవిషయములను వెల్లడి చేయవలసియున్నది. శైలేంద్రులు మధ్యజావాను జయించి, యచ్చట నద్భుతమైన నిర్మాణములకు కర్తలైరని జావాచరిత్రమువలన దెలియగలదు. అన్యదేశములందు వారు కట్టించిన యద్భుతమైన నిర్మాణములవలన వారి వంశముయొక్కయు, సుమిత్రయొక్కయు కీర్తి యిప్పటికిని సుస్థిరమై, హిందూవిజ్ఞానమునకు కూడ వన్నెబెట్టుచున్నది.

బలి:—జావాకు బహుసమీపమున బలియను చిన్నద్వీపము కలదు. ప్రాచీనకాలమున హిందువు లనేకదేశములలో వ్యాపింపజేసిన హిందూమత మీయొక్క వలసరాజ్యమునందే యిప్పటికి నేదోయొక రూపమున నిలచియున్నది. జావాతోపాటు బలిద్వీపమును హిందూమతమును స్వీకరించినది. ఏకారణముచేతనో బౌద్ధులిచ్చట తమ మతప్రచారమునుగూర్చి విశేషముగ శ్రద్ధవహింపలేదు కాని బౌద్ధమతాచారములతోపాటు హిందూమతాచారములు కలసి యిచ్చట కానవచ్చుచున్నవి. సుమిత్ర జావాప్రజలు మహమ్మదీయమతమును స్వీకరించినకాలమున తమసనాతనమతములం దభిమానము విశేషముగాలని హిందువులు, బౌద్ధులు తలదాచుకొనుటకు బలిద్వీపమునకు వచ్చిన పిమ్మట అందరును కలసిమెలసి వందలకొలది సంవత్సరము లుండుటయం దొకవిధమగు నాచారములు మరియొక గనుకరించుటయందు వింతలేదు. పూర్వము సుమిత్ర జావాలయందు సంఘమెట్లుండెనో యిప్పటికిని మనకీద్వీపమునందు కానవచ్చుటచే చారిత్రకవిషయముల ననేకములను బలిద్వీపవాసుల హైందవాచారములనుండి గ్రహింపవచ్చును. భారతదేశమునందును, ఈవలసరాజ్యములందును శిల్పచిత్రములలో గానవచ్చు నాగరికమును నడుమునకు మీదిభాగమున వస్త్రము లేకపోవుటయు మొదలగు విషయములవలన కళాభిమానులకు కలుగుచున్న సందేహములు బలిద్వీపమునందలి సాంఘికాచారములు నివర్తిచేయగలవు. ఇటీవలనే యిచ్చట హైందవాచారము ననుసరించి యొకయజ్ఞము చేసిరట! రామాయణ మహాభారతాది పురాణములను పారాయణము చేయుచుందురు. ప్రాచీన భారతీయహిందూ నాట్యమును బోలు నాట్యమును, తోలుబొమ్మలాటయు నిచ్చట ఆదరమును బడయుచున్నవి.

తాంపక్సిరింగుఅనుచోట రాజుల శ్మశానమొకటి ౧౧,౧౨-వ శతాబ్దములనాటిది కలదు. ఈ సమీపమున నొక లోయప్రక్కగల శిలపై దేవాలయద్వారములవంటి చిత్రములు మలచబడియున్నవి. ౧౪,౧౫ శతాబ్దములలో గట్టబడిన "పురవిగంగ" యను దేవాలయము ఆంధ్రదేశమునగల యంతస్థు శిఖరములను బోలియున్నది. కాని

యీశిఖరము పొడవుగ, సన్నముగ నుండుటవలన నా ద్వీపమున నిర్మాణమునందు కొంతమార్పుకలిగినట్లు గోచరమగును. ఇటీవల సంన్సెత్తు, బంన్లె, బటూరు, కేసి మాను మొదలగుచోట్ల గట్టబడిన యాలయములం దొక్కొక్క గదిమాత్ర మున్నవి. ద్వారములు గల గోపురములు దక్షిణహిందూదేశమునందువలె నెత్తుగ నున్నవి. శిల్పాలంకారములందును, నిర్మాణమునందును చేర్కొనవలసిన విషయము లెవ్వియు వీనియందు కానరావు.

బలియందు గోడలమీదను, దారుఫలకముల మీదను వ్రాయబడినచిత్రములు కానవచ్చినవి. ౧౭,౧౮-వ శతాబ్దములనాటి గ్రంథములందునుకొన్ని చక్కని చిత్తరువులు కలవు. పౌరాణికకథలు, స్త్రీపురుషులశృంగారము విషయములుగాగల యీచిత్రములందు విదేశీయుల గుణములు కానరాకపోవుటచే యీప్రాంతములందు హిందూసంప్రదాయముల ననుసరించి చిత్రరచన యెట్లు పెరిగి ప్రత్యేకత వహించినదియు వీటివలన మనకుదెలియగలదు.

జావా:—అంకోరుఘాటు, ఆంకోరుతోము నిర్మాణములు కాంబోజదేశముయొక్క పూర్వపునాగరికముపై దృష్టినాకర్షించినట్లుల బొరొబుదరు (బడాబహద్దరు?) చరిత్రకారుల, కళారాధకుల దృష్టి నాకర్షించి, జావాయొక్క పేరును సుప్రసిద్ధముచేసివైచినది. ఇటీవల పురాతత్త్వజ్ఞు లీద్వీపమునంతను వెదకి యచ్చటి నిర్మాణములనుగూర్చి వ్రాసి, భారతీయ నాగరికము ఖండాంతరములందు వ్యాపించుటనుగూర్చి యనేకములగు అద్భుత విషయములను ప్రపంచమునకు వెల్లడిచేసిరి.

జావాద్వీపము డచ్చిఈస్టుఇండియా కంపెనీవారి యాధిపత్యమున నుండిన కాలమున చాలాసంవత్సరముల వఱకు నీనిర్మాణములపై డచ్చివారిదృష్టిప్రసరింపలేదు. తమకులోబడిన ప్రజలయెడలను, దేశమునందును గూర్చి నభిరుచి కలుగుటచే వ్యవసాయవాణిజ్యమున నభివృద్ధికొఱకు మార్గములను కనిపెట్టుటకును, ప్రజలయొక్క ఆచారవ్యవహారములను, చరిత్రమును పరిశీలించుటకును సమితియొకటి క్రీ. శ. ౧౭౭౮ లో బటేవియాయందుస్థాపింపబడినది. ౧౮౦౧-౧౮౦౮ లో కొంతభాగమునకు గవర్నరుగనుండిన నికోలాసు ఎంజెలుహార్డు గారు ప్రాంబణముప్రాంతములందుండిన సనాతననిర్మాణములను బరిశీలించి, కొన్నిటిని బాగుచేయించి, వాటి చిత్రములను వ్రాయించుటకు కొలతలను తీయింపించెను. అప్పటి డచ్చిగవర్నరుగారు వీటిసౌందర్యమును గ్రహించి, కొన్నిశిలావిగ్రహములను సెమరాంగు అనుచోటగల తననివాసము నలంకరించుటకు తెప్పించుకొనెను. కాని యివి తువకు లీడనుసందుగల వస్తుప్రదర్శనశాలకు చేరుటచే చెడిపోక, యిప్పటికిని కళారాధకుల నానందింపజేయుటకు నిలచియున్నవి. ౧౮౧౧ - ౧౮౧౬ లో జావాద్వీపము బ్రిటిషుపరిపాలనము క్రిందనున్నప్పుడచ్చట గవర్నరుగనున్న సర్ స్టాంఫోర్డు రేఫిల్సు పురాతనశిలానిర్మాణావ్యాపారములను పరిశీలించి, నూతనవిషయములను సేకరించి, జావాచరిత్రమును వ్రాసి ప్రచురించెను. అచ్చటి సనాతనభవనములను గూర్చి యిది యమూల్యమైన గ్రంథమైనను, చారిత్రక విషయములందు లోపపూరితమైయున్నది. జానుక్రాఫర్డు కోలినుమెక్కంజీ, డాక్టరు జానులీడను అనువారును రేఫిల్సుమార్గముల ననుసరించిరి కారణాంతరములవలన వీరిపరిశ్రమ విశేషముగ ఫలించినదికాదు. బొరొబుదరు నిర్మాణమునుగూర్చియు, శిల్పమునుగూర్చియు విల్సను వ్రాసిన ౬౦౦ చిత్రములను డచ్చిగవర్నమెంటువారును, డాక్టరు లీమన్సుగారు వ్రాసిన వర్ణనతో అరువదియైదు-ఛాయాచిత్రములను సేకరించి బటేవియాసొసయిటీ వారు మరియొకమారు తదితరదేవాలయములగూర్చి ౩౩౨ ఛాయాచిత్రములను లోకమున కందజేసిరి. డచ్చిప్రభుత్వమువారిచే నియమితుడై డాక్టరుఫ్రీడరిక్కు కొన్నిశాసనములను తర్జుమాచేసెను. హాంబ్రిడు కెర్నుపండితుడు సంస్కృతమును, జావాలో వాడుకయందున్న "కవి"యనుభాషను బాగుగ నేర్చుకొని శాసనములను, అచ్చట ప్రచారముననున్న రామాయణమును భాషాంతరీకరించి జావాయొక్క సనాతన నాగరికతను ప్రపంచమునకు బాగుగ వెల్లడిచేసెను. వీరి

శిష్యులగు డాక్టరు బ్రాందిసు అచ్చటిభాషలందును, భవననిర్మాణతత్త్వమునందును మంచిపండితులు. జాగో వద్దగల దేవాలయమునుగూర్చియు, సింగసారి, పానింతరను వద్దగల సనాతననిర్మాణములనుగూర్చియు వీరు వ్రాసిన గ్రంథము లమూల్యములైనవి. డచ్చిప్రభుత్వము వారి యాజ్ఞప్రకారము వారేర్పడు పాడువడియున్న నిర్మాణములను బాగుచేయించి యనేకములగు ఛాయాచిత్రములను తీసెను. ఇచ్చటిపురాతత్త్వశాఖను ఆధునిక పద్ధతులపై పునరుజ్జీవింపజేసిన డాక్టరుక్రోము జావాయొక్క శాసనములు, చరిత్రము, కళలు మొదలగువిషయములను గూర్చి యమూల్యములైన వ్యాసములను వ్రాసిరి. ఉద్యోగమును చాలించుకొనినపిమ్మట హిందూ-జావాకళనుగూర్చి యొకగ్రంథమును రెండుసంపుటములుగ బ్రచురించిరి. వీరు బోరొబుదరుగూర్చి రకరకఛాయాచిత్రములతో ప్రచురపరచిన గ్రంథ మద్వితీయమైనది. జావా పురాతత్త్వశాఖ కిప్పు డధిపతియైయున్న డాక్టరు బోష్‌గారిప్పుడీవిషయమునుగూర్చి విశేషము శ్రద్ధవూనియున్నారు.

పైనచెప్పబడిన పండితులు లోకమున కర్పించిన విషయములు భారతీయుల సనాతననాగరికమును వెల్లడిచేయుటకు చాల నుపయోగపడుచున్నవి. భారతీయులు మాత్ర మీవలసరాజ్యములయెడల విశేషముగ శ్రద్ధవూనకుండుట శోచనీయము. సుప్రసిద్ధులగు రవీంద్రనాథ ఠాకురుగారు కీప్రాంతములకువెళ్లి, భారతీయులలో కొంత యుత్సాహమును కలుగజేయుట శుభప్రదముగ నున్నది. జావాద్వీపమునందు మొదట హిందూమతము ప్రచారమునకువచ్చెను. ఆతరువాత బౌద్ధమతము వ్యాపించినను హిందూమతమునందు ప్రజలకుగలిగిన నమ్మకము పోలేదు. పదునైదవశతాబ్దమున జావా మహమ్మదీయమతమును స్వీకరించుటచే దేవాలయములందు హిందూబౌద్ధమతాచారముల ననుసరించి పూజలు జరుగకపోయినను హిందూనాగరికముయొక్క చిహ్నములు మాత్రమిప్పటికిని సంఘమున నిలచియున్నవి. జావాప్రజలు హిందూత్వముయొక్క తత్త్వమును బాగుగ గ్రహించుటయే దీనికి కారణము. కొన్నితావులను చూచినయెడల నీవిషయము బాగుగ వ్యక్తమగును.

మన పురాణములందు కానబడు పేరులు జావాయందిప్పటికిని వాడుకయందున్నవి. ఈ ద్వీపమున నెత్తయిన పర్వతము "స్మేరు" అని పిలంబడుచున్నది. ఇది పురాణప్రసిద్ధమగు సుమేరుపర్వతమును జ్ఞాపకము తేగలదు. అర్జున, బ్రమ (బ్రహ్మ), కవి అనుపర్వతములు కూడ నిచ్చటగలవు. మధ్యజావాయందు "సెరయు" (సరయు) అనునది కలదు. ఒక భూభాగమునకు "బేసుకి" అను పేరుకలదు. బేసుకి వాసుకి యను సంస్కృతపదమునకు వికృతరూపము. ఇప్పటికి నిచ్చటి రాజులు సంస్కృతపదములగు రాజ, ప్రబు (ప్రభు), బూపతి (భూపతి), అదిపతి (అధిపతి), అర్య (ఆర్య) అనుపేర్ల బిలువబడుచుందురు. మంత్రి, పతి, ద్యక్ష (అధ్యక్ష), వాదనొ (వాదన) ఉద్యోగులలో కొందరు సూర్యపుత్ర, సూర్యవినిత, శాస్త్రవిదగ్ధ మొదలగుపేర్ల నిచ్చటివారిప్పటికిని పెట్టుకొనుచుందురు. జావావారి పూర్వపుభాష పేరు "బాసకవి." ఇది "భాష కవి 'యను' యను రెండుపదముల కూడిక. ఈభాషయందు హిందూగ్రంథము లనేకములు కొన్ని మార్పులతో వ్రాయబడినవి. పూర్వము సంస్కృతవ్యాకరణము, బౌద్ధమతము మొదలగునవి నేర్చుకొనుట కిచ్చటికితరదేశీయులు వచ్చుచుండిరట! హిందూదేశమునుండి కూడ హైందవశాస్త్రములను నేర్చుకొనుటకు కొందరిచ్చటికి వచ్చినటుల కూడ నిదర్శనములు కలవు!! రామాయణ, మహాభారత వీరులనిన జావావారి కిప్పటికిని గౌరవముహెచ్చు. నాట్యమునందును, నాటకములందును హిందూవీరుల వేషములను ధరించి, వారిచరిత్రము నభినయించి జావాప్రజ లానందించుచుందురు.

ఇట్టి నాగరిక మిచ్చట యెటుల స్థాపితమైనదియు జావాచరిత్రమువలన దెలియుచున్నది.

హిందువు లీప్రాంతములకు రాకపూర్వము జావాప్రజ లెట్టినాగరికులై యుండిరో చెప్పుటకు వారి నిర్మాణములుకాని, శిల్పచిత్రములుకాని (కొన్ని పోటువిగ్రహములుతప్ప) కానరాలేదు. జవాలకు చంపా,

కాంభోజము, మలయ మొదలగుదేశముల నాగరికమును బోలునదిచ్చటను ఉండెనుకాబోలు. రానురాను భారతీయకళావిధానము లాదేశమునకు సరిపోవునటుల మారుటకీనాగరికమే కారణమైయుండవచ్చును. చైనా,అన్నాము వారిపలుకుబడి యిట్టిమార్పుల నెంతవరకు ప్రవేశపెట్టెనో చెప్పుట దుర్లభము కాని యీవిషయ మింకను నిర్ధారణము కాలేదు.

భ్రాతయుద్ధము (భారతయుద్ధము) నందలి వీరులు తమద్వీపమునందే పుట్టి పెరిగినటుల జావాప్రజలు భావించుచుండిరి. బౌద్ధుల శకయుగమునకు కారకుడైన "అదిశిశక" యిచ్చటికి క్రీ. శ. 79-వ సంవత్సరమున వచ్చెననియు చెప్పుకొందురు. ఈకథలుతప్ప హిందువులిచ్చటికి మొదట వచ్చుటనుగూర్చి చెప్పుటకు జావాయందుగాని, భారతదేశమునందుగాని యెట్టి యాధారములును కానరాలేదు. దక్షిణదేశమునను, జావాయందును లభించిన శాసనములును, తూర్పుజావారాజుల చారిత్రమును తెలియజేయు "నాగరక్రేతాగము" అనుగ్రంథము వలనను తరువాతి నీరెండుదేశములకు గలిగిన సంపర్కమును మాత్రము తెలియజేయుచున్నవి.

ఫాహియాను సింహళదేశమునుండి మరలి చైనాకు బోవుచుండగా పెద్దగుపానువచ్చుటవలన ఎ-పొ-టియను దేశమున దిగె, బ్రాహ్మణులు, అన్యమతస్థులు నచ్చట గలరు కాని బుద్ధునిమతము ప్రచారమున లేదనివ్రాసెను. ఎ-పొ-టి యవభూమియై యుండవలెను. యవభూమి సుమిత్రయని కొందరును, జావాయని కొందరును అభిప్రాయపడుచున్నారు. ఇందేయూహ నిజమైనను ఈ ప్రాంతములందానాటికి (క్రీ. శ. ౪౧౪) హిందువులు విశేషముగ నుండుట నిశ్చయము.

క్రీ. శ. ౬౭౧-వ సంవత్సరమున ఇత్సింగు హిందూదేశమునకు బోవునప్పుడు భొచెయను స్థలమున నారుమాసములుండి సంస్కృతవ్యాకరణమును నేర్చుకొనెను! సుమిత్రద్వీపమందలి పాలెంబాంగువద్ద 'భొచె' యుండెననియు, నిది హిందూవిజ్ఞానమున కాస్థానమై యుండెననియు పండితుల యభిప్రాయము. ఆనాటికే హిందువులిచ్చటనుండుటయే కాక హిందూనాగరికము బాగుగ పాదుకొనునటుల జేసిరని స్పష్టమగుచున్నది.

సుమిత్ర, జావాద్వీపములు హిందూవలసరాజ్యములలో మిగుల పేరుపడినవైనను ఈతూర్పుప్రాంతములందలి మొదటి సంస్కృతశాసనము లిచ్చటగాక బోర్నియోద్వీపమునందు లభించుట చిత్రముగనున్నది. శ్రమదీసుకొని వెదకినయెడల జావా, సుమిత్రలందు శిలాశాసనములు లభింపగలవని నమ్మవచ్చును. ఫాహియానీద్వీపములకు వచ్చినప్పటికి బోర్నియోలో "మహాకామ" నదీతీరమున నొకరాజ్యముండెననియు, దానిని అశ్వవర్మ, మూలవర్మ మొదలగురాజులు పాలించుచుండిరనియు తెలియుచున్నది. బ్రాహ్మణులచట నొక యజ్ఞమును చేసిరని నిర్దుష్టమైన సంస్కృతమున నా శాసనములందు గలవు.

పశ్చిమజావాయందు సుమారు క్రీ. శ. ౪౫౦ సంవత్సరమునాటి శిలాశాసనములు నాలుగు లభించినవి. "తారుమా" యను నగరమున పూర్ణవర్మయను హిందూరాజు పాలించుచుండెనని స్పష్టపడినవి. ఈశాసనములు సంస్కృతమున గలవు. అక్షరములపోలికయందు పల్లవులశాసనములను పోలియున్నది. జావా,బోర్నియో రాజులయొక్కయు, పల్లవులయొక్కయు నామాంతమున "వర్మ" శబ్దము కానవచ్చుచున్నది. కాని ఇచ్చటి రాజులు పల్లవుల కుటుంబమువారై యుండవచ్చును.

చెంగలు, నదియలవద్ద రెండుశాసనములు కానవచ్చినవి. అక్షరరచనయందు దక్షిణహిందూదేశమున ౭, ౮-వ శతాబ్దములనాటి శాసనములను బోలియున్నవి. కుంజరకుంజదేశమున కాపురముజేసిన సంతతివాడగు సంజయుడను రాజు శివలింగమును ప్రతిష్ఠజేయించెనని యీరెండుశాసనములందు గలదు. కుంజరకుంజదేశము తమిళనాడునందుగలదని డాక్టరు కుమారస్వామిగారి యభిప్రాయముగ గపబడుచున్నది. కుంజరకుంజము దక్షిణహిందూదేశమున గలదని డాక్టరు వోజెనుగారు వ్రాసిరి. "సంజయ" అనుపేరువంటివి (జయంతవర్మన)దక్షిణకళింగము నేలినరాజుల పేరులను పోలియున్న

ది. మాదుగులనేలిన మత్స్యవంశజుల కిట్టిపేరు లుండినవి. మాధుగుల దక్షిణకళింగమునగలదు. కళింగదేశమునుండియు, మచిలీబందరునుండియు ప్రజలు జావా ప్రాంతములకు వెళ్లిరని నిదర్శనములు కలవు. కాని కుంజర కుంజదేశ మీ ప్రాంతములదే యైయుండవలెను. కుంజర కుంజము కుంజరకోణమనియు, ఇదియే విజయనగర ప్రభువులకు రాజధానియై యుండిన ఆనెగొందెయనియు కళింగమున దక్షిణభాగమునగాక, కళింగదేశమునకు దక్షిణమున గలదనియు గంగులీవారు వ్రాసిరి. కుంజరధారి యనగా అన్నామలెయని యర్థముకలదు. కాని తక్కిన చారిత్రిక విషయములన్నియు నీయూహకు వ్యతిరేకములై యున్నవి.

అగస్త్యుడను ఋషి కుంజరపర్వతముచెంత నివసించుచుండెనని చెప్పుటకు హరివంశమున ఆధారములు కలవట. ఈతడు జావాయందు విశేషముగ బూజింపబడుచుండెను. అగస్త్యోదయసమయమున వర్షాకాలాంతమున సముద్రముప్రయాణకరముగ నుండెదుకనుక జావా ప్రాంతములకు బోవునుండిన నావికుల తనిని బూజించుటయం దాశ్చర్యము లేదు. జావా, బలిద్వీపములందీనమ్మకమిప్పటికిని కలదు. అగస్త్యుడు దక్షిణహిందూదేశమునను బూజింపబడుచుండెను.

మలయ ప్రాంతములందు భారతీయులను ఒరాంగు కెలింగు (కళింగులు) అని పిలచెదరు.

ఉత్తరహిందూదేశమున వాడుకయందుండిన విక్రమయుగమునకుబదులు దక్షిణహిందూదేశమునందలి శకయుగమీద్వీపముల ప్రజ లవలంబించిరి.

కనుక జావా, బలి, సుమిత్ర మొదలగు ద్వీపములకు వెళ్లి రాజ్యములను స్థాపించినవారు కళింగ ఆంధ్ర దేశములందలి ప్రజలగుట నిశ్చయము. అచ్చటి దేవాలయములన్నియు ఆంధ్ర, మైజామురాష్ట్రములందు కానవచ్చు దేవాలయములను పోలియుండుట కిదియే కారణము. ఇటీవల జావాయందు బౌద్ధమతము వ్యాప్తి జెందినను తొలుత హిందూమతమునే యచ్చట ప్రవేశపెట్టబడినదనియు పైన జెప్పిన యాంశములవలన స్పష్టపడుచున్నది.

"తనరాజ్యము క్షీణించునని గుజరాతురాజునకు తెలియవచ్చుటచే (సోదివలన), క్రీ. శ. ౫౯౯ లేక ౬౦౩లో తనకుమారుని జావాకు పంప నిశ్చయించెను. ఆరాజకుమారుడు ఆరుపెద్ద, నూరుచిన్న పడవల మీద ౫,౦౦౦ యనుచరులతో నాలుగుమాసములు ప్రయాణముచేసి యొకద్వీపమున దిగెను. ఆద్వీపము జావాకాదని తెలియుటచే మరల ప్రయాణముచేసి జావా యందలి మాతారెము అనుచోట దిగెను. మనుష్యబలమున్న యెడల నచ్చట గొప్పరాజ్యమును స్థాపించవచ్చునని కనుగొని గుజరాతునకు కబురంపగా నాతని తండ్రియానందించి ౨,౦౦౦ మంది హిందువులను కుమారునివద్దకు బంపెను. ఆనాటినుండియు జావా సుప్రసిద్ధమైన రాజ్యమైనది. గుజరాతు మొదలగు దేశములతో వాణిజ్యము పెరిగెనది. అనేకదేశములనుండి ప్రజలు రావెుదలిడిరి. ఈకథను ఫెర్గూసను వ్రాసియున్నాడు. సుప్రసిద్ధుడను శాస్త్రపురాణ సుమిత్రకు క్రీ. శ. ౧౭౩ లో వచ్చి యాదేశపురాణిని, యామె కుమారుని బౌద్ధమతమున గలుపుకొనెనని సుమిత్ర చరిత్రమువలన దెలియుచున్నది. జావాయందలి "పగమ" యొక్క రాజగు మహారాజాధిరాజ ఆదిత్యవర్మడు తానేక యుద్ధములందు జయముపొందితినినియు, ఐదు సురుధ్యానబుద్ధులభక్తుడననియు నొకశిలాశాసనమున (క్రీ. శ. ౬౫౬) వ్రాయించుకొనెను. ఆనాటికే రాజులు కొందరు బౌద్ధమతమును స్వీకరించిరని యీకథలవలనను శాసనములవలనను తెలియుచున్నది.

మొదటకళింగ, ఆంధ్రదేశములనుండి హిందువులు వెళ్లి దేశము నాక్రమించుకొని, హిందూవిజ్ఞానము ప్రవేశపెట్టిన కొన్నిశతాబ్దములకు ఉత్తరహిందూదేశమునుండి వెళ్లినవారు బౌద్ధమతమునకు ప్రజలను మార్చియుందురనియు, అపిమ్మట కళింగ, ఆంధ్ర, తమిళ దేశములమండి యనేకులు పోవుచుండిరనియు పైన జెప్పిన విషయములన్నియు సూచించుచున్నవి.

# బెల్లము శుభ్రపరచుట

పూడిపెద్ది వెంకటరమణయ్య

## బెల్లమునుండి చక్కెరతీయుట

చక్కెర కర్మాగారపు పనివాండ్రు చక్కెరపంట కాలము ముగియగానే సంవత్సరమున మిగిలిన కాలమంతయు, గోళ్లుమీటుకొని కూర్చుండవలసినదే. అట్టి సమయముల బెల్లపు వంట ఉన్న యెడల ఆబెల్లమును శుభ్రపరచుట కుపయోగింపవచ్చును. అందుకుగాను చాలచక్కెరకర్మాగారములు బెల్లమును శుభ్రపరచుయంత్రమును గూడ సంతరించుకొనుచున్నవి. (౧౯౩౦-౩౧ సం. ౨౦ కర్మాగారములు, చెరకుతోను బెల్లముశుభ్రపరచుటతోనూ పని చేసినవి. మిగిలిన ౧౪ కర్మాగారములును బెల్లమునే శుభ్రపరచినవి.) బెల్లమును శుభ్రపరచుపరిశ్రమవలని లాభనష్టములు, చక్కెర బెల్లముల ధరనుబట్టి వచ్చుచుండును. బెల్లపుధర హెచ్చైనచో దానినుండి వచ్చు చక్కెరధరయు హెచ్చిపోవునుగదా! సామాన్యపరిస్థితులలో ౧౦౦ టన్నుల చెరకునుండి ౧౦ టన్నుల బెల్లమును చేయవచ్చును. దానిని శుభ్రపరచినచో ౫ లేక ౫½ టన్నుల చక్కెరవచ్చును. అట్టిబరువుగల చెరకునుండి తిన్నగ చక్కెరనే చేయదలచినచో ౯ టన్నులకు పైగా చక్కెరవచ్చును. రెండిటను వచ్చు మడ్డి సమానమే. అందువలన నీపరిశ్రమ పట్టి ప్రయాసమూలకమయి దండుగపనియగును గాని దేశసౌభాగ్యమున కెమాత్రమును సహాయకారి కాజాలదు. పరిశ్రమగ నాలోచించినను దీని లాభనష్టము లస్థిరములు. పత్రిక మాంద్యమిప్పటివలె సర్వత్ర వ్యాపించి బెల్లపుధర పడిపోయినప్పుడే ఈవిధానము కొంత లాభించును. ఇటుపయిని చక్కెరపంట సర్వవ్యాప్తమయినయెడల ఈ బెల్లపుపరిశ్రమ పూర్తిగనిరుత్సాహపరుపబడునట్లు తోచెడిని. దీనినిసంరక్షించుటెటులో చక్కెర టారిఫుబోర్డు నారికిని బోధపడలేదు. ఈపరిశ్రమను నిలబెట్టుట కొక్కటేకారణము; అది చెరకులోని పదార్థమును తనలో నిలువరించి యుంచగలదు. బెల్లము హిందూదేశమున ఆహార పదార్థములలో నొకటిగ నుపయోగపడి తీరును. అందువలన దీనివంట యన్నిట సాగును.

బెల్లము మంచిచెడ్డలు:—బెల్లము లేతగౌరవర్ణము మొదలు బొగ్గునలుపువరకును గల వన్నెలలో నుండును. ఈవన్నె వంటకాలమున రసమున కలిపిన సున్నమును బట్టి యుండును. మరియు పాకముచేయువారి చాకచక్యమునుబట్టి కూడ మారుచుండును. అది మైనము మెత్తన మొదలు ఇటుక గట్టిదనమువరకును గల నిర్మాణములలో కూడ నుండును. ఇదికూడ వంటకాలమున వాడుకచేసిన సున్నమును బట్టియే మారుచుండును. ఒక్కొక్కప్పుడు బెల్లము గాలిలోని చెమ్మను గ్రహించి పలుచపలుచగ ప్రాకిపోవును. (ఇది బెల్లమున నెక్కుడుగ పరిస్ఫుటము కాజాలని చక్కెర (Glucose) ఉండుటవలన గలుగును.) దానిలో నూటికి ౭౦ మొ. ౭౫ వరకును చక్కెరయుండును. దానిని రవలుగ ఏర్పరిచి గ్రహింపవచ్చును. నూటికి ౫ మొ. ౧౫ వరకును పరిస్ఫుటము కాజాలని చక్కెరయును నూటికి ౨ లేక 3 వరకు సున్నమును, ఇతరపదార్థములును ఉండును. ఇందు నీరుకూడ నూటికి కయిదు మొదలు పదివరకుండును. బెల్లములోని పదార్థములన్నియు వేర్వేర కొలది చెప్పుటకష్టము. ఏమనిన పాకవిధానమునుబట్టి యవియెల్ల మారుచుండును. అయినను ఈపైనిచెప్పిన యంకెలు బెల్లము మచ్చునకు త్రోవచూపగలవు.

బెల్లము శుభ్రపరుపవలెనన్న అది చాలగట్టిగ నుండవలెను. చాలతక్కువగ నుండవలెను. వన్నె చాల తక్కువగ నుండవలెను. అందులో పరిస్ఫుటము కాజాలని చక్కెర (Glucose) తక్కువగ నుండవలెను. సగటున నీలక్షణములుగల బెల్లమునుండి నూటికి ౫౦ మొ. ౫౫ వరకు చక్కెరను తీయవచ్చును.

విధానము:—బెల్లమును మున్ముందు నీటిలో కరగించవలెను. ఇందుకుగాను ప్రత్యేకపు తొట్టె

లుండును. వానిలో నీబెల్లమును చితుగగొట్టి కలుపు సాధనములుండును. ఇందు సాధారణముగ సగము నీరును సగము బెల్లమును ఉండును. ఈ తొట్టెలనుండి దానిని శుభ్రపరచుయంత్రమునకు పంపుదురు. అక్కడ దానికి తగినసున్నమును కలుపుదురు. సున్నపుదోషమును కొట్టివేయుటకు గంధకపుటావిరి నాపానకమున కెక్కింతురు. అవసరమయినచోట నీపానకము నప్పుడుకాచి దళసరిగుడ్డలలో వడియగట్టుదురు. ఇట్లుశుభ్రపడిన పానకమును మరి మరగించి దించనక్కరలేదు. దానిని తిన్నగ వంటపెనమునకే గొంపోయి, చక్కెరవంటలోవలె చక్కెరరవలను విడివడజేయుదురు. కర్మాగారమున, వడియగట్టుసాధనములు మంచివి ఉన్నయెడల మంచిచక్కెర వచ్చును. ఇది వడియగట్టుటకు ఎముకలబొగ్గు వాడుకచేయు నాచారముగలదు. జంతువుల ఎముకలు కాల్చి బొగ్గుచేసి ఆబొగ్గులలోనుండి ఈపానకమును పారించినయెడల దానిరంగంతయు తీసివేయుశక్తి యీబొగ్గునకు గలదు. ఈబొగ్గు వాడుకవలన చక్కెరలో నెముకలు కలుపుదురన్న లోకులమాట వచ్చినది. ఇదినిజమా? ఈయెముకలబొగ్గు చాలధరగలదగుటచేత ఈవిధానమునుగూడ ఎక్కువ పెట్టుబడితో సాగింపవలెను. ఇప్పుడు చెరకురసమును ధాన్యపుటుముక (ఊక)ను కాల్చిన వడి బొగ్గుతో శుభ్రపరచుటకు వీలుగలదని రా. బ. బి. విశ్వనాధంగారు కనిపెట్టియున్నారు. దానిలోన వడియబోసిన చెరకురసమును పంపినయెడల నది లేత పచ్చనిబెల్లమగును. దాని కాయన 'మీగడ బెల్ల'మను పేరు పెట్టినాడు. ఈబొగ్గు వాడుకచక్కెరవంట కెంతవరకుపయోగించునో ఇంకనునిర్ణయింపలేదు.

ఎముకలబొగ్గు వాడుకయగు యంత్రశాలలో ఈ బొగ్గు తడవతడవకు నీటితో కడుగుచుండవలెను. ఆకడిగిననీరుకూడ రసముతో కలిపి రవల పెనమున కంపుదురు. అట్లయ్యును ఈబొగ్గునకు పటిష్ఠత శాశ్వతము కాదు. కొంతవడికి దాని సత్వము చెల్లిపోవును. అప్పుడాఓటిబొగ్గును తిరుగ నేవో ద్రావకములతో కడిగి కాల్చి దానికి నూత్నత్వ మొసగుదురు. ఈపానకమును చక్కెరపానకమును వలెనే మరగించి చక్కెరరవల

రు. ఇంతకష్టపడి చేసిన యీబెల్లపు చక్కెర పరిశ్రమ లాభకరముగాదు. కాని దానికి మరి కొన్ని పరిశ్రమలు తోడు చేసి సామర్లకోటలో వలె దానిని సాగించిన ఆపరిశ్రమల మొత్తమున తగినలాభ ముండును. సామర్లకోట కర్మాగారమున పిప్పరమెంట్లును, సారాయులును తయారుచేయుదురు. ఈరెండును చక్కెరకంటె నెక్కుడు లాభమును చేకూర్చును. ఇదియే దిక్ప్రదర్శనముగ బెల్లమును శుభ్రపరచు లేక బెల్లమునుండి చక్కెరదీయువిధానము. పనిలేనికాలమున నీపరిశ్రమ చక్కెరయంత్రశాలలో సాగించినదానివలన వచ్చు స్వల్పలాభ మాపని వాండ్ర వేతనాదులకయిన పనికివచ్చునుగదా. ఈపరిశ్రమ భావిదశ హిందూదేశమున నెట్లుండగలదో చెప్పలేము గాని ఇప్పటి దానిస్థితినిబట్టి చూడ మనదేశమే తనకుకావలసిన చక్కెరను వండుకొనుచో నీపరిశ్రమ కాలక్రమమున పడిపోవునేమో!

## చక్కెరవంటలోని వ్యర్థపదార్థముల యుపయోగములు

ఏదైన కర్మాగారమున ముఖ్యవస్తుపరిశ్రమకే ప్రాముఖ్యముగలదో దానిని తయారుచేయునప్పుడు వచ్చు వ్యర్థపదార్థముల యుపయోగమున కంతటిప్రాముఖ్యము గలదు. ఆర్థికముగ నిది యవసరముగదా.

ఇంతవర కీవ్యాసములను చదివినవారు చక్కెరలోని తోడిపెండ్లికూతుండ్లు పిప్పి, వడపోత అచ్చులు మడ్డి కూడ, కర్మాగారమున నిలుచుట చూచియున్నారు.

ఇందు పిప్పినిప్రపంచమందంతటను కర్మాగారపుటావిరియంత్రములను నడపు ప్రొయ్యిలోనికి వాడుక చేయుదురు. చక్కగ సంతరించినయెడల మరి వేరుగ వంటచెరకక్కరలేకయే చెరకు పిప్పిలో చక్కెరవంటనంతను సాగింపవచ్చును. వడపోత అచ్చులు, చెరకులోని మాలిన్యమును చెరకుపొలముల కెరవుగ పనికివచ్చును కాని మడ్డికి త్రోవలేదు. హిందూదేశపరిస్థితుల కేసీకు తగిన యుపయోగము నీమడ్డివిషయమున కనిపెట్టవలసి

యున్నది. ఇదికాక నీవ్యర్థపదార్థముల నుపయోగమెట్లు పరిణమించుచున్నదో ఇచటకొలదిగ పరిశీలింతము.

పిప్పి: పిప్పిలో నూటికి ౮౦ మొదలు ౫౯ వరకు నీరుండును. ౧ ము. ౫ వరకును చక్కెర, ౫౦ వరకును పీచుయుండును. ఈపీచు Cellulose అను పదార్థము. దానిని Cellulose పరిశ్రమల కుపయోగింపవచ్చును. అది ముఖ్యముగ కాగితపుపరిశ్రమకును, చేతి పట్టుపరిశ్రమకును ఉపయోగపడును. ఈ పరిశ్రమలు హిందూదేశమున నెంతమట్టుకు పనికివచ్చునో చూడవలెను.

దీనినుండి చేసిన అట్టకాగితములును అట్టలును తయారున్నవని చెరకుపండించు నన్యదేశీయులు చేసి చూపియున్నారు. పిప్పిబొగ్గు రంగు తీసివేయు సాధనముగ వాడుకకావచ్చును అనునది చాలకాలముక్రిందటనే కనిపెట్టియున్నారు. కాని హిందూదేశపు చెరకుపిప్పికట్టి సత్వమున్నదో లేదో నిర్ణయించు ప్రయత్నమిప్పటికిని జరుగలేదు. ఈపిప్పిని మడ్డితో కలిపి మేపిన పశువు లానందముగ మేయును. వానికది మంచి ఆహారము.

వడపోత అచ్చు:—ఇందు నూటికి ౧ మొ. ౨౦ వరకును చక్కెర నిలిచియుండును; సున్నముండును. భాస్వరద్రావకము (Phosphoric Acid) నత్రజని (Nitrogen) కూడ దీనిలో నుండును. ౭౫ వంతులు నీరుండును. ఎరవుగ నిది యుపయోగపడుట మాటయటుండ, దీనినుండి కత్తమైనము తీయవచ్చును. దీనినుండి రంగుతీయు బొగ్గుకూడ తయారుచేయవచ్చును. ఇంతప్రయాసపడి యీపదార్థముల దానినుండి యొండదీయుటకంటె దానిని చెరకుపాలముల కెరవెత్తుటయె మంచిదని తోచెడిని.

మడ్డి:—ఇందు చక్కెరపాలు నూటికి ౩౦ మొ. ౮౦ వరకుండును. కాని దానిని తీసికొన వీలుండదు. దానిని రవలుగ తీర్చి తేర్చి గ్రహించుసాధనమిప్పటి కేదియును కనిపెట్టబడలేదు. ఇందుల కేదయిన సాధనముండిన అది యార్థికముగ లాభకరము. వెనుకచెప్పినట్లు దానిని పిప్పితో గలిపి పశువులకు మేపవచ్చును. దానిని చెరకుపొలముల కెరవెత్తుట మంచిదో కాదో యింకను నిర్ణయింపలేదు. ఇందులోనున్న చక్కెర, గాలిలోని నత్రజనిని నేలకు లాగికొనగలదట. కేవలమిది నేలకు చెడుగచేయునేమో! కాబట్టి దానిని ఏదో తరపు గత్తముగ మార్చి మరియు ఎరువెత్తుట మంచిది. ఆ యెరువెత్తుటలో కూడ భూవైశాల్యమును బట్టి ఎంతెంత యెప్పుడెప్పు డెత్తుచుండవలెనో తేల్పవలెను. దీనికి మనదేశపు భూతత్త్వమునుబట్టి పరిశోధన చేయవలసియున్నది. ఈమడ్డి నీటిలోకలిపి ఇండ్లుకట్టునప్పుడు వాడుకచేసిన కట్టడము బలమధికమగును. అది పిప్పితో కలిపిగాని, లేదా వేరుగగాని చెరకుప్రాయిల్లలో నుంచిన పిప్పియందు కంటె దీనియందు వేడి యధికముగ పుట్టును.

ఇది సారాయివంటకు చాలబాగ యుపయోగపడుచున్నది. దీనిని తగినంత పలుచనినీటిలో కలుపుదురు. ఆనీటిని పాత్రలలో బోసి కొలదిగ కల్లుమడ్డి దానిలో కలిపి మూతలుపెట్టుదురు. అది పులియును. దీనినుండి విడలివచ్చు బొగ్గుపులుసువాయువును ఇనుపగొట్టముల (Cylinders) లో పట్టి నిలువరించి 'సోడా' నీటి కుపయోగింతురు. ఇందు తేలిన పలుచనిసారాయి (Dilute alcohol) బట్టీ పెట్టి తగినపాత్రలలో గ్రహింతురు. ఈసారాయిని నిషాపదార్థముగ మనదేశమున నెక్కుడుగ వాడుదురు. తక్కిన దేశములలో ఈపలుచని సారాయినుండి నీటిని తీసివేసి పొత్తుసారాయి (Absolute Alcohol) తీయుదురు. దానిని పెట్రోలియంలో నొకపంపిణిని గలిపి మోటారుయంత్రములలో 'గాసానులీను' అనుపేర వాడుదురు. పెట్రోలుకంటె దీనివాడుకే మోటారులకు మంచిదని హెచ్చరించుచున్నారు. హిందూదేశమునమాత్ర మిది జరుగలేదు. బహుశః ఇట్టియుపయోగమే ఈమడ్డిని చేయవచ్చునేమో, తప్పితముగ చెప్పవలసివచ్చిన నీచెరకుపంటలో ఇంకొక వ్యర్థపదార్థము పొడసూపుచున్నది. ఇది ప్రాయిల్లలోని రొయ్య. అదిపాలముల కెరువుగ పనికివచ్చునట్లు తోపదు. దానిలో చాలమట్టుకు పొటాషుపదార్థములే. అది

గ్రహించుశక్తి మొక్కకు చాలదు. దీని కేదయిన యుపయోగము కనిపెట్టవలెను?

ఈకొలదిపాటి పుటలలో చెరకుపంట చక్కెర పంటనుగూర్చి దిక్ప్రదర్శనముగ నన్నియంశములను చెప్పసాహసించితిని. దీనిని చదువుటవలన నందరకు, చక్కెర, అదియెట్లు పుట్టుచున్నదో, వృద్ధిపొందు చున్నదో, దాని నెట్లు వండి గ్రహించుచున్నారో ముఖ్యమయిన యంశములు సామాన్యముగ తెలియుటకే వ్రాసితిని గాని ఇది దాని సంపూర్ణచరిత్ర కాదు. కాని దానియాకృతిని మాత్రము సంపూర్ణావయవనిర్మాణముతో చూపగలదని నా నమ్మకము.

సంవత్సరమున కరువదికోట్లరూప్యములు చక్కెర కొరకు హిందూదేశమున ఖర్చగుచున్నవట. ఇది ఏపరిశ్రమకును తీసిపోని ముఖ్యపరిశ్రమ కాదా? కాబట్టి హైందవులు, అందు ముఖ్యముగ మనయాంధ్రులు, ఈ పరిశ్రమను తమకు తగినంతమట్టున కయిన నభివృద్ధి చేసికొనవలెను. ఇప్పుడున్న దొరతనమువారి సహాయము మున్ముందు ౧౫ ఏండ్లపిదప తీసివేయబడినను ఈపరిశ్రమను తనంతట తానే నడుపుకొనుశక్తి దేశమునకు కలుగవలెను. ఇందులకు మనకు ఆరితేరిన శాస్త్రజ్ఞులును, పనివాండ్రును, పెట్టుబడిదారులును కావలెను. వీనినెల్ల నిర్ణయించి హెచ్చరించు భారము ప్రజలదే.

---




అత్తవారింట



తమయింట

—తోట వెంకటేశ్వర రావు



కన్యాకుమార్యగ్రము

A. A. C.



మూడు సముద్రముల కూటమి (కన్యాకుమారి)

A. A. C.

# సాహసే లక్ష్మీః

(అనువృత్తము)

దివాకర్ల శారదామణి

## ౭

## మోహనరావు దుండగము

"డాక్టరుగారెందుకువచ్చారు? మీరు రమ్మన్నారా లేక ఆయనే వచ్చాడా?"

"నేనే పనుంపి రమ్మన్నాను."

"మీకు వంట్లో సరిగా లేదా?"

"డాక్టరుగారికి నాకు చాలరోజులనుంచి ఒక వ్యవహారం వుంది. రెండురోజులుండి వెళ్లిపోతాడు." ఆయన డాక్టరుగారితో మాట్లాడుచు మేడక్రిందగదిలో నుండిరి. నేను ఆయింటిముంగటనున్న పూవులమొక్కలను చూచుచు ఇటునటు తిరుగుచుంటిని. అపుడు రూపు మెత్తివచ్చిన కాకినాడలోని గ్రామదేవతయగు నూకాలమ్మవలె నాకారవిలాసములుగల యేబదేండ్ల కర్నాటాంగన యొకతె జట్కాబండినుండి దిగి నాయెదుట ప్రత్యక్షమయ్యెను.

"నీవేనా ఈయనను పెళ్లిచేసుకొన్నావు? నా పేరు సరస్వతి. నిన్ను వారు బాగాతెలుసు." అని అసంపూర్ణపు తెలుగులో అస్పష్టముగా తన్నుతాను తెలియజెప్పుకొనెను.

"ఏమమ్మోయి. లేచిరావాలి. ఈరోజల్లా తిప్పేట్టున్నావు. బండికట్టించావని కాశీదాకా—"

"నోరుముయ్యరా దున్నపోతా మాట్లాడావంటే తోసేస్తాను."

అపుడాబండివాడు శ్రవణకఠోరముగా నోటికి వచ్చినట్లు అచ్చతెనుగుమాటలతో తిట్టజొచ్చెను. ఆమె వానిని కొట్టబోయెను. అంతట మానౌకరు లక్ష్మువచ్చి బండివానిని విడిపించిరి. నాభర్తగారు వాకిటిలోనికి వచ్చిరి.

"వేళగానివేళ వచ్చావు. మేడపైకిరా" అని వారు మేడమీదకు వెళ్లిపోయిరి.

"మళ్లీ మొరిగావంటే స్టేషనులో పెట్టించేస్తాను. నీ సోగాలు కూలియిస్తే మాదిగదాన్నే! నాపేరు సరస్వతి. మొద్దువుగాని, తమాషా"

"చెల్లవమ్మో, గొర్నరంటే నేను జడిసేవాణ్ని కాను. ఆషుదాన వయిపోయ్యావు. లేకపోతే—" అని బండివాడు తనపౌరుషమును ప్రకటించెను. ఆమె వినిపించుకొననట్లు తీవిగా మేడమీదకు వెళ్లిపోయెను.

"సరస్వతి. కాళికమ్మలాగుంది." అని బండివాడు ప్రథమమున నాకుదయించిన భావమునే తన భాషలో ప్రకటించెను.

డాక్టరుగారు రీవలకు వచ్చిరి. ఎవరు వచ్చిరని నన్నడిగిరి. "నే నెఱుగను. తన పేరు సరస్వతి యని చెప్పినది." డాక్టరుగారు కంగారుపడుచు "సరస్వతా; అవుతే పంపివేయకపోయావా, రాజశేఖరంగారి మనసు పాడు చేస్తుంది." అని యింకను ఏమేమో గొణుగుకొనిరి.

"ఈలోకంలో అంతటి గయ్యాళి ఎక్కడా లేదు. అది మొదట వంటచేసేదట. ఏలాతగలబెట్టిందో" అని డాక్టరుగారు తా మదివఱకు కూర్చుండియున్న గదిలోనికి వెళ్లిపోయిరి. నేను మేడమీదకు బోయి చూచితిని.

"నావాడికి రావాలీయాస్తి. మధ్య మీరంతా భక్షించేస్తున్నారు" అని సరస్వతి యనుచున్నట్లు నాకు వినుపించెను.

"మాతండ్రిగారిని చూసి వూరుకుంటున్నాను. యింకా ఈవిధంగా పేల్తూ నాయింటికి రావద్దు. ఈలా వచ్చి యల్లరిపెట్టావంటే నానౌకరులు నువ్వు వీథిలో వుండగానే గెంటేస్తారు. ఇదిగో ఆఖరు దఫా వెయ్యి రూపాయ లిచ్చేస్తున్నాను. నీ విక ఎప్పుడూ రావద్దు; నన్ను అల్లరిపెట్టద్దు. నడూ" అని నా భర్తగారను

చుండిరి. నే నాతలుపువద్ద నిలువక అవలనున్న గదిలోనికి వెడలిపోతిని. ఆనాటి మధ్యాహ్నమున నాభర్తగారు వచ్చి "విజయా, నీపేర ఉత్తరం వచ్చినది. ఇంటనే యియ్యడం మఱచిపోయాను." అని నాకొక యుత్తర మిచ్చి వెళ్లిపోయిరి. కవరు చించిచూడగా అదియాంగ్లమున మోహనరావు వ్రాసినట్లు కాన్పించినది. సంతకముండే చివరికాగితము ఆ యుత్తరములో లేకపోవుట నా కాశ్చర్యముగ నుండెను.

"ఈనాటిసాయంత్రం వచ్చి నిన్నుచూసి నా జన్మ పావనంచేసుకుని—" అను నర్థమువచ్చు వాక్యమసంపూర్ణముగ నివరపంక్తియం దుండెను. నేను చించిన కవరును తీసి పరీక్షించితిని. అప్పుడే యంటించబడినట్లు కవరుపై పూత తడిగనుండి చేతితో తీయగా వచ్చివేసెను. నాభర్తగారు గదిలోనికివచ్చిరి. "ఈ ఉత్తరం చూశారాయేమి? ఉత్తరం సగమేయున్నది."



('విలన్, స్కౌండ్రల్' అని భర్తగారు... . ...నిలువునా పట్టుకొని.......)

"అదృష్టవంతుడు. పెట్టిపుట్టాడు. శ్రమలేకుండ పూర్వు లెవ్వరో గడించి తుళ్లిపోతూవున్న డబ్బుతో నిన్ను కొనుక్కో గలిగాడు. లేకపోతే ఇంత విద్యావతిని. ఇంత సౌందర్యవతిని పరిణయమాడడం వాడితరమా!" అని నాకు క్రోధము రవులుకొనిపోవునట్లు కొన్ని కారుకూతలు అక్షరరూపమున నాకంటబడెను.

"ఆహా! నేనే విప్పిచూశాను. ఇదుగో తీసుకో మిగిలినకాగితం. వీడి కిదేంపొయ్యేకాలం! నాతోహాతు వాడితోహాతు తెలియకుండ నీకీవిధంగా వుత్తరం వ్రాస్తాడా గాడిదకొడుకు. యింకావస్తాట్ట! వస్తే బుర్ర పగులగొట్టేస్తాను." అని వారు నిక్కముగు కోపములో పలికిరి. నాకును మోహనరావుపై పట్టరాని యాగ్రహము వచ్చినది.

సాయంకాలము నాటియుదయమువలెనే మా యింటి పుష్పోద్యానమున నిటునటు తిరుగుచుంటిని. ఎవ్వరో చెట్లవెనుక నేనున్నవైపునకు వచ్చుచుండిరి. మోహనరావు పకపకనవ్వుచు నాయెదుటకు వచ్చెను.

"కొత్తపెళ్లికూతురుగారు! ఈ దివ్యభవనాల్లో పువ్వులతోటల్లో మమ్మల్ని పూర్తిగా మరచిపోయారు' మీ ఆయనకింతడబ్బు యెల్లావచ్చిం దనుకున్నారు? ఈరోజే కాకినాడలో తెలుసుకొన్నాను. ఈయనగారి తండ్రి వట్టిపిచ్చవాడు. ఒక్కరోజున ముగ్గురు బుర్రలు పగులగొట్టి చంపేశాడు. ఆయన కొడుకీయన. ఈయన కూడా ఏరాత్రో ఏపగలో ఎవరిబుర్రో పగులగొట్టి తీరుతాడు." అని మిక్కిలి వికటముగ నవ్వనారంభించెను.

"ఏం, నీకేపొయ్యేకాలం? ఏం పేలుతున్నావు నా భార్యతో?" అని సింహగర్జనముచేయుచు నాభర్తగారక్కడకు వచ్చిరి. మోహనరావు కంపితస్వరముతో "నేను కాదు — ఈమె నాస్నేహితురాలు. ఎడ్యుకేటెడ్ లేడీ. అందుచేత సంశయించకుండా నేనే వచ్చాను."

"విలన్! స్కౌండ్రెల్!" అని నాభర్తగారు మోహనరావును నిలువునాబట్టుకొని ఒకసంపంగిపొద మీదకు గిరవాటువైచిరి. మోహనరావు అక్కడనే కూలబడిపోయెను. నేను నిర్ఘాంతపోతిని. నాభర్తగారు తిరిగి చూడకుండ వెడలిపోయిరి.

"నీపాడుబుద్ధియే నిన్నీయవస్థకు దీసుకవచ్చినది." అని లేచి ఒడలుసవరించుకొనుచున్న మోహనరావును చూచుచు నేనంటిని.

"రాక్షసుడిలాగున్నాడు. నేనెప్పటికైనా పగ తీర్చుకుంటాను." అని మోహనరావు ప్రతాపములు కొట్టుకొచ్చెను.

"ఓహో! పౌరుషమంటే నీకేవుంది. నీవెంత పరాక్రమశాలివో ఈ అరనిమిషంలో నాకు చూపనే చూపించావు. ఇకనైన బుద్ధికలిగివుండు." అని నేను ఇంటివైపునకు పోవుచుండగా నాభర్తగారక్కడనే యొకవృక్షముచాటునుండి మాసంభాషణ నాలకించుచుండిరని నేను తెలిసికొంటిని. ఆయన నౌకరులను బిలచి "ఆతోటలోవున్న పెద్దమనుష్యుని కొంచెం మర్యాదగా అవతలకు తీసికొనిపోయి విడిచిపెట్టిరండి." అని యాజ్ఞాపించిరి.

## ౮

## ఎంతదారుణము!

అస్తంగతుడగు సూర్యభగవానునిచే నెట్టబడి యున్న ఆకాశసౌందర్యము నుపలక్షించుచు నేను గోదావరియొడ్డున గూర్చుంటిని. ఆతరంగడోలికలమీద దేలివచ్చుచున్న పిల్లవాయువులు నాకు మహదానందదాయకముగ నుండెను. బెంపస్థారము విడిచినదిమొదలు నాకైన యనుభవములను కల్లోలముగ దలంచుకొనుచుంటిని. కొంతసేపటికి ఎవ్వడో మిక్కిలిసాహసముగ నా వద్దకు వచ్చి నాకు రెండుగజముల దూరమున గూర్చుండెను. అక్కడ గట్టు మిక్కిలి నోటకముగ నీటిమట్టమునకు మిక్కిలి నెత్తుగనుండెను.

"ఆఖరుసారి నీవద్దకు వచ్చాను. నేను వ్యర్థమైన బెస్టియల్ థింగ్ నని (జంతువువంటి వస్తువునని) నీ ఒపీనియన్ కావడం నాకొక ట్రెమండెస్ షాక్‌గా వుంది. ఇప్పుడు కథ ఇంత అడ్డంగా తిరిగిపోయింది. కనుక ఇప్పుడు చెప్పేస్తున్నాను. ఇన్నాళ్లు బట్టలో నిప్పుదాచిఉంచినట్లు మనసులోఅది వుంచాను. అది నన్ను దగ్ధపటలం చేస్తోంది. నాగ్రహచారంగాని నేను జహంగీరువంటి అదృష్టశాలినయ్యుంటే ఈరాజశేఖరుడనేవాడు షేర్‌ఖాన్‌లాగ అమాంతంగా పెద్దపులుల్ని ఎంత కొరుక్కుతినేవాడయినా నిన్ను నూర్జహానుని చేసి, నాతమాషా చూపించి యుందును."

"ఏమువలేకపొయ్యావు! నీకేదో పోగాలము వచ్చి యిలా ప్రేలుతున్నావు. లోకంలో వున్న పిచ్చివాళ్లందరిని ఒకచోటకు చేర్చి ఒక మొగలాయీ దర్బారుజరిపిస్తే అందులో జహంగీరులాగ తానుబోతు ప్రేలాపనకు నీవే పాదుషా వనిపించుకోవచ్చు. ఒళ్లెరుగకుండ, దాహశాంతి చేశావో ఏమో కాని కళ్లు

సెత్తికివచ్చి ఇలా కూస్తున్నావు. ప్రపంచచరిత్రలో నూర్జహానువంటి పాపాత్మురాలు మఱిలేదు. నీకు నూర్జహాను కావలిస్తే అది వుండేచోటికే నీవు పోవ దయచెయ్యి."

"ఆహా! నీఅలోచనప్రకారం దేవుడికి ఈరాత్రి పిటిషన్ పంపిస్తాను. తప్పకుండా ఏవడో ఒకడు దేవుడి వద్దకు వెళ్లితీరాలి. ఇంతమందినీ భూమి మొయ్యాలేకుండా వున్నది. కాని నీవు పొరబాటు చెప్పేవు. నీకు తెలియదు. చెప్పితే తెలుసుకోలేవు. నిజంగా మీఆయన తండ్రి వట్టిపిచ్చాడు. ఆపిచ్చాయనతల్లికి మఱింత పిచ్చ వుండేది. వాళ్లవంశంలో నాలుగు తరాలనుంచి పిచ్చవాళ్లు పుట్టడం. వాళ్లు ప్రపంచంలో ఉన్మత్తుల సంఖ్య వృద్ధిచేయడం జరుగుతూ వచ్చింది. ఇదంతా నీకు వట్టి పిచ్చపేలాపన. కాని మీ ఆయన తండ్రికి, తాతలకి, తాతతాతలకి గొప్పగొప్పవాళ్లంతా పిచ్చవానుకులో కవి గండపెండేరాలిచ్చేశారు. కాబట్టి నేను పిచ్చివాడినో లేక మీఆయన—"

అంతలో నాభర్తగారు అచటకు వచ్చిరి. మొదట మేమిరువురమును కలసియే వాహ్యాళికై అచ్చటకు వచ్చితిమి. నాకపరిచితులైన వారి స్నేహితు లక్కడ తారసిల్లుటచే వారు నన్నక్కడ కూర్చుండుమని చెప్పి తాము వారితోగలసి వెళ్లిపోయిరి.

"విలన్ డేస్టర్డ్లీ విలన్, హౌ డేర్ యు—"అని క్రోధావేశమున నాభర్తగారు చెయ్యియెత్తి వానిమీదకు బోయిరి. మోహనరావు కాళ్లకుబుద్ధిచెప్పి ఎగిరి యావలకు పఱుగెత్తబోయెను. వాడు గట్టునకు మిగులచేరువగ నెగిరి పడుటవలన నీటిమట్టమునకు మిగులనెత్తుగ నున్న కూలమంతయు మోహనరావును, వాని భయభారమును వహింపలేక చూచుచుండగ ప్రచండవేగమున గోదావరిలో బడిపోయెను.

అది యేడుపో లేక కోపమో చెప్పజాలనుగాని మోహనరావు ఆక్రందనము భీభత్సముగ నాకు వినిపింపనొచ్చెను. మట్టిగడ్డలనడుమ తొంపిలో మొదట కూలబడి, తరువాత తన్నాక్రమించుకొనివచ్చిన నీటిలో పూర్తిగ మునిగిపోయి తరువాత యుక్కిరిబిక్కిరి యగునట్లు విలవిల దన్నుకొనుచు తీరమునకు జేరి అతడెట్లో ప్రాణములను దక్కించుకొనెను.

"పాపాత్ముడు. ఈలోకంలో చేసే దౌర్జన్యాలకి ఈలోకంలోనే ఫలితం అనుభవిస్తున్నాడు." అని నేనంటిని. కీచకాంతకుని ఉత్తమనాయకత్వ మెఱిగికొని విసుమానపు దీనుడుగ జేయబడిన కీచకుని చూచునపుడు ద్రౌపది కుదయించిన విషణ్ణభావమే నాకును బుట్టి యాశ్చర్యమును కలిగించెను. మోహనరావు దుండగమునుగూర్చి నేను పలుకుచుండగా,—

"విజయా, నీవేమియు చెప్పనక్కఱలేదు. వాడు కూసిన కారుకూతలన్నీ నేను వింటూనేవున్నా. ఎప్పుడో నాచేతులలోనే వాడితల పగిలిపోతుంది." అని నాభర్తగారనిరి. వారిమాటలకు భయము, కంపము, జాలి, విషాదము, ప్రణయమును ఒక్కసారిగ బుట్టి నన్ను కలచివైచెను.

మేమింటికి మఱలివచ్చునప్పటికి చీకటిపడిపోయెను. ఆచీకటితోకూడ నాకు విపత్తులును ప్రబలమైపోయెను. ఇన్ని రాత్రులు గడపియుంటినికాని ఆనాటి రాత్రివలె మహాభయంకరమగు రాత్రిని నాజన్మమధ్యమున నెన్నడు నెఱుగను.

వాకిట నెవ్వరో మాకొఱకై ప్రతీక్షించుచు గూర్చుండిరి. ఆమె డాక్టరురంగాచారి ధర్మపత్ని కమలాంబ. నేనామెను చూడగోరి డాక్టరుగారితో చెప్పియుండుటచే సూర్యాస్తమయసమయమున రాజమండ్రీలోని తనబంధువులయింటనుండి నాయాహ్వాన మంగీకరించుచు మాయింటికి వచ్చియుండెను.

ఆమెను నేను సముచితముగ సంభావించి భోజనసమయమగుటచేత డాక్టరుగారితో కలసి యందఱమును భుజించితిమి.

"విజయా, అదియేమోకాని తాగినవాడివలె నాతల గిర్రున తిరిగిపోవుచున్నట్లుంది. డాక్టరేదో మందిచ్చాడు. ఆయన నాతో నేమని చెప్పెనో నీవు వినియే యుంటివి. నేనాగదిలో నుందును. మందువలన నాకు గాఢముగా నిద్రపట్టవచ్చును. నీవెందులకైన నర్ధరాత్రి నన్ను బిలువదలచినయెడల ఆగదిలోనికిరా." అనిపలికి

భోజనానంతరమున నాభర్తగారు వెడలిపోయిరి. ఆ నాటిసాయంకాలమునుండియు వారిమనస్సు మనసులో లేనట్లు నాకు దోచెను. మిగులపరాకుగా నసంబద్ధముగా ప్రసంగించుచు మిక్కిలియాందోళితులై యుండినట్లు నాకు పొడగట్టుటచే మా అల మోహనరావునుగూర్చి వారితో నే నేమియు ప్రస్తావించియుండ లేదు.

నేను నిద్రబోవుచుంటిని. ఆకస్మికముగా నాకు నిద్రాభంగమైనది. సింహగర్జనమువలె నొకకుక్క యఱచుచున్నట్లును ఎవ్వరో హాహాకార మొనర్చుచున్నట్లును నాకు వినుపించెను. నేను కిటికీయొద్దకు బోయి చూచితిని. లేడిపై నుఱుకుచునది పెద్ద కుక్కయొకటి ఎవ్వనిపైననో నుఱుకుచున్నదని తెలిసికొంటిని.

అది నాభర్తగారు మద్రాసునుండి నాటియుదయమే తెప్పించిన 'ఆల్సేషియన్' జాతి "బ్లడ్‌హౌండు"ని గుర్తించితిని. నేను రాజమండ్రీవచ్చిన మఱునాడే తంతివార్తలపై దాని కార్డరు నిచ్చి తెప్పించితిమి. అది చూచుటకు సింహమువలెనుండి ఆగంతుకులకు భయముగొలుపుచుండుటచేత నేను దాని నినుపగొలుసులతో కట్టియుంచి నా యుత్తరువు లేకుండ విడువరాదని సేవకుల కాజ్ఞాపించితిని. ఇట్టికుక్కలు కొన్ని ఒకరాజ బంధువుని నామరూపములు లేకుండ కండలు కొరికి తినివేసెనని నే నీనడుమ వృత్తాంతపత్రికలలో జూచి యుండుటచేతనే నాకుక్కను పలలభోజియగు రాక్షసివలె నూహించుచుంటిని. అది స్వకీయ ప్రయత్నమునతన్ను బంధించియున్న శృంఖలములను ద్రెంపుకొనినదో, లేక ఎవ్వరైన దానిని విప్పివేసిరో నాకు తెలియదు. ఇప్పుడు దాని పాలబడిన దురదృష్టవంతు డెవ్వడా యని నామనసు మిగుల నాందోళనముగ నుండెను. నే నుద్వేగమున 'టైగర్ టైగర్' అనిదానిని మందలించుచు కేకలు వేసితిని. క్రొత్తయగుటచేత అది నా మాటలు వినిపించుకొనలేదు. ఎవ్వరి ఆయుష్షో మూడినదని తలంచితిని. చూచుచుండగా ఆమనిషి క్రోతివలె చెట్టుపై కెక్క ప్రాకిపోయెను.



(తననోటికందను బోగొట్టుకొనిన పులివలె కుక్క గాండ్రుమనుచు నల్లరిచేయుచుండెను.)

తననోటికండను బోగొట్టుకొనిన పులివలె కుక్క గాండ్రుమనుచు నల్లరిచేయుచుండెను. అంతలో దాని భయంకరార్భాటము లణగిపోయి అది నేలపై కూలబడెను. చెట్టెక్కిన యామనుష్యుడు క్రిందికిదిగి వెంటనే దాని నాక్రమించుకొని దానికొంతుకనుబట్టి నులిమివేయుచున్నట్లు నాకగుపించెను. నేను నిర్ఘాంతపోయితిని.

కుక్క గిలగిలకొట్టుకొనుచుండెను. నేను నా కన్నులనే నమ్మజాలకపోయితిని. నాలుగువందలును బోసి తెప్పించినకుక్క నాకనులయెదుటనే పీనుగువలె నైపోయినదా యని నాకు మహాశ్చర్యము గలిగెను.

"చావు!" అని మెల్లగ, మిగులక్రోధముతో నా మనుష్యుడు పలికి చచ్చియున్న యాకుక్కపై నెక్కి కాలితోలది తన్నుచు ద్రొక్కుచున్నట్లు నేను తెలిసికొంటిని. "రాఘవుడా!" అని నేను పిలచితిని. ఆవ్యక్తి నామాటలు విని పలాయితుడై పోవుచుండెను.

నేను తొందరగా నాభర్తగారు పరుండియుందుమని చెప్పియున్న గదిలోనికి బోయిచూచితిని. ఆయన ఆ గదిలో లేరు. పాన్పుపై పవళించియుండినట్లుగూడ చిహ్నములులేవు. వారిపడనమందిరములోనికి బోయితిని. అచ్చటగూడ లేదు. నాకు మహాశ్చర్యముగనుండెను. అప్పుడు రాత్రి పన్నెండున్నరగంటలు దాటియుండెను. నేను చేత ఎలక్ట్రిక్ టార్చి నొకదానిని బట్టుకొని గదులన్నియు నొకటివెంబడి యొకటి పరిశోధించుచు బోయితిని. వారెచ్చటను లేరు. మేడక్రిందిగదులలోనికిగూడ బోయిచూచితిని. క్రిందనొకమూలువున్న గదిలో వెలుతురుకానుపించెను. ఆగదిలోనికి దీపమెట్లు వచ్చెనా యని ఆశ్చర్యపడుచు నాచేతనున్న టార్చిని వెలుగింపకుండ నాయంధకారమున కొంతప్రయాసముతో నాగది గవాక్షము వద్దకు బోయిచూచితిని.

అపుడు నాకన్నుల కగుపడిన భయంకర దృశ్యమును జన్మమధ్యమున నెన్నడు మఱువను. ఆగదిని చేరియున్న పెద్దగూటివంటి యొక యున్నత ప్రదేశమున నాభర్తగారు ఒక చిన్నముద్రాయంత్రమున కభిముఖముగ నిలుచబడి యుండిరి. ఆయంత్రము ఝుర్రున తిరిగిపోవుచుండెను.

ఒక నోట్లదొంతర వారి చేతులలోనికి వచ్చెను. నాకొడలు చచ్చినట్లయిపోయెను. అది కలయో, నిక్కమో, మాయయో, నేను విజయలక్ష్మిని గానో, వారు నాభర్తగారు కారో అనుభావములు తండోపతండములుగ నాహృదయమున నొక్కక్షణమున బుట్టిపోయెను. నేనక్కడ నిలువజాలక రెండుమూడుగదు లీవలకువచ్చి,

"ఎక్కడ నున్నారు? తోటలో 'టైగర్' వచ్చిపోయినట్లుంది. వేగంరండి" అని పిలచితిని. వారు గవాక్షమువద్దకు వచ్చి "వస్తానుండు—. ఏమిటో సరిగా తెలియకుండావుంది. అక్కడనే వుండు" అని పలికి కొంతసేపటికి నావద్దకు వచ్చిరి.

"ఏమి, ఈరాత్రి కూడ నిద్రాభంగ మయిపోయిందా?" అనివారనిరి.

"టైగర్‌ను మీరు విప్పివేయించారా ఏమిటి? దాని నెవడో చంపివేసినట్లున్నాడు" అని నా నిద్రాభంగమైనతరువాత అదిచచ్చినట్లు నాకెలాకనుపించినదో వారికి విశదముగ జెప్పితిని.

"ఆశ్చర్యంగా వుంది. ప్రతిరాత్రి వస్తూన్న ఆ దొంగవాడ్ని కండలుపీకి చంపివేసే నిమిత్తమే దాన్ని మదరాసునుండి తెప్పించాను. అందుచేత ఈ రాత్రి దాన్ని నేనే విప్పించేశాను. కాని వాడి చేతుల్లోనే అది హతమారిపోవడం నాకు చిత్రంగా వుంది. స్కౌండ్రెల్. ఆదొంగ యెవ డనుకుంటున్నావో కాని వాడు తప్పకుండ మోహనరావే అయ్యుండాలి. ఎప్పటికో వాడి రక్తంకళ్ల జూసితీరుతాను." అని నాకొడలు జలదరించునట్లు తమయుద్వేగమును ద్వేషమును ఒక్కమాఱుగా ప్రకటించిరి. మేము తోటలోనికిబోయి చచ్చియున్న కుక్కను జూచితిమి. శత్రువులచేత బలవంతముగా జచ్చిన మహాయోధునివలె నున్న ఆకుక్కయొక్క యాకారము నాకు మిగుల జాలిగొలుపుచుండెను. దాని గుండెలయొద్ద పెద్దగాయమై అచ్చటి నేలయంతయు రక్తసిక్తమయి యుండెను. ఆరక్తమును జూచుచుండగ దూరమున రెండుమూడు రొట్టెముక్కలు మాకంటబడెను. ఒకముక్క కుక్క సగమువఱకు తినియున్నట్లుండెను.

"విషపురొట్టెలై యుంటాయి. అది తినడం చూసి చచ్చేసమయంలో పగదీర్చుకుందామని దీని గొంతుక నొక్కడం మొదలుపెట్టి దీని నీలిగంగా పొడిచివుంటాడు." అని నాభర్తగారు సేవకులనుబిలచి చచ్చియున్న కుక్కను వాండ్ర కప్పగించి ఆవిషపు రొట్టెలను పరీక్షనిమిత్తమై భద్రముచేయించిరి.

"డాక్టరుగారు మందిచ్చారని చెప్పినారుగదా. ఇంకా నిద్రపోయారు కారేమి?" అని మేడమీదకు తిరిగివచ్చినతరువాత నే నంటిని.

"డాక్టరిచ్చినమం దింకా తీసుకోలేదు. వేరే ఆలోచనలో వుండిపోయాను. మధ్య ఈకుక్కవల్ల జరిగిన అల్లరిఒకటి. అది ఏంచేస్తోందో చూద్దామనే క్రిందకువెళ్లినాను. అంతరాయంగా ఆక్రిందిగదిలో ఏదో అనుమానంపుట్టి అక్కడనే ఉండిపోయాను."

నేను డాక్టరుగారిచ్చిన మందు గ్లాసులోపోసి వారికిచ్చితిని. భావికార్యఘటనములు నాకు తెలసియున్నయెడల నెన్నడును నాస్వహస్తములతో వారికా మందును త్రాగించియుండను.

కొంతసేపటికి వారొడలెఱుగకుండ నిద్రబోయిరి. వారికి గాఢముగా నిద్రపట్టినదని భావించి నాటి నిశీథమున పూర్వార్థమున నిద్రించియుండిన నా శయనమందిరమునకు వచ్చి కూర్చుంటిని. నాజీవితాకాశము మేఘచ్ఛన్నమై తుపానువలె కల్లోలముగ నా హృదయమును సంక్షోభింప జేయుచున్నదని నాకు స్ఫురించెను.

ఆహా! విద్యాభ్యసనము బాల్యకాలమునందలి వినోదకేళివలె సౌఖ్యావహమయ్యు నెంతయల్పకాలమున నతిక్రమించిపోయినది! ఉన్నతవిద్యాపఠనము—అందును ఆంగ్లవిద్యాభ్యాసము—నేనే యూహలతో జేసియుంటిని! ఒకప్పు డుద్యోగాభిలాషిణినై—మఱియొకప్పుడు కీర్తికాసించి...ఇంకొకప్పుడు రాజకీయ వ్యవహారములలో నాయకత్వమును వహింపవలెనన్న యడియాసలతో ఎన్నెన్ని మనోరథములు నాహృదయమునందు జీర్ణించిపోయినవి! 'ధనమూల మిదంజగత్' అను పరమసూత్ర మనునిమేషమును, సర్వవ్యవహారముల యందును ప్రత్యక్షమగుచుండుటచేతనా నాతండ్రిగారి యొక్క యిష్టానుసారముగా ఘనాఢ్యులని నాభర్తగారిపై నాకిట్టినురాగము హెచ్చిపోయినది! వారు తమనోటితో సెలవిచ్చినట్లే ఈమహైశ్వర్యమంతయు కేవల విశ్వామిత్రసృష్టియని భావింపవలసినట్లు నా కండ్లార వారిస్వహస్తములతో ముద్రాయంత్రమునుండి నోట్లను తయారుచేయుచుండగ చూచియుంటినే?

అయిన నగుగాక! జగత్తంతయు మాపై నెత్తి వచ్చినను ఆకాశము విఱిగి మాపైబడిపోయినను భూమి తిరుగబడినను ఐహికజీవితమున మాయిరువురకును మాకు మేముగాక మాకన్యప్రసక్తియు నితరచింతలును వ్యర్థములని భావించుచు నేను నిట్టూర్పువిడిచితిని.

అపుడు నాగదికి నావల నెవ్వరో నన్ను బిలుచుచు తలుపుగొట్టినట్లు నాకు దోచెను. నేను తలుపువద్దకుబోయి నాటిరాత్రి మాయింటికివచ్చిన కమలాంబయని తెలిసికొని తలుపు తెఱచితిని. ఆమె నేనుమేల్కొంచియుండుట కాశ్చర్యపడి "ఈగదిలో ఎలక్ట్రిక్ దీపములను చూసి నీవు మేలుకొనియున్నావని నిద్రపట్టక ఈలావచ్చాను. అవుతే ఇక్కడికి పెద్దపులులు వస్తాయా యేమిటమ్మా? నేను హడిలి చచ్చిపోతున్నాను. గంటైందో లేక రెండుగంటలైందో కాని ఎవరో 'టైగర్ టైగర్' అనికేకవేశారు. నేను ఉలిక్కిపడి లేచి కిటికీ తలుపు వేసుకొన్నాను. కొంతసేపటికి సాహసంచేసి చూస్తే ఎవర్నో మోసుకుపోతూవున్నట్లు కనుపించింది. నాకు నిలువునా ప్రాణాలుపోయి పక్కగదిలో పడుకున్న మాఆయనవద్దకువెళ్లి చెప్పేను. ఆయన నమ్మక పోడమేకాకుండా నేను వట్టిపిరికిదాన్నని, నన్ను పరిహాసంచేసి మేలుకొనివున్నానని నామీద కోపపడి ఏవో మందునీళ్లు కలిపిఇచ్చారు. నేను మళ్లీ కిక్కురుమనకుండా నాగదిలోనికి వచ్చేసి ఎంతదొర్లిచూసినా నిద్రపట్టిందికాదు. ఇంకా మేలుకొనివున్నానని చూస్తే ఆయన చంపేస్తారు. నేను మెల్లిగా తలుపుదీసిచూశాను. ఈఎలక్ట్రిక్ లైట్ కనుపించింది. ఏదయినా పెద్దపులి తోటలో ఎవర్నయినా చంపేసిందా ఏమిటి? నేను స్పష్టంగా చూశాను" అని బెదరిపోతూఅడిగినది. నేను మాటైగరు చచ్చిపోయినసంగతినంతయు నామెకు జెప్పితిని.

“నీ వెంత యదృష్టవంతురాల వమ్మా! ఎంత పుణ్యంచేసి పుట్టావో యేమో! తక్కువనోములునోచుకుని మేము ఎక్కువఫలముల కాశపడితే ఏలావస్తాయి? ఎన్నివందలుఖరీదుచేసే వస్తువయినా సరే ప్రపంచంలో మరెక్కడా లేకపోయినా నీవు కావాలంటే రాజ



(నాభర్తగారు మిగుల వికృతముగ పాన్పుపై పవళించియుండిరి.)

శేఖరరావుగారు కేబిల్‌గ్రాములమీదనే కొనేస్తారు” అని ఆమె తనమనసులోని స్త్రీజనసాధారణమైన ఈర్ష్యను వెల్లడించినది.

నేను యథోచితముగ నాయల్పబుద్ధికి తోచినట్లు ఆమెతో సంభాషించుచు గూర్చుంటిని. ఆమె తనకు నిద్రాభంగమైనదనియు ఒకమారు నిద్రాభంగ మైన తరువాత మరల నిద్రింపజాలననియు తనభర్తగారా సంగతి చూచినయెడల గొంతుక నులిమివేయుదురనియు ఏవో లోకాభిరామాయణమునుగూర్చి చెప్పుచు నాయర్ధరాత్రిసమయమున నాశయనమందిరమున నట్లేకూర్చుండి పోయెను. అప్పు డాకస్మికముగ ఉన్మత్తునిహాహాకారము ఆక్రందనము మహాభయంకరముగ మాకు వినుపించెను. నా కోపలు జలదరించిపోయినది. కమలాంబ వణకుచు వచ్చి నన్ను గట్టిగా పట్టుకొనెను.

“అమ్మో! యిదేదో పిశాచాల కొంపలాగుంది. మనుష్యు డెవ్వడు ఇలాగ హాహాకారం చెయ్యడు. చెన్నపట్నం పిచ్చాసుపత్రిలో ఇలాగే దౌర్జన్యంగా అరుస్తూ వుంటారు. నాగుండెలు పగిలిపోతూ వున్నాయి” అని ఏడవడం ప్రారంభించింది.

కృత్యాద్యవస్థమీద ఆమెకు ధైర్యము చెప్పి నేను శావడిలోనికి వచ్చినలుదిక్కుల పరీక్షించి చూచితిని. కొంతసేపటికి ఎవ్వరో నక్కుచు మా మేడ క్రిందిభాగమునకు పఱుగిడుచువచ్చుచున్నట్లు కాన



వచ్చెను. అప్పటికిచంద్రు డస్తమించి యుండుటచేత నావ్యక్తియెవ్వరోగుర్తింప జాలకపోతిని. అప్పుడు నేను భయభ్రాంతురాలనై గదిగుమ్మమువద్దనుండి నన్నుపలక్షించుచున్న కమలాంబను ధీరస్వాంతను జేసి పండుకొమ్మని యామెకు బోధించి ఆమె శయనించినతరువాత నేను సేవకు లుండుతావునకు వచ్చితిని. వారప్పటికి మేలుకొని కొంతకలవరపాటుతో నుండిరి. మాకు భయంకరముగ వినవచ్చిన ఆర్తనాదమునుగూర్చియే వారు తమలో దాము చెప్పుకొనుచుండిరి. అప్పటికి తెల్లవారుజామున నాలుగున్నరగంటలై యుండుటచేత నేను నౌకరులను తోటలోనికిబంపి అట్టి భయంకరశబ్దమునకు కారణ మన్వేషింపుడని ఆజ్ఞాపించితిని. వారు నలువైపులకును బోయి పరిశోధన మారంభించిరి.

కొంతసేపటికి తోటమాలి నావద్దకువచ్చి 'అమ్మా తోటకు వెనుకవైపున గోడ్డువద్ద నెవరో చచ్చియున్నాడు." అని నాగుండెలు పగులునట్లు చెప్పెను. అంతలో రాఘవుడువచ్చి "సాయంత్రం అయ్యగారు తోటనుండి పంపివేయమని సెలవిచ్చి నాయనేనండి. తల చితికి చచ్చిపోయున్నాడు." రాఘవునివెనుకవచ్చిన కారుడ్రైవరు కూడ "అమ్మా నేనుకూడ చూశాను. తలబీభత్సంగా పగిలిపోయింది. సాయంత్రంవేళ గోదావరిగట్టులో నీళ్లలో కూలబడిపోయినవాడేనండి. ముఖం చాల వికృతంగా ఉంది." అని నాప్రాణములు పైకెగిరి! పోవునట్లు చెప్పెను. "ఎంత ఘోరం! ఎంత ఘోరం ఎవరు చంపేరో? పాపం వాడెంతట్లో చచ్చిపోయాడు!" అని మిగుల భయభ్రాంతురాలనై నేనొక కుర్చీయందు చదికిలబడి గందరగోళముగ నాలోచింప జొచ్చితిని. అప్పటికే మిగుల క్షోభించియున్న నా హృదయము ఒక్కసారిగ నిప్పులలో పొరలించినట్లయి పోయెను. పొంగిపొరలివచ్చుచున్న ఖేదమెట్లో యడంచుకొని నేనెట్లయిన మనస్విని నగుటకు బ్రయత్నము సేయుచు మేడపైకివచ్చితిని. అప్పటికప్పుడే తెల్లవారి యుండుటచేత నేను నాగదినుండి నా భర్తగారు శయనించియున్నగదిలోనికి బోయితిని. తలుపుతీయుటయే తడవుగ దారుణమును, మహాభయంకరమును నగు దృశ్యమునుగాంచి నేను రిచ్చవడిపోతిని. నాభర్తగారు మిగుల వికృతముగ బాన్పుపై బవళించియుండిరి. వారు ధరించియున్న షర్టు రక్తమున దడసియుండెను. వారిచేయి పాన్పునుండి క్రిందకు వ్రేలాడుచుండెను. చేతికొక యడుగుమూరమున భార్గవరాముని గండ్రగొడ్డలివలె, బలరాముని హలాయుధమువలె మిగులభయంకరమైన పెద్ద సుత్తెయొకటి రక్తసిక్తమైయుండెను.

నేను మిగుల నుద్వేగమున వారిచెంతకుబోతిని. శత్రువులెవ్వరో దారుణముగ వారినట్టిస్థితికి దీసికొని వచ్చిరని భావించితిని. కాని వారిచే గట్టబడిన నా మంగళసూత్ర మహత్వమున వారి కపాయము

లేకుండ నుండుటయే కాక కేవలము నిద్రమైకమున మేను మఱచి యుండిరని తెలుసుకొంటిని.

“ఏమండీ, యిట్లున్నారు? లెండి. అయ్యో! ఈవర్తు ఇలాగుందేమిటి?” అని నేను వారి నెంతకదిపి చూచినను వారికి మెలకువ రాలేదు. మధ్య నొకటి రెండు సారులు ‘మోహనరావు!— ఛీ!— పశువు!— స్కౌండ్రెల్!—’ అని వారు పండ్లుకొఱికికొనుచు నామాటలకు సమాధానముగ నిద్రయందే పలవరింప జొచ్చిరి.

ఆహా! ఎంత ప్రారబ్ధమువచ్చినది. తుదకు నేను బ్రతికియుండగనే ఎంతదౌర్జన్యమైపోయినది!— అని విహ్వలచిత్తనై యాలోచించుకొనుచుండగ తటాలున మెఱపుమెఱసినట్లు నామనస్సునందొక యూహపుట్టెను. నేను క్షణమయినను విలంబనముచేయకుండ వారు తొడుగుకొనియున్న షర్టునుదీసి వైచి అట్టిదే యొక షర్టును బీరువానుండి పైకిదీసి దానిని ధరింపజేసితిని. వారు ధరించియున్న బట్టపై మఱియెట్టి రక్తపుగుర్తులును లేవు. రక్తసిక్తమైయున్న ఆషర్టును సుత్తెను దీసికొని నేను నాగదిలోనికిబోయి వాటిని నాపెట్టెయందు బెట్టి తాళమువైచితిని. తరువాత నేను మఱల నాభర్తగారి వద్దకువచ్చి నిద్రించుచున్న వారిమొగమునగాని చేతుల యందుగాని రక్తపుగుర్తులేమైన నున్నవేమో యని పరీక్షించితిని. నాకెక్కడను కాన్పింపలేదు.

అప్పటికి బాగుగ తెల్లవారియుండుటచేత నేను మేడక్రిందకు బోయి అప్పటికప్పుడే లేచి ముఖప్రక్షాళన మొనర్చుకొనుచున్న డాక్టరుగారిని చూచితిని. అంతలో కమలాంబ యచ్చటకువచ్చి “ఎంతదారుణమైందో విన్నారా? ఎవర్నో రోడ్డువద్ద బ్రుగులగొట్టి చంపేశారుట. మీరువిన్నారా?” అని ఖంగారుపడుచు నడిగెను.

“మనుష్యులు లక్షలాది పుడుతూ చస్తూవుంటారు. అందులో ఎవడో ఒకడు ఇలాదారుణపుచావు చస్తాడు. నౌఖరులు చెపుతూంటగా విన్నాను. వాడెవడో ఆయుర్దాయంమూడి చచ్చాడు. ప్రపంచంలో పాపం పండిపోతూంటే ఇలా దారుణంగా ఛస్తూవుంటారు.” అని డాక్టరుగారొకచిన్న ఉపన్యాసం ఇచ్చిరి.

“అవునండీ, డాక్టరుగారు! అహర్నిశాలు మనుష్యుల్ని కొయ్యడం, చంపడం మీకు నిత్యవిధిగా జరుగుతూవుంటాయి. కాబట్టి మీకు ఎవరు తలలుపగిలి చచ్చినా ఒళ్లునలిగి చచ్చినా అవన్నీ క్షుద్రమైన ఈగలను దోమలను చంపినట్లే తోస్తుంది. శవాల్ని కొయ్యడంలో పరిపూర్ణపాండిత్యం పొంది డాక్టరులనిపించుకొన్న మీకు హృదయమనే పదార్థమేమయినా ఉందో లేదో నాకాశ్చర్యంగా వుంది.” అని నేనంటిని.

“నాకు హార్టులేదంటావా? ఉందోలేదో నా స్టెతస్కోప్ ఇస్తాను. ఒకసారి పరీక్షిస్తే నీడౌటు వదలిపోతుంది.” అని డాక్టరుగారు పలికిరి.

## ౬

## ప్రసాదరావుగారి కపటనాటకము

ఈకపటసంసారమున మాయాపాశముల జిక్కుపడుచున్న నేను డాక్టరుగారితో కలసి నాభర్తగారి గదివద్దకు వచ్చి తలుపుతెఱచితిని. ‘పతిభిక్షాం మమ దేహి కోమలమతే పదాబ్జస్థితే’ యనుపద్య భాగమపుడప్రయత్నముగ నాజిహ్వాగ్రమునకు వచ్చుటచేత నాలో నేను గొణిగికొనుచు నాభర్తగారివంక జూచితిని. వారింకను నిద్రాపరవశులై యుండిరి. డాక్టరుగారాశ్చర్యమును ప్రదర్శించుచు “ఏమిది వాటె మిరకిల్” అని నాభర్తగారి భుజముపై చేయివైచి ‘హల్లో స్లగిష్ యు ఆర్ యు!’ అని ఇటునటు కదలించిరి. కొంతసేపటికి వారు కన్నులను విచ్చి “అబ్బా!— ఏమండీ డాక్టరుగారు” అని బద్ధకముగ కన్నులు నులిమికొనుచు “మీరేదో పవర్‌ఫుల్ డోస్ (గట్టిమత్తుమందు) ఇచ్చినట్లున్నారే! వళ్లంతా చితుకగొట్టినట్లుంది. జబరాండి (గంజాయి)వంటి దేమయినా కలిపి ఇచ్చారేమిటి? ఏమిటి తల యింతబరువుగా వుంది!” అని మిగుల చికాకుగా ననిరి. డాక్టరుగారు తనభార్యను బిలచి తన మెడిసెన్ ఛెస్టును (మందులపెట్టెను) దెప్పించిరి.

“విన్నారా? ఆ చచ్చిపోయినవాడు ఎవడో మోహనరావుట! నౌఖరులు—అలా చెబుతున్నారు.” అని కమలాంబ తన భర్తగారి నుద్దేశించి పలికెను.

"మోహనరావు చచ్చాడా? — ఎప్పుడు ఎలాగ చచ్చాడు?" అని నాభర్తగారు మిగుల నుద్వేగమున తమ యాశ్చర్యమును ప్రకటించిరి.

"మోహనరావా? ఎవడో నిర్భాగ్యుడను కొన్నాను. వాడు మీ నాన్నగారింటికి వచ్చేవాడు కాదమ్మా నీకు బాగా తెలుసు ననుకుంటాను" అని డాక్టరుగారు నన్నుద్దేశించి పలికిరి.

"మోహనరావవుతే వాడే కావాలి." అని నే నంటిని. "వాడెలా చచ్చాడు? నాతల పగిలిపోతూన్న దయ్యా డాక్టరుగారు" అని నాభర్తగారు తమ తలను రెండుచేతులతోను బట్టుకొనిరి.

డాక్టరు వారి కొకమందును త్రాగించి ఆచచ్చిన వానిని చూచి వస్తానని క్రిందకు వెళ్లిపోయారు.

తంతివార్తనిచ్చి నాభర్తగారు మధ్యాహ్నమున సూపరింటెండెంటు ప్రసాదరావుగారిని రప్పించిరి.

"విజయా, నీవు ఇక్కడకు వచ్చిన మూడవ రాత్రే సంగతులు ఇంతభయంకరంగా నడవడం నాకు పరమవిషాదంగా వుంది. ప్రసాదరావుగారిప్పుడు కాకినాడ వెళ్లిపోతున్నారు. ఈసందిగ్ధసమయంలో ఆయన కంటె ప్రాణాధికమైన మిత్రుడు నాకెవ్వడూ లేడు. నీ వాయనతో కలసి కాకినాడ వెళ్లిపో. ఒకటిరెండురోజులలో నేను కాకినాడ వస్తాను. రోజుకంటె రోజు ఈమేడలో దౌర్జన్యాలు విజృంభించిపోతున్నాయి." అని నాభర్తగా రనిరి. కొన్ని తర్కవితర్కములైన తరువాత నే నందుల కంగీకరించితిని.

"విజయా, నీవు వెళ్లేముందు నా కొక సందేహం తీర్చుకోవాలని వుంది. ఈవేళ ప్రొద్దున నేను లేచి నప్పుడు నేను ధరించివున్నది నిన్నరాత్రి తొడుసుకొన్న షర్టుగాక వేరేషర్టులావుంది. నీవు మార్చావా ఏమిటి? కాక సోమ్‌నామ్‌బలిజమ్ (నిద్రపోతూ లేచి నడచుట) అనే తెగులుపట్టుకుందేమో యని సందేహంగా వుంది." అని నాగుండెలు ఝల్లుమనునట్లు పలికిరి. ఇంగ్లీషు 'సోమ్‌నామ్‌బలిజమ్' అనియు 'స్లీప్‌వాకింగ్' అనియు చెప్పబడుచు మిగుల నరుదును మహాభయంకరమును నగు మానసికవ్యాధివలన ఒడలెఱుగక నిద్రలో నడచి పోయి ఈహత్యాపరాధ మొనర్చిరని నా మనోవీథిని మెఱుపువలె దళుక్కున మెఱసి ఒక్కసారిగ నెత్తిపై పిడుగుపడినట్లు మిగుల విభ్రాంతి కలిగెను.

"విజయా, నీ కాకస్మికంగా చాల నాందోళనము కలిగించాను. నీకనుటయేమి? నాసంగతి తలచుకొన్న నాకే మహాక్షోభగా వున్నది. నీమనస్సునకుగూడ కష్ట మియ్యకుండ దాచియుంచాలని తలంచాను. కాని సంగతులు చివరకు చాలఘోరంగా పరిణమించడంవల్ల ఇప్పుడు నీతో స్పష్టంగా చెప్పకుండ దాచుకోవడం కష్టంగావుంది."

"మీ కష్టసుఖాల్లో సమభాగినినైన నాతో చెప్పకుండ ఎంతకాలం దాచివుంచుతారు? నన్ను లోక సామాన్యనుగా భావించి మీ రధైర్యపడవద్దు. మీరొక వేళ యెంతదారుణంగా ప్రవర్తించినా, అది స్పష్టంగా నాకళ్లతో చూసినా,— నేను చేతులార ఈ ఐహికసంబంధం చంపుకోలేను." అని చెప్పకొనుచుండగా నా కన్నులు బాష్పకలితములై పోయెను.

వారు నాహృదయమార్దవమునకు దుఃఖించుటయే గాక నన్ననేకవిధముల నుపలాలించిరి. ఆహా! కష్టకాలమున నొరపిడిచేతనే గదా దాంపత్యానురాగము తరిమెన పెట్టబడిన పాత్రవలె ధగధగలాడుచు మెఱసిపోవును!

"ఆహా! విజయా! నేనెంతపాపాత్ముడనైనను చాల నదృష్టవంతుడను సుమా! కావుననే నిన్ను పెండ్లాడగలిగినాను." అని యిట్టివాక్యము లెన్నియైన పలికినా జన్మమునకు కృతార్థత్వమును పవిత్రతయు నొడగూర్చిరి.

"విజయా, నీవింత నొక్కినొక్కి యడుగుచున్నావుగనుక చెప్పుచున్నాను విను. మోహనరావు చెప్పినట్లు మాపాండ్రవంశమున బ్రతివానికి మతిభ్రమణము కొన్నితరములనుండి పీడవలె బట్టుకొనియుండడం నిజమే. అది మాతండ్రిగారిలో చాల ముదిరిపోయింది. అది వారికి తమతల్లిగారి వంశంనుంచి సంక్రమించింది. పాశ్చాత్యుల సిద్ధాంతాన్ననుసరించి అటువంటి వంశంలో పుట్టినవాళ్లు సాంసారికసుఖాలను వదలుకొని లోకంలో అటువంటివాళ్ల సంఖ్య వృద్ధి కాకుండ ఊరుకోవాలి. అయిదారునెలలక్రితంవరకు

చేసినట్టిసంకల్పంతోనే ఉన్నా. కాని నాలో ఉన్మాద చిహ్నములేవ్వీ లేవని కలకత్తా, బొంబాయి—ఈలాంటి చోట్లలో గొప్పగొప్ప డాక్టర్లంతా పరీక్షించి చెప్పేరు. వాళ్లంతా వంశక్రమాగతంగా వస్తూవున్న ఈభయంకర రోగం నాకు సోకదని, లేనిపోని భీరుత్వంలో నుండ వలదనీ గట్టిగా చెప్పేరు. పెండ్లాడి శాంతంగా కాలక్షేపం చెయ్యవలసిందనిచెప్పేరు. తరువాత డాక్టరు రంగా పరిచయమైంది. అతనుకూడ అదేవిధంగా చెప్పడమేకాక వెంటనే పరిణయంచేసుకోని యెడల ఉన్మాద చిహ్నము లంకురింపవచ్చునని ఉపదేశం చేశాడు. అందువల్లనే అంతతొందరగా పెళ్లి జరిగింది. చేతులు కాలిపోయినతరువాత ఇప్పుడు విచారిస్తే ఏంలాభం? ఇప్పుడిలా కొంపమునిగిపోతూవుంది. స్లీప్ వాకింగ్ వల్లనే రాత్రి అంతదారుణం జరిగిఉంటుంది."

"ఏమో, నేను నమ్మలేకుండాఉన్నాను—నేనొకసంగతి ప్రత్యక్షంగా చూశాను."

"ఏంచూశావు? కొంపత్రవ్వి నేను రాత్రిలేచి తోటపైకి వెళ్లడం చూశావాఏమిటి?"

"నేనదేమీ చూడలేదు. నేను చూసినదేదో మీతో చెప్పవలెనని లేదు."

"అవుతే ఈసంగతులన్నీ నాచేత చెప్పించవచ్చును కావూ?"

"క్షమించండి.— నే నేపాపపువేళ లేచానో కాని అన్నీ ఘోరాలే కనుపించాయి.—ప్రొద్దున్న మీగదిలోకి రాగానే మీరు వళ్లుతెలియకుండా వుండడమేకాక మీపక్క రక్తమయంగా వుంది. అప్పుడాపక్క నేనే మార్చివేశాను."

నాభర్తగారు చాల విభ్రాంతులైపోయిరి. తప్పక తామే నిద్రలో ఏదోఉన్మాదావేశమున నట్టిపని చేసియుందుమని వాపోవజొచ్చిరి. నేనువారిని ధైర్యాన్వితులను జేసి "మీరు ఖంగారుపడి ఈసంగతు లీవిధంగా మరెవ్వరియొద్దను చెప్పవలదని ప్రార్థన. మీకు తెలియకుండా ఈశ్వరు డీకార్యమును మీచేత జేయించిన యెడల మీకందువలన పాపముగాని, తదితరశిక్షలుగాని కలుగనేకూడదు." అని యాశ్వాసించితిని.

ఆనాటిసాయంత్రమే ప్రసాదరావుగారితో కలసి నేను కాకినాడలో నాభర్తగారు నివసించియుండిన గృహమునకు వచ్చివేసితిని. వచ్చునపుడు రక్తసిక్తమై యున్న పక్కను సుత్తెయు రెండవకంటివానికి తెలియకుండ నాసూటుకేసునందే యుంచి భద్రముగ నాతో దీసికొనివచ్చితిని. మార్గమున నాతో ప్రసాదరావుగారీక్రిందివిధముగ సంభాషించిరి.

"మోహనరావెవ్వరో మీకు సరిగాతెలియదనుకుంటాను. రంగాచారి అనే ఇన్స్పెక్టరు కొన్నిభోగట్టాలు చేసినట్లు చెప్పేడు. యస్. వెంకటరంగయ్య అనే గొప్పవాడొకడుండేవాడు. ఆయన తనభార్య గతించినతరువాత 'సరస్వతి'అనే వంటలుచేసేదాన్ని చేరదీసినాడుట. ఈమోహనరావు ఆవెంకటరంగయ్యగారికి 'బేస్టర్డుసన్' (జారజుడు)గా పుట్టినాడుట. మోహనరావు ఎప్పుడూ తనకంటపడకుండా ఉండే షరతుమీద, తన పేరైన వాడికి తెలియకుండావుండే షరతుమీద, వాడికి గొప్పచదువులు చదివించి ప్రతినెల కొంతసొమ్ము వచ్చేయేర్పాటు చేశాడుట. తలచుకుంటే వాడిచరిత్ర నాకాశ్చర్యంగావుంది."

"అవుతే ఎవరా వెంకటరంగయ్యగారు?"

"అమ్మా, మీకంతమాత్రం నాకు చెప్పవలెనని లేదు. కాని ఎప్పటికైన మీకాసంగతి తెలియకుండా ఉండదు. రేపంపటితోటి లోకంతోపాటు తెలుసుకొని ఆందోళన పడిపోతారని ముందు నేనే స్పష్టంగా చెబుతున్నాను. ఆయన మీమామగారు సత్యవరపు వెంకటరంగయ్యగారే. మీకు తెలిసే వుంటుందనుకొంటాను. ఆయనకు వయసు ముదిరినకొలది మతిచలించిపోయింది. అపుడే కాబోలు సరస్వతిని చేరదీశాడు. ఇంకా చరమకాలంలో పిచ్చకోపం పట్టుకొని నిష్కారణంగా కొన్నిదారుణాలు చేశాడు."

"అవుతే మోహనరావు చేసిన పిచ్చపనులకు"—అని నేను అర్ధోక్తియందే నూగకుంటిని.

"ఆహా! ఆతండ్రిపిచ్చే కొంత దారుణం. కాని అది రాజశేఖరరావుగారిలో లేదని నిస్సంశయంగా చెప్పగలను—మోహనరావు ఒక్కొక్కప్పుడు వట్టి

ఉన్మత్తుడనడానికి చాలసంగతులు దాఖలాగా వున్నాయి. బుర్ర పగిలివున్న వాడిజేబులో గుళ్లుపట్టించియున్న ఒక రివాల్వరు వుంది. తరువాత రాజమండ్రీలో ప్రతి రాత్రి మీహోటలోనికివచ్చి మీఇంట్లో ప్రవేశించి మీ గదిలో క్లోరోఫారమ్ రుమాలు వదలిపెట్టిపోయినవాడెవ్వడో అడుగుల జాడలనుబట్టి ఇన్‌స్పెక్టర్లు ఋజువు చేశారు."

"మోహనరావేనా?—"

"అపిచ్చపనులన్నీ వాండే చేశాడు. అన్నింటికీని నిదర్శనాలు కనుపించాయి."

అప్పుడు నాకు సర్వము విశదమైపోయినది. తరువాత నన్ను మాయింటియొద్ద దిగవిడచి ప్రసాదరావుగారు తమ ఆఫీసునకు వెడలిపోయిరి.

కాకినాడ వచ్చినతరువాత ఆనాటిరాత్రి జాగరణమువలన బుట్టిన అలసత్వముచేతను, ఆయాసముచేతను నంబనే విశ్రమింపవలసినదాననైతిని.

మఱునాటి మధ్యాహ్నమున నేను వృత్తాంతపత్రికలను చదువుకొనుచుండగ పట్టాభిరామయ్యగారను వకీలు మాయింటికి వచ్చెను. వృక్షమున బూర్ణముగపండి రాలుటకు సిద్ధముగ నున్న ఫలమువలె ఆత డుండెను. ఆయన నాభర్తగారి వ్యవహారములను జూచుచుందురనియు ఎందులకోగాని నాభర్తగారి రాకకై ప్రతీక్షించుచుండిరనియు నేను తెలిసికొంటిని.

"మోహనరావు చచ్చినట్లు రాజశేఖరరావుగారు నాకు టెలిగ్రామ్ ఇచ్చారు. సంగతులు చాలా విపరీతమైపోయాయి. మోహనరావు మొదటినుంచి నాద్వారానే ఎప్పుడు సొమ్ముతీసుకుని విద్యాభ్యాసం చేసేవాడు. పట్టి పత్రి పత్రి పోకడలు పోయేవాడు. వాడి తల్లితో ఆ సంగతి నే నెప్పుడు చెబుతూండేవాణ్ని—వాడు, వాడి తల్లీ—వీళ్లిద్దరివంటి మూర్ఖుల్ని నేనెప్పుడూ చూడలేదు. ఆతల్లికి నేను చాలసార్లు వార్నింగ్ ఇచ్చాను. 'ఆలస్య మమృతం విషమ్' అన్నట్లు నేనేదో కర్తవ్యం నిశ్చయంచేసి తీరాలి—స్టాట్యుటరీ డిక్లరేషన్ (శాసనసమ్మతమైన వాఙ్మూలం) ఒకటి వెంటనేచేస్తాను—ఈమూర్ఖులు వెంకటరంగయ్యగారు వ్రాసిన మరణశాసనం సరిగా అర్థంచేసుకొంటే వాళ్లే గ్రహించివుందురు." అని చెప్పి వారు వెడలిపోయిరి. వారిని సాగనంపుటకై గది బయటకు వచ్చుచుండగా ప్రక్కగదిలో డాక్టరు రంగాగారు నాకై ప్రతీక్షించియుండుటకు చాల నక్కజపడితిని.

"అమ్మాయి, విజయలక్ష్మి నీవెవ్వరితోనో మాట్లాడుతున్నావని ఇక్కడకూర్చున్నాను. నేను మెయిలులో వచ్చా. మద్రాసువెళ్లిన మీనాన్నగారుకూడ ఈరోజునే మెయిలుమీదవచ్చారు. నిన్ను వచ్చిచూస్తానని చెప్పమన్నారు. మొన్నరాత్రిజరిగిన ఘోరపు పనులన్నీ ఆయనతో చెప్పాను. నీవుకూడ చాల బెదరిపోయివున్నావు. రాజశేఖరరావుగారు రేపు సాయంకాలం వస్తానని చెప్పమన్నారు. నాకు పనుంది. పోయి వస్తాను." అనిచెప్పి వెడలిపోయిరి. ఒక యరగంటసేపటికి మాతండ్రిగారు వచ్చిరి. అంత యాందోళనమున నుండగ మాతండ్రిగారి నెన్నడును జూచియుండలేదు.

అమ్మాయీ, విజయ!—ఈ ఘోరాలన్నీ చూస్తూ ఎంత క్షోభపడిపోతున్నావో ఏమో! నీవు తలచినట్లు అతనిసంగతి కనిపెట్టకుండా పెళ్లిచేశానేమో అని బాధగావుంది."

"పోనీయండి నాన్నగారు. నాకిప్పుడు వచ్చిన విపత్తేమీ లేదు. ఈశ్వరుడిదయవల్ల ఆయనకేమిచిక్కులు లేకపోతే అదే నాకు పదివేలు."

"అయితే నీకితనివల్ల యితని చర్యలవల్ల సుఖం కలుగుతోందా చెప్పు."

"అసలీ సంసారపు తగులమే దుఃఖమూలకం. శాంతి అనే పదార్థం ఎవరికో యోగులకుగాని వుండదు. నాకిప్పుడు సుఖం కలుగుతున్నదా అని అడుగుతున్నారు. కాబట్టి చెప్తానువినండి. బుద్ధభగవానుడు చెప్పినట్లు సుఖంఅనేపదార్థం బహుశః ఈలోకంలో వుండదు. మనం సుఖమనుకునేది ఎప్పుడూ వట్టి బాధానివారణమే కాబట్టి మనకేమి గందరగోళాలు పుట్టకుండా వుంటే అదే సుఖంగా భావిస్తాను."

"ఆహా! విజయ!— గొప్పవేదాంతులుకూడ తెలుసుకోలేని సంగతులు నీవు ప్రత్యక్షంగా ఆచరణంలోనికి తెస్తున్నావు. కడకిదంతా ఏలా పరిణమిస్తుందో ఏమో అని చాలభయంగా వుంది. నేను నిజంచెబుతాను విను. కేవలం రాజశేఖరరావు ధనం చూసే ఈపెండ్లిచేశాను. పైకి ఐశ్వర్యంతో తులతూగిపోతూఉన్నట్లున్నా నాకు వ్యాపారంలో చాల చిక్కులువచ్చాయి. అటువంటి సందర్భంలో ఈయనడబ్బు కొంత వ్యవహారానికి అక్కరకొస్తుందన్న పాడుబుద్ధికొద్దీ ఈపెళ్లిచేశాను. ఇప్పుడేంచెయ్యను? 'అవశ్యమనుభోక్తవ్యం కృతకర్మ.'

* * *

ఆసాయంకాలమున నేను నాసూట్‌కేసును తెరచి దానిలో రహస్యముగాబెట్టియుంచిన సుత్తెయు రక్తసిక్తమైయున్న నాభర్తగారి షర్టును పైకిదీసి ఒకకాగితములో లుంగజుట్టి దానినెక్కడనైన సురక్షితముగా నుంపవలయునను నుద్దేశముతో నాగదితలుపును తెఱచి ఈవలకు వచ్చితిని. అప్పుడొక సేవకుడు పరుగెత్తుకొని వచ్చి, అమ్మ పోలీసుసూపరెంటుగారు వచ్చారు. అని నాగుండె లదరునట్లు చెప్పెను. అపుడు నేను చేతనున్న కట్టను తొందరగ నొకయలమారులో బెట్టి తాళమువేసి ప్రసాదరావుగారియొద్దకు వచ్చిరి.

"అత్యవసరంగా మాట్లాడవలసివుండి వచ్చాను. మోహనరావు నెవడుచంపేడోకాని వాడు తనప్రాణాలు రక్షించుకోడానికి యత్నాలు చెయ్యకపోవడమే కాకుండా ఈహత్యానేరం పూర్తిగా రాజశేఖరరావుగారి కంఠానికి పట్టుకునేటట్లు విశ్వప్రయత్నాలు చేస్తున్నాడు. సి. ఐ. డి. ఇన్‌స్పెక్టరు రంగాచార్యులసృష్టిని, ఈహత్యని, ఆయనచేశాడని తాను ప్రత్యక్షంగా చూసినట్లు కొన్నిదాఖలాలు, సాక్ష్యాలు తయారుచేస్తున్నాడు. ఈమధ్యాహ్నం నాపేర, రంగాచారిపేర ఎనానిమస్‌గా (ఆకాశరామన్నవ్రాసినట్లు) రెండుఉత్తరాలు వచ్చాయి. వాడెవ్వడోకాని మోహనరావును రాజశేఖరరావుగారే హత్యచేశారనీ, సంశయింపవలసినపనిలేదనీ, సంశయించేవాళ్లు నశించిపోతారనీ వ్రాశాడు. రాజశేఖరరావుగారు ఆయింట్లోవున్న ఒక పెద్దకోల్‌హేమర్ (రాతుసిబొగ్గుకొట్టుసుత్తె) తీసుకు వెళ్లి ఆహత్య జరిగించారని అప్పుడాయన షర్టు రక్తమయమైపోయినదనీ, ఆషర్టు ఉదయం లేచినప్పుడు లేదనీ, ఎవరో దాన్ని మార్చియుంటారనీ, యిట్టివే కొన్ని సంగతులు వ్రాశాడు. ఇవన్నీ యదార్థమని రంగాచారి పరిశోధించి తెలుసుకొన్నాడుట. ఇప్పుడాసుత్తె, షర్టు ఎక్కడుంటాయో తెలుసుకునే నిమిత్తం ఈలాగ వచ్చాను." నేను నిర్ఘాంతబోవుచు ఏమో చెప్పబోతిని. అపుడు ప్రసాదరావుగారు "అమ్మా మొదట నేనుచెప్పేది సావధానంగా వినండి. నేను ఈజిల్లాలో పోలీసుశాఖను పరిపాలిస్తూ ఉన్న ఉద్యోగస్థుడను. థియరిటికల్‌గా నేను గోజాకు యిరవైనాలుగు గంటలు డ్యూటీలో ఉండవలసినవాడ నయినా నేను అప్పుడప్పుడు ప్రైవేట్ సిటిజన్‌గా మారిపోతూ ఉంటాను. ప్రైవేట్ సిటిజనుగాఉన్న సమయాల్లో నేను పోలీసు అఫీసరు నన్నసంగతి పూర్తిగా మఱచిపోతాను. లేనియెడల నాబ్రతుకునకు వినియోగంలేదని నా వూహ." అని గడియారంపైపుచూస్తూ ఏడుగంటలు దాకా నేను ప్రైవేటుసిటిజన్‌గా వుంటాను. ఈ మధ్యకాలంలో నేను రాజశేఖరరావుగారికి పరమ మిత్రుడను. ముందు ఈషర్టునుగూర్చి, ఈకోల్‌హేమర్‌నుగూర్చి చెప్పవలసివుంది. అవి రాజశేఖరరావుగారి శత్రువులకు చిక్కివుంటే నాకు మిక్కిలి కష్టంగా వుంటుంది. అలా కాకుండా అవి వారిస్నేహితుల చేతుల్లో వుంటే నాకు అంత ఏన్‌గ్జైటీ వుండదు." అని పలికిరి.

"మీరు ఏన్‌గ్జైటీతో ఉండవలసిన పనిలేదు." అని కొంతసమయస్ఫూర్తితో నంటిని.

"అలాగా? అవుతే నాకు మనస్సునకు కొంచెం శాంతిగా వుంది.—అంటే నేను ప్రైవేటు సిటిజన్‌గా మాట్లాడుతున్నాను.—ఏడుగంటలకు తరువాత నేను డ్యూటీమీదవచ్చి అప్పుడు మిమ్మల్ని నానా విధమైన ప్రశ్నలు వేయవచ్చును.—అవుతే ఒకకప్పుటీ తెప్పించండి."

నేను బెల్‌కొట్టి సేవకుని పంపించి కప్పులో టీ తెప్పించితిని.

"టీ త్రాగడం నాకొక వీక్‌నెస్. (అవగుణం) సామ్యూయెల్ జాన్‌సన్‌లాగ ఎన్నికప్పులైనా నిముషంలో ఊదేస్తాను. ఇదొక్కటే నాకవగుణంకాదు. నిర్ధనులకు ఏదయినా ఇచ్చుకోవడం అనే ఒకవీక్‌నెస్‌కూడా నావద్దవుంది.——అంటే మీకు ఉపయోగంలేని దుస్తులు కాని, సుత్తెలుగాని, గడ్డపారలుగాని మీవద్దవున్నాయనుకోండి.——ఉంటే వాటిని సరియైన వినియోగంలోకి తెచ్చే బీదవాళ్లకు అన్విచ్చేస్తాను. నేరాలు చేసి సరియైన బ్రతుకు బ్రతికే ఉద్దేశంవున్నవాళ్లెందరో సరియైన పనిముట్లు దొరకకపోవడంవల్ల యుక్తమైన జీవితం చెయ్యలేక అవస్థ పడుతూవుంటారు" అని వారు స్పూన్‌తో టీకలిపి త్రాగుటకు ప్రారంభించి,

"అవి దుర్వినియోగంచేసేవాళ్ల చేతుల్లో పడిపోతాయేమోనని మీరు భయపడుతున్నారేమో! కాబట్టి మాటవరుసకు చెబుతున్నాను. అలాంటివస్తువులు మీదగ్గరవున్నాయనుకోండి. ఉంటే వాటిని ధైర్యంతో చెత్తతో వీధులోపారేయించలేరు. ఒకవేళ ఏఉప్పుతొట్లోనైనా పారవేసేయెడల రంగాచారి నీడలాగ వెంటనే వచ్చి కార్యభంగం చేస్తాడు. అదేవిధంగా మీరు ఈ యింట్లోకాని, మరెక్కడనైనాకాని కప్పెట్టించినా అవి శత్రువులహస్తాల్లో పడిపోయి మొదటికే మోసం కలుగజేస్తాయి. కాబట్టి నేనొక్కడిని దౌర్భాగ్యులకేమయినా ఇచ్చుకుందామని ఉద్దేశ్య ఉన్నవాడను గాను. మీకుకూడ అటువంటి వస్తువులుండవచ్చు. ఉంటే తప్పకుండా నాకే యిప్పించండి."

"ఆహా! ఇతరులచేతుల్లో పడిపోవడంకంటె మీకిస్తేనే భద్రమని భావిస్తున్నాను."

"మీరిలా ఊహించడం నాకు ఆనందంగావుంది. రంగాచారి సెర్చివారంటుతోవచ్చి ఈయింట్లో వినియోగం లేకుండా వుండే వస్తువులు, ఉపయోగంలేని తదితరవస్తువులు తనదౌర్భాగ్యస్నేహితులకోసం తప్పకుండా పట్టుకుపోతాడు."

ఆయన టీ సగం త్రాగి బల్లమీద ఉంచివేసిరి.

"అవుతేఎప్పుడైనా సెర్చివారంటు(ఇంటిసోదా) ఏలాగ అమలుజరుగుతుందో మీరెప్పుడైన చూశారా?"

నేను లేదని తలనడ్డముగ నాడించితిని.

"అవుతే ఆ దేవిధంగా జరుగుతుందో ముందు మీకొక రిహార్సల్ (మచ్చునాటకం) జరిపించి చూపిస్తాను. చూతురుగాని——"

"అవుతే మాయి ల్లీరాత్రి సోదా జరుగుతుందా చెప్పండి?"

"ఆహా! రంగాచారి తప్పకుండావచ్చి అందుకు ఉపక్రమణం చేస్తాడు."

"ఏగదులతో ముందు సోదా ఉపక్రమిస్తారు?"

"ముందు రాజశేఖరరావుగారి పఠనమందిరంతో ప్రారంభిస్తారు. నడవంటి ముందక్కడకి. ఇండ్లసోదా అంటే ఏలాగుంటుందో కొంచెం రుచిచూతురుగాని.— కాని ఈరిహార్సల్‌లో నాపేరు 'రంగాచారి' అనే భావించండి."

ఆపఠనమందిరమున మొదట వారన్నిపుస్తకములను ఒకమారు నడచి చూచి కొన్ని డ్రాయర్లను తెరచిరి. కొన్ని వస్తువులను అక్కడక్కడ పరీక్షచేసి మరల వానిని మూసివేసిరి. తుదకు గోడలో నమర్చబడి యున్న ఇనుపపెట్టెయొద్దకు వెళ్లిరి. తమజేబునుండి కొన్ని సాధనములనుదీసి చిక్కుపడకుండ వానితాళపు సుత్తులను ఒకటివెనుక నొకటిగ నన్నిటిని సడలించి దానితలుపు తెరచిరి. దానిని తెరచురహస్యమును నాభర్తగారాయన కొకసారి చెప్పియుండిరట. దానిలో సీల్లువేయబడియుండిన కవరుల కట్టలు చాల యుండెను. అవిచూసి వారు ముఖమును చిట్లించిరి. తరువాత డైరీవలెనున్న పుస్తకమును దానిలో నుండితీసి "రంగాచారి ఎందునిమిత్తమైనా వస్తే ముఖ్యంగా దీనికోసమే వస్తాడు. ఇది నాకంట పడుతుందని అనుకోలేదు." అని ఆండలిపత్రములను ద్రిప్పజొచ్చిరి.

దానిలో "౩౫౦ నైజాము, క. నో. ౧౦౦ చాలబాగున్నవి. వారంగల్లునకు పంపబడినవి." అని యున్నపత్రమును నాకుజూపించిరి. "అనగ దీనిభావము" అని నే నడిగితిని.

"అంటే ఎవరైనా దీన్ని నమ్మవలసివుంటే నైజాము వందరూపాయిల కరెన్సీనోట్లు ౩౫౦ వరం

గులులో వున్న ఏజెంటునకు పంపించిరిమని అర్థం."
తరువాత చాలపత్రములమీద—

"౨౦౦౦ — పసులు — కలకత్తా."

"౫౦౦౦ — ఐదులు — బొంబాయి."

"౪౦౦౦ — పదులు — బెంగుళూరు."

"౧౦౦౦ — పండులు — ఢిల్లీ."

అని ఈవిధముగ పెన్సిలుతో వ్రాయబడియున్న స్థలముల యొద్ద నాగి నాకు చూపించిరి.

"చాలు యింక నాకేమీ చూపించకండి. ఇదేమో నాకు చాలభయంకరంగా వుంది. ప్రసాదరావుగారు, ఈడైరీలో యింకేమీ చూపించవద్దు. అయితే ఇవన్నీ సత్యమా చెప్పండి?"

"ప్రసాదరావునుగాను. రంగాచారిననండి. ఇవన్నీ సత్యమానా కాదా అంటే నాకు 'ఆహా! ఎందుకబద్ధమౌతాయి?' అని ప్రత్యుత్తరం చెబుతాడు. ఏమయితేనేం—రంగాచారికి సత్యం ఎప్పుడైనా తెలుస్తేగా అసలు?"

అని వారు డైరీనీపలనుంచి ఇనుపపెట్టెవేసిరి.

"దీన్నికూడ మీకు ఉపయోగంలేని పర్సుబట్టలతో పట్టుకుపోతాను. ఒక పదిపన్నెండు పేజీలు పోయినా ఇలాంటి డైరీలకు ఆసపడేవాళ్లు వందలాది జనం వుంటారు—ఔతే ఇలాంటి సందిగ్ధసమయంలో మీరు ఎవరిమీదనో ఒకరిమీద విశ్వాసంవుంచితీరాలి. ఇక నేనేగదులు చూశాను. కాలాతీతమైపోయింది, నేను క్రిందకుపోతాను — మీకేమీ ఉపయోగంలోలేని ప్రాతగుడ్డలు, తదితరవస్తువులు, ఇస్తే చాలా సంతోషిస్తాను. కంఠంలో ప్రాణా లుండగా నేనెప్పుడు మిత్రద్రోహం చెయ్యనని జ్ఞాపకం ఉంచుకోండి." వారు క్రిందికి నడలిపోయిరి. మోహనరావు హత్యానేరమును ప్రత్యక్షముగ జూచి యున్న పర్సును సుత్తెను లుంగగ జుట్టియున్న గోధుమవన్నెపు కాగితపుకట్టను వారివద్దకుకు దెచ్చి "ఇదుగోనండి" గుడ్డలు—ప్రసాదరావుగారు! కాక రంగాచారిగారా?"

"ప్రసాదరావునే. రంగాచారి—"

అప్పుడెవ్వరో తలుపుతెఱచి గదిలో ప్రవేశించిరి. సి. ఐ. డి. ఇన్‌స్పెక్టరు రంగాచారి నన్ను చూచుచు "అమ్మా నేనొక అన్‌ప్లెజెంట్‌డ్యూటీ (ఆనందవిహీనమైనపని) మీద వచ్చాను. క్షమించండి." అని సూపరింటెండెంటుగారిని చూసి అభివాదముచేసి "నాకన్న ముందువచ్చారే!" అని పలికెను.

"ఇప్పుడే వచ్చాను. నీవువచ్చిన పనికానియ్యి." రంగాచారి "చిత్తం చిత్తం" అని జేబులోనుండి ఒక కాగితము తీస్తూ "అమ్మా ఇదుగో సెర్చివారంటు కలెక్టరుగారు మంజూరుచేశారు. ఈమేడంతా సోదా చూడాలి." అనిపలికెను.

"అమ్మా, అది వాడి డ్యూటీ. ఈదేశంలో త్రినేత్రుడుకూడా పోలీసువాడు డ్యూటీమీద వచ్చినప్పుడు అడ్డుకోలేడు.—ఔతే రాజశేఖరరావుగారు రేపటికి కాని రారన్నమాట. నేను నడుస్తాను. అని నేనుతెచ్చిన బ్రౌనుపేపరు కట్టను చంకబెట్టి—"బజారులో షాపింగ్ ఇలాఒకసారి చూసిపోదామని వచ్చాను— -రంగాచారి! బజారులో నాస్వంతపనినిమిత్తం కొన్నవస్తువులకట్ట." అని వచ్చినపోలీసుభటులందఱును సలాము చేయుచుండగ వీథిలోనికి నడలిపోయిరి.

ఆయన ఆవస్తువులను పట్టుకొని పోయినతరువాత మాయిల్లున్నంతప్రదేశమందును భూనభోంతరమంతటను నెంత గాలించినను, రక్తపుగుడ్డలుగాని, సుత్తెలుకాని, దొంగనోట్లకు దారుణమైన దినచర్యలుగాని, రంగాచారికన్నులబడవుగదా! ఇనుపపెట్టెను నాసూట్‌కేసును సోదాచేసినతరువాత వానికి శృంగభంగమైనట్లయ్యెను.

"అయితే సూపరింటెండెంటుగారు తీసుకు పోయిన ఆపార్సెలు (కట్ట) ఏమిటి?" అనియడిగెను.
"అది మీరాయననే అడిగి తెలుసుకోవాలి."

"అమ్మా క్షమించండి. వట్టి పరిహాసంగా అన్నాను. మీరు నామీద దయయుంచి నేనిలాగ అడిగానని ఆయనతో చెప్పకలదని ప్రార్థన. వారు వేరువిధంగా భావించవచ్చును." అని కేవల మవివేకమున నాప్రసంగమెత్తినట్లు మిగుల ప్రతిమాలుకొనుటయేగాక నాకన్నో క్షమాపణముల జెప్పుకొని నడలిపోయిరి.

(ఇంకా వున్నది.)

చెన్నరాజధానియందు 1933 సంవత్సరము జూలై ప్రారంభము మొదలు సెప్టంబరు తుదివరకు గల మూడునెలల కాలమున ముద్రితములయి ప్రకటితములయిన

# ఆంధ్ర గ్రంథముల పట్టిక*

## ఇతిహాసములు

శ్రీమదాంధ్ర మహాభారతము, అరణ్యపర్వము—(ప). సి. పార్థసారథి, గుంటూరు

## కథలు—ఐతిహాసికములు, పౌరాణికములు

అర్జునవిజయము—ఐ. వైద్యనాథ్
కుశలవుల చరిత్రము—యస్. సి. దేశికాచార్యులు
నలమహారాజుకథ, వచనకావ్యము—(ప) యస్. వి. గోపాల్ అండ్ కో. మదరాసు
పారిజాతాపహరణము—ఏ. వెంకటప్పయ్య, యస్. హరిప్రసాదరావు
ప్రభావతీప్రద్యుమ్నము—యస్. వెంకటరంగాచార్యులు
భారతసావిత్రి—(ప) యస్. వి. గోపాల్ అండ్ కో, మదరాసు.
మణికుండలోపాఖ్యానము—సి. మల్లయ్య
రఘువంశము భా. ౧,౨—(అను) డి. పిచ్చయ్య
రాయబారము—డి. వెంకటకృష్ణరావు
రుక్మాంగదచరిత్రము—యస్. హనుమచ్ఛాస్త్రి
వరూథిని, దమయంతి—పి. యస్. వి. ఆర్. సూర్యనారాయణకవి
విపులభాగవత కథావళి—పి. యోగానందకవి
విశ్వామిత్రమహర్షి—కె. వరలక్ష్మమ్మ
శకుంతల—యస్. శేషగిరిరావు
శ్రీమదాంధ్ర తులసీరామాయణము, బాలకాండము, ద్వితీయభాగము—(అను) ఓ. వి. సుబ్బరావు
శ్రీరామకథామృతము—టి. వెంకటప్పయ్యశాస్త్రి
సీతావిజయము—డి. లక్ష్మణస్వామి

## కల్పితములు

గద్యకథామంజరి—బి. వెంకటరావు
జీవకారుణ్యకథలు—యస్. సి. రంగస్వామిఅయ్యంగార్
నిజమైన కాశీమజిలీలు—యస్. చలపతిరావు

## చారిత్రకములు

ఆర్యకథాలహరి, భా. ౧—టి. వి. నరసింగరావు
చంద్రహాసము—జి. జోసఫ్
భోజకాళిదాసుకథలు—ఏ. సోమేశ్వరరాయకవి
మహాపతివ్రత—(ప్ర) డి. సీతారామస్వామి, పిఠాపురము.
విక్రమార్కచరిత్రము—బి. రామమూర్తిశాస్త్రి

## కల్పము

విఘ్నేశ్వరపూజావిధానము—(ప్ర) సుందరరామ శాస్త్రిలు అండ్ సన్స్, తెనాలి

## కావ్యము

రసాశ్రయము—యస్. త్ర్యంబకరావు

## గణితశాస్త్రము

గణితజ్ఞానబోధిని, తరగతులు, ౪, ౫—కె. వి. రామదాసు.
గణితము—జె. వి. సుబ్బరావు, యస్. వెంకటరమణ
ప్రారంభగణితము, బుక్ ౧—వి. వెంకటసుబ్బయ్య
లఘుగణితము, బుక్ ౧—యం. బాలకృష్ణఅయ్యర్

---

* ఈ పట్టికయందుగల సంకేతపదముల వివరణము: అ.—అధ్యాయము. అను.—అనువాదము, అనువాదకుడు, పద్యము. ప.—ప్రకా.—ప్రకాశకులు. భా.—భాగము. వ.—వచనము. సం.—సంపాదకుడు. సటీ.—సటీకము.

12. 5- 16 [illegible]

## గేయములు

అహింసాపుష్పము—యన్. వరదదాస్
గ్రామఫోను ఇమిటేషన్ పాటలు—ఏ. గురుమూర్తి ఆచార్యులు
తారకామృతసారము—జి. నారాయణదాస్
గ్రామఫోన్ కామిక్కు పాటలు—(ప్ర) వి. శ్రీనివాసరావు, అనకాపల్లి
గ్రామఫోనుపాటలు—(ప్ర) ఆర్. రామరావు, విశాఖపట్టణము
నూతన గ్రామఫోను కీర్తనలు—(ప్ర) సి. రాజయ్య, కడప
నూతన గ్రామఫోనుపాటలు, భా. ౧—(ప్ర) జి. కలికిమూర్తి, రామచంద్రపురము
పాండురంగ భజనకీర్తనలు—డి. సీతారామమ్మ, జి. వెంకటసుబ్బమ్మ
దసరాగేయములు—ఏ. సీతారామయ్య
పాగల్ మురళి—(ప్ర) పి. ఆర్. దాసు
ప్రపంచ నిష్ప్రపంచానుభవ కందార్థసంగ్రహము—డి. సుబ్రహ్మణ్యాచార్యులు
మనశ్చిద్విలాసచరిత్రము—కె. రామదాస్
వేణుగోపాల పంచరత్నములు—కె. నరసింహరాజు
లక్ష్మీ పద్మావతుల చపతుల కొట్లాట—యం. హరిభూషణం
శ్రీజ్ఞానబోధిని—యల్. ఉక్కప్పరావు
శ్రీ కుసుమహారస్తోత్రరత్నావళి—యన్. శేషమ్మ
శ్రీ గురుసిద్ధారామచరిత్రసంగ్రహము—యం. పి. బసవాచారి
శ్రీ ద్రౌపదీదేవిమాహాత్మ్యము—ఏ. నరసింహదాసు
శ్రీ పద్మావతి వేంకటేశ్వర మేలుకొలుపులు—(ప్ర) యం. వి. రుద్రయ్యనాయుడు, తిరుపతి
శ్రీ పాండురంగ బృందావన సంకీర్తనములు—(ప్ర) కె. సీతారామయ్య, కడప
శ్రీమద్రామాయణ హరిభజనకీర్తనలు—సి. పోలయ్య
శ్రీ రామనామసంకీర్తనము—(ప్ర) శ్రీ రామకృష్ణ పూజామందిరము, గుంటూరు
శ్రీహరమురళి—(ప్ర) టి. ఆర్. దాస్, కాకినాడ
శ్రీ హరినామసంకీర్తనలు—శ్రీ శృంగారం సీతారామాచార్యులు
సౌగంధికప్రసూనహరణము—టి. పురుషోత్తం

## చరిత్ర

ఆరంభ హిందూదేశచరిత్రము, బుక్ ౨, 3 — యం. వెంకటరంగయ్య
హిందూదేశచరిత్ర—డి. అప్పారావు. ఆర్. సూర్యనారాయణ
హిందూదేశచరిత్రము—(ప్ర) టి. వి. చల్లప్పశాస్త్రి

## జీవితములు

అక్బరుసార్వభౌముడు—వి. సత్యనారాయణ
అమెరికా మహాపురుషత్రయము—వి. వెంకట కృష్ణశర్మ
ఆత్మచరిత్రము—ఆర్. వెంకటశివుడు
దేశభక్తుడు—కె. యస్. వెంకటరమణి
పూజనీయుడైన బిన్— (ప్ర) చర్చి బుక్ రూమ్, బెజవాడ
మార్టిన్ లూథర్—(రెవ్.) యస్. యస్. సుబ్బయ్య
మొహమ్మద్ గారి జీవితచరిత్రము — పి. లక్ష్మీనారాయణ
శ్రీమతి ఫ్లారెన్సు నైటింగేల్‌మ్మ—(ప్ర) చర్చి బుక్ రూమ్, బెజవాడ
శ్రీరామకృష్ణ వివేకానందులు—యం. వి. యల్. నరసింహరావు
శ్రీ వివేకానందస్వామి జీవితము, భా. ౧, ౨—బి. వెంకటేశ్వరులు

## జ్యోతిషశాస్త్రము

జ్యోతిషసర్వస్వము—టి. వెంకట సూర్యనారాయణ

## దండకములు

ఆంజనేయదండకము—వెంకటరాజేశ్వరరావు
రామదండకము—(ప్ర)పి. వి. మునియ్య, ఏలూరు

శ్యామలాదండకము—(ప్ర) పి. వి. మునియ్యా, ఏలూరు

## నవలలు

కళావతి—యం. వెంకటరాఘవాచార్యులు
కాంచనమాల—వంగూరి సుబ్బరావు
చంద్రగుప్తుడు—భోగరాజు నారాయణమూర్తి
చోరనాయకుడు—జి. వెంకటేశ్వరరావు
పంజాబు మెయిలు—డి. వెంకటసుబ్బరావు
పూజాపుష్పమంజరి—బి. వెంకటరావు
మాధవాశ్రమము—జి. సుబ్రహ్మణ్యశర్మ
సారంగధరవిజయము—సి. వెంకటకృష్ణశర్మ

## నాటకములు

కపటవేశధర్మపట్టాభిషేకము—పి. నేమూనాగవరావు
ఖిల్జీరాజ్యపతనము—సి. వి. సుబ్బరావు
గయోపాఖ్యానము—జె. వెంకటరామరాజు
గిరికాపరిణయము—కె. వెంకటహనుమయ్య
నందనారుచరితము—వి. వెంకటకృష్ణయ్య
భాగవతావతరణము—యన్. నరసింహశాస్త్రి
ముగ్ధప్రణయము—(అను) కె. లక్ష్మీనరసింహరావు
రుక్మాంగదనాటకము—బి. భగవంతరావు
శృంగారచంద్రహాసీయము—యం. సుబ్రహ్మశర్మ
శ్రీరామాయణము—వెంకటరమణకవి
శ్రీరామసామ్రాజ్యపాదుక—టి. అమరయ్య
సాత్రాజితీ గర్వభంగము—వై. వెంకటసుబ్బయ్య చౌదరి

## నీతి

నీతికథావళి—వి. వెంకటేశ్వరరావు
నీతి కథారత్నావళి—లక్ష్మణస్వామిదాసరి
నీతిమంజరి—ఇ. వెంకటనరసయ్య
బాలవినోదిని, బుక్ ౧, ౨—పి. రాములురెడ్డి
సదుపదేశము, భా. ౨—జి. శ్రీరామశాస్త్రి
సుజ్ఞానబోధిని—పి. శ్రీరాములురెడ్డి

## పరిశిష్టము

అడవిపువ్వులు—యం. గురునాథ
అన్నపూర్ణాదేవిలేఖలు—(ప్ర) బాపినీడు, ఏలూరు
అన్నసత్రప్రతిష్ఠ—(ప్ర) సి. లక్ష్మీనృసింహశాస్త్రి, మచిలీపట్టణము
అష్టాదశమహాపాపియగు బ్రాహ్మణునితో సాహాయ్య నిరాకరణమొనర్పుము—కె. రాఘవచంద్రయ్య సచ్ఛాస్త్రి
ఆత్మజ్యోతి—(అను) యం. విశ్వనాథం
ఆర్యక్షేత్ర యువజన మహాసభ—(ప్ర) యం. రామచంద్రరావు, ఏలూరు
ఇంద్ర నారద సంవాదపుస్తక—పి. రంగరాజు
ఇంద్రియనిగ్రహత్వము—యం. కె. గాంధి
ఉస్మానియా తెలుగువాచకము, తరగతి ౧—ఆర్. సుబ్బరావు
ఎలిమెంటరీ ఉపాధ్యాయబోధిని—కె. సుబ్రహ్మణ్య

కాకినాడ డిస్ట్రిక్టుకోర్టులో తిరుపతి శ్రీ వెంకటేశ్వరులు సాక్షిచెప్పిన అద్భుతచరిత్రము—(ప్ర) యం. వి. రుద్రయ్యనాయుడు, తిరుపతి
కావ్యకథామంజరి, భా. ౧, ౨—(ప్ర) యన్. వీరరాజుపంతులు, పిఠాపురము
కుసుమాంజలి—(ప్ర) పి. వెంకటసుబ్రహ్మణ్యశర్మ, కావలి
కొండాలి వేంకటసుబ్బరాయస్మృతి—(ప్ర) కె. శివరామకృష్ణరావు, మద్రాసు
గద్యపద్యసంగ్రహము—(ప్ర) ఆర్. వెంకటేశ్వర్ అండ్ కో., మదరాసు
గురుదత్త సరస్వతీయము—యం. దక్షిణామూర్తి
గ్రామమునసబుల పరీక్షాప్రశ్నలు, భా. ౧, ౨—బి. లక్ష్మీనరసింహం
చాటువులు—డి. గోపాలకృష్ణయ్య
తెలుగుసామెతలు—(ప్ర) లిటరేచర్ కమిటీ, ఆంధ్ర ఎవాంజిలికల్ లూథరన్ చర్చి, గుంటూరు

దస్తావేజుల మతలబులు—యం. శ్రీరామమూర్తి

నవరత్నములు—ఏ. సూర్యనారాయణరాజు

నియమములు, నిబంధనలు—(ప్ర) గంజాం హ్యూమెని టేరియన్ లీగ్, సోంపేట

నిరుద్ధభారతము—యం. వేంకటశర్మ

నూతనపద్ధతి ఆంధ్రవాచకము, బుక్ ౩,౪,౫—ఏ. వి. నరసింహంపంతులు, కె. దక్షిణామూర్తినాయుడు

పద్యగద్యమంజరి, భా. ౧, ౨, ౩—(ప్ర) యస్. వీర రాజు పంతులు

ప్రథమవార్షికనివేదిక—(ప్ర). గంజాం హ్యూమెనిటేరి యన్ లీగ్, సోంపేట

ప్రాథమికగణితము, తరగతి, ౪—కె. సుందరరామయ్య, కె. వెంకటసుబ్బారావు

బాలికావాచకము—పి. రామకోటయ్య

భక్తబృందావనము—యం. వెంకటశర్మ

భారతీయ బాలికాభటకోద్యమము—(ప్ర) గరల్ గైడ్ అసోసియేషన్, మదరాసు

మణిమంజూష, భా. ౧—(ప్ర) ఇ. యం. గోపాల కృష్ణకోన్, మధుర, మద్రాసు

మహర్నవమి పద్యములు—(ప్ర) శ్రీ సత్యనారాయణ బుక్ డిపో, రాజమహేంద్రవరము

యతీంద్ర తత్వమంజరి—కె. యజ్ఞకవి

యూనియనులు—కె. లక్ష్మీనారాయణ

లక్ష్మీజగన్నాథసంవాదము—ఆర్. సింగరాచార్యులు

లక్ష్మీవాచకము, సెం. ౪, ౫—భ. నారాయణమూర్తి

లోకజ్ఞానపాఠములు, బుక్ ౧, ౨, ౩—సి. సత్యనారా యణమూర్తి, యం. రాధాకృష్ణమూర్తి

వాచకపారిజాతము, భా. ౧,౨—(ప్ర) ఆంధ్రబుక్ డిపో, గుంటూరు

విజయరామాయణము దసరాపద్యములు—వి. లక్ష్మీ నారాయణశాస్త్రి

విజ్ఞానవాచకము, తరగతులు ౫—ఏ. శంకరరావు, డి. సోమలింగాచార్యులు, బి. సుబ్బరాయుడు

శతకపద్యమంజరి, తరగతులు ౨, ౬—(ప్ర) యస్. వీరరాజుపంతులు, పిఠాపురము

శృంగారపద్యములు—(ప్ర) కె. సీతారామయ్య, కడప

శ్రీకృష్ణాపుష్కరము—కె. ప్రభాకరశాస్త్రి

శ్రీ కోనేటిరాయవింశతిక—బి. కృష్ణప్పనాయన

శ్రీ వెంకటేశ్వరప్రార్థన—(ప్ర) యం. వి. రుద్రయ్య నాయుడు, తిరుపతి

సుగ్రీవపట్టాభిషేకము—వి. సత్యనారాయణమూర్తి

స్త్రీధర్మము—వెంకటనాంచారయ్య

హరిజనమొర—యం. నరసింహం

## పారిశ్రామికము

సుగంధపరిశ్రమ—సి. వి. యం. ఆర్. మూర్తి

## ప్రకృతిశాస్త్రము

ప్రకృతిశాస్త్రపాఠములు, భా. ౩—జి. వెంకట రామయ్య, బి. సుబ్రహ్మణ్యవత్

బాలవిజ్ఞానశాస్త్రము, వాల్యూము, ౨, భా. ౧— కె. వీరభద్రయ్య.

## ప్రబంధము

పారిజాతాపహరణము—తిమ్మనార్యకవి

## భూగోళశాస్త్రము

చంద్రగిరితాలూకా భూగోళశాస్త్రము—పి. కె. నా రాయణయ్యంగార్

చిత్తూరుజిల్లా భూగోళశాస్త్రము—పి. కె. నారాయణ అయ్యంగార్

ప్రపంచభూగోళము, భా. ౧, ౨—సి. వీరభద్రరావు

భూగోళవర్ణనము—యస్. వెంకట్రామన్, యం. కె. సుందరవరదాచార్యులు

భూగోళశాస్త్రము—ఫ. రాఘవేంద్రరావు, ఏ. ఫణీం ద్రుడు

## మతము—హిందు

అత్మారాములవారి దేవాలయచరిత్ర—యం. హనుమంతు

ఈశ్వరోపాసనవిధి—(ప్ర) ఆర్యసమాజము, మదరాసు.

కణ్వగురుహాజసనేయ యాజ్ఞవల్క్య చరిత్రము — భ. లక్ష్మీపతిశాస్త్రి

కర్మవిపాకము — (ప్ర) వి. త్యాగరాయ శాస్త్రులు అండ్ సన్, మదరాసు
చికాగో ఉపన్యాసములు—వివేకానందస్వామి
జగన్మాత—అరవిందగోష్
సంధ్యావందన క్రియా ప్రయోగము—(ప్ర)జి. వీరబ్రహ్మాచారి, దువ్వూరు
స్త్రీపునర్వివాహము శాస్త్రసమ్మతము—(ప) ఎ. సుబ్బరావు సప్త, బెజవాడ

—ఇతరములు

అధ్యక్షోపన్యాసము — (ప్ర) రెవ్. చ. అలన్, నెల్లూరు
క్రీస్తుసంఘాధికర్మములకై, ధ్యానములు, విజ్ఞాపనములు—(రెవ్) జయరాజ్, డి. సొ. సి.
క్రైస్తవ భజనకీర్తనలు—యస్. సుబ్రహ్మణ్యం
చిన్న జ్ఞానోపదేశ సంక్షేపము— యం. (రెవ్ రెండ్) ఇగ్నాటిస్
జనానా, హాస్పిటల్ సీరీస్ నెం. ౧-౪౦—అవం ఇ. చ. జి. డి. యం.
తప్పిపోయినకుమారుడు—(ప్ర)లిటరేచర్ కమిటి,ఆంధ్ర ఎవాంజెలికల్ లూథరన్ కమిటి, గుంటూరు
ద్విజన్మము—(ప్ర) లిటరేచర్ కమిటి, ఆంధ్రఎవాంజెలికల్ లూథరన్ చర్చ్, గుంటూరు
నాయకవిజయము—జె. శామ్యూల్
నూతన సువార్తలమీద ప్రసంగకల్పనవివరములు—ఆర్. సి. హెచ్. లెన్స్కి
నెల్లూరు మేత్రాసనపు దేవమాతసభ పుస్తకము—యం. (రెవ్) ఇగ్నాటిస్
పరమవైద్యుడు—(ప్ర) లిటరేచర్ కమిటి, ఆంధ్రఎవాంజెలికల్ లూథరన్ చర్చ్, గుంటూరు
ఫ్రాన్సిస్ మహాముని—(ప్ర) చర్చ్ బుక్ రూం, బెజవాడ
ప్రేమస్వరూపియగు భగవంతుడు—(ప్ర) లిటరేచర్ కమిటి, ఆంధ్ర ఎవాంజెలికల్ లూథరన్ చర్చ్, గుంటూరు.
బిడ్డ, మతము—(రెవ్) ఐ. పి. మహమ్మద్.
బైబిలువాచకము, తరగతులు ౪, ౫—(ప్ర) ఆంధ్ర ఎవాంజెలికల్ లూథరన్ చర్చ్, గుంటూరు
బైబిలువాచకబోధిని—యస్. భూషణం
భజనకీర్తనలు—(రెవరెండ్) కె. రాజరత్నము
మంచిసమరయ్యుడు—(ప్ర) లిటరేచర్ కమిటి—ఆంధ్ర ఎవాంజెలికల్ లూథరన్ చర్చ్, గుంటూరు
మోక్షమార్గము—(ప్ర) లిటరేచర్ కమిటి, ఆంధ్రఎవాంజెలికల్ లూథరన్ చర్చ్, గుంటూరు
రాజు-ప్రజలు—(ప్ర) లిటరేచర్ కమిటి, ఆంధ్రఎవాంజెలికల్ లూథరన్ చర్చ్, గుంటూరు

మాహాత్మ్యములు

కాళహస్తిమహాత్మ్యము — (ప్ర) యల్. రామయ్యనాయుడు, కాళహస్తి
కృష్ణాపుష్కరమహాత్మ్యము — (ప్ర) రమేశ్ అండ్ కో., మదరాస్
శ్రీకృష్ణానదీపుష్కర మహాత్మ్యము — యం. మల్లికార్జునరావు
శ్రీకృష్ణాపుష్కరమహిమాకథావళి — యం. అచ్యుతరామశాస్త్రి
శ్రీవేంకటేశ్వరమహాత్మ్యము—(ప్ర) యం. వి. రుద్రయ్య నాయుడు, తిరుపతి
శ్రీవేంకటేశాష్టోత్తర శతనామప్రభావము — కుబ్బారభూతి

మీమాంసశాస్త్రము

ఆంధ్రమీమాంసాన్యాయముక్తావళి — కె. గోపాలకృష్ణమ్మ

యోగశాస్త్రము

యోగదర్శిని— అరవిందగోష్
యోగసంకలనము, వాల్యూం ౨, భా. ౧—(ప్ర) డి. గోపాలకృష్ణరావు, కాకినాడ
యోగసాధన—అరవిందగోష్

## రాజకీయము

అధినివేశస్వరాజ్యము—డి. వెంకటశివరావు, సీ. వెంకటప్పయ్య
ఆంగ్ల రాజ్యాంగము—డి. వెంకటశివరావు
తురుష్క ప్రజాస్వామికము—ఏ. కాళేశ్వరరావు
నానాదేశరాజ్యాంగనిర్మాణములు—కె. చంద్రమౌళి
మానవస్వత్వములు—(అను) వి. గోపాలకృష్ణమూర్తి
స్థానికకూటములు—టి. శివశంకరం

## వాస్తుశాస్త్రము

వాస్తుగణితబోధిని—బి. రామలింగశాస్త్రి
వాస్తుపూజావిధానము—(ప్ర) బి. లక్ష్మయ్య, పాలకొల్లు

## విమర్శనము

ఆంధ్రభారతకవితావిమర్శనము—కె. రామకృష్ణయ్య

## వేదాంత శాస్త్రము

అద్వైతానుభూతి—(ప్ర) బి. రాఘవేంద్రరావు, కమలాపురము
ఆత్మయోజుకావిలాసము—శ్రీరామపుత్రి
ఉపదేశవాక్యరత్నావళి—గంగేశ్వరానందస్వామి
కైవల్య-ఆత్మ-శారీరకోపనిషత్తులు—జి. వీరరాఘవులు
గీతామృతము—యం. వెంకటరత్నము
దీపముచూపండి—ప్రణవానంద
ధ్యానము—యస్.
పరిపూర్ణసుధానిధి—వి. రామకృష్ణదాస్
మాహేశ్వరసూత్రాణి—(ప్ర) కే. నాగేశ్వరరావు, మద్రాసు
మోక్షసామ్రాజ్యము—సింహాద్రి విశ్వనాథ అవధూతస్వామి
మోక్షసాధని—(ప్ర) శ్రీరామకృష్ణపూజామందిరము, గుంటూరు

## వైద్యశాస్త్రము

అనుభవవైద్యచింతామణి—వై. శ్రీరాములుచౌదరి
సర్వవైద్యవిజ్ఞానము, భా. ౧, ౨—ఎ. కె. సోమయాజులు

## వ్యాకరణశాస్త్రము

త్రిలింగలక్షణము, బుక్. ౧, ౨—డి. యజ్ఞన్న
పరిమితవ్యాకరణము, భా. ౨—ఘం. వెంకటకృష్ణశాస్త్రి

## శతకములు

కుమారశతకము — యం. యస్. శర్మ అండ్ కో., గుంటూరు, తెనాలి
తాడిమళ్ల రాజగోపాలశతకము—యస్. వి. గోపాల్ అండ్ కో., మదరాస్
రాఘవశతకము—కె. వెంకటసుబ్రహ్మణ్యం
రామభద్రశతకము—బి. సింహాసనలంపట్నాయక్
వేణుగోపాలశతకము—(ప్ర) యస్. వి. గోపాల్ అండుకో., మదరాస్
శ్రీకేశవశతకము—కె. వెంకటసుబ్రహ్మణ్యం
శ్రీమల్లికేశ్వరశతకము—టి. వేంకటసుబ్రహ్మణ్యశర్మ
శ్రీవేంకటేశ్వరశతకము—నరసింహదాస్
శ్రీసిద్ధేశ్వరశతకము—జి. కోటయ్య

## స్తోత్రములు

శ్రీకృష్ణనామసంకీర్తనము—(ప్ర) శ్రీరామకృష్ణపూజామందిరము, గుంటూరు
శ్రీభూమీశస్తవరాజము—కే. శేషయ్య
శ్రీరాజరాజేశ్వరీ రామలింగతారావళి—వి. నాగేశ్వరరావు
శ్రీరామకృష్ణపరమహంస సంకీర్తనము—యం. వెంకటరత్నం
శ్రీరామనామసుధాలహరి—(ప్ర). పి. వి. మునియ్య, ఏలూరు

## హరికథలు

జాంబవతీకల్యాణహరికథాకాలక్షేపము—శ్రీరామపుత్రి

## ఉండవల్లి గుహాలు



—డి. సత్యవాని

# నవాలోకము

మల్లవరపు విశ్వేశ్వరరావు

లోకమ్ములో నవా
లోకమ్ముదయమయ్యె!
శోకమ్ముడిగిపాడు
మోకవీ; ఓకవీ!

రాకాసుధాకరా
లోకోదయమ్మయ్యె!
చీకుచింతల మాను
మోకవీ! ఓకవీ!

*

కరిమొగిలుచాయలే
దరినితేలనిరేయి
భరమైన బ్రతుకైన
కరగిపాఱెను రేయి

తెరచుకోనీ తలుపు!
అరసిరానీ పిలుపు!
విరియనీ నీవలపు!
ఓకవీ! ఓకవీ!

*

చుక్కలన్నీ గోట
నొక్కమూరే మీట
దిక్కుదిక్కుల వీణ
చొక్కమ్రోగిన రేయి

వెక్కిఏడ్తు వదేల?—
ధిక్కరింపుము శోక
కర్కశా వేదనల
నోకవీ! ఓకవీ!—

పాలవెల్లి తరంగ
డోల రిక్కలమీలు
తేలియాడుచు నింగి
మేలమాడెడు రేయి

కేళికాభావనా
జాలమ్ము బర్వ నీ
వేలయానందింప
వోకవీ! ఓకవీ!

*

నిండుపున్నమిరేయి
పండువెన్నెలపూచె!
కొంకకోనల కాంతి
మొండమ్యె! మెండమ్యె!

ఉండనీ నిట్టూర్పు—
బెండువాఱిన బ్రతుకు
నిండిపోనీ వెలుగు!
ఓకవీ! ఓకవీ!

*

విశ్వగానాలాప
విస్వత వ్యాపింపు!
విశ్వదీపాలోక
రశ్మి సందర్శింపు!

నిశ్వాస నిర్ఘోష
[illegible]—
విశ్వదానందమూ
ర్తి! కవీ! ఓకవీ!



వృషసవము

(శ్రీ కాశీనాథరావుగారి తంజాపుర ప్రాచీనచిత్రసంగ్రహమునుండి)

# ఆంధ్రవాచస్పత్యము

'కుమారదేవ'

ఆంధ్రవాచస్పత్యమును "ఆంధ్రులను ధన్యుల గావింప"ను, ఇంతవఱకున్న నిఘంటువుల యందలి "లోపముందీర్చుటకు"ను ఆంధ్రవిద్యావాచస్పతీత్యాద్యనేకబిరుదాంకితులు బ్ర. శ్రీ. కోట్రిశ్యామల కామశాస్త్రిగారు రచియింపఁబూనిరి.

నేను నిరుడు ఆగస్టుమాసమున నీగ్రంథకర్తగారి "ఉభయభాషావాచస్పత్యము" అనుపేరఁ బ్రచురింపఁబడనున్న నిఘంటువులోని మచ్చుపొరటలపత్త్రమును చూడఁగల్గితిని. దానిని చూచినంతనే ఆంధ్రభాషామతల్లికి ఇట్టిమహాసేవ అపూర్వమనుకొని మురిసితిని.

నేఁటివఱకు ఆంధ్రసాహిత్యపరిషత్తువారు చిరకాలమునుండి రచియింపించుచున్న సూర్యరాయాంధ్ర నిఘంటువునకు సూర్యరశ్మి సోకలేదు; వావిళ్లవారి నిఘంటువు మచ్చుపొరటలనుండి వర్ధనము గాంచలేదు; శబ్దరత్నాకరము సమస్తాంధ్రశబ్దముల సాధింపలేదు; శబ్దార్థచంద్రిక పండితహస్తముల కెక్కి నిక్కలేదు. తెనుఁగువారికి ప్రభుత్వకృపారసమున "తమిళలెక్సికాన్" వంటిది చేయించుకొనుటకు భాగ్యమబ్బలేదు. 'కల్పద్రుమము 'వంటిదో, 'వాచస్పత్యము' వంటిదో మనకు లభించునాయని మొగము వాచియుండునప్పు డీట్టినిఘంటువు సృష్టింపఁబడుట యనఁగా ఆఁకలివేళ కన్నము వంటిది యనుకొంటిని.

ఇంతలో పత్త్రికలన్నియు నోరుక్కుమ్మడి మెచ్చుకొనుచు పండితప్రకాండులచే మెప్పువడయుచున్న "శ్రీ శ్యామలకామశాస్త్రీయము, ఆంధ్రవాచస్పత్యము" మొదటి 3 భాగములను ఒకచోట చూడఁగల్గితిని. శాస్త్రులవారు ఉభయభాషావాచస్పత్యమును, ఆంధ్రవాచస్పత్యమును రెండు వేర్వేఱుగ్రంథములుగా ప్రకటించిరా, లేక 'ఉభయము' గాక కేవలము ఆంధ్రవాచస్పత్యమా అని చూడఁగా నిది బహుభాషావాచస్పత్యముగా కనుపడినది. 'అధికస్య అధికం ఫలమ్' అనుకొంటిని. ఉభయభాషావాచస్పత్య మనియుండిన తత్కోశమునందలి ఆంధ్రభాషానుపయోగములగు సంస్కృతధాతువులకు, అవ్యయములకుఁ బ్రయోజన ముండియుండును. "బహుభాషావాచస్పత్య" మనియుండిన ఆంగ్ల ద్రావిడ కర్ణాట మహారాష్ట్ర) హిందూస్థానీపదముల ప్రవేశమునకు సాఫల్య ముండియుండును. ఆంధ్రవాచస్పత్యమని పేరిడి ఆంధ్రభాష కనుపయోగకరములగు పదములఁ జేర్చుటవలన నితరప్రయోజనము మృగ్యమయినను గ్రంథముమాత్రము విపరీతముగ బలియఁగలదు.

నిఘంటువనఁగా (Lictionary) వాఙ్మయము నందలి పదములను, వానిఅర్థములను నిర్ణయించుగ్రంథము. వివిధవిషయవిజ్ఞానమును వివరించుగ్రంథము విజ్ఞానసర్వస్వము (Encyclopedia) అనఁబడును. ఈ వాచస్పత్య మున్నరూపమున నీరెంటిలో నేదియు కాకున్నది. ఇదివఱకున్న నిఘంటువుల లేని వేలకొలఁదిపదములలో కొన్నియైన నిందు లేకపోవుటయేకాక వానిలోనున్న పదములే అనేకము లిందు లేవు. విజ్ఞానసర్వస్వమున చేరవలసిన విషయము లిందులేని వసంఖ్యములు. ఇది 'మసిపూసి చేసిన మారేడుకాయ'. అదియు తత్కర్తయసమర్థతనే ప్రకటించుచున్నది.

నిఘంటువులు ప్రామాణికములుగ నుండవలెను. ఈనిఘంటువున శబ్దార్థనిర్ణయమున దొరలిన 'ప్రామాదికము' లిన్నియు నన్నియుకావు. పారిభాషికపదము లను పేర సమస్తపదము లెంతపెద్దవయినను, తుదకు వాక్యములు కూడ నిందుచేర్పఁబడినవి. వందలకొలఁది అనావశ్యక పదములు కూర్పఁబడినవి. అత్యావశ్యకములగు పదములు వదలివేయఁబడినవి. తత్సమశబ్దముల స్వీకరించుపట్ల సంస్కృతపదముల కొన్నిటి 'ప్రాతిపదికము'లు తారుమారయినవి. లింగ, వచన, విభక్తివివరములు తప్పుత్రోవబట్టినవి.

ఇందు సంజ్ఞావివరణములు "అం" అనుసంజ్ఞతో వ్రాయఁబడినవి కలవు. వానివివరణములు వివరింపలేదు. "కాలా" అని గ్రంథసంకేతము గ్రుచ్చిపెట్టిన చోట్లనేకము లున్నవి. కాని ఆగ్రంథరాజ మేదియో గ్రంథసంకేతపట్టికయం దగుపడదు. అట్టిచో ఏశాస్త్రమునకు సంబంధించినదో విద్యార్థులకుఁ దెలియు టెట్లు?

ఈవిషయములను ప్రాజ్ఞులతో యుక్తముఁ దెచ్చుట కయి గ్రంథమునుండి కతిపయశబ్దముల యర్థవివరణాదు లీక్రింద దిఙ్మాత్రముగ నుద్ధరింపఁబడినవి:

అఁట—(3. అచ్చట) అట పదము ఈ అర్థమున సబిందుకము కాదు; అచ్చట అనుదానికి సంగ్రహరూపము. పాప మీగ్రంథకర్త తనతప్పును ఆంధ్రకవితాపితామహుని కంటగట్టె "అఁటఁజనిగాంచె...". అను పద్యము నుద్ధరించినాఁడు.

అంసపాది—(వై. వి. హంసపాది). తెనుఁగున సిరములకుముందు బిందువులేదు. అంచపాది గాని అంసపాది కాదు.

అక్కృతి—(ఛందస్సు లియువదియాఱింటిలో నొకటి) ఆకృతిగాని అక్కృతికాదు. లక్షణము, వివరణము ఇన్నవఛందస్సనియు చెప్పవలయును.

అడ్డెడు—(దే. విణ. రెండుమానికెల సరుకు) నిర్బిందుకముకాదు. ఇట్లే ఎన్నిపదములనైన సృష్టింపవచ్చును.

అనసూయ—(౧ అసూయ కోపము) ఇది లోకవిరుద్ధమయిన అర్థము. అనర్థదాయకము. (అత్రిమహర్షి భార్య) అట్లయిన శకుంతలచెలికత్తె అనసూయ అని పేరుగల దొక్కటి ఉన్నదే!

అంత్యతీర్థ్యానము, అభిముఖచేరిక, బహువిధచేరిక—ఈసమాసములు దుష్టములు. ఇట్టివెన్నో.

అర్థిశబ్దమునకు తరువాత—"అర్ధకంధర" మున్నగుపదము లించుమించుగ నన్నియు ధ థ ల భేదము లేక వ్రాయఁబడియున్నవి. వీనినన్నిటిని చూపఁదలంచిన గ్రంథము పెరుగును.

అవ్యయీభావము—(ఇది సంస్కృతమునందే యున్నది.) పెడతల, క్రిఁగన్ను లోనగునవి ఏసమాసములు?

అశ్రుపాతార్తి అశ్రుపాతావర్త మని యుండవలెను.

అశ్వధృవస్థానములు—ఇందలి ధకారమునకుగూడ కొమ్ము క్రారవడియు నుండవలెను.

అష్టదళపద్మబంధము—రెండుపద్యములు కలవు. వివరణము శూన్యము.

అష్టరసనీసమాలిక—వివరణ, ఉదాహరణములు లేవు.

ఆసన్నవింశ—(సం. వి. ఇ. స్త్రీ. ఇరువది వస్తువులు). ఇది ఇరువదివస్తువులు కాను. ఇంచుమించు ఇరువది. ౧౯ లేక ౨౧ అగును. మఱియు నిది ఇకారాంతము కాదు. అకారాంతము.

అక్రమము—(౧. క్రమముతప్పుట, ౨. క్రమము తప్పినది......) రెండర్థములు నొక్కటియే.

అక్షము—(ర. ఇరుసుయందుండు కందెన) సంధిదోషము.

అటె—(ఇదిమనకు ౧-౬......) నకారపొల్లు బంతిమొదట నిలిచినది.

ఇట్లె 101 పుటయందు(......గలఁబ్రత్యయము) అని వ్రాయఁబడియున్నది. ఈసరళాదేశము వీరి వ్యాకరణ పాండిత్యమును స్పష్టపఱచుచున్నది.

అతిగోమశము. (మేఁక. చూ. మేషము' ఆఁడుమేఁక. (మేషము.)

మేషమనఁగా పొట్టేలు, మేఁకయని "పెద్దబాలశిక్ష"జ్ఞానమును స్మరించియున్నారు.

ఆంధ్రమండలము—(...తెలుఁగు మాటలాడు జనుల స్వస్థానమునకే ఆంధ్రదేశమని పేరు. దీనిని త్రిలింగములు, త్రినగములు అనియందురు.) ఆంధ్రదేశమును త్రిలింగములు త్రినగములందురా? త్రిలింగము, త్రినగము అనియుండవలెను.

ఆముక్తమాల్యద. (ప్రా. శ్రీకృష్ణదేవరాయలు రచించిన యాముక్తమాల్యదను పెద్దనార్యుఁడు రచించి నట్లు వాదప్రతివాదములు కలవు; రాజరాజనరేంద్ర పట్టాభిషేకసంచిక. ౧౭౭ పుట) ఇది ఆముక్తమాల్యద కర్థమా, వివరణమా?

ఆమరి—(సం. వి. ఈ. స్త్రీ. ఆమరియను ఆఁడుది చూ. స్త్రీ.) ఆమరియనువాఁడుది యనఁగానేమి?

ఆనందభైరవి—ఆనందభైరవి మాత్రలు చేయు పద్ధతి వివరింపఁబడినది. ఒకరాగము పేరుసూచకదా? దాని పేరెత్తలేదెందులకు? సంగీతశాస్త్రమును పడవు వారిదేలముఱచిరి?

అవతారిక—(సం. వి. ఆ. స్త్రీ. అనుక్రమణిక. చూ. విషయసూచిక.) అవతారికకును, అనుక్రమణికకును, విషయసూచికకును భేదములేదా?

అవాంత్రము—ఇది దేశ్యవైకృతమిశ్ర మెట్ల య్యెను?

అర్ధాశ—కుచిక్కృతి అడియాసయా?

అడియాస—(గురాశ) అడియన వ్యర్థమని అర్థ మయిన కలుగునను ఆస దురాశ యగునా?

అపనీతములు—(పా. ఇవి వాతాపనీతములు జలాపనీతములు అని ద్వివిధము.) అపనీతములన నేమో, తెలిసినమీఁదఁగదా వాని భేదము తెలియుట?

అంకించు—(క దొంగిలించు) నాఁచికొను, హరించు అర్థము వ్రాయఁబడవలెను. పీఠిచ్చిన లక్ష్యము నకు దొంగిలించు అనుట యుక్తముకాదు.

అంగనము—(౩) (అంగణము) అరాణము కాఁ బోలును!

అంగప్రాణములు — అం..............ఽ అర్థ ములు.) ఇవి ఏశాస్త్రమునందలి పరిభాషాపదములు?

అంతగొట్టు—(జాగుచేయు) గనిమచెక్కు అను నర్థము వ్రాయఁబడలేదు.

అంతరకల్లటి—(ఒక రకము పావురము) సేల కాలూనక వేయుపల్లటీ అనునర్థము వ్రాయఁబడలేదు.

అందాజుపట్టి—(ప్రా. మదింపులెక్క) అం దాజుపట్టె అని యుండవోపు.

అంకితము—(గుఱుతింపఁబడినది) యాథ్యర్థము గూడ నిచ్చియుండవలెను.

అగ్నిచిత్తు—(అగ్నిచయనము చేసినవాఁడు) అగ్నిచయనమన నేమో తెలియదు. ఆపద ముద్ధరింపఁబడ లేదు.

అచలజిహ్వా—(అం. శబ్దాలంకారములలో నొ క్కటి.) వివరణమును, ఉదాహరణమును, నిచ్చియుండ వలెను.

అచ్చర—(దేవతాస్త్రీ) దేవవేశ్య అపవలెను.

అచ్చముగ—(సంశయములేకుండఁగ) అచ్చము అను పద మున్నపుడు అచ్చముగ అనుపద మెందులకు?

అచ్చుకోలు—పా. క్రొత్తభూస్వామికి రైతు అచ్చుకొనుట) "దీనిభావమేమి తిరుమలేశ?"

అడఁగుబొద్దు—(గోడపునాదిపై యిటునటుదారి గోడల నణఁగియుండునట్టు గోడయంచులయందు గీటి యేర్పఱచెడు బొద్దు; చూడు మొలత్రాడు) ఎంత పెద్దవివరణము! భావముమాత్ర మస్పష్టము.

అతర్క్యము—(దే. వి. (?) అగోచరమైనది, తెలిసికొనశక్యముకానిది) ఇదియా దీనిఅర్థము?

అతికృచ్ఛ్రము—(పా......చాంద్రాయణ వ్రతము) మిక్కిలి కష్టమైనదనునర్థము వ్రాయఁబడలేదు.

అతిచ్ఛత్ర—పుట్టగొడుగనునర్థము వ్రాయఁ బడలేదు.

అంచయేనుఁగు మావంతుబిడ్డ—ఇదొక వాక్య మంతటిసమాసము. అనవసరము.

అంటింపుబొళ్లు— ఓళ్లయనుచోట వివరింప వచ్చును.

అంతటితోను—ఇదొకపదమా?

అక్రమపుసేరము, అక్రమప్రవేశము, అక్రమభిత్తి ప్రవేశము—అక్రమపదముతో ఘటిసించుపదము లిట్లనే కము లుద్ధరింపఁబడుటవలనఁ గలుగు లాభమేమి?

అగ్నినష్టనివారణభీమా. ఇట్టిపదములను సేకరింప నెవరితరము?

అచతురుఁడు—ముపలను నఞ్పూర్వపదములు వేసి వేలుద్ధరింపఁబడవలసియుండును.

అగ్రేభోజమ్, అధకిమ్—ఇట్టిపదములవలన ఆంధ్ర వాఙ్మయమున కేమిలాభమో!

అటతి—(పోవుచున్నాఁడు) ఈ తిఙంతరూప ముల నెన్నింటిని వ్రాయఁగూడదు?

అతికృష్ణమచ్ఛము—(నాళలక్షణము చూ. లక్ష ణము ౧.) ఇంతమాత్రమున మూలపదమునుగూర్చి చదు వరి కేమి తెలియఁగలదు? మచ్ఛము సంస్కృతమా?

అతిదీర్ఘాతిహ్రస్వాంగలక్షణము—(విఘనా లక్ష ణము చూ. లక్షణము ౧.) లక్షణము ౧ అర్థమునందె అతికృష్ణ మచ్ఛలక్షణము, విఘనాలక్షణము రెండును చెప్పఁబడినవా?

అభిజిద్ధనిష్ఠాపంచకమందు గమననిషేధ నిర్ణ యము—పా. ఇది విచారించి ప్రయాణముచేయవలెను. కాలా. ౧౭౬ శ్లో. — ఇది పదమా? దీని జదివినవా రేమనుకొనవలెను? "కాలా" అనునది కాలామృత మనుకొందము. దానిని చదివిన ప్రయాణనిషిద్ధనక్షత్రము లెఱుఁగననుననియా?

అచలస్వరూపలక్షణము—(పా. సమస్త శుభ కార్యములయందును జూడఁదగినది. కాలా. ౧౬౯. శ్లో.) ఇది 'కాలా'లోని ౧౬౯ శ్లోకమునకు పొర్లింపు!

అధరము—దీని కాఱర్థములు వ్రాయఁబడియు న్నవి. ఆఱునుచేరి ఒక్కటే అర్థము. నైఘంటికులు వ్రాయఁదగిన అర్థములుగావు.

అనర్హత్వకారణము— (డి స్క్వాలిఫికేషన్) ఏమి వీరి ఆంగ్ల భాషాపాండిత్యము?

ఆకాశచారులు—(పా. ౧౬ పదములు) అవి దేవతలో దయ్యములో తెలియదు.

ఆపత్కాలమున రక్షించువాఁడు—ఈపద ముద్ధ రించిన తెలివి ప్రశంసనీయము.

ఆవులేనియిల్లు—(నిరర్థకము లేడింటిలో నొకటి) ఇదియు నిరర్థకమనుటలో సందియమేమి?

ఆవాలు—(అర. కడుఘూ) ఈపదము వివరించు పట్ల శాస్త్రులవారు తమద్రావిడభాషా పాండిత్యమును వెల్లవిరియఁజేసినారు. (ఘూ) అనువమున వర్గయు క్కులు లేవు. ఇట్టి వుద్ధరింపఁబూనుట పెక్కురింపఁబోయి నెల్లకిలఁబడుటయే.

అశ్వహృదయపరిజ్ఞానము—దీని వివరణమునకును దీనికిని గలసంబంధము గోరుబాష్టమికి పీర్లపండుగకుఁ గల సంబంధమువంటిది.

ఆరూఢము—(...దీనికే కోశారూఢము అనియు నాడఁబడును) ఈవాక్యమున కన్వయమెట్లు?

ఆలగోడుబాలగోడు—(దే. వి. విపరీతధ్వని) ఆల (ఆంధ్ర) గోడును బాలురగోడును అని వివరణము వ్రాయవలయును.

అబ్బ, మూఁడుభాగములలో నేనిట్లు వందలకొలఁది శబ్దములు అర్థములు వివరణములు తప్పులుదప్పులుగా నున్నవి!

ఈనిఘంటువు సచిత్రముగూడ. అవి సమంజసము లైనవని చెప్ప నెవరును సాహసింపరు. చిత్రములే వేయఁ దలంపు గలుగుచో అనేకు లెఱుఁగని వస్తుచిత్రముల చిత్రించుటుపయోగకరముగాని పిడుగునకు బియ్యమునకు నొక్కటేమంత్రమన్న ట్లొక్కబొమ్మయే పెక్కింటి కుదాహరింపఁబడుట అసహ్యకరము. అఱచేయి, అరచేయి, అర్ధచంద్రము, అనామిక, అభినయము వీని కన్నిటికి నొక్కటేబొమ్మ. అభిజుఁడు (రాహువు) అరుంధతి, అనేహస్సుఁడు (?) (శుక్రుఁడు) వీనికన్ని టికి నొక్కటేబొమ్మ. 'అమ్ములమెత్త' మెత్తకాక పోవుచుండ భీష్మునకు కల్పింపఁబడినరూపము అతి ఘోరము. ఐరావతమునకు నల్లనేనుఁగునువేసి సాల్గుదంత ములలో రెంటినూడఁగొట్టినారు. అష్టపది అనుచో వేసిన సాలెపురుగు అష్టాదళపద్మమైనది. ఇట్టివానికి లెక్క లేదు.

వీరి లోకోక్తులకు, న్యాయములకు మాతృకయైన నందిరాజు చలపతిరావుపంతులుగారి ఉపన్యాస దర్పణమును స్మరింపమి వీరిని గ్రంథచౌర్యదోషము పాలుగావించుచున్నది. ఇట్లే అభిధానములను నానివివరణములను విజ్ఞానసర్వస్వము మొదలగు గ్రంథములనుండి వీరేరుకొని గ్రంథసంకేతపట్టికయందు వానిని స్మరింపరైరి.

ఇట్టివిషయములను పరికింప మొదలిడినచో కంబళిలోని అన్నమున వెంట్రుకలేరుట వంటి పనగును. ఇందు వలన వీరికి నిఘంటువును వ్రాయుటకేపాటి యోగ్యత గలదో, ఇట్టి తప్పులకుప్ప వాచస్పత్యమువలన ఆంధ్ర వాఙ్మయమున కెట్టి ఉన్నతి కలుగగలదో పాఠకులే ఊహించుకొనగలరు. తమ కసాధ్యమైన ఇట్టిసాహసిక కార్యమునకు శాస్త్రిలుగారు పూనుకొనుట ఎఱిగియో ఎఱుగకయో అని శంకింపవలసివచ్చుచున్నది. కావున దీనితత్త్వమును ప్రకటించుట కర్తవ్యమని తలంచి యిట్లు చేసితిని.

---



ప్రతీక్ష                                                  D. P. R.

# జీవవికాసము

**కోమాండూరి శఠకోపాచార్యులు**

ఈ ఏప్రిలు భారతిలో మానవవికాసమునుగూర్చిన శ్రీ వెంకటాచలంగారి వ్యాసము మిక్కిలి మనోహరముగ, జ్ఞానదాయకముగ నున్నది. అందలి ఒకటిరెండు విషయముల గూర్చిన సంశయముల నీక్రింద వ్రాసితిని.

జడములనుండియే అనుకూలపరిస్థితులందు జీవులు కలిగెనని చాలమంది వైజ్ఞానికులు చెప్పుట నిజమే. మన ప్రాచీనులలోను అసత్తునుండి సత్తుకలిగెనని కొందఱు భావించిరి. (ఉ. అసద్వా ఇద మగ్రఆసీత్, తతో వై సదజాయత. తై. ఉ. అ. ౭). కాని అసత్తు అను జడమునుండి జీవము (సత్తు) ఎట్లు కలుగుననుప్రశ్నకు ఇంతవరకు సరియగు సమాధానము రాలేదు. ఆరంభమందును సత్పదార్థ ముండెననియు కొందరిభావము (ఉ. సదేవసోమ్యేదమగ్రఆసీత్. ఛాం. ఉ. ౬. ౨). అజీవమని పైకితోచు ప్రతివస్తువులోను లోలోన జీవశక్తి అవ్యక్తముగా ఉండునని, అది వ్యక్తమైనప్పుడు జీవ మనిపించుకొనునని మనప్రాచీనుల ముఖ్యసిద్ధాంతము. అవ్యక్తస్థితిలో అదిసత్తు అని అసత్తు అని చెప్ప వీలుండదు. (ఉ. అవ్యక్తాత్ వ్యక్తయస్సర్వా ప్రభవంత్యహరాగమే, భగవద్గీత, ౮-౧౮; నాసదాసీన్నో సదాసీత్తదానీం...ఋగ్వేదసంహిత. ౧౦ - వ మం. ౧౧-౨. నసత్తన్నాసదుచ్యతే భ. గీ. ౧౩. ౧౩).

జీవాజీవములమధ్య వైజ్ఞానికులు చేయుచుండిన విభేదము యుక్తము కాదని 'ది లివింగ్ అండ్ ది నాన్లివింగ్' మున్నగు గ్రంథములందు పరిశోధనల మూలమున శ్రీ జగదీశచంద్రవసుగారు తెల్పిరి.

జీవులు మనభూపటలప్రాంతమందే కలరను నిర్ధారణ చాలసందిగ్ధమని తోచును. మహావిశ్వ మనంతము. అందు మనసౌరకుటుంబ మణుమాత్రము. ఇతర సూర్యు లెందరో కలరు. అందలి పరిస్థితులు వాటి గ్రహముల పరిస్థితులు మనవైజ్ఞానికుల కింకను తెలియవు. అవి మనకు అర్బుదములకొలది మైళ్లదూరమందున్నవి. మన సౌరకుటుంబములోనే మన కతిసమీపగ్రహమగు అంగారకునందు జీవు లున్నది లేనిది వైజ్ఞానికులలో చాల చర్చాస్పదమై సందిగ్ధముగ నున్నది. మనప్రస్తుతపరిస్థితులున్ననే ప్రాణులుండు ననుటకును వీలు లేదు. అతిశీతలమగు ధ్రువప్రాంతమందును అత్యుష్ణమగు ఎడారులలోను సముద్రమధ్యమందును ఆయాభౌతికపరిస్థితుల కనుకూలమగు అంగవిశేషములతో జీవకోటి వ్యాపించియున్నది. భూమిపై మనప్రస్తుతయుగమునకు భిన్నమగు పూర్వయుగములందు ఇప్పుడు లేని అనేక చిత్రవిచిత్ర జీవులుండెను. ముందుయుగముల జీవులెట్లుండునో తెలియదు. అట్టిస్థితిలో గోళాంతరముల గ్రహములందు ప్రాణులున్న నిదర్శనము మనకు దొరకకుండుటకు మనజ్ఞానలోపమే కారణమని తలచుట న్యాయ్యము. ఇంతటి మహావిశ్వమున పరమాణుమాత్రమని చెప్పదగు మనభూమియే జీవాధారమనుట సవ్యముగ తోచదు.

చింపాంజి గొరిల్లా మున్నగువానరజాతులకును శరీరనిర్మాణమున చాలపోలిక ఉన్నను, వానరులకన్నను నిస్సంశయముగ సింహజాతులకన్నను నరులలోగల ఆధిక్యము మనశ్శక్తి ఆత్మికశక్తి వీటివిశేషములో కలుగుచున్నది. వాక్చాతుర్యము, హస్తనైపుణ్యము, నిర్మాణకౌశలము ఇత్యాదులచే నది గోచరమగుచున్నది. నరులలో ఇంకొక వ్యావర్తకచిహ్నము ఆధ్యాత్మికభావము. సృష్టిస్వభావముల గూర్చి తత్త్వవిచారము నైతికప్రబోధము నరులలోనే కలదు. వేదఋషులు, బుద్ధుడు, కంఫ్యూషియసు, క్రీస్తు, మహమ్మదు మొదలగు అనేకప్రవక్తలు వరుసగా నాభావముల వ్యాపింపజేసిరి. (శ్రీవెంకటచలంగా రిచ్చిన పట్టికలో క్రీస్తుతరువాతనే బుద్ధు నుదహరించుట వ్రాతపొరబాటు. బుద్ధుడు క్రీస్తుకు చాలపూర్వుడనుటకు సందేహము లేదు. బుద్ధుని సిద్ధాంతములు కొంతవరకు క్రీస్తుబోధన సిద్ధాంతములకు కారణములయ్యెనని కొందరు విజ్ఞుల అభిప్రాయము). ఈ ఆధ్యాత్మికపరిణామమువలన మానవుల ఆత్మికశక్తిలో మున్ముందు అధికవికాసము కలుగవచ్చును.



# కలగూరగంప



## రామాయణమునుండి "ఇలియడ్" పుట్టినదా?

గ్రీకుభాషలో ఆదికవియగు హోమరు రచించిన "ఇలియడ్" అను గొప్ప పద్యకావ్యము నందలి కథా సంవిధానమంతయు సంస్కృత రామాయణమునుండి గ్రహింపబడినదని వాదించుచు ఒక లక్నో విశ్వవిద్యాలయపు ప్రొఫెసరు లండనులో కొన్నిపురాతన లిఖిత గ్రంథములను ప్రదర్శించినాడని ఫ్రీ ప్రెస్ జర్నలు వ్రాయుచున్నది.

ఈ ప్రొఫెసర్ పదునాలుగేండ్ల నుండియు ప్రపంచనాగరకతాచరిత్రను సంపూర్ణముగ సేకరించుటకై ప్రయత్నించుచు, తనపరిశోధనలయందు దాకస్మికముగ నీ లిఖితపుస్తకములను కనుగొన్నాడట. ఇవి ౫౦౦౦ యేండ్లకంటె పూర్వము రచింపబడినట్లు సూచనలున్నవి. వీనిలోని కొన్నిభాగములను నేటి యాంగ్లభాషలోనికి తర్జుమాచేయునప్పు డీరామాయణము, ఇలియడ్, గ్రంథముల నూతనసంబంధము పొడకట్టినది.

ఈయన వాదము: వాల్మీకి రామాయణము హోమరు పుట్టకముం దెన్నో యేండ్లక్రింద రచింపబడినది. ఇలియడ్‌లోని ట్రోజనుయుద్ధమునందలి ప్రతిభాగమును రామాయణయుద్ధమునందు ప్రతిబింబించుచున్నది. సీతకే హోమరు హెలెను అనిపేరు పెట్టి తనకథకు బీజమువేసెను. లంక తనులబెట్టబడినట్లే ట్రాయినగరము దగ్ధమైనది. ఇంక నిట్టి వెన్నియో కలవు.

ఇకభాషావిషయము: సంస్కృతమునకును గ్రీకుభాషకును ఎంతో దగ్గరసంబంధ ముండెడిది. సంస్కృతమునందలి పదములెన్నియో గ్రీకులో స్వల్ప పరిణామముచెంది కలిసిపోయినవి. అసలు గ్రీక్ అను శబ్దమే కురుపక పదమునుండి పుట్టినదట. ఇట్టిపదముల జాబితాయొకటి యీలిఖితపుస్తకములందు లభించినది.

విఖ్యాత పరిశోధకుడగు ప్రొఫెసర్ గిల్బర్ట్ ముర్రే యీవాదమును విని ఆశ్చర్యపడెను. తానింకను ఈవిషయమై శోధింపవలసియున్నదట.

## "వెస్ట్ ఇండీస్" లోని వింత ఆచారములు

అమెరికాచెంతనున్న యీదీవులలో నివసించు హిందూదేశస్థులనుగూర్చి లండన్ 'టైమ్సు' పత్రికా విలేఖరి యిట్లు వ్రాయుచున్నాడు:

"వీరిలో క్రైస్తవమతము పుచ్చుకొననివారు లేరు. కాని హిందువుల ఆచారముల నవలంబింపనివారును లేరు. ప్రతికుటుంబమును చర్చికివెళ్లి ప్రార్థనలు చేసివచ్చును. కాని గృహమునందలి అలంకారములన్నియు హిందూసంప్రదాయము ననుసరించియే యుండును. వివాహాదిసమయములందు హిందూదేశమునందువలెనే వీరు తోరణములు కట్టుచుందురు. ముగ్గులు వేయుదురు. ఆడువారందరును హిందువుల దుస్తులనే యెల్లప్పుడును ధరింతురు. పురుషులుసైతము ఆఫీసువేళలందుతప్ప మరి పాశ్చాత్యరీతిని వస్త్రములు ధరింపరు. అన్నిటికన్న ఆశ్చర్యకరమైన విషయ మేమనగా, ఈక్రైస్తవకుటుంబములం దింకను కొన్నియిండ్లలో తులసిమొక్కలు కాన్పించును." దం. న.

# పండిత సమ్మాన మహోత్సవములు




౧. బ్రహ్మశ్రీ మహామహోపాధ్యాయ తాతా సుబ్బారాయశాస్త్రి†గారి షష్టిపూర్తి మహోత్సవము విజయనగరము (౨౦-౪-౧౯౩౫).

౧. శ్రీమాన్ పరవస్తు రామానుజస్వామిగారు, యం. ఏ. సమ్మాన సంఘాధ్యక్షులు. ౨. బ్రహ్మశ్రీ మహామహోపాధ్యాయ తాతా సుబ్బారాయశాస్త్రిగారు; 3. బ్రహ్మశ్రీ మహామహోపాధ్యాయ యస్. కుప్పుస్వామి శాస్త్రిగారు; యం. ఏ., ఐ. ఇ. యస్.; బ్రహ్మశ్రీ ఆకెళ్ల సత్యనారాయణపంతులుగారు, యం. ఏ. యల్, యల్. బి, ఆహ్వానసంఘాధ్యక్షులు.

---

† వీరిని గురించి శ్రీ బులుసు వేంకటరమణయ్యగారు వ్రాసినవ్యాసము. భారతి ౧౧-వ సంపుటము ౪-వ సంచిక ౫౫౧-౫౫౫ పుటలలో ప్రకటితమయినది.




౨. శ్రీయుత పానుగంటి లక్ష్మీనరసింహారావు*గారి సప్తతి పూర్తిమహోత్సవము, పిఠాపురము. (౨౭-౪-౧౯౩౪)

౧. శ్రీ పానుగంటి లక్ష్మీనరసింహారావుగారు. ౨. శ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహము పంతులుగారు, మహోత్సవాధ్యక్షులు.

---

* వీరినిగురించి శ్రీ ముద్నంగి లక్ష్మీనరసింహశర్మగారు వ్రాసిన 'భావశబలత' అను వ్యాసము. భారతి ౭-వ సంపుటము, ౧౧-వ సంచిక ౮౨౩-౮౨౫ పుటలలో ప్రకటితమయినది.




## హరిజనుడు

గ్రంథకర్త: అల్లాడి నీలకంఠశాస్త్రిగారు, వకీలు, కడప.

హరిజనోద్ధరణమునకై జరుగుచున్న ప్రచారములలో 'హరిజనుల దేవాలయప్రవేశ' మొకటి. హరిజనులు హిందువులు కారని వాదించువారు అనేకులు లేరు. అట్టియెడ హరిజనుల దేవాలయప్రవేశమునకు నిర్బంధము ఏకాలమున ఏవిధముగ కలిగెనదో తెలియరాకున్నది. హరిజనులున్ను మన కనేకవిధముల ఉపయోగపడుచున్నారు. వారిని ఇట్లు నీచముగ చూచుట న్యాయమా?

ఈ యేకాంక నాటకము హరిజనుల దేవాలయ ప్రవేశమును గురించినది. నిర్మలమైనభక్తిగలవా రేజాతివారైనను భగవంతుని ఆదరమునకు పాత్రులగుదురని యీ చిన్ని పొత్తము బోధించుచున్నది.

---

## మందలింపు

శ్రీ పూతలపట్టు శ్రీరాములురెడ్డిగారు (ఆంధ్రోపాధ్యాయులు, బోర్డుహైస్కూలు చిత్తూరు) ఈ మందలింపును రచియించినారు. ఇం దాటవెలదులు నూట ఎనిమిది గలవు. అన్నియు 'కుక్క' నంటగట్టుకొనినవి. దీనిని కుక్కశతకమనిన మిక్కిలి యొప్పును.

ఇట 'కుక్క' యన నీచుడు. నీచులు బహుప్రకారములవారు. వారికిది మందలింపు. కొందఱయిన నట్టివా రేకొంతయిన బాగుపడుదురేని యీ 'మందలింపు' సార్థకము కాగలదు. కవిత్వము విషయమున, రచనమున వాడిగలది. వెల రు. ౦-౧-౬. ఇది గ్రంథకర్తవద్ద దొరకును.

---

## రంగభూమి

(కళోపాసనగావించు సచిత్రాంధ్రమాసపత్రిక)

సంపాదకుడు: యస్. యస్. సోమసుందరాలు గారు, 95 పెరుమాళ్ మొదలివీధి, రాయపేట, మదరాసు.

సంవత్సరచందా రు. ౧-౮-౦ విడిసంచిక రు. ౦-౨-౦.

---

## కామవిలాసము

(స్నేహలతాకవితాసంఘము 13వ పుష్పము, కొల్లాపురము, మాగనకొండపోస్టు, కర్నూలుజిల్లా)

గ్రంథకర్త: విద్వాన్ యస్. విశ్వనాథశాస్త్రిగారు, ఎం. ఏ; క్రౌను ౭౪ పుటలు. వెల రు. ౦-౮-౦.

---

## రత్నాపణము

గ్రంథకర్త: పెనుమర్తి వెంకటరత్నముగారు. సారస్వతకుటీరము, తెనాలి; క్రౌను ౧౬౬ పుటలు. వెల రు ౧-౮-౦.

---

## వసిష్ఠగోత్రక్షత్రియులు

పూసపాటి రాచిరాజవంశచరితము. ప్రకాశకులు: జగన్నాథశర్మగారు. క్షత్రియచారిత్రకమండలి. రాజా బజారు, విజయనగరము. క్రౌను ౨౮ పుటలు. వెల రు. ౦-౪-౦.

---

## (శ్రీ) యువసంవత్సర గంటలపంచాంగము

గణికులు: గొట్టిముక్కల సుందరరామశాస్త్రి సిద్ధాంతిగారు, నరసారావుపేట, పల తెలియదు.

---

## ఇన్స్యూరెన్సుపత్రిక (తెలుగు)

సంపాదకులు: యస్. రామచంద్రరావుగారు ౨౩౧ పైక్రాఫ్ట్సురోడ్డు, రాయపేట, మదరాసు.

సంవత్సరచందా రు. ౨-౦-౦ విడిసంచిక రు. ౦-౩-౦.

---

## ఢంకా

(సచిత్రాంధ్రమాసపత్రిక)

సంపాదకుడు: బి. టి. నరసింహాచార్యులుగారు, ౧౭౬ మింట్‌వీధి, మదరాసు.

విడిసంచిక వెల రు. ౦-౨-౦.

---

## (Rural Teacher) గ్రామోపాధ్యాయుఁడు

సంపాదకుడు: కే. రామదాసుగారు, పోలాకి, గంజాం జిల్లా. ఇది విద్యావిషయక మాసపత్రిక.

సంవత్సరచందా రు. ౧-౧౨-౦ విడి ప్రతి రు. ౦-౧-౦.

---



ఉత్తరపళని

K. P. S.

श्री

## अखिल भारतवर्षीय-हिन्दी-साहित्य-सम्मेलन के चौबीसवें अधिवेशन इन्दौर के सभापति महात्मा मोहनदास करमचन्दजी गांधी का

# भा ष ण ।

भाइयो और बहनो!

ईश्वर की गति गहन है। अक्टूबर मास से मैं इस बोझ को टाल रहा था। यह पद पूजनीय मालवीयजी महाराज का था। पर उनका स्वास्थ्य बिगड़ने के कारण, और उनको विदेश जाना था इसलिए उन्होंने त्याग पत्र भेजा। दूसरा सभापति चुनने में आपको कुछ मुसीबत थी। मेरा नाम तो स्वागत समिति के सामने था ही। मुझको जब स्वागत समिति का संकट बताया गया तो मैं विवश हो गया और पद ग्रहण करना स्वीकार कर लिया।

स्वीकृति देने का मेरे लिये अन्य कारण तो था ही। गत वर्ष जब मेरे पास इस अधिवेशन के सभापतित्व का प्रस्ताव आया तब मैंने दक्षिण-भारत हिन्दी प्रचार के लिए दो लाख रुपये माँगे। भला आजकल दो लाख इस काम के लिए कौन दे?—'हाँ, हम प्रयत्न करेंगे। आपके पद स्वीकार करने से सफल होंगे'—समिति की ऐसी बातों में फँस जाऊँ ऐसा भोला मैं कब था? मैंने तो दो लाख की गारण्टी माँगी। मैंने समझा कि इस पर मित्रों ने मुझे छोड़ दिया।

लेकिन ईश्वर को दूसरी ही बात करनी थी। उसे मेरे मार्फत हिन्दी प्रचार की कुछ और सेवा लेनी थी। मालवीयजी महाराज न आ सके। उनको ईश्वर शतायु करे। मैंने आपके अधिवेशनों की रिपोर्ट कुछ अंशों में देखी है। सबसे पहला अधिवेशन सन् १९१० में हुआ था। उसके सभापति मालवीयजी महाराज ही थे। उनसे बढ़ कर हिन्दी-प्रेमी भारत वर्ष में हमें कहीं नहीं मिलेंगे। कैसा अच्छा होता यदि वे आज भी इस पद पर होते। उनका हिन्दी प्रचार क्षेत्र भारत व्यापी है; उनका हिन्दी ज्ञान उत्कृष्ट है।

मेरा क्षेत्र बहुत मर्यादित है। मेरा हिन्दी भाषा का ज्ञान नहीं के बराबर है। आपकी प्रथमा परीक्षा में मैं उत्तीर्ण नहीं हो सकता हूँ। लेकिन हिन्दी भाषा का मेरा प्रेम किसी से कम नहीं ठहर सकता है। मेरा क्षेत्र दक्षिण में हिन्दी प्रचार है। सन् १९१८ में जब आपका अधिवेशन यहाँ हुआ था, तब से दक्षिण में हिन्दी प्रचार के कार्य का आरंभ हुआ है। वह कार्य तब से उत्तरोत्तर बढ़ ही रहा है। धनाभाव के कारण वह रुकना नहीं चाहिए। पं० हरिहर शर्मा धन के लिये मुझे नित्य सताते हैं। उनसे मैं कहता हूँ कि 'अब मुझे मत सताओ। दक्षिण से ही आपको पैसे मिलने चाहिए। इतना भी करने की शक्ति यदि आपमें नहीं है तो आप अपना प्रयत्न निष्फल समझिये।' कहने को तो मैं यह कह देता हूँ; पर इतनी बड़ी संस्था को २१ वर्ष तक नाबालिग रहने का भी तो हक होना चाहिये। इसलिये जब मौका आया तब मैं ने दो लाख की माँग की। इतना द्रव्य अधिक भी नहीं है। लेकिन जो सज्जन मेरे पास आये उन्होंने रुई का दाम एक दम गिर जाने से दो लाख के लिये अपनी असमर्थता प्रगट की। बात भी ठीक थी। जमनालालजी ने भी उन भाइयों का पक्ष लिया। मैंने भी हार मानली और एक लाख की शर्त कबूल करली। अब किसी न किसी तरह से पर सचाई के साथ आपको मुझे एक लाख देना है।

आप पूछ सकते हैं कि केवल दक्षिण ही में हिन्दी प्रचार के लिये क्यों? मेरा उत्तर यह है कि दक्षिण भारत कोई छोटा मुल्क नहीं है। वह तो एक महाद्वीप सा है। वहाँ चार प्रान्त और चार भाषाएँ हैं-तामिल, तेलुगु, मलयाली और कानडी। आबादी करीब सवा सात करोड़ है। इतने लोगों

में यदि हम हिन्दी प्रचार की नींव मजबूत कर सके तो अन्य प्रांतों में बहुत ही सुभीता हो जायगा।

यद्यपि मैं इन भाषाओं को संस्कृत की पुत्रियाँ मानता हूँ, तो भी ये हिन्दी, उड़िया, बंगला, आसामी, पंजाबी, सिंधी, मराठी, गुजराती से भिन्न हैं। इनका व्याकरण हिन्दी से बिलकुल भिन्न है। इनको संस्कृत की पुत्रियाँ कहने से मेरा अभिप्राय इतना ही है कि इन सब में संस्कृत शब्द काफी हैं, और जब संकट आ पड़ता है तब ये संस्कृत माता को पुकारती हैं और उसका नये शब्द रूपी दूध पीती हैं। प्राचीन काल में भले ही ये स्वतंत्र भाषाएँ रही हों; पर अब तो ये संस्कृत में से शब्द लेकर अपना गौरव बढ़ा रही हैं। इसके अतिरिक्त और भी तो कई कारण इनको संस्कृत की पुत्रियाँ कहने के हैं, पर उन्हें इस समय जाने दीजिये।

जो भी हो, इतनी बात तो निर्विवाद है कि दक्षिण में हिन्दी प्रचार सबसे कठिन कार्य है। तथापि अठारह वर्षों से हम व्यवस्थित रूप में वहाँ जो कार्य करते आये हैं उसके फल स्वरूप इन वर्षों में छः लाख दक्षिण वासियों ने हिन्दी में प्रवेश किया ४२००० परीक्षा में बैठे, ३२०० स्थानों में शिक्षा दी गई, ६०० शिक्षक तैयार हुए और आज ४५० स्थानों में कार्य हो रहा है। सन् ३१ से स्नातक परीक्षा का भी आरंभ हुआ, और आज स्नातकों की संख्या ३०० है। वहाँ हिन्दी की ७० किताबें तैयार हुई और मद्रास में उनकी आठ लाख प्रतियाँ छपीं। सत्रह वर्ष पूर्व दक्षिण के एक भी हाई स्कूल में हिन्दी की पढ़ाई नहीं होती थी, पर आज सत्तर हाई स्कूलों में हिन्दी पढ़ाई जाती है। सब मिलाकर वहाँ ७० कार्य कर्त्ता काम कर रहे हैं और आज तक इस प्रयास में चार लाख रुपया खर्च हुआ है, जिसमें से आधे से कुछ कम रुपये दक्षिण में ही मिले हैं। यहाँ एक और बात कह देना जरूरी है। काका साहब अपने निरीक्षण के बाद कहते हैं कि दक्षिण में बहनों ने हिन्दी प्रचार के लिये बहुत काम किया है। वे इसकी महिमा समझ गई हैं। वे यहाँ तक हिस्सा ले रही हैं कि कुछ पुरुषों को यह फिक्र लग रही है कि यदि स्त्रियाँ इस तरह उद्यमी बनेंगी तो घर कौन सँभालेगा?

क्या इतनी प्रगति सन्तोष जनक नहीं मानी जा सकती? क्या ऐसे वृक्ष को हमें और भी न बढ़ाना चाहिये? आज जब कि मुझे यह स्थान दिया गया है तब भी मैं इस संस्था को चिरस्थायी बनाने का यत्न न करूँ तो मेरे जैसा मूर्ख कौन माना जा सकता है? मुझको यदि दुबारा यह पद लेने का कुछ भी अधिकार है तो सिर्फ मेरे दक्षिण हिन्दी प्रचार के कार्य के कारण ही! भले ही उस कार्य में मैंने कोई पद लेकर काम न किया हो; पर हर हालत में उस वृक्ष को सींचने में तो मैंने काफी हिस्सा लिया ही है। उसके संरक्षक श्री जमनालाल बजाज, श्री राजगोपालाचारी श्री रामनाथ गोयनका, श्री पट्टाभि सीतारामैया और श्री हरिहर-शर्मा हैं। इसका कौड़ी-कौड़ी का हिसाब रक्खा गया है, जो समय समय पर प्रकाशित होता रहता है।

मैंने आपको इस संस्था का उज्ज्वल पक्ष ही दिखाया है। इसका यह मतलब नहीं है कि उसका काला पक्ष है ही नहीं।

'जड़ चेतन गुण दोष मय, विश्व कीन्ह करतार।
संत हंस गुण गहहिं पय, परि हरि वारि विकार॥'

निष्फलता भी काफी हुई है। सब कार्यकर्त्ता अच्छे ही निकले, ऐसा भी नहीं कहा जा सकता। यदि सब कार्य आरंभ से अंत तक अच्छा ही रहता तो अवश्य और भी सुन्दर परिणाम आ सकता था। पर इतना तो कहा ही जा सकता है कि यदि अन्य प्रांतों के हिन्दी प्रचार से इसकी तुलना की जाय तो यह काम अद्वितीय ठहरेगा।

रही एक लाख के व्यय की बात! क्या यह व्यय सम्मेलन के प्रयागस्थ केन्द्र से होना आवश्यक नहीं है? यदि ऐसा न किया गया तो क्या इससे सम्मेलन का अपमान नहीं होगा? इन प्रश्नों के उत्तर में मेरा नम्र निवेदन यह है कि इसमें अपमान की कोई बात नहीं है। सम्मेलन न होता तो दक्षिण भारत हिन्दी-प्रचार सभा भी न होती। सन् १९१८ में इसी शहर में इसी सम्मेलन की

छाया में इस संस्था का उद्भव हुआ। बाद के इतिहास में जाना अनावश्यक है। अंत में इस संस्था को सम्मेलन ने स्वतंत्र कर दिया, या यों कहिए कि 'डोमीनियन स्टेटस' दे दिया। इससे सम्मेलन का गौरव बढ़ा ही है, कम नहीं हुआ। यदि सम्मेलन से संबंधित सब संस्थाएँ स्वावलंबी बन जायँ तो इससे ज्यादा हर्ष की बात सम्मेलन के लिए कौन सी हो सकती है? आप से जो एक लाख रुपये की भिक्षा माँगी जा रही है वह इस स्वतंत्र संस्था के लिए है। उसको भी झंडा तो सम्मेलन का ही फहराना है।

पर तब यह प्रश्न उठ सकता है कि क्या अन्य प्रांतों की बात छोड़ दी जाय? क्या अन्य प्रांतों में हिन्दी प्रचार की आवश्यकता नहीं है? अवश्य है। मुझे दक्षिण का पक्षपात नहीं है, और न अन्य प्रांतों से द्वेष! मैं ने अन्य प्रांतों के लिए भी काफी प्रयत्न किया है; लेकिन कार्यकर्त्ताओं के अभाव के कारण वहाँ इतनी क्या थोड़ी भी सफलता नहीं मिल सकी। बेचारे बाबा राघव दास उत्कल, बंगाल और आसाम में हिन्दी प्रचार के लिए अथक प्रयत्न कर रहे हैं। कुछ सफलता भी मिली है लेकिन उसे नहीं के बराबर ही मानना चाहिए। जो कुछ भी सहायता मैं उनको दिला सकता था वह दिलाने की चेष्टा भी मैंने की है। बाबा जी के मार्फत आसाम में गोहाटी, जोरहट, शिवसागर और नौगाँव में प्रयत्न हो रहा है। वहाँ १६० विद्यार्थी पढ़ रहे हैं। दो छात्रों और दो छात्राओं को छात्रवृत्ति देकर काशी विद्यापीठ और प्रयाग महिला विद्यापीठ में पढ़ाया जा रहा है। एक आसामी भाई बरहज (गोरखपुर) में हिन्दी पढ़ रहे हैं और वहाँ वालों को आसामी पढ़ा रहे हैं। आसामी प्रतिष्ठित लोग इस प्रचार कार्य में कम रस लेते हैं। जो मदद बाबा जी को मिली भी है वह एक ही वर्ष के लिए है।

उत्कल में कटक पुरी और बरहमपुर में कुछ प्रयत्न हो रहा है। उत्कल के बारे में एक बड़ी आशा जनक बात यह है कि श्री गोपबन्धु चौधरी और उनकी धर्मपत्नी रमादेवी हिन्दी प्रचार में बहुत दिलचस्पी लेते हैं। अपने परिवार को भी उन्होंने हिन्दी का काफी ज्ञान प्राप्त करा दिया है। वे सब आज कल एक देहात में रहते हुए ऐसी ही क्रियात्मक सेवा कर रहे हैं। ऐसे ही कुछ दूसरे भी त्यागी कार्यकर्त्ता उत्कल में हैं। इस लिए उत्कल में हिन्दी प्रचार की आशा अवश्य रखी जा सकती है।

बंगाल में तो एक समिति भी बन गयी थी; सब कुछ हुआ था, हिन्दी पर प्रेम रखने वाले बंगाली भी काफी हैं। श्री रामानंद बाबू श्री बनारसीदास चतुर्वेदी की मदद से 'विशाल भारत' निकाल रहे हैं। यह कोई छोटी बात नहीं है। कलकत्ते में हिन्दी-प्रेमी मारवाड़ी सज्जन भी कम नहीं हैं। तो भी बंगाल में जितना कुछ हो रहा है वह बहुत ही कम समझा जाना चाहिए।

पंजाब की बात मैं छोड़ देता हूँ, क्योंकि पंजाब में उर्दू तो सब समझते हैं। वहाँ तो केवल लिपि की बात रह जाती है। इस प्रश्न पर विचार करने के लिए काका साहब की अध्यक्षता में लिपि-परिषद् हो रही है, इसलिए मैं इस बारे में कुछ नहीं कहना चाहता हूँ। अब रहे सिन्ध, महाराष्ट्र और गुजरात। इन तीनों प्रांतों में जो कुछ हो रहा है वह शायद ही उल्लेख योग्य हो। पर मेरी उम्मीद है कि इसी सम्मेलन में हम वहाँ के लिए भी कुछ न कुछ रचनात्मक कार्य करने का निश्चय करेंगे।

सारी मुश्किल तो यह है कि सम्मेलन के उद्देश्यों में तो अन्य प्रांतों मे हिन्दी प्रचार खासा स्थान रखता है, लेकिन मेरा यह कहना अनुचित न होगा कि, सम्मेलन ने इस प्रचार कार्य पर उतना जोर नहीं दिया है जितना कि परीक्षाओं पर। मेरा निवेदन है कि इस सम्मेलन में हम इस बारे में ध्यानपूर्वक विचार करके इस संबंध में कोई स्पष्ट नीति ग्रहण करें।

मेरी राय में अन्य प्रांतों में हिन्दी प्रचार, सम्मेलन का मुख्य कार्य बनाना चाहिए। यदि हिन्दी को राष्ट्र-भाषा बनाना है तो प्रचार कार्य सर्व व्यापी और सुसंगठित होना ही चाहिए। हमारे यहाँ शिक्षकों का अभाव है। सम्मेलन के

केन्द्र में हिन्दी शिक्षकों के लिए एक विद्यालय होना चाहिए जिसमें एक ओर तो हिन्दी प्रांत-वासी शिक्षक तैयार किये जायँ और उनको जिस प्रांत के लिये वे तैयार होना चाहें उस प्रांत की भाषा सिखायी जाय, और दूसरी ओर अन्य प्रांतों के भी छात्रों को भरती करके उन्हें हिन्दी शिक्षा दी जाय। ऐसे प्रयास दक्षिण के लिए तो किया भी गया था, जिसके फल-स्वरूप हमको पं० हरिहर शर्मा और हृषीकेश मिले।

आप जानते हैं कि मेरी सलाह से काका साहब कालेलकर दक्षिण में प्रचार कार्य का निरीक्षण करने और पं० हरिहर शर्मा को मदद देने के लिए गये थे। उन्होंने तामिलनाडु, मलाबार, त्रावणकोर, मैसूर, आन्ध्र और उत्कल तक भ्रमण किया, हिन्दी प्रेमियों से मिले और कुछ चन्दा भी इकट्ठा किया। इस भ्रमण में उनका अनुभव यह हुआ कि कुछ लोग ऐसा समझते हैं कि हम प्रांतीय भाषाओं को नष्ट करके हिन्दी को सारे भारतवर्ष की एक मात्र भाषा बनाना चाहते हैं। इस गलतफहमी से भ्रमित होकर वे हमारे प्रचार का विरोध भी करते हैं। मेरा ख्याल है कि हमें इस बारे में अपनी नीति स्पष्ट करके ऐसी गलतफहमियाँ दूर करनी चाहिए। मैं हमेशा से यह मानता रहा हूँ कि हम किसी हालत में भी प्रांतीय भाषाओं को मिटाना नहीं चाहते। हमारा मतलब तो सिर्फ यह है कि विभिन्न प्रांतों के पारस्परिक संबंध के लिये हम हिन्दी भाषा सीखें। ऐसा कहने से हिन्दी के प्रति हमारा कोई पक्षपात नहीं प्रगट होता। हिन्दी को हम राष्ट्र-भाषा मानते हैं। वह राष्ट्रीय होने के लायक है। वही भाषा राष्ट्रीय बन सकती है जिसे अधिक-संख्यक लोग जानते-बोलते हों और जो सीखने में सुगम हो। ऐसी भाषा हिन्दी ही है, यह बात यह सम्मेलन सन् १९१० से बता रहा है और इसका कोई वजन देने लायक विरोध आज तक सुनने में नहीं आया है। अन्य प्रांतों ने भी इस बात को स्वीकार कर ही लिया है।

काका साहब ने कुछ लोगों में दूसरी गलतफहमी यह देखी कि वे समझते हैं कि हम हिन्दी को अंग्रेजी भाषा का स्थान देना चाहते हैं। कुछ तो यहाँ तक समझते हैं कि अंग्रेजी ही राष्ट्र-भाषा बन सकती है, और बन भी गयी है।

यदि हिन्दी अंग्रेजी का स्थान ले तो कम से कम मुझे तो अच्छा ही लगेगा। लेकिन अंग्रेजी भाषा के महत्व को हम अच्छी तरह जानते हैं। आधुनिक ज्ञान की प्राप्ति, आधुनिक साहित्य के अध्ययन, सारे जगत् के परिचय, अर्थ प्राप्ति, राज्याधिकारियों के साथ सम्पर्क रखने और ऐसे ही अन्य कार्यों के लिए अंग्रेजी ज्ञान की हमें आवश्यकता है। इच्छा न रहते हुए भी हमको अंग्रेजी पढ़नी होगी। यही हो भी रहा है। अंग्रेजी अंतर्राष्ट्रीय भाषा है।

लेकिन अंग्रेजी राष्ट्र-भाषा कभी नहीं बन सकती। आज इसका साम्राज्य सा जरूर दिखायी देता है। इससे बचने के लिए काफी प्रयत्न करते हुए भी हमारे राष्ट्रीय कार्यों में अंग्रेजी ने बहुत बड़ा स्थान ले रक्खा है। लेकिन इससे हमें इस भ्रम में कभी न पड़ना चाहिए कि अंग्रेजी राष्ट्र-भाषा बन रही है। इसकी परीक्षा प्रत्येक प्रांत में हम आसानी से कर सकते हैं। बंगाल अथवा दक्षिण भारत को ही लीजिये, जहाँ कि अंग्रेजी का प्रभाव सबसे अधिक है। वहाँ यदि जनता की मार्फत हम कुछ भी काम करना चाहते हैं तो वह आज हिन्दी द्वारा भले ही न कर सकें। पर अंग्रेजी द्वारा तो नहीं ही कर सकते। हिन्दी के दो चार शब्दों से हम अपना भाव कुछ तो प्रगट कर ही देंगे। पर अंग्रेजी से तो इतना भी नहीं कर सकते। हाँ, यह अवश्य माना जा सकता है कि अब तक हमारे यहाँ एक भी राष्ट्र-भाषा नहीं बन पायी है। अंग्रेजी राज-भाषा है। ऐसा होना स्वाभाविक भी है। अंग्रेजी का इससे आगे बढ़ना मैं असम्भव समझता हूँ, चाहे कितना भी प्रयत्न क्यों न किया जाय। हिन्दुस्तान को अगर सचमुच एक राष्ट्र बनाना है तो—चाहे कोई माने या न माने राष्ट्र-भाषा तो हिन्दी ही बन सकती है, क्योंकि जो स्थान हिन्दी को प्राप्त है वह किसी

दूसरी भाषा को कभी नहीं मिल सकता। हिन्दू मुसलमान दोनों को मिला कर, करीब बाईस करोड़ मनुष्य की भाषा थोड़े बहुत फेरफारसे—हिन्दी हिन्दुस्तानी ही है। इसलिए उचित और सम्भव तो यही है कि प्रत्येक प्रांत में उस प्रांत की भाषा, सारे देश के पारस्परिक व्यवहार के लिए हिन्दी, और अन्तर्राष्ट्रीय उपयोग के लिए अंग्रेजी का व्यवहार हो। हिन्दी बोलने वालों की संख्या करोड़ों की रहेगी, किन्तु अंग्रेजी बोलने वालों की संख्या कुछ लाख से आगे कभी नहीं बढ़ सकेगी। इसका प्रयत्न भी करना जनता के साथ अन्याय करना होगा।

मैंने अभी 'हिन्दी-हिन्दुस्तानी' शब्द का प्रयोग किया है। सन् १८ में जब आपने मुझको यही पद दिया था तब भी मैंने यही कहा था हिन्दी उस भाषा का नाम है जिसे हिन्दू और मुसलमान कुदरती तौर पर बगैर प्रयत्न के बोलते हैं। हिन्दुस्तानी और उर्दू में कोई फर्क नहीं है। देवनागरी लिपि में लिखी जाने पर वह हिन्दी और अरबी में लिखी जाने पर उर्दू कही जाती है। जो लेखक या व्याख्यानदाता चुन चुन कर संस्कृत या अरबी-फारसी के शब्दों का ही प्रयोग करता है वह देश का अहित करता है। हमारी राष्ट्र-भाषा में वे सब प्रकार के शब्द आने चाहिए जो जनता में प्रचलित हो गये हैं। श्री घनश्याम-दास बिड़ला ने ठीक ही कहा है कि राष्ट्रभाषा वादियों को चाहिए कि विभिन्न प्रांतीय भाषाओं में जो शब्द रूढ़ बन गये हैं और जो राष्ट्रभाषा में आने के लायक हैं उन्हें वे ले लें। हर व्यापक भाषा में यह ग्राहक शक्ति रहती ही है। इसी लिए तो वह व्यापक बनती है। अंग्रेजी ने क्या नहीं लिया है? लैटिन और ग्रीक में से कितने ही मुहावरे अंग्रेजी में लिए गये हैं। आधुनिक भाषाओं को भी वे लोग नहीं छोड़ते। इस बारे में उनकी निष्पक्षता सराहनीय है। हिन्दुस्तानी शब्द अंग्रेजी में काफी आ गये हैं। कुछ अफ्रीका से भी लिए गए हैं। इसमें उनका 'फ्री ट्रेड' कायम ही है। पर मेरे यह सब कहने का मतलब यह नहीं है कि बगैर अवसर के भी हम दूसरी भाषाओं के शब्द लें, जैसा कि आज कल अंग्रेजी पढ़े-लिखे युवक किया करते हैं। इस व्यापार में विवेक दृष्टि तो रखनी ही होगी। हम कंगाल नहीं हैं, पर कंजूस भी नहीं बनेंगे। कुरसी को खुशी से कुरसी कहेंगे, उसके लिए 'चतुष्पाद पीठ' शब्द का प्रयोग नहीं करेंगे।

इस मौके पर अपने दुख की भी कुछ कहानी कहूँ। हिन्दी भाषा राष्ट्रभाषा बने या न बने, मैं उसे छोड़ नहीं सकता। तुलसीदास का पुजारी होने के कारण हिन्दी पर मेरा मोह रहेगी। लेकिन हिन्दी बोलने वालों में रवींद्रनाथ कहाँ हैं? प्रफुल्लचन्द्र राय कहाँ हैं? जगदीश बोस कहाँ हैं? ऐसे और भी नाम मैं बता सकता हूँ। मैं जानता हूँ कि मेरी अथवा मेरे जैसे हजारों की इच्छा मात्र से ऐसे व्यक्ति थोड़े ही पैदा होने वाले हैं! लेकिन जिस भाषा को राष्ट्र-भाषा बनना है उसमें ऐसे महान् व्यक्तियों के होने की आशा रक्खी ही जायगी।

वर्धा में हमारे यहाँ एक कन्या आश्रम है। वहाँ सम्मेलन की परीक्षा के लिए कई लड़कियाँ तैयार हो रही हैं। शिक्षक वर्ग और लड़कियाँ भी शिकायत करती हैं कि जो पाठ्य पुस्तकें नियत की गयीं हैं उनमें से सब पढ़ने लायक नहीं हैं। शिकायत के लायक पुस्तकें शृंगार रस से भरी हैं। हिन्दी में शृंगार-साहित्य काफी है। इस ओर कुछ वर्ष पूर्व श्री बनारसीदास चतुर्वेदी ने मेरा ध्यान खींचा था। जिस भाषा को हम राष्ट्र भाषा बनाना चाहते हैं उसका साहित्य स्वच्छ, तेजस्वी और उच्चगामी होना चाहिए। हिन्दी भाषा में आजकल गन्दे साहित्य का काफी प्रचार हो रहा है। पत्र-पत्रिकाओं के संचालक इस बारे में असावधान रहते हैं अथवा गन्दगी को पुष्टि देते हैं। मेरी राय में सम्मेलन को इस बारे में उदासीन न रहना चाहिए। सम्मेलन की तरफ से अच्छे लेखकों को प्रोत्साहन मिलना चाहिए। लोगों को सम्मेलन की तरफ से पुस्तकों के चुनाव में भी कुछ सहायता मिलनी चाहिए। इस कार्य में कठिनाई अवश्य है, लेकिन कठिनाई से हम थोड़े ही भाग सकते हैं।

परीक्षाओं की पाठ्य-पुस्तकों में से एक पुस्तक के बारे में एक मुसलमान की भी, जो देवनागरी लिपि अच्छी तरह जानते हैं, शिकायत है। उसमें मुगल बादशाह के लिए भली बुरी बातें हैं वे सब ऐतिहासिक भी नहीं हैं। मेरा नम्र निवेदन है कि पाठ्य-पुस्तकों का चुनाव सूक्ष्म विवेक के साथ होना चाहिए और उसमें राष्ट्रीय दृष्टि रहनी चाहिए, और पाठ्यक्रम भी आधुनिक आवश्यकताओं को ख्याल में रख कर निश्चित करना चाहिए। मैं जानता हूँ कि मेरा यह सब कहना मेरे क्षेत्र के बाहर है। लेकिन मेरे पास जो शिकायतें आई हैं उन्हें आपके सामने रखना मैंने अपना धर्म समझा।

(ह.) मो. क. गांधी.

---



बकिंगहेम् केनाल - मद्रास.    D. P. R.

రజతోత్సవము ౧౯౧౦-౧౯౩౫

# శ్రీ పంచమ జార్జి సార్వభౌమ దంపతులు





మే 6-వ తేది వీరి రజతోత్సవము బ్రిటిష్ సామ్రాజ్యమందంతటను కడు వైభవముగ జరిగెను



జార్జి రాకుమారుడును, వారి సోదరసోదరీమణులును (బాల్యమున).



నెలలశిశువుగనున్న జార్జిగారిని తల్లి అలగ్జాండ్రా రాణి ఎత్తుకొనుట




రాజుగారి రజతోత్సవాలంకారము :—మదరాసు సెక్రటరియటుభవనము
తిరువళిక్కేణి సముద్రతీరమున విద్యుద్దీపములచే నలంకరింపబడినది.




బొంబాయి మునిసిపలు కార్పొరేషను భవనము, విద్యుద్దీపములతో నలంకరింపబడెను.



# సాభిప్రాయ విశేషములు



ఆనందము ప్రపంచ ప్రవృత్తికి పరిణామము. పిపీలికాదిబ్రహ్మపర్యంతము వ్యాప్తమైన చరాచరప్రపంచమునకు ఆనందము పురుషార్థము, పరమార్థము. ఆనందానుభవమునకు ప్రపంచము చేయుచున్న ఘోరతపస్సునకు శాస్త్రములు, కళలు, కావ్యములు, కథలు, నాటకములు, రాజ్యాంగములు, మతములు, పాటలు, పద్యములు మొదలగు సకలప్రపంచప్రవృత్తులును మహావ్యాపారములు. ప్రవృత్తియందు సకలపదార్థములును ఆనందసాధనములైనను శాంతిసుందర స్వభావస్వరూపములు పరమ ... మానవ ... నందానుభవమునకు సాధనములుగ నున్నవి. నిరపేక్షమైన అవ్యక్తానందము సాపేక్షమైన వ్యక్తానందరూపమున సాధ్యముగ నున్నది. సాహిత్యకళోపాసకులు విశ్వప్రవృత్తియందు సకలార్థములందును శ్రీకృష్ణలీలను సందర్శించుట కధికారులు. వేణుగానము, కంసమర్దనము, రాధామాధవవిలాసములు, రుక్మిణీకల్యాణము, గోపాలనము, బాలక్రీడలు, జలక్రీడలు, పార్థసారథ్యము, గజేంద్రమోక్షాది భాగవత స్కంధము లన్నియును రసలీలావిలాసములు సాహిత్యకళాప్రవృత్తులు. విశ్వసాహిత్యకళా ప్రవృత్తుల కానందానుభవము పరిణామము. సకలార్థములందును ఆత్మానందానుభవమానందమునకు మూలము. ఆత్మానందానుభవజ్ఞులైన సాహిత్యకళోపాసకు లాత్మానందము ననుభవించుటకు చేయుచున్న యనంతములైన నిర్మాణములు సామాన్యులకును ఆత్మానందానుభవమునకు వినియోగపడుచున్నవి.

ప్ర ... త్యే మైన ప్రబోధసమయము నను సకలార్థములందును మహానుభావులు సామాన్యులకు నిర్మాణ విషయములందు మార్గదర్శకులుగనుండుట ప్రయోజనకరము. పురాణ నవీన సాహిత్యకళా సంస్కారములు సంరంభము సాహచర్యములం దుభయమార్గములును నిందాస్తోత్రములకు పాలగుచున్నవి. ప్రాచ్యపాశ్చాత్య సాహిత్యకళా సంస్కారముల సంసర్గసంరంభములందును నిర్మాణోద్యమములు దురభిమాన పరాయణములుగ నున్నవి. కార్యపరాయణులు నిందాస్తోత్రములను, లాభనష్టములను పాటింపకను సంశయములను విడిచి ఆత్మానుభవమును పరిస్ఫుటము చేయుట పురుషార్థము. మానవులు కర్మాధికారులు; ఫలాధికారులు కారు. మహాకవి భవభూతి మాలతీమాధవమునందు వ్రాసినటులు సకలజనులును వారి యాత్మానుభవానురూపముగను యోగారూఢులగుట సహజధర్మము.

శ్లో. యే నామ కేచి దిహ నః ప్రథయం త్యవజ్ఞాం
జానన్తి తే కిమపి తా న్ప్రతి నైష యత్నః;
ఉత్పత్స్యతే స్తి మమ కోపి సమానధర్మా
కాలో హ్యయం నిరవధి ర్విపులా చ పృథ్వీ.

నిరవధికమైన కాలము, విపులమైన పృథ్వి, అనంతములైన పాత్రలు సకలనిర్మాణములను నుచితసమయరీతిని సఫలము చేయుచున్నవి. మహానుభావులవలెను సామాన్యులును స్వానుభవప్రమాణమైన ఆనందము ననుభవించుటకును,సమకూర్చుటకును నధికారులు.భారతీ పత్రికా నిర్వహణావలోకనములును నీ పరమార్థమునే స్ఫురింప జేయుచున్నవి.

భారతి సాహిత్యకళాదిరంగములందు జేయుచున్న సేవ సామాన్యమైనను ప్రాచీన నవీనసాహిత్యకళా సంస్కారముల సమ్మేళనమునకును, ప్రాచ్య పాశ్చాత్య సాహిత్యకళా సంస్కారముల సమన్వయమునకును యథోచితముగను వినియోగపడుచున్న విధమును సంచికలయందలి రచనలు విశదము చేయుచున్నవి. ప్రపంచమునందు జాతి మత దశా భేదములు లేకను విశ్వమానవభ్రాతృత్వమును స్థాపించుటకు జరుగుచున్న ప్రయత్నములు సకలసందర్భములందును ఆనంద తాండవమున కవకాశములను సమకూర్చుచున్నవి. ఈ సంచికయందలి శ్రీ శివశంకర శాస్త్రిగారి కృతి వకుళమాలిక ప్రాచీన నవీన సాహిత్య సంస్కార సమ్మేళనమునకు ప్రమాణముగనున్నది. వకుళమాలిక సురుచిరసౌరభకుసుమానురాగకల్పితమైన ప్రేమమాలిక. కావ్యములందు శృంగారరసాస్వాదానుభవము విషయపరాయణమైన కామారాధనముననుగాకను త్యాగపరాయణ మైన ప్రేమారాధనముననుగలుగగలవిధమునువకుళమాలికాకల్పనలు మనోహరముగను వర్ణించుచున్నవి. నవ్యసాహిత్యాచార్యులైన శ్రీ శివశంకరశాస్త్రిగారు వకుళమాలికయందు పొందుపరచిన కల్పనలు, సంభావనలు, శైలి, రీతము నవసాహిత్యనిర్మాణమునకు లక్ష్యముగ నున్నవి. స్వాతంత్ర్యము నిర్మాణమునకు కీలకము. ఆరంభమునందు స్వతంత్రనవీన రచనలు పూర్వసంస్కారప్రియుల నిరసనమునకు గురియైనను కాలక్రమమునను సాహిత్యోపాసకుల యాదరణమును బడయుచున్నవి. సాహిత్యాంగములైన విమర్శనలు, కథలు, చరిత్రములు, పరిశోధనలు నవీన మార్గము నవలంబింపవలసిన యవసరమును సాహిత్యాంగములు విశదముచేయుచున్నవి. నవజీవననిర్మాణవికాసములకు సాహిత్యోపాసకులువలెను కళోపాసకులు నవీననిర్మాణమార్గము నవలంబించుచున్నారు.మానవలక్ష్యము కళానిర్మాణములం దసహజమైన బాహ్యాలంకారాడంబరములనుండి సహజమైన ఆత్మస్వరూపానుభవములకు సంక్రమించినది. శ్రీ భాగీరథిగారి చిత్రకళా కల్పనలు నవ్యకళాకల్పనలకు ప్రమాణములు. సాహిత్యకళాపరిణామమునందు రసానందమువలెను రసాభాసమును ప్రవర్ధమానంబగుచు శాంత

శివసుందరస్థానములను ప్రళయవిప్లవవికార స్వభావస్వరూపము లాక్రమించుచు మహాపరివర్తనమును గలుగజేయుచున్న విధమును సాహిత్యకళా నిర్మాణములవలెను రాజకీయార్థికసాంఘికోద్యమములును సవగతముచేయుచున్నవి. ప్రపంచావృతమైన సకలార్థములకును సర్వాత్మత్వాకరమైన సచ్చిదానందము పరమార్థము. సచ్చిదానందప్రాప్తికి ప్రపంచము చేయుచున్న మహాప్రస్థానము భయభ్రాంతులను గలుగజేయుచు రసాభాసముగ నున్నను ధర్మపరిణామమున కవసరముగ నున్నది.

* * *

రసాభాసము:

నవనిర్మాణములు సాహిత్యకళారంగములందువలెను సకలార్థములందును నిందావిరసనములకు గురియగుట సహజమైనను పరమార్థసాధనములుగను పరిణమించుచున్నవి. మానవధర్మ రక్షణపోషణముల కవసరములైన యంత్రాద్యుపకరణములు మానవధర్మసంహారమున కుపయోగపడుట మానవశాస్త్రాధ్యాయమునందు దురదృష్టాధ్యాయము. ప్రపంచాభ్యుదయమునందు నిర్మాణమున కవసరమైన యంత్రాద్యుపకరణములు సంహారమునకును నుపయోగపడుట ప్రవృత్తికి సహజమైన సాపేక్షధర్మమునకు నిదర్శనము. ప్రవృత్తియందు స్థితికన్యోన్యాశ్రయములైన సృష్టిసంహారములకు ప్రమాణావరణములను నిర్ణయించుట దుర్లభము. నిర్మాణాభావమైన సంహారమును, సంహారాభావమైన పునర్నిర్మాణములును దుర్లభములు. నిర్మాణసంహారములకు బీజము సాధ్యము కాని సాధనముకాదు. ప్రపంచాభ్యుదయమునకు సాధనములైన వాయువిమానములు సంహారమున కుపయోగపడుట యసంగతమైనను, దోషమునకు కారకులు మానవులుకాని విమానములు కావు. మానవుల ధర్మశక్తి సకలదోషములను జయించి ఆత్మసామ్రాజ్యమును స్థాపించుటకువినియోగపడగలవిధమును ధర్మప్రస్థానము విశదము చేయుచున్నది. మహాత్ములీపరమార్థమును నిర్మాణసాధనములందువలెను సంహారసాధనములందును సందర్శించుచు స్థితప్రజ్ఞులగుట ప్రవృత్తి నివృత్తిమార్గములకు పరమార్థము. ప్రపంచావృతములైన స్వాభిమానదురహంకారములుస్థితప్రజ్ఞకు ప్రతిబంధకములై రసాభాసమును గలుగజేయుచున్నను నవ్యయుగనిర్మాణమునకు మహాదుఃఖానుభవ మనివార్యమై ప్రపంచపరిణామమునకు వినియోగపడుచున్నది. ప్రపంచావృతమైన విషమపరిస్థితులందు ప్రపంచోద్ధరణమునకు మృతమైన గతముగాకను, చైతన్యమయమైన వర్తమానభవిష్యత్తులను కవులు, గాయకులు, కళాభిజ్ఞులు, శాస్త్రజ్ఞులు, వీరులు, ధీరులు, రాజులు, మంత్రులు, నియంతలు సకలార్థములందును యోగారూఢులగుట పురుషార్థము, పరమార్థము.

# రాయలసీమ క్షామనివారణ

ఒకకాలమునందు సుక్షేత్రద్రాక్షారామములకు నిలయమైన రాయలసీమ వర్తమాన కాలమునందు క్షామసీమయగుట సంభవించినది. క్షేత్రములు పండుటలేదు. జలాశయము లింకిపోయినవి. ఈరెంటిమీద నాధారపడియుండు నామండలవాసులు పడుచున్న కష్టములు ఆంధ్రావనినేగాక వివిధరాష్ట్రములను మారుమ్రోగుచున్నవి. తినుటకు తిండిలేదు. కట్టుకొనుటకు బట్టలేదు. త్రాగనీరులేదు. పిల్లలకు పాలులేవు. పశువులకు మేతలేదు. రైతు తానుదినుట మానినను పశువును పోషించుకొనును. అందుల కెట్టియాస్కారమును లేకపోయినది. పంటలు పండినగాని మనుష్యులైనను పశువులైనను జీవించుట దుర్లభమని యందరకును దెలిసినదే. వరుణదేవుని యాజ్ఞానుసారము పండుపంటలు యీసీమయందు విస్తారము. ఆయన ప్రసాదించుటను మానెను. పంచభూతములలో నేదిలేకున్నను, నేది యతిశయమైనను వాని యన్నింటి సన్నివేశమువలనను మహాప్రళయము సంభవించును. ఇపుడట్టి ప్రళయమేవచ్చినదన్న నతిశయోక్తిగాదు.

ఈప్రళయమును నివారించుటకు ప్రభుత్వమును ప్రజాహితసంఘములును పాటుపడుచున్నవి. ఇతరరాష్ట్రములనుండి సహాయమువచ్చుచున్నది. బాబు రాజేంద్రప్రసాదు గారిద్వారా మహనీయు లొకరు నాల్గువేలు క్షామనివారణమున కొసంగిరి. ప్రభుత్వము వారు స్థాపించిన క్షామనివారణకార్యములందు దాదాపు ౮౦ వేలమంది కార్మికులు పాల్గొనుచున్నారు. అచట పురుషులు అణా కానిని, స్త్రీలు ముక్కానిని రోజు కూలి పుచ్చుకొని పనిచేయుట కొప్పుకొనుట జూడ పరిస్థితులెటుల దుర్భరముగనున్నవో తెలుసుకొనవచ్చును. ప్రజాహితసంస్థలు అన్నియును స్థానికసంఘములు, కోశాగారములు, సహకారసంఘములు జేయదగినసహాయము చేయుచున్నవి. ధర్మాత్ములు వస్తుధనసహాయముల సాయముజేయుచున్నారు. కాని యింతవరకు పండ్రెండువేలుకన్న నెక్కువవసూలుగాలేదు. క్షామనివారణసంఘము చేయుచున్న కార్యములకు ఇపుడున్న కార్యావసరములకు నాధనము సముద్రములో నొకచినుకువలెనున్న దనవలయును. ప్రస్తుతము ముఖ్యావసర మొకటి కలదు. కఱవుప్రదేశముల స్త్రీపురుషులు పేలికలతో వ్రేలాడుచున్నారు. పిల్లలు బరివంటితోనున్నారు. తిండి నేదోవిధముగ బొందిలో ప్రాణముపోకుండ పెట్టుచున్నను వస్త్రములసాయ మిపుడు ముఖ్యముగ నవసరముగ నున్నటుల సీమధ్య కాంగ్రెసు అధ్యక్షులును, క్షామనివారణసంఘాధ్యక్షులును, కార్యదర్శియు గావించిన ప్రకటనములవలన స్పష్టమగుచున్నది. ఈ పుణ్యకార్యమునకు ఆంధ్రమండలములందు వస్త్రముల వ్యాపారముచేయు వారందరును బూనుకోవలసి యుండును. కొట్టు కొకబట్టయు చీరయు నిచ్చిన యెడల చాలును. వారివద్దకు నెవరును వసూళ్లకు రాకున్నను అనంతపురం క్షామనివారణ సంఘ కార్యదర్శికి బంపవచ్చును. బట్టలవర్తకులందరును యీవిన్నపము నాలించెదరనియే నమ్మెదము.

---

**Printed and Published by K. Nageswara Rao, at the Andhra Patrika Press, No.7, ThambuChetty St., Madras.**
**Editor: G. Subbaramayya.**

# కాయకల్ప రసము

## సకల వ్యాధులకును ఈ రసమును లోనికిని పైకిని యుపయోగించిన గంటల మాత్రమున అత్యద్భుతమగు గుణమిచ్చును.

నివారణమగు వ్యాధులు:—తలనొప్పి, పార్శ్వపు తలనొప్పి, ప్రక్క— మెడనరములు లాగుట, కీళ్ల వాతము, వీపునొప్పి, కీళ్లనొప్పులు, శరీరమునందే భాగమునకైన తిమ్మిరి, కీళ్లు పట్టుట, నరములు పట్టుకొనుట, నరముల వ్యాధులు, పండ్లనొప్పి, నడుము నొప్పి, చర్మమున వాపు, తామర.

అన్ని విధములైన జ్వరములు, అజీర్ణము, మంద విరేచనములు, కలరా, మలబద్ధము, పిత్తాశయ ప్లీహారోగములు, పక్షవాతము, ధాతు సంబంధమైన దుర్గుణములు, కక్కు—వాయి, స్త్రీలకు కలుగు ఋతు సంబంధమైన వాయువు, సూతక కట్టు, సూతక సన్నిపాతము, గుల్మము, మొదలైన అన్ని విధములైన దేహవ్యాధులు కాయకల్ప రసమువల్ల నివారణమగును.

ఏ రోగమునకైనను కఠిన నిర్బంధము లేదు.

**ఒక సీసా వెల రూ. 1-8-0.**

తపాలాచార్జి ప్రత్యేకము.




## ఇండియన్ మెడికల్ వర్క్సు

ఆలందూరు పోస్టు,
మద్రాసు.

234, గోవిందప్పనాయక్ వీధి,
మద్రాసు.

# భారతి

## సచిత్ర మాసపత్రిక

అధిపతి

కా. నాగేశ్వర రావు

సంపాదకుడు

గన్నవరపు సుబ్బరామయ్య

సంపుటము ౧౪, సంచిక ౬

ఆంధ్రపత్రికా ముద్రాలయము, మద్రాసు

౧౯౩౭

# భారతి - ద్వాదశ సంపుటము—భా. ౧.

## వ్యాసముల అకారాదిపద సూచి

త్రి

## స

## సవరణలు

### ౧

భావ సం.ర ఫాల్గునమాస భారతిలో ప్రకటించిన అంబీరదేవుని ఓరుగంటిశాసనముయొక్క కాలమును నిర్ణయించు సందర్భమున నొకదోసము వాటిల్లినది. అందు (పుట ౪౨౯) ప్రమాది సం.ర మాఘ శుద్ధ ౧౦ శుక్రవారము క్రీ. శ. ౧౪౫౯ ఫిబ్రవరి నెల ౧ వ తేది శుక్రవారమునకు సరిపోయినట్లు వ్రాసియున్నది. ఇది పొరబాటు. అది క్రీ. శ. ౧౪౬౦ ఫిబ్రవరినెల ౧ వ తేది శుక్రవారమునకు సరిపోవును కావున క్రీ. శ. ౧౪౬౦ ఫిబ్రవరి ౧ వ తేది శుక్రవారమునాడు అంబీరదేవుడు ఓరుగంటిని స్వాధీనము చేసుకొనెను.

### ౨

యువ సం.ర వైశాఖమాస భారతియందు ప్రకటింపబడిన 'కొండవీటికవులు-వారికాలము' అనువ్యాసమునందలి "తరువాత కుమారగిరిరెడ్డి రాజ్యారంభ కాలమున అనగా ౧౪౭౨-౭౫ సంవత్సరములకు మధ్య నతడు... .........కావున విక్రమార్కచరిత్ర రచనాకాలము క్రీ. శ. ౧౪౭౫ - ౯౦ సంవత్సరముల మధ్య ననుటయొప్పును" అను వాక్యముల (౬౯౪ పుట)లోని యంకెలను వరుసగా ౧౩౭౨-౭౫, ౧౩౭౫-౯౦ అని చదువుకొనవలయును. పొరపాటున ౩ కు బదులు ౪ పడినది.

—సేలటూరి వెంకటరమణయ్య.

# భారతి – ద్వాదశ సంపుటము – భా. ౧.

## త్రివర్ణచిత్రముల అకారాదిసూచి

# విషయానుక్రమణిక



## త్రివర్ణచిత్రములు

సావిత్రి; కృష్ణదళమి; కృష్ణఏకాదశి.

## సాధారణచిత్రములు

సార్వభౌమదంపతులు; 'తాతా' శిలావిగ్రహము; చిరునగవుచెలువు; దేహసౌందర్యము, గానమాధుర్యము; ప్రతిబింబము, లాల్ బాగు, బెంగుళూరు; తాతా ఇన్స్టిట్యూటు, బెంగుళూరు; అందచందములను పే రొందిన 'జెలగోవా' సినిమానటి; నీలగిరిపడుచు; ఉప [illegible]ములు ౨; ఐనపల్లి ప్రకృతిశిబిర చిత్రములు 3; మహాత్ముడు బోర్సదులో ప్లేగునివారణనుగూర్చి సర్దారుపటేలుగారితో చర్చించుట; కమలా, ఇందిరా నెహ్రూలు; వి. యఫ్. ఆంధ్రదాసు; యూరపు విడలిన భారతీయ విశ్వవిద్యాలయముల విద్యార్థినులు; బెజవాడ లలితకళాదర్శమండలి; సక్కుబాయి సినిమాచిత్రములు 3; మైసూరు చాముండేశ్వరి దేవాలయము; నటరాజమూర్తి; భారతీయనర్తకి 'ఇస్పానిసుల్బర్గో'; ఇసుకటి మైసూరు మహరాజాగారి శిలావిగ్రహము, బెంగుళూరు; తంజావూరుకోట దేవాలయము; వ్యంగ్యచిత్రములు; ఇతర చిత్రములును



సా వి త్రి

—చంద్రదాపల్లి రామారావు